# శివపంచస్తవి





సంపాదకుడు:

చిదిరెమఠము వీరభద్రశర్మ

శివధర్మగ్రంథమాల ౧౧వ బిల్వము

# శివపంచస్తవి

పుష్పదంత మల్హాణ మలయరాజ దండి

హలాయుధకృతము

'భక్తరంజినీ'కర్త

వేదకావ్యస్మృతితీర్థ ధర్మాచార్య విద్యారత్న విద్యానిధి

## పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సాహాయ్యకులు:

దూపల రామిరెడ్డిగారు, ఉండవెల్లి

ప్రకాశకులు:

శివధర్మగ్రంథమాల

శ్రీ మటికె నాగయ్య ధర్మనిలయము

సికింద్రాబాదు - దక్కన్

వెల రూపాయిపావలా

సర్వస్వామ్యములు ప్రకాశకులవి



గ్రంథము దొరకు చోటు :

శివధర్మ గ్రంథమాల
౫-౨౬౯ సజ్జాలాల్ వీధి
సికింద్రాబాదు, దక్కన్



అయ్యంకి వేంకటరత్నము M. Sc. గారిచే
బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది. డిసెంబరు 1943.

శ్రీశివమస్తు

# దాతృప్రశంస

శ్రీమత్ప్రతాపముఖగుణ
ధామంబై, సూర్యచంద్రతాదాత్మ్యంబై,
సామాద్యుపాయచణమై,
భామహమై వెలుఁగు క్షాత్రపద్ధతి పృథ్విన్. ౧

క. ఆ రెడ్డిక్షత్రియజన
పారంపర్యముగ వేరు ప్రబలెను ధరలో,
వారే దుంపలవారన
భూరిపరాక్రములు గణనఁబొందిరి ప్రముఖుల్. ౨

గీ. అందు జనియించె నుజ్జ్వలుం డార్యహితుఁడు
శాయిరెడ్డినాఁ బరగెడు చారుగుణుఁడు;
సుగుణసంపద నురుకీర్తిఁ జూఱగొనియె
చిన్నహనుమంతరెడ్డి యా క్షితిపుసుతుఁడు. ౩

చ. చినహనుమంతరెడ్డి, జనసేవ్యుఁడు బాల్యమునందె పొందెగా
ఘనమగు కీర్తికాంతను ప్రకామపరాక్రమధాటి; నంత యౌ
వనమునఁ బెండ్లియాడె వరవర్ణిని తిమ్మమ, నార్యలోకపూ
తను, తపనీయవర్ణను, సుధామధురోజ్జ్వలభారతిన్, గృతిన్. ౪

క. ఏతద్దంపతుల గుణ
వ్రాతఫలమొ! యుండవెల్లి గ్రామఫలంబో;
చేతోహరరూపుఁడు వి
ఖ్యాతుఁడు శ్రీ రామిరెడ్డి కలిగెన్ ఘనుఁడై. ౫

గీ. సుమము పుట్టుకతోడనే సురభిల మగు
భంగి; ధైర్యసాహసముల బాల్యమందె
సంతరించి విద్యాబుద్ధిసాధనముల
రామిరెడ్డి ముఖ్యుండయి రక్తిఁ గాంచె. ౬

చ. జనకుల పాదభక్తియు, విచక్షణపండితపూజ, యాతిథే
య నయనిషేవణ, మ్మఖిలయాచకపోషణ, లోకసౌఖ్యసా
ధన, పతనాలయోన్నతి నిదానము లాహ్నికకర్మగా మదిం
గనుచును రామిరెడ్డి తన కాయధనంబుల నిచ్చు నిత్యమున్. ౭

గీ. ఉండవెల్లి జనంబుల పండువనఁగఁ
బండువెన్నెల కళ లీను భవ్యముఖుఁడు
రాజభోగుఁడు కవికుల భోజసముఁడు
రాజిలుచునుండు దుంపల రామిరెడ్డి. ౮

మ. గతసంవత్సరపుష్యమాసమున నీ కల్యాణసంధాయి సం
స్తుతగాథుండగు రామిరెడ్డి శివభక్త్యుల్లాసతన్ దానె యా
గతుఁడై మా దగు నాశ్రమంబునకు; శ్రీకంఠస్తుతిం దీని ము
ద్రిత మానట్లుగఁ బుష్కలార్థమిడి, యార్జించెన్ యశస్సంపదన్. ౯

క. ధనికుల వెదకుచు నర్థులు
చనుచుందురు గాని, దాత స్వయముగఁ బ్రీతిన్
జని, యర్థి వెదకి యిచ్చుట
విన లేదెటఁ; దప్పి పుట్టెఁ బృథ్వి నితఁడహో ! ౧౦

గీ. శ్రీ శివస్తవకృతికిఁ బ్రసిద్ధిరస్తు
దాతృజనులకు సప్తసంతతి రథాస్తు
దుంపలాన్వయమునకు నస్తోకతాస్తు
రామిరెడ్డికిఁ గల్యాణరాశి రస్తు ! ౧౧

ఓం

# ప్రస్తుతము

సమేధయతి యన్నిత్యం, సర్వార్థాన్ సర్వకర్మసు
శివమిచ్ఛన్ మనుష్యాణాం, తస్మాద్దేవః శివః స్మృతః
—మహాభారత రుద్రాధ్యాయము.

క. శ్రీమంతంబై, భిక్షుక
నామంబై; భోగియోగినాయకధృతమై
కామాంతకమై, శ్రితజన
కామదమా; శాంభవమ్ము గ్రాలుత సతమున్.

శ్రీమద్విశ్వేశ్వరుండును, సర్వదేవసార్వభౌముండును, సృష్టి-స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాది పంచకృత్య స్వతంత్రుండును, వేదాగమ పురాణేతిహాసశాస్త్రప్రతిపాద్యుండును, అష్టమూర్తి దేవుండును, పరబ్రహ్మాభిధేయుండును, భవరుద్రహరాది వివిధనాముండును సచ్చిదానంద ఘనుండును, ఉమాసనాథుండును నగు శ్రీసదాశివుండే సర్వవివేకి జనములకు సముపాస్యుం డనుట సర్వశాస్త్ర సిద్ధాంతము. అమ్మహాదేవుని మహిమమును అపారము. ఐనను పుష్పదంత మల్హణ మలయరాజ దండి హలాయుధు లను ప్రాచీన మహాత్ములు భక్త హృదయముతో శివమహిమాణువునే ఈ శివపంచస్తవములందు నిబద్ధము గావించి సర్వమానవకల్యాణమును సాధించియున్నారు. మా గ్రంథ మాలయం దేకాదశమగు నీ గ్రంథబిల్వదళమును ఏకాదశ రుద్రాత్ముడగు శ్రీపరశివుని పాదసన్నిధిని సమర్పించు పుణ్యావకాశము లభించినది. ఏతదవసరమున బ్రస్తుతము లగు కొన్ని యంశములు నివేదింపవలసి యున్నవి.

## శివుడు; వేదము

మహాదేవాయ రుద్రాయ, శంకరాయ శివాయ తే।
మహేశ్వరాయాపి నమః, కస్మైచి న్మంత్రమూర్తయే॥
—ఉత్పలాచార్య - శివస్తోత్రావళి.

భారతీయాస్తికులలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తులు

సుప్రసిద్ధులు. అందును శివుడు మహాదేవుడు. ఋగ్ - యజుస్ - సామ - అథర్వరూపముగా నున్న వేదరాశిలో శివుడు పరమోపాస్య దైవముగాఁ బ్రస్తుతింపబడినాడు. ఋగ్వేద ప్రథమమండల ౪3 వ సూక్తమందలి "కద్రుద్రాయ ప్రచేతసే" అను తొమ్మిది మంత్రము లందును, ౧౧౪ వ సూక్తమందలి "ఇమా రుద్రాయ తవసే" అను పదు నొకండు మంత్రములందును, ద్వితీయమండలపు 33 వ సూక్తమందలి "ఆ తే పిత ర్మరుతాం" అను పదునేను మంత్రములందును, సప్తమ మండలపు ౪౬వ సూక్తమందలి "ఇమా రుద్రాయ స్థిరధన్వనే"యను నాల్గు మంత్రములందును; (మొత్తము ౩౯ మం. లో) విశ్వకల్యాణ (శివ) స్వరూపుడైన రుద్రుని మహిమము కీర్తితమైయున్నది. నాల్గు సూక్తములు రుద్రసూక్తము లనియే వైదికుల వ్యవహారము గలదు. వీని సంపూర్ణమైన తాత్పర్యవిశేషముల నిట విస్తరింప వీలులేదు. కాని "కేవల చైతన్యస్వరూపుడు, మహాజ్ఞాని, శంకరుడు, రోగనివారకుడు, వైద్యుడు, ప్రవక్త, ఉపదేశకుడు, పశుపతి, శూరుడు, పరమాత్మ, విశ్వాధిపతి, మృత్యుంజయుడు, తేజస్వి, అగ్నిరూపుడు, సూర్యుడు" అను ముఖ్యమైన అర్థముల నిచ్చు నామములు రుద్రునకు ప్రయుక్తము లైనట్లు తెలియుట యావశ్యకము.

ఈ సూక్తములలోనే కాక ఇతరదేవతాసూక్తములలో గూడ నీ రుద్రశబ్దము రెడునూర్ల మారులైనను ఉపయోగింపబడినది. దీని వలన రుద్రశబ్ద మెంత వ్యాపకమైన అర్థమును, అభిప్రాయమును కలిగి యున్నదో గ్రహింపవచ్చును.

ఋగ్వేదమున ప్రత్యేకముగ శివసూక్త మను పేరితో మంత్ర ములు లేనందున రుద్రుడు శివుడు కాడని కొందరు శంకించుచున్నారు. కాని ఇదియు సమంజసము కాదు. వేదవిభాగకాలమున మహర్షులకు శివరుద్రుల యందు ఏకభావమే యుండెను. కావున రుద్రునకు, శివునకు వేరువేరుగా సూక్తముల పంచివేయరైరి. ఐనను దాదాపు దశమండలములలోను ఏబదిపర్యాయములు శివశబ్దము ప్రయోగింపబడినది. దీనికి వివిధార్థము లున్నను కొన్ని తావులలో విశేష్యముగాను, విశేషణముగాను వచ్చినందున శివదేవతాభావ

మును స్పష్టముగనే గ్రహింపవచ్చును. రుద్ర శబ్దమునకు సామాన్యముగా "భయంకరుడు" అను ఒకే యర్థమును కొందరు గ్రహించుచున్నందువలననే ఇట్టి విపరీత భావము ప్రచార మగుచున్నది. వైదిక నిఘంటు(నిరుక్త)కారుడైన యాస్కాచార్యు డేమనుచున్నాడో చూడుడు:—

"రుద్రో రౌతీతి సతః, రోరూయమాణో ద్రవతీతివా, రోదయతేర్వా, "యదరుదత్తద్రుద్రస్య రుద్రత్వ" మితి కాఠకం. "యదరోదీత్తద్రుద్రస్య రుద్రత్వం" ఇతి హారిద్రవికం." [సత్పురుషుల కుపదేశించువాడు, కరుణతో కరగువాడు. ఏడ్చువాడు (అనగా మేఘస్థానము నుండి జలము రాల్చువాడు). ఏడ్పించువాడు.] (నిరుక్త. దై. కా. ౧౦-౧-౧)

"అథాపి విప్రతిషిద్ధార్థా భవంతి 'ఏకఏవ రుద్రః' 'అసంఖ్యాతా...రుద్రాః'" (రుద్రశబ్దమునకు వేరు అర్థములుకూడ కలవు. ఎందువలన నన గా రుద్రు డొకడుగాను, అసంఖ్యాతులుగాను కలరని వేదము చెప్పుచున్నది.) ని. ౧౦-౧౫-౭.

యజుర్వేదమున గల సుప్రసిద్ధమైన శతరుద్రీయ నమకచమకములలో రుద్రుడు శివుడుగానే ఘోషింపబడినాడు. ఇంత సమర్థమైన సూక్తములు మరి యే దేవతను గూర్చియును లేవు. ఆ పరమేశ్వరుడు లోకకల్యాణార్థమై రుద్రరూపమును, శివరూపమును ధరించుననియును, శివ, భవ, ఉగ్ర, అర్క, భర్గ, అగ్ని, రుద్ర, బ్రహ్మ, శర్వ, మున్నగు శబ్దములు శివవాచకము లనియును విజ్ఞులు దెలిసికొనియే యున్నారు. అసలు అగ్నియే రుద్రు డన్నపుడు వైదిక తాత్పర్యము శివోపాసన యనియే తేలుచున్నది. గాయత్రీప్రతిపాద్యమైన భర్గముకూడా శివ తేజమనియును, సౌరోపాసనయు నిట్టిదే యనియును గ్రహింపవలెను. ఇట్టి విషయములు విపులముగ గ్రంథాంతరమున జర్చింపవలసినవియ. పై యభిప్రాయ సమర్థకములగు కొన్ని ప్రమాణముల నిట నుదాహరించుచున్నాను.

రుద్రం రుద్రేషు రుద్రియం హవామహే ఋ. ౧౦-౬౪-౮
శం నో రుద్రో రుద్రేభి ర్జలాషః ,, ౭-౩౫-౬
శం నః కరో త్యర్వతే సుగం ,, ౧-౪౩-౬
యః శుక్ర ఇవ సూర్యో హిరణ్యమివ ,, ౧-౪౩-౫

భువనస్య పితరం గీర్భి రాభీ రుద్రం ,, ౬-౪౯-౧౦

| | |
|---|---|
| అయం మే విశ్వభేషజో...శివాభిమర్శనః | ఋ ౧- ౧-౨౫ |
| యో రుద్రో అగ్నౌ | తై. స. ౫- ౫-౯ |
| రుద్రోవా యదగ్నిః ఘోరాన్యా శివాన్యా | ,, ౫- ౬-౫ |
| యా తే రుద్ర శివా తనూ రఘోరా | య ౧౬-౧ |
| నమశ్శివాయ చ శివతరాయ చ | ,, ౧౬-౧౧ |
| జగతాం పతయే నమో నమో రుద్రాయ | ,, ౧౬-౫ |
| సోర్యమా స వరుణః స రుద్ర స్సమా దేవః | అథ ౧౩- ౪-౪ |
| య ఇమా విశ్వా భువనాని చక్లృపే తస్మై రుద్రాయ ,, | ౭-౯-౨-౧ |
| అగ్నిర్వై స దేవః, తస్యైతాని నామాని, | |
| శర్వ ఇతి, భవ ఇతి పశూనాం పతీ రుద్రోగ్ని రితి శ. బ్రా. | ౧-౭-౩-౧ |
| అగ్ని రేవ బ్రహ్మ | ,, ,, ౧౦-౪-౧-౫ |
| అయం వా అగ్ని రర్కః | ,, ,, ౧-౬-౨-౧౯ |
| అగ్నిర్వై భర్గః | ,, ,, ౧౨-౩-౪-౧ |
| అగ్ని రేవ భర్గః | గో. బ్రా. పూ. ౫-౧౫ |
| త్వమగ్నే రుద్రః | ఋ. ౨-౧-౬ |
| ఏష రుద్రః యదగ్నిః | తై. ఉ. ౧-౧-౫-౧ |
| తాన్యేతాన్యష్టా (రుద్ర శర్వ పశుపతి ఉగ్ర అశని- భవ మహాదేవ ఈశాన) అగ్నిరూపాణి | శ. బ్రా. ౬-౧-౩-౧౧ |
| యోవై రుద్రస్సోగ్నిః | ,, ,, ౫-౨-౪-౧౬ |
| అగ్నిర్వై రుద్రః | ,, ,, ౫-౩-౧-౧౦ |
| శివశ్శివ ఇతి శమయత్యేవైనం (అగ్నిం) | ,, ,, ౬-౭-౩-౧౫ |
| అగ్నిరపి రుద్ర ఉచ్యతే | నిరుక్త. ౧౦-౭-౨ |
| ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం | మాండూక్య ౧-౭ |
| ఏక ఏవ రుద్రో నద్వితీయాయ తస్థుః | శ్వేతాశ్వ ౩-౨ |
| న స న్న చాసత్ శివ ఏవ కేవలః | ,, ౪-౧ |
| విశ్వాధికో రుద్రో మహర్షిః | మ. నా. ఉ. ౧౦ |
| ఏకో రుద్రో నద్వితీయాయ తస్మై | అథర్వశిర ౫ |
| రుద్ర మేకత్వ మాహుః శాశ్వతం వై పురాణం | ,, ౩-౯ |
| శివ ఏకః స్యేనభాసేదం సర్వం | త్రి. బ్రా. ౧-౧ |

[ఇంకను వేలకొలది ప్రమాణములు కలవు. ఇక్కడ నుదాహరింపబడినవి మంత్రములయొక్క సంపూర్ణభాగములు కావు. శివ రుద్ర శబ్దార్థములతో సంబంధము గలవిమాత్రమే వ్రాయబడినవి.]

వైదికవాఙ్మయమని చెప్పబడు మూలసంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, నిరుక్తము మున్నగు ప్రాచీన గ్రంథములలోని ప్రమాణములను పర్యాలోచింపగా శివ రుద్ర శబ్దము లేక దేవ వాచకములనియును హైందవుల శైవసంప్రదాయానుగతములు సాధారములనియును దెలియుచున్నది. కామికాది శివాగమములు, స్కాందాది శివపురాణములు, శివరహస్యాది ఇతిహాసములు మున్నగు అపారమైన వాఙ్మయమునుండి యీ తత్త్వముల నింకను విపులముగ దెలిసికొనవచ్చును.

ఇది యిట్లుండ మనదేశమున పాశ్చాత్యవిమర్శనలు బైలుదేరిననాటినుండి యనేక సంగతులను గూర్చి భావవిప్లవములు పొడసూపుటయు సర్వవిదితము. ఇటులే శివుడు; శైవసంప్రదాయము; లింగపూజ మున్నగు వానిని గురించియును విచిత్రములైన విమర్శనలు కనుపడుటలో నాశ్చర్యములేదు. ఉదాహరణార్థము కొందరిని స్మరింపవచ్చును.

శ్రీ ప్రొ. డాసన్ అను ఆంగ్లపండితుడు తన "హిందూ క్లాసికల్ డిక్షనరీ'' అను గ్రంథమున [1] "రుద్రుడు కేవలము భయంకరముగ గర్జించు దేవుడు. అగ్నితో సంబంధము గలవాడు. సర్వసంహారకుడు. ప్రాణులలో రోగముల బెంచును. కల్యాణకారకు డనికూడ చెప్పబడినాడు. రుద్రుడే తరువాత శివుడుగా మారినాడు'' అని వ్రాసినాడు. కాని ఈతడు వేదమున నేయున్న రుద్రశబ్దముయొక్క వివిధార్థములను సరిగ పర్యాలోచన జేయుచో రుద్రుడు భయంకర దేవుడే యని భయపడ నవసరము లేకుండెను. రుద్రుడు విశ్వజనకుడు; జగత్పతి; లోకహిత

(1) He is the howling terrible god, the god of storms, the father of the Rudras or Maruts, and is sometimes indentified with the god of fire. On the one hand he is a destructive deity who brings diseases upon men and cattle, and upon the other he is a beneficent deity supposed to have a healing influence. These are the germs which afterwards developed into the god Siva.

(Hindu Classical Dictonary, Page No. 269)

కరుడగు ఆదివైద్యుడు (ప్రథమో దైవ్యో భిషక్ - యజు ౧౬-౫) అను వివిధనామము లుండగా కేవల సంహారకుడని నిర్ణయించుట నిరాధారము.

సర్. మోనియర్ విలియం పండితుని "సంస్కృత్ - ఇంగ్లీష్ డిక్షనరీ"లో గూడ ఇట్లే "రుద్రుడు తుపాను దేవుడు. మరుత్తులకు పిత" అనియే నిర్ణయింపబడినది. [2] రుద్రునకు దేవపిత; జగత్పతి; సృష్టికర్త; పోషకుడు; కల్యాణకరుడు మున్నగు విశేషణములు కలవని ఈ యాంగ్ల విద్వాంసులు స్వీకరించుచున్నను ఇట్టి సర్వగుణ పరిపూర్ణుని ఏకపరమేశ్వరునిగా నిశ్చయింపజాలక యాగ్రహము వలన తమ "ఒకటి గుణమును" మానజాలకున్నారుగదా! ఆశ్చర్యము!!

మరియొక సుప్రసిద్ధుడు శ్రీ ఆర్థర్ ఆంతోనీ మేక్డోనల్ దొర తన "వైదిక్ రీడర్" అను పొత్తమున రుద్రునిగూర్చి కొన్ని విషయములను వివరించినాడు, కాని ఈ రుద్రుడు క్రింది తరగతి దేవతలలో జేరుననియును; క్రూరపశువువలె వినాశకుడనియును; ఎర్రనియు, పందియనియును మహాక్రూరముగ వ్రాసినాడు. [3] కొంది మంత్రములలో వర్ణింపబడినంతమాత్రమున రుద్రునకు క్రింది తరగతి నిచ్చుట మిక్కిలి యాశ్చర్యకరము; రుద్రుడు నగ్నియు నేకము లని వ్రాయుచును; వేదమునిండ నగ్నిప్రాధాన్యము నరయుచును; రుద్రుని సర్వశక్తిమత్తను; సర్వజ్ఞత్వమును; కల్యాణకారిత్వమును; జగత్పతిత్వమును అంగీ

(2) 'Rudra, roarer, the god of tempests and father and ruler of Rudras and Maruts. (In Veda he is closely connected with Indra and still more with Agni, the god of fire......and also with Kala or time, the all consumer with whom he is afterwards identified; though generally represented as a destroying deity......he has also the epithet Siva, 'benevolent or auspicious' and is even supposed to possess healing powers ......from his purifying the atmosphere......)'

(William's Sanskrit English Dictionary)

(3) 'This god occupies a subordinate position in the Rig Veda, being celebrated in only three entire hymns, in part of another, and in one conjointly with Soma. His hand, his arms, and his limbs are mentioned. He has beautiful lips and wears braided hair. His colour is brown; his form is dazzling, for he shines like radiant sun, like gold......he holds the thunderbolt in his arm, and discharges his lightning shaft from the sky; but he is usually said to be armed with a bow & arrows, which are strong and swift'.

రించుచును గూడ నిట్లు రుద్రునియొక్క పరమాత్మతను గ్రహింప జాలని వారిని షడ్రసములలోను, పరమాన్నములోను, ఎల్లపుడు దిరుగుచు దాని రుచి నరయని తెడ్డు (గరిటె)తో బోల్చుటకంటె వేరు లేదు.

రుద్రుని బాణాదుల వర్ణనములోని యలంకారభావను నరయక దురర్థములు చేయరాదు. శుక్ల యజుర్వేదము ౧౬ అధ్యాయమందును అథర్వవేదమందును (3-౨౬) గల ఇషుశబ్దములకు "అన్నము వాతము, వర్షము, ఆదిత్యులు, పితరులు, వీరుధము, అశని, ఓషధి, కామము, బృహస్పతి" మున్నగు నర్థములు వాని ప్రక్కనే యుండగా భ్రమ కవకాశమే లేదు. వరాహ వృషభ శబ్దములకు వారెట్టి యర్థము దెల్పి, తమ పాండిత్యమును ప్రకటించినారో చూదుడు.

దివో వరాహ మరుషం కపర్దినం
త్వేషం రూపం నమసా నిహ్వయామహే. ఋ. ౧-౧౧౪-౫.

అర్థము:—దివః = స్వర్గముయొక్క; అరుషం=ప్రకాశ మొసఙ్చు నట్టి; కపర్దినం = జటాజూటముగల; త్వేషం రూపం = ప్రకాశమయమైన రూపముగలట్టి: వరాహం = శ్రేష్ఠమైన దినమును; మేఘమును నమసా = నమస్కారము చేత; నిహ్వయామహే = ప్రార్థించుచున్నాము. ఇక్కడ లోకసామాన్యమైన వరాహము (పంది)యను అర్థము లేనే లేదు. వర + అహః = శ్రేష్ఠమైన దినము; లేక వర్ + అహః = ఉదకమే యాహారము గలిగినట్టి వస్తు వనియే యర్థమగును.

---

'He is fierce and destructive like a terrible beast, and is called a bull, as well as the ruddy (aruna) boar of heaven. He is exalted, strongest of the strong, swift, unassailable, unsurpassed in might. He is young and unaging, a lord (Isana) and father of the world. By his rule and universal dominion he is aware of the doings of men and gods He is bountiful (midhvams) easily invoked and auspicious. (Siva) But he is usually regarded as malevolent; for the hymns addressed to him chiefly express fear of his terrible shafts and deprication of his wrath......He is, however, not purely maleficent like a demon. He not only preserves from calamity, but bestows blessing. His healing powers are especially often mentioned; he has a thousand remedies, and is the greatest physician of physicians...... .

(A Vedic Reader, Pages 56—57.

గాని ఇతరార్థమున కవకాశమే లేదు. పందికి ప్రసక్తియు లేదు. వైదిక నిఘంటు (౧-౧౦)వున "వరాహో మేఘః" అనియును; నిరుక్తమున (౫-౪-౧) "వరాహో మేఘో భవతి వరాహారః" అనియును స్పష్టముగా వ్రాయబడియున్నది.

బృహస్పతిర్ వృషభి ర్వరాహై-
ర్ఘర్మస్వేదేభి ర్ద్రవిణం వ్యానట్. అథర్వ ౨౦-౯౧-౭

అర్థము:—ఘర్మస్వేదేభిః = ఉష్ణతవలన కలిగెడు; వృషభిః = వృష్టియొనర్చునట్టి; వరాహైః = మేఘములతో గూడి; బృహస్పతిః = జ్ఞానప్రభుడు; ద్రవిణం = ద్రవ్యమును; వ్యానట్ = సంపాదించుచున్నాడు. "వృషభో వర్షితా అపాం" నిరుక్త ౪-౮. "వృషభః ప్రజాం వర్షతీతి వా" ని. ౯-౨౨. అను ప్రమాణముల వలన నిట వృషభి శబ్దరూపమునకు "వర్షించునట్టి" గుణముగల అనునర్థమే ప్రస్తుతము. ఇట్టియుత్తమగుణములు రుద్రుని యందారోపించి యాలంకారికముగ వాని సర్వశక్తిమత్తను వేదము ప్రకటింపగా మ్యాక్డోనాల్డ్ వంటివారు నిర్లక్ష్యముగ నిట్టి విపరీతార్థములను వ్రాయుట శోచనీయము.

అల్పజ్ఞులు వేదమునకు విపరీతార్థముల నొనర్చి ధ్వంసపరచెదరు (బిభేత్యల్పశ్రుతా ద్వేదో అయం మాం ప్రహరిష్యతి) అని ఎన్నడో మన పూర్వులు మొత్తి పెట్టియే యున్నారు. సంప్రదాయ సదాచార స్థితులైన పండితులు నేటికిని మ్లేచ్ఛాదులకు వేదముల బోధించుట లేదు. అందువలన ఏ బాజారు 'ట్యూటరు' నో ఆశ్రయించి కొంత లౌకిక సంస్కృతభాషను నేర్చుకొని యలౌకికభాషగల వేదములను గూర్చియును బహు ఆడంబరముగా నచ్చుగొట్టించుకొనిన యాంగ్ల గ్రంథములద్వారా దుష్ప్రచారము జేయుచున్న ఈ మ్లేచ్ఛపండితులు నిక్కముగ తమ వరాహ(Boar)త్వమునే ప్రకటించుచున్నారనుటలో సందియము లేదు.

ఇట్టివారి విజ్ఞతను ప్రాచ్యపండితులు తెలిసియున్నను; కేవలాంగ్లభాషను మాత్రమే నేర్చుకొని యా గ్రంథముల మూలముననే భారతీయ విజ్ఞానమును బడయ నెంచు సోదరులకు గలుగుచున్న అన్యాయము గమనింప దగినది. శ్రీ పరమశివ అయ్యరు అను నొక మైసూరు

జడ్జిగారు తమ 'రిక్సు' అను పొత్తమున [4]రుద్రుడనగా "మేఘమండలి మెరుపు, తుపానుగాలి; పిడుగు" వలె తమకు విద్యార్థి దశలో దోచి తాము పెద్దవారైన తరువాతగూడ నీ భావము ధ్రువపడినదని వ్రాసి నారు. పాండిత్యమన్న నిట్లుండవలెను. "ఒరే త్వరగా తిను, అదుగో మేఘంలోని రుద్రుడు గర్జిస్తున్నాడు. తినని వాళ్లను పట్టుకెళుతాడు'' అని పాపము నాయనమ్మగా రేమైనను బాల్యమున వీరిని భయపెట్టి యుందురు.

యజుర్వేద శతరుద్రీయమున రుద్రునియొక్క విశ్వరూపవర్ణన కలదు. పంచభూతములు, వివిధశక్తులు, రక్షణ శిక్షణలు అన్నియు రుద్రాధీనములే! అతడు సహస్రవిధుడు, బహురూపుడు. (సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యాం). ఇట్టియెడ ఆయనయొక్క "నిషంగిత్వము, తస్కరపతిత్వము, అంతరిక్షవాసిత్వము'' మున్నగు వానిని మాత్రమే పెద్దగా భావించి మొట్టమొదటనే కల యాయన యొక్క "సోమత్వము, సభాపతిత్వము, జగత్పతిత్వము, మృడత్వము, శివతమత్వము''ను మరచిపోవుట జూడగా నీ పాశ్చాత్యబుద్ధులపై నుండి పరమేశ్వరుని దయయే దూరమగుచున్నట్లు తోచును.

ఇంకను రుద్రుడు ఆర్యుల దేవుడు కాడనియును, ద్రావిడుడనియును, తెల్లనివాడు కావున మంగోలియను జాతికి జెందిన వాడనియును, ద్రవిడుల లింగపూజను ఆర్యులనుకరించిరనియును కొన్ని నిరాధారవాదములు ఆంగ్లగ్రంథములలో కుప్పతెప్పలుగా నున్నవి. ఇందు కొన్ని యజ్ఞానవిలసితములు. మరికొన్ని రాజకీయప్రచారమునకై పుట్టినవి. తక్కినవి దయనీయములు. ఆర్యద్రావిడసమస్యను పరిహ

(4) I had a firm belief even when I was a schoolboy that Rudra was lightning, and that was confirmed by a study of the few Vedic hymns solely devoted to his praise. I was familiar with the Rudra section of the Krishna Yajus samhita, which is my family Veda, and I knew that the fierce god who dazzles and shoots his arrows..........

This Rudra and Rudras should not be confounded with moutain lightnigs and snows. This Rudra Agni is, of course, an asura (breather) in a special sense. His energy is cheifly the energy born of Vayu and is intimately associated with lightnig and snowstorms as he rose amid great snowbeds and precipices.

(The Riks, Page Nos. 12. 13, 80)

రించుటకై సమర్థమైన గ్రంథ మొకటి వెలువడవలసి యున్నది.[5] తన భక్తుల ననుగ్రహించుట కయియే పరశివుడు జ్యోతిర్లింగాకారమును ధరించి సాకార నిరాకార వాదమునకు చక్కని మార్గమును జూపెట్టి యున్నాడు. లింగము సాక్షాత్తు శివస్వరూపమే కాని విపరీతార్థము నిచ్చునది కాదు.[6] శివభక్తులు ధరించు రుద్రాక్షలు హిమాలయ ప్రాంతమునను నేపాళాద్యుత్తర భారతమునను బుట్టునే కాని దక్షిణ మున కాదు. శివుని శక్తిగా నెన్నబడిన ఉమాదేవికి "ఆర్యా" యను నామముండుట గమనింపవలెను. శివుడు కైలాసవాసి యని సర్వభాషా గ్రంథములును వాకొనుచున్నవి కదా! హైమవతియే ఆర్యయై యుండ హిమాలయమునకు నింకను నుత్తర దిక్కుననున్న కైలాసమందలి శివుడు కేవల మార్యుడనుటకు సందేహింప నవకాశము లేదు. శివశబ్దము ద్రవిడభాషాశబ్దమనియును కొందరు మహాపండితులు తమ యభిప్రాయ మును వెలిబుచ్చియున్నారు. వీరి సాహసమునకును దుష్కల్పనకును మేరలేదనవచ్చును. రెండు వేల సంవత్సరములకంటె పూర్వకాలమున ద్రవిడ (తమిళు)భాషా గ్రంథము లున్నట్టుగాని, అప్పటి శివశబ్ద వ్యుత్పత్తిని దెల్పు సాధనములు కలవనిగాని నిర్ణయించుట కొక యాధారమైనను లేదు. అరవ సోదరులకు తమ దేశభాషాభిమానము మెండు కావున తమిళము మిక్కిలి ప్రాచీనమైనదని ఇటీవల నెక్కువగా ప్రచారము చేయుచున్నారు. కాని యది చారిత్రికముగ నిలువదగినది కాదు. వారు వాడుచున్న నేటి తమిళలిపి కూడ సంస్కృతపు బ్రాహ్మి నుండి పుట్టినదే కాని తమిళమునకు సొంత యక్షరములు కూడ ప్రాచీన కాలమున నున్నట్లు ప్రమాణములు లేవు. ఇక శివశబ్దమును తమిళము నుండి సంస్కృతమునకు దీసికొనిరనుట భ్రమయే యగును.

చతుర్వేదములు,[7] నిరుక్తము, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు,

(5) దీనికి సంబంధించిన విమర్శన వ్యాసము 'విభూతి' ౪-౯ లో కలదు.

(6) మా గ్రంథమాలలోని "లింగధారణ సిద్ధాంతము" చూ.

(7) ప్రపంచమందు నే డుపలబ్ధములగు సర్వగ్రంథములకన్నను వేదములు మిక్కిలి ప్రాచీనములు. హిందూ ధర్మశాస్త్రముల ప్రకారమివి యనాదులు. విమర్శకులు సైతము పదివేల సంవత్సరములకంటె నిటీవలవి కావనుచున్నారు.

శివాగమములు, పాణినీయధాతుపాఠము, మహాభారతము, పురాణములు, మున్నగు సమస్త ప్రాచీన గ్రంథములలో శివశబ్దము, శివకథలు, పుష్కలముగ నిబద్ధము గావింపబడి యుండుటవలన, నివి వైదికములని యును ఆర్యజనశరణ్యములనియును నమ్ముట నిరుపద్రవ కరము.

యద్దర్శనామృతసుఖానుభవేన ధన్యా
నేత్రోత్పలాని చిర మర్ధనిమీలితాని
దృజ్మార్గగోచర రవీందు కరప్రసంగ-
భంగ్యేవ బిభ్రతి శివ శ్శివద స్స వోఽస్తు.
(జగద్ధరభట్ట - స్తుతికుసుమాంజలి)

## శివుని చిహ్నములు

విశ్వేశ్వరుని తత్వములు విశ్వాధికము లగుటంజేసి సాధారణ బుద్ధికి దురూహములై యున్నవి. అటులే శివుని సాకారతకు సంబంధించిన కొన్ని చిహ్నములుగూడ మానవున కమేయములై వెలయు చున్నవి. ఇట్టి జిజ్ఞాసువుల ననుగ్రహించుటకై పూర్వ మహాత్ములు శాస్త్రగ్రంథములలో ననేకచోట్ల శివుని చిహ్నములనుగూర్చి వివరణము గావించియున్నారు. అవియు నిగూఢముగ నుత్తమాధికారులకు వేద్యముగా నున్నవి. ప్రాచీను డగు నరహరిస్వామిచే విరచితమై సుప్రసిద్ధమైయున్న "బోధసార"మను శివాద్వైతసంప్రదాయ గ్రంథము నుండి ఈ క్రింది యంశములు వివరింపబడుచున్నవి.

౧. దిగంబరత్వము:— కేవల సచ్చిదానంద స్వరూపుడగు శివుడు సర్వమును పుట్టింప గిట్టింప సమర్థుడై యున్నాడు. కావున సర్వవిషయముల లోను స్వతంత్రుడగుటయు సహజము. వాని జ్ఞానమునకు ఇచ్ఛకు ప్రతిబంధకము లేనేలేదు. ఈభువనబ్రహ్మాండములలోని సర్వపదార్థము లందును, అనగా వజ్రము మొదలు మహాకాశమువరకు గల కఠినసులభ వస్తువులలో నెల్ల ప్రవేశించును. సర్వవ్యాపకుడుకదా! ఇట్టి లోకాతీతమైన ప్రభువునకు దేహసంరక్షకమైన ఆవరణము, అంబరముతో పనియే యుండదు. ఆ యంబరముపైన మాత్రము తాను లేడా? కావున

(8) ఇది విద్యాభాస్కర బుక్కు డిపో, [illegible] ప్రచురణము.

సర్వాతిశాయియైన సంపదగల సర్వేశ్వరుడు నిరావరణుడై దిగంబరుడని ప్రసిద్ధికెక్కినాడు. అంతియే కాని వస్త్రములు, దిక్కు లేక కాదు. "అట్లగుచో శివుడు వ్యాఘ్రచర్మాదుల ధరించినట్లు పురాణవార్త కలదు. కావున అపుడు ఒక కవచమునకు లోబడినటులేకదా" యన జెల్లదు. తన ఇచ్ఛననుసరించియే భక్తుల నుద్ధరించు సందర్భమున నివి ధరింపబడినవికావున ఇదియే యాకారమని యవధి నేర్పరుపగూడదు. సర్వదా సర్వవిధముల జేయలేనివాడు సర్వేశ్వరుడే కాడు. కావున శాస్త్రప్రసిద్ధములైన లీలలను దెలిసికొనుటకు మాత్రమే 'దిగంబర' చర్మాంబర మున్నగు నామము లుపయోగింప బడుచున్నవని తెలియవలెను. అంతియేకాని "శివుడు దిగంబరుడు మాత్రమే యగుటకు వీలున్నది. మరియొక ఆవరణమును దాల్పజాలడు" అను వాదమును లేవదీయరాదు. సర్వేశ్వరునకు సర్వమాయ, స్వాధీనమైయున్నది. కావున వాని ఇచ్ఛగలిగినపుడు; కలుగుటయు, వెలుగుటయు, తొలగుటయు జరుగును. ఈ యుక్తిని సరిగ జ్ఞాపకముంచుకొన వలయును.

> నిరావరణ విజ్ఞాన, స్వరూపోహి స్వయం హరః
> స్వైరం చరతి సంసారే, తేన ప్రోక్తో దిగంబరః. ౧

౨. భస్మోద్ధూళనము:— పుణ్యాపాపములు, ధర్మాధర్మములు, సుఖదుఃఖములు, బాల్యయౌవనములు, జనన మరణములు మున్నగు ద్వంద్వబాధలు లోకాధీనులకు తప్పవు. లోకాతీతుడైన ప్రభువునకివి లేశమాత్రమును అంటుకొని పీడింపవు. దీనికి కారణ మా శివుని లోని చిన్మయతయే! ఈ జ్ఞాన తేజము సర్వకర్మములను, సర్వవికల్ప భావములను దహించి భస్మమొనర్చుచున్నది. మహేశ్వరు డిట్టి భస్మముతో దేహమునెల్ల నుద్ధూళనము గావించి యున్నాడు. అందువలన భస్మధారి యను పేరు వచ్చెను. అనగా కర్మముచే నలిప్తుడనియును చిన్మయు డనియును భావము.

> జ్ఞానాగ్నిః సర్వకర్మాణి, భస్మసాత్కురుతే కిల
> తేనైవ భస్మనా గాత్రం, ముద్ధూలయతి ధూర్జటిః. ౨

౩. జటాజూటము:— విశ్వమండలి సకలమార్గముల సంచరించి సర్వవైభవములను అనేక జన్మములెత్తి యనుభవించినను అపేక్షతీరదు.

ధర్మము అర్థము కామము అను త్రివిధపురుషార్థములను శాస్త్రోక్త ముగ ననుష్ఠించు వారికిని అంత్యము కనుపడుటలేదు. పురాకృత మఖిల జీవులకును ఉన్నట్లు తోచుచున్నది. ఇది తొలగుటకు భక్తి జ్ఞాన వైరాగ్యములు పరమావశ్యకములు. దీనికి మునివృత్తియే ప్రథమ సాధనము. సకల మునులును, సకల భక్తులును చివరకు శివునేఆశ్రయించుచున్నారు. ఇది పురాతన వటవృక్షము. పక్షిజాలము దినమెల్ల దేశము సంచరించి సమస్తఫలముల ననుభవించినను సాయంసమయమున నీ మఱ్ఱిచెట్టు నకేచేరుకొని సుఖము నొందుచున్నవి. గులాబి మొక్కకువలె సుందరమైన కుసుమము లీ చెట్టున లేవే యనువారికి దీని మాహాత్మ్యము తెలియదు. ఇది మహాశ్రియము. సమస్త ఖగ మృగ మునులకు ఆశ్రయము ననుగ్రహించుచు; శాఖలలోనుండి ఊడలను దింపికొనుచు దినదినమును తన మహత్త్వమును వృద్ధి గావించుకొనుచునేయున్నది. ఇటులే పరశివుడును సమస్త భక్తాశ్రియుఁడై సనాతనముగా తన మహాదేవత్వమును జాటుచునేయున్నాడు. కావున వేదాంతసాంఖ్యయోగము లనెడు తన మూడు జడలను పెంచి ఆ యా యుత్తమ మధ్యమ అధమాధికారులకు ఆలంబముల ననుగ్రహించి యుద్ధరించుచున్నాడు. "అయ్యో మా దేవునకువలె కత్తెరజుత్తు, సంపెంగనూనె, మీా దేవునకు మెరయుటలేవే? ఆ నెరసినగడ్డము, మాసినజడలు, ఏమిటి?" అనుకొనువారు ఆలోచింపనగును.

విశ్రామోఽయం మునీంద్రాణాం, పురాతనవటో హరః
వేదాంత సాంఖ్య యోగాఖ్యా - స్తిస్రస్తజ్జటయః స్మృతాః. ౩

౪. త్రినేత్రములు:—ఈ బ్రహ్మాండము నిండ నెల్లపుడు అంధకార మలముకొనియేయున్నది. ఒకవైపు వెలుగున్నదని సంతుష్టుల మగుదుమేని మఱొకప్రక్కన చీకటియున్నదని వ్యసనము గలుగక మానదు. భారతభూమిలో వెలుతురును, అమెరికాలో చీకటియును ఒకే కాలమున నుండగలవు. సూర్యచంద్రు లిద్దరును కావలసియున్నారు. వీ రిద్దరు తేజః స్వరూపులైనను లోకమునకు గావలసిన పాకాగ్నియు వేరుగా నున్నది. ఇక అజ్ఞానాంధకారమునకా హద్దులేదు. కావున సుజ్ఞానముతో సజ్జ్ఞానమును భారద్రోలి, యాహ్లాదము గలిగించుటకును,

లోకమునందలి యంధతమసమును ప్రచండ తేజముతో నశింపజేసి దట్టమైన వెలుగుజూపి లోకమును కర్తవ్యమున బడవేయుటకును, రాత్రిలో గూడ చల్లనివెలుగు నిచ్చి(శాంతిభావముతో అహోభావమునుగూడ జతపరచి) సమన్వయ సుఖము ననుగ్రహించుటకును, సూర్య చంద్ర అగ్నులు పరమావశ్యకములు. ఇవియే శివుని త్రినేత్రములు. అనగా సత్త్వరజస్ తమస్సులని ముప్విధములుగ వ్యాపించిన సర్వవిశ్వదోషములను సూర్యచంద్రాగ్నిరూప త్రినేత్రములతో సాకల్యముగ నవలోకించి నిర్వహించు సామర్థ్యము సర్వేశ్వరుడైన శివున కొక్కనికే కలదని భావము. రెండు కన్నులు గలవాడు బాహ్యమును మాత్రమే చూడ గలడు. శివు డట్లు సమాత్ముడు గాక జగత్తులోని ద్వంద్వమును గనుటకు ద్వినేత్రములను, అధ్యాత్మను గనుటకు జ్ఞాననేత్రమును గలిగి విరూపాక్షుడు, విషమాక్షుడు, అని చెప్పబడినాడు. జగత్తునకంటె విలక్షణమైన దృష్టికలవాడే జగదీశ్వర బిరుదమున కర్హుడు కదా!

> ఆప్యాయన స్త్మమోహర్తా, విద్యయా దోషదాహకృత్
> సోమ సూర్యాగ్నినయన, స్త్రినేత్ర స్తేన శంకరః. ౮

౫. సర్వధారణము:— లోకమందలి హేయమాయను వదలుకొన దలచినవా రందరును వానినుండి దూరప్రదేశములకు వెడలి గిరిగుహాలందు నివసింతురు. ఇట్టివారు గ్రామములోని ఆహారవిహారములను వదలనిచో మరల లోకవాసన తప్పదు. కావున అడవితిండికి అలవాటు పడవలసియుండును. వైరాగ్యవృత్తి నభ్యసించువారికి తిరిగి తిరికి కందమూలముల ద్రవ్వికొనుటయు బాధాకరమే! కావున పరమేశ్వర ప్రేరితమై సహజముగ సర్వత్ర ప్రవహించు సదాగతిని (గాలిని) సేవించి గాలివంటి జీవమును కొనలసినంత కాలము నిల్పికొనవచ్చును. లభించిన ఆ కొంచెము గాలినైనను వ్యర్థముగ వ్యయమొనర్పక ప్రాణాయామములతో బంధించి మెక్కువ కాలము దనుక నుపయోగింప వచ్చును. ఇట్టి వారికి చిత్తముకూడ స్వాధీనమగును. చిత్త మధీనమగుచో యోగము సిద్ధించును. యోగముతో శివయోగ (సాయుజ్యముక్తి) మహాసామ్రాజ్యము లభించును. ఇట్టి యోగీశ్వరులను కరుణించి శివు డాశ్రయ మొసంగును.

సర్పములు కూడా గాలి పీల్చి పుట్టలలో పరుండును. ఇవియు యోగులే. కావున శివుడు సొమ్ములవలె దాల్చెను. యోగీశ్వరుల చిత్త మసాధారణమైనదనియు, శిష్టుల ననుగ్రహించి దుష్టుల శపింతురనియును మన మెరుగుదుము. నిష్కారణముగ వారికి కోపము కలుగదు. అటులే సర్పములును మహాత్ములకు తమ పడగలతో నీడలు బట్టి; రత్నదీపముల నిడి సేవించుచుండును. దౌర్భాగ్యులను దుష్కృతులను మాత్రమే కరచును. నిర్నిమిత్తముగ నవి కాటువేయు ననుట నమ్మదగినది కాదు. అట్లు స్వేచ్ఛగ నందరను మ్రింగుచో నిప్పాటికి జనసంఖ్య యుండెడిదా? పైన కాళ్ళనూనిన వారిని, పరుండినవారిని, గరచుగాక! ఆభరణమువలె దాల్చిన శివమూర్తినేల గరచును? మహాకాలకూటమును గళమున స్తంభింపజేసిన కాలకాలునకు పామువిస మేమి చేయగలదు? కావున రుద్రుని సన్నిధిసేవతో తమలోనున్న ఆ స్వల్పతామసమును గూడ పాములు పోగొట్టుకొనుచున్నవి. పాములనే ధరించి వాని విషప్రద స్వభావమును శమింపజేయు మహాదేవుని మహిమ మపారముగదా!

యోగినః పవనాహారా, స్తథా గిరిబిలేశయాః
నిజరూపే ధృతా స్తేన, భుజంగాభరణో హరః॥ ౫

౬. త్రిశూలధారణము:—ఈ సంసారభావప్రసారమునకు ముఖ్యముగ క్రోధ, లోభ, అజ్ఞానములే కారణములు. అజ్ఞానమువలననే లోకవస్తువులపై యాశ పుట్టును. ఆ యపేక్షించిన వస్తువు లభింపనిచో క్రోధమే కలుగును. ఇదియే మహాఅనర్థహేతువు. కావున శాంతి వైరాగ్యము జ్ఞానము అను సునిశితమైన మూడు శూలముల (త్రిశూలము) తో సత్త్వరజస్తమోగుణాత్మకములగు త్రిపురములను త్రినేత్రములు గల శివుడు ఎక్కుపెట్టి హరించుచున్నాడు. ఒక శూలము, ఒక నేత్రము చాలదా యనుచో జగము వివిధగుణములతో నలముకొని యున్నపుడు వివిధ దృష్టులతో నవలోకించి వివిధోపాయములతో నణచుటయే ప్రాజ్ఞలక్షణము. అట్లగుచో శివునకు భిన్నదృష్టి, భేదదృష్టి యను దోషము పట్టు ననుకొనరాదు. త్రిశూలముయొక్క కొనలు మూడున్నను వాని యాధారదండ మొక్కటియే! అటులే నేత్రము లౌ యా సందర్భముల గనుటకు బాహ్య

మున మూఢుగా గన్పట్టినను వాని కాధారమైన మస్తకపీఠ మొక్కటియే. నేత్రములు ఎక్కువ యున్నంతమాత్రమున హృదయముతో నాలోచింపకయే, సమన్వయము గావింపకయే లక్ష్యమును వేధింపరనుట అనుభవైకవేద్యము. ఆలోచన లేనివానికి అధిక నేత్రము లున్నను అపకారమే జరుగును. పైగా జ్ఞానవైరాగ్య శాంతి సముద్రుడగు శివుడు ధరించిన త్రిశూలము తన యుద్దిష్టమును సముచితముగ గ్రహించియే ప్రవర్తింపగలదు. ఆజ్ఞను పరిపాలింపని అస్త్రమును హస్తమున ధరింతురా! విననిబంటుకు వెన్నపూస కూడనా! సర్వేశ్వరుడగు శివునకే లోహత్రిశూలముపై యనుగ్రహము కలిగినదన్నచో దాని ధన్యత కడు మాన్యము గదా!

శాంతి వైరాగ్యబోధాఖ్యై - స్త్రిభి రస్త్రై స్త్రరస్విభిః
త్రిగుణం త్రిపురం హంతి, త్రిశూలేన త్రిలోచనః. ౬

౭. వృషభవాహనము:—మిక్కిలి వేగముగా వెడలు వియాన (పక్షి, లేక విమాన)ములపై ప్రయాణించుట యొక గొప్పకాదు. అందు ఉపద్రవములును ఎక్కువగా నున్నవి. జీవితమును త్వరగా ముగింపదలచువారే ఎక్కువవేగము గల వాహనముల నుపయోగింపవలెను. ఆ వాహనములు సైతము దీర్ఘకాల ముండునవి కావు. యుద్ధక్షామ డామరసమయములలో నవి మరియు దుర్లభములై పోవును. లభించినను సౌకర్యము మిక్కిలి తక్కువ. బ్రహ్మాదులు హంసలమీద త్వరగా ప్రయాణముచేయుట కలవాటుపడినారు. వృషభములమీద నెక్కి మనమును బిగబట్టుకొని తిన్నగా పయనమగుటెట్లు? మోటారులలో దిగువారికి ఎద్దులబండి పయనము సరిపడునా! మసాలా వడల మెక్కు కుత్తుకలో జొన్నరొట్టె చొచ్చుటెట్లు! వడల వారి భోగముతో బాటు రోగమును పెద్దదియ. జొన్నలవారి రుచిభోగములు తక్కువే. కాని జీవితయోగము మిక్కిలి యెక్కువ. పక్షులమీదబడి ఎగిరిపోవువారికి పల్లెటూరి ప్రజల పనిపాట లేల దెలియును! అందుకనియే సర్వమును సావధానముగ-నవలోకించి పరిశీలించుట కయియే పరమేశ్వరుడు మందముగ సందముగ పయనించు వృషభేశ్వరునిపై నారూఢుడైనాడు. ఇం దుపద్రవ మొకటియైనను లేదు. పైగా నంది తానే తన మొనరి

వాహన మగుటకు శివునినుండి వరము దీసికొని మిక్కిలి యాసక్తితో వచ్చిన బంటు. తన దొరకు ప్రమాదము వాటిల్లనిచ్చునా? వృషభము సామాన్యముకాదు. సాక్షాత్తు ధర్మస్వరూపుడు. ధర్మము నాలుగు పాదములతో పూర్తిగా నతని కధీనము. ఆర్యుల కన్నివిధముల పవిత్ర మగు గోమాతకు నీ వృషభము పతిదేవత. ఇట్టి ధర్మదేవత నధిరోహించి "ధర్మమేధసమాధిసంపన్న"తను బడసి విశ్వమును పరిపాలించు సామర్థ్యము విశ్వాధిపుడగు శివున కొక్కనికే కలదు.

బ్రహ్మాద్యా యత్ర నారూఢా, స్తమారోహతి శంకరః
సమాధిం ధర్మమేధాఖ్యం, తేనాయం వృషవాహనః॥ ౧౨

౮. శ్మశానవాసము:—ఇంట శవము గాంచినంతనే అప్పటి మట్టుకు సర్వకర్మసన్న్యాసము గావించి గగ్గోలుపెట్టి యేడ్చువారికి శ్మశానమున సదానందమయుడై నృత్యమొనర్చు రుద్రుని కృత్యము విపరీతముగ దోపవచ్చును. లాభమున కందరు పెత్తనదారులే! నష్టమున కెవరు నాయకులు? సకాలమున శరీరమును వదలినవారిని గూర్చి విలపించుట మూర్ఖతయే కద! కాలము సమీపించనిదే గమన మెట్లు కలుగును? ఎన్ని విపరీతకర్మము లున్ననోకద విపరీత మరణము సంభవించుట? మనము భావించుకొను అకాలమృత్యువున కర్థము కలదా? పుణ్యులకు వశంకరుడైన శంకరుడు పాపులకు భయంకరుడే! నిరభిమానముతో నిర్లిప్తతతో సకాలమున లోకప్రళయము గావించు రుద్రుడు సదానందమూర్తియే కాక మరేమగును? పెద్దలజంపిన రాత్రి దొంగకు ఉరిశిక్ష నను గ్రహించిన న్యాయాధ్యక్షుడు సర్వలోకానంత మున పాల్గొనడా? కర్తవ్యమును గుర్తెరిగి తన తల్లిని ఖడ్గముతో వేసిన పరశురాముడును, భార్యను నరకదలంచిన హరిశ్చంద్రుడును స్మృతిపథములో నున్నవారికి రుద్రుని పవిత్రతనుగూర్చి జెప్ప నవసరము లేదు. అందుకనియే శివుడు రుద్రరూపముతో శ్మశానమున సదా నివసించి దివ్యప్రాసాదమునందువలెనే తన కర్తవ్యము నుత్సాహముతో నిర్వహించుచు లోకకల్యాణము గావించుచు సదానందమయుడై యున్నాడు. ఇతర పురుషోత్తముల కిదియసాధ్యము. కావుననే శివుడు సర్వాధికుడు, ప్రళయంకరుడు, మృత్యుంజయుడు.

నిత్యం క్రీడతి యత్రాయం, స్వయం సంసార భైరవః
తత్ర శ్మశానే సంసారే, శివః సర్వత్ర దృశ్యతే.

౮. ప్రమథ గణము:— శివునకు పారిషదులుగా ప్రమథులుండు టయు శాస్త్రప్రసిద్ధము. పరబ్రహ్మమునకును, ప్రకృతి, పంచభూత జగత్తు లేక సృష్టికిని సంబంధము లేదని వాదించువా రిద్దాని పర్యా లోచింపవలెను. సచ్చిదానందఘనుండగు శివుడు ఈ జగద్రూపమగు క్రీడతో నిత్యానందము నందుచున్నాడు. ఇది యాతని స్వతంత్రమైన లీలావిలాసము కావున ఇతరుల వలన గలుగుచున్న దని యెవ్వరును భావింపవలదు. శివుడే ఆనందసముద్రము. శివుని ఇచ్ఛా క్రియా జ్ఞాన రూపమగు శక్తియే ద్రవజలము. శివుడు పొందుచున్న ఆనందము యొక్క కణములే సముద్రములోని తుంపరలవలె ప్రమథగణములు. ఈ జగత్తు సర్వమును శివుని లీలావిలాసమేకాని వేరుకాదు. శివునిలో సర్వదా యడగియున్న శక్తివలన నీ సృష్టిస్థితిలయములు జరుగు చుండును. ఇదియంతయు వాని యధీనములో నున్నది. వాని ప్రేరణ లేకయే విశ్వములోని ఒకవస్తువైనను కదలజాలదు. ఇట్టి ఏకైకప్రభువు లేనిచో సృష్టిలోని సర్వపదార్థములు ఎవరియిష్టానుసారము అవి పర స్పరవిరుద్ధముగను, విపరీతముగను నడచుచో మహావిప్లవమే చెలరేగి యుండెడిది. అట్లు జరుగక పరస్పరానుకూలముగ ఒకనియమము ననుస రించి నడచుచున్నందువలనను, అవి కొన్ని సంగతుల ననుసరించుటకు మాత్రమే స్వల్పశక్తి కలిగి యుండుట వలనను సర్వశక్తి సంపన్నుడును సర్వజగచ్చాలకుడును అగు నొక ప్రభు డున్నాడనియే మనకు దోచు చున్నది. జగత్తునకును జగదీశ్వరునకును అవినాభావసంబంధము లేనిచో ఇట్టి మహాలీల జరుగదు. ఎట్టి గుణములుగాని సంబంధముగాని లేని బ్రహ్మ మొకటి కలదనుట వంధ్యాపుత్రుని సాధించుటయే యగును. "యతోవా ఇమాని భూతాని" "సర్వం ఖల్విదం బ్రహ్మ" మున్నగు ననంఖ్య ప్రమాణములు నీ సర్వము సర్వేశ్వరాధీన మనుటకు భేరీనినాదములు. ఈ ప్రమథగణాదుల సృష్టి బ్రహ్మకు దెలియుటకై శివునిచే జేయ బడెను. ఇది ప్రథమసృష్టి కావున ప్రమథగణము లని పేర్కొన బడి నటు పురాణప్రతీతి కలదు.

ఆనందసాగర శ్శంభు, స్తచ్ఛక్తి ర్ద్రవ ఉచ్యతే
శీకరా ఇవ సాముద్రా, స్తదానందకణా గణాః. ౯

ఈ పైన శివునకు సంబంధించిన కొన్ని చిహ్నములు మాత్రమే వివరింపబడినవి. వీనిని నా యల్పబుద్ధికి దోచినటులు వ్రాయుచు సమర్థనమునకై "బోధసారము" లోని శ్లోకముల నుదాహరించితినే కాని యా శ్లోకములకు కేవల మర్థతాత్పర్యములను కాదు. ఈ శివ పంచస్తవిలోని యనేకశ్లోకముల తాత్పర్యవిశేషాంశములలోను పై విషయములు యథాసాధ్యము సమావిష్టములైనవి. ఇంకను శాస్త్రీయమైన చర్చను గోరువారు స్కాంద శివ లింగ పురాణ శివ రహస్యాదుల నవలోకింపవలెను.

## శివతత్త్వము - జీవుడు.

సర్వేశ్వరుడగు సదాశివునిగూర్చి తెలియదగినది చాలగలదు. మానవబుద్ధి మిక్కిలి యల్పమైనది కావున లోకాతీతవిభూతిసంపన్న మగు శివతత్త్వమును దెలియజాలదు. ఇట్టు లది కేవల మమేయమని యౌదాసీన్యమును బ్రచార మొనర్చుటకాదు. "మానవ శ్శివయోగేన శివో భవతి నిశ్చయం (సి. శి) శివం జ్ఞాత్వా శివో భవేత్ (పా. ౧) బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః (భ. గీ. ౫-౨౦) బ్రహ్మవిజ్ఞానలాభాయ... శాంతిదాంత్యాదిభిః సర్వై స్సాధనై స్సహితో భవేత్ (నా.ప.౬-౨౮) శివజ్ఞానం పరంబ్రహ్మ (శివో ౭-౬౧) శివరూపః ప్రాణిలింగీ (రుద్రో ౨) శివ స్సర్వజగత్పతిః (శివో ౧-౧౪) శివ స్సంసారమోచకః (పంచ బ్ర. ౩౬) శివభక్తి సమాయోగే జాయతే పరమా స్థితిః (యో. శి. ౧-౧౭) శివలింగం త్రిసంధ్య మభ్యర్చ్య (భ. జా. ౨-౪) శివో గురుః శివో వేదః, శివో దేవః శివః ప్రభుః (వరాహో ౪-౩౨) శివోహం నానాశక్తోహం (అద్వై. భా. ౧) రుద్ర మేకత్వ మాహు శ్శాశ్వతం వై పురాణం (అ. శి. ౩-౯) రుద్రవాగ్నిః (పారా. ౧) రుద్రగ్రంథిం భిత్వా యాతి శివాత్మకం (యో. శి. ౧-౧౧౫) శివ మద్వైతం చతుర్థం మన్యంతే (రామో ౨-౪. గణే. ౧-౪. మాండూ ౧-౭) అను ప్రమాణ సమవాయమునుబట్టి జీవుడు శివుడగుటకు గావలసిన సామగ్రి సంసిద్ధ ముగ నున్నదనియు నిశ్చయ మగుచున్నది.

జగద్విహితమగు బ్రహ్మము కలదన్నను అది శూన్యము కంటె మరియొకటి కాదు. మనతో నెవ్విధముగను సంబంధముగాని వస్తువునుగూర్చి మనకు పరిసక్తియే లేదు. ఎవ్వాని ఇచ్ఛ ననుసరించి విశ్వము పుట్టుచు, మనుచు, గిట్టుచున్నదో అట్టి మహేశ్వర శివతత్త్వమే మనకు ఉపాసనార్హము. ఈ శివోపాసన మహాత్ముల కెంతసులభమో అల్పాత్ముల కంత దుర్లభము. విశ్వములోని చరాచరములకు నెల్ల పరమేశ్వరు డొక్కడే పరమకారణుడు. ఇట్టి నిశ్చయాత్మకమైన జ్ఞానము గలవాడు మాత్రమే శివోపాసన కధికారి. వారివారి శక్తిపాతమును బట్టి హఠ, రాజ, కర్మ, జ్ఞాన భక్తియోగముల మార్గములు సాధనము లగుచుండును. ఇందు కొన్ని కొందరికి మాత్రమే సిద్ధించును. తదితరులు తమ సామర్థ్యలోపమును గమనించి దృఢమైన యభ్యాసవశమున పరమును సాధింపవచ్చును. జీవుని బంధముగూడ సామాన్యమైనది కాదు. అదియెంత దీర్ఘకాలమునుండి వెంటనంటి వచ్చుచున్నదో కదా! కావుననే జీవుడు సాధారణముగ అర్థకామములందు పేరాశగలిగి యున్నాడు. ధర్మపురుషార్థమును సేవించువారు కొలదిగ నుందురు. ఇక పరమపురుషార్థమైన మోక్షము నపేక్షించువారు మిక్కిలియరుదు. జీవునకు దవిలియున్న మాయాపాశమే దీనికి గారణము. శివకృప లేనిదే ఈ పాశవినాశము కలుగజాలదు. శివకృపను సంపాదించుటకు నుపదిష్టములగు నిఖిలోపాసనలలో భక్తియోగమే సర్వాధికారి సులభమై, కలికాలమందు శ్రేష్ఠతరమై యొప్పుచున్నది. శివయోగులాదియందు భక్తస్థలమునే ఆశ్రయించుట సుప్రసిద్ధము. (9) నవవిధములుగ నున్న భక్తియోగాచారములలో స్మరణ కీర్తనములు ప్రధాన సాధనము లనుట జగద్విదితము. ఈమార్గమున దృఢముగ ప్రయాణించు జీవుడు తన నామరూపముల బోనాడి పరశివత్వము నొంది తీరును.

ఈ శివతత్త్వము "శివ శక్తి సదాశివ ఈశ్వర శుద్ధవిద్యా మాయా కలా విద్యా రాగ కాల నియతి పురుష ప్రకృతి బుద్ధి అహంకార మనస్ శ్రోత్ర త్వక్ నేత్ర జిహ్వా ఘ్రాణ వాక్ పాణి పాద

---

(9) భక్త మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను షట్స్థలములను క్రమముగ ప్రవేశించుట వీరశైవశాస్త్రప్రసిద్ధము.

పాయు ఉపస్థ శబ్ద స్పర్శ రూప రస గంధ ఆకాశ వాయు అగ్ని జల పృథ్వి'' అను ముప్పదియారు తత్త్వములుగ పరిణమించును. చరాచరాత్మకమైన ఈ జగమంతయు పరశివుని పరిణామ మనియే శివాగమములు చెప్పుచున్నవి. ప్రత్తియే దారమై వస్త్రమై విస్తరింపబడి రొుక జేరా యగుచున్నట్లు శివుడు తనలో నిత్యమైయున్న విమర్శనశక్తి యొక్క వికాసము వలన విశ్వరూపముగా పరిణమించుచున్నాడు.

> ఆత్మశక్తివికాసేన, శివో విశ్వాత్మనా స్థితః
> కుటీభావా ద్యథా భాతి, పటః స్వస్య ప్రసారణాత్.
>
> సి. శి. ౧౦-౬౫

శివుని నుండియే యుద్భవించిన ఈవిశ్వము శివునికంటె భిన్నము కానేరదు. విత్తులోనుండి వచ్చిన చెట్టు విత్తు కంటె వేరెట్లగును? ప్రత్యక్ష అనుమాన శబ్దము లనెడు ప్రమాణత్రియముతో నీ శివాద్వైతశాస్త్రము కర్తవ్యమును, జ్ఞాతవ్యమును ఉపదేశించుచున్నది. ఎట్టి క్రమముతో జీవాత్ముడుగా పరిణమించినాడో మరల అట్టి వ్యుత్క్రమము నవలంబించుచో వాడే శివుడుగా సిద్ధము కాగలడు.

కామిక కారణ సూక్ష్మ పారమేశ్వరాది శివాగమములును, ఈశాద్యుపనిషత్తులును, వ్యాసుని శివపురాణములును, శివాద్వైతమంజరి, శ్రీకరభాష్యము, సిద్ధాంతశిఖామణి, క్రియాసారము, శివతత్త్వవివేకము, శివతత్త్వ రత్నాకరము మున్నగు గ్రంథములలో విశేషముల నవలోకింపవచ్చును. గోరఖపూర్ గీతాప్రెస్సువారి 'కల్యాణ శివాంక' మును దర్శించినైనను ఈ శివధర్మసాహిత్యపరిచయము నొంద వచ్చును.

## శివస్తవములు

వేదము సర్వవిజ్ఞానమునకు మూల మని మన పెద్దలు వచించిరి. ఋగ్వేదమందలి "అగ్నిమీళే పురోహితం" అను ప్రథమమంత్రము స్తోత్రసాహిత్యమునకు సర్వప్రథమప్రచోదితమని యెంచుట సమంజసము. అగ్ని యే రుద్రుడు కావున నది శివస్తవమనియు చెప్పనగును,

రుద్రశబ్దమునకు "విశ్వేశ్వరుడు, కల్యాణకరుడు" అను నర్థములే వేద ప్రసిద్ధములు. ఐతే "సంహారకర్త" యను నర్థమును ఇటీవల యాథ మగుటచే కేవలము కాంతి కల్యాణార్థములు గల శివశబ్ద ముపదిష్ట మైనది. "కద్రుద్రాయ ప్రచేతసే" అను ఋక్సూక్తములు స్పష్టముగ శివ స్తవములే. యజుర్వేదమందలి శతరుద్రీయ నమక చమకములు అద్వి తీయమైన శివ స్తవమనియును, అందు భక్తిభావ, కవిహృదయములు చక్కగా వ్యక్తీకరించిన వనియును విజ్ఞులకు నివేదింప నవసరములేదు. మాండూక్య, ఈశ, అథర్వశిర, శ్వేతాశ్వతరాద్యుపనిషత్తులలో శివ స్తవములు స్పష్టముగనే యున్నవి. కావున వేదాంతగౌరవమునుబట్టి శివుని యుపాసనార్హత తేటపడుచున్నది. ఋగాదిమంత్రసంహితలు పూర్వకర్మకాండలు. కావున నందు ఇంద్రాగ్ని వరుణాది పాంచభౌతిక వివరణము లెక్కువగా గలవు. పరమజ్ఞానకాండము లగు ఉపనిషత్తు లలో శివపరబ్రహ్మస్తవము లుండుట గమనింపదగి యున్నది.

ఇక శివాగమములు, శివపురాణములు, శివరహస్యము, భారత భాగవతాదులలో వివిధములైన శివ స్తవములు పరస్సహస్రములుగా నగుపడుచున్నవి. ఆ యా ప్రసంగములలో నీ స్తోత్రములను దూర్వాస గౌతమ అగస్త్య విశ్వామిత్ర సానంద మార్కండేయ రావణాదులు విరచించినట్లు ఆయాగ్రంథములవలననే తెలియుచున్నది. ఇవి మిక్కిలి ప్రాచీనములు. ఇందు కొన్ని నేటికిని సుప్రసిద్ధములై ప్రచారములో నున్నవి. 'రత్నసానుశరాసనం' "జటాకటాహసంభ్రమత్" "బ్రహ్మ మురారి సురార్చితలింగం" "చంద్రశేఖర పాహి మాం" మొదలగు శివ స్తవములు శివభక్తుల కంఠభూషణమై వెలయుచున్నవి. పుష్ప దంతుని మహిమ్న స్తవమును పురాణకాలముననే గణనకు వచ్చి యుండును. దీనిగూర్చి ముందు విస్తరింపబడును.

చరిత్ర కాలమున ప్రచారమునకు వచ్చిన శివ స్తోత్రములను గురించి యును కొంత తెలియు టవసరము. శ్రీ శంకరాచార్యులవారు శివస్తవ ముల ననేకముగ విరచించినారు. వీరి శివానందలహరి దక్షిణదేశమున మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. స్తోత్రవాఙ్మయమునకు గూడ శంకరుడే భిక్ష పెట్టినట్లున్నది. [illegible] పూర్వులగు నీలకంఠ సుందరపాండ్య

సోమానంద అభినవగుప్తాది శివాచార్యులు గొప్ప శివభక్తులు. కొన్ని కారణములవలన వీరి శివస్తవములును అనేకములుగా నుండియుండునని యూహ కలుగుచున్నది. కాని మూలతః దొరకునంత వరకు శంకరుని స్తోత్రములే చరిత్రకాలమున ప్రథమగణ్యము లగును. శంకరుని కాలము క్రీ. శ. 100-750, వరకని చర్చ జరుగుచున్నట్లు పాఠకు లెరుగవలెను. తరువాత ఉత్పలాచార్యుని శివస్తోత్రావలి [10] ప్రశస్తమైనది. ఇందు వివిధములైన ౨౦ శివస్తవములుగలవు. శ్లోకసంఖ్య ౪౪౮. శైలి ధారాళమైనదే కాని శాస్త్రీయపరిభాషలు గలిగి ఇంచుక కఠినమై యున్నది. దీని పరిచయము సామాన్య లోకమునకు లేదు. దీనికంటె పూర్వమున ననేకస్తోత్రము లుండబట్టియే ఇట్టి సమర్థమైన శివస్తోత్రావలి పుట్టియుండును. దీనికి మహామాహేశ్వర క్షేమరాజు సంస్కృతటీకను రచించియున్నాడు. ఉత్పలుడు క్రీ.శ. 760 మున నుండెననుచున్నారు. అట్లగుచో శంకర దండి సోమానంద నీలకంఠాదుల స్తోత్రముల నీత డవలోకించియుండును. హరదత్తాచార్యుని పంచశ్లోకి శివాధిక్యమును స్థాపించుటలో శిరోమణి. ఇది స్తవమగునా కాదా యను సందేహము కలదు. పంచశ్లోకి కర్త 9 వ శతాబ్దపు వాడని ప్రతీతి. ఈ యైదు శ్లోకములపై క్రీ. శ. 18 వ శతాబ్దమున నున్న కెళది బసవ భూపాలుడు ౨౦౦ పుటల విపులమైన సంస్కృతవ్యాఖ్యను విరచించి యున్నాడు. ఇది చాల సమర్థమైన టీక. హరిహరతారతమ్య మను చక్కని చిన్ని శివాధిక్యగ్రంథమును విరచించిన రామేశ్వరమఖి యెప్పటివాడో కాని "వయ మాశ్రయామః" (మే మాశ్రయించుచున్నాము) అనుటచే నిది స్తోత్రములలో జేర్పనగును. 14 వ శతాబ్దమున కాశ్మీరదేశమునందు విఖ్యాతుడైన జగద్ధరభట్టు "స్తుతికుసుమాంజలి" యను లోకోత్తరమైన శివస్తవగ్రంథమును విరచించెను.[11] ఉత్పలుని శివస్తోత్రావళి యనుకరణ మిందు గన్పట్టినను ఇది యొక యద్భుతమేధాసంపన్నుని కృతి యనుటలో సందేహమే లేదు. ఇందు

---

(10) ఇది కాశీ చౌఖంబా సంస్కృత గ్రంథమాలలో ప్రకటితము.

(11) ఇది పం. ప్రేమవల్లభ త్రిపాఠి, శివభక్తి గ్రంథమాల రామఘాట్. కాశిలో దొరుకును.

ముప్పది తొమ్మిది తెరంగుల శివస్తోత్రములుకలవు. మొత్తము ౧౪౪౯ శ్లోకము లున్నవి. పేరున కిది స్తుతిగ్రంథమేయైనను కావ్యముయొక్క సర్వగుణములచే పరిపూర్ణమై మహాకావ్య మన దగియున్నది. స్తోత్ర సాహిత్య జగమున నీ స్తుతికుసుమాంజలికి సార్వభౌమపట్టము, గట్ట వలసినదే! శైవ వాఙ్మయముననే కాదు. శాక్తవైష్ణవ వాఙ్మయమునను ఇట్టి మధురచమత్కృతిగల కృతి లేదన్నచో నతిశయోక్తి కాదు. తరువాత కాలమున అప్పయ్య దీక్షితుని శివస్తవములును మన్నన గాంచెను. దీక్షితునితోబాటు ఒక మహాయుగ మస్తంగతమైనది. ఈ యాధునికయుగమునను స్తోత్రములు పరస్సహస్రములు విరచితమైనవి అగుచున్నవి. కాని వీనికి ప్రాచీన స్తవములకుబోలె ఘనత గలుగకుండుట సహజమే! భరద్వాజకృత మని శివకర్ణామృతస్తవ మొకటి కలదు. ఇందలి కవిత కమ్మనిదే కాని ఈ భారద్వాజు డెప్పటివాడో తెలియదు. గీతగోవిందము ననుకరించి గీతగౌరీశకావ్యము నొక శివకవి రచించినాడు. దీనిని కొన్ని కారణములవలన స్తోత్ర మనవచ్చును. అంత ప్రౌఢముగా నగుపడలేదు. గోకులనాథ పండితుని శివస్తుతియు శివలింగభూపాలుని శివలీలాస్తుతియు కొంత బాగుగ నున్నవి.

దృష్టిగోచరమైన స్తవములను గూర్చియే వ్రాసితిని. 'ఆఫ్రేటు' గారి సూచీ పత్రికలో (Catologue of catolograms) అనేక శివస్తుతులు సూచింపబడినవి. బృహత్స్తోత్రరత్నాకరము, పరమేశ్వర స్తోత్రకదంబము మున్నగు గ్రంథములలోను శివస్తవములు కలవు. కాళిదాస బాణ మయూరాది మహాకవుల పేరిటను శివస్తవములు ప్రచారము నందియున్నవి. పరిశోధింపనిదే వీనిగూర్చి వ్రాయ వీలు లేదు. ప్రాచీన పండితులు ప్రథమమున ఇష్టదేవతాస్తుతుల నల్లిన యనంతరమే కావ్యకర్తలై పన్నెకెక్కి యుండురు. కవిత్వమునకు మొదటికృతి స్తుతియే! ఇవి ప్రాథమికము లగుటవలన నెన్నియో ప్రౌఢముగా లేవు. పాండిత్యకవిత్వము లబ్బినపిదప మధ్యవయస్సున రచింపబడిన స్తుతులుమాత్రమే పండితపామరరంజనము గావించి ప్రచారమునసందినవి. ఆంధ్రశతకములును నిట్టివే.

కవి తన భక్తి భావమును శివసన్నిధిని ప్రకటించుట ప్రథమోద్దేశ్యము కావున నీస్తుతులన్నియు సాధారణముగ భక్తి ప్రబోధకములే కాని నీతి, సదాచార ధర్మముల నుగ్గడించుచు దురాచారముల దుర్మతముల ఖండించుచు నొక్కొక యెడ చమత్కారజనకములై భగవల్లీలను నిరూపించు చుండును. ఇట్టి మధురమైన కావ్యగుణము లుండుటంజేసియే ఇవి యింత దీర్ఘకాలము స్థిరతనంది భాషాప్రచారోద్దీపకములై శబ్దార్థజ్ఞానప్రదములై వెలయు చున్నవి.

## శివపంచస్తవములు

శివమహిమ మపారమైనట్లు శివస్తవములును మహాసాగర సదృశములై యున్నవి. దప్పిగొన్నవాడు సరోవరములోని కొలది జలమును గ్రోలి సంతసించునట్లు శివభక్తులు శివస్తవ రత్నాకరమునుండి మహిమ్న, మల్హాణ, మలయరాజ, అనామయ, హలాయుధము, లనెడు ఐదు స్తవరత్నములను హస్తగతము గావించుకొని పారాయణ మనెడు శాణోల్లేఖ మొనర్చి కంఠమున ధరించి ధన్యులైరి. ఇవియే శివపంచస్తవము లని ప్రసిద్ధి నందెను. వీనిని క్రమముగ పుష్పదంతుడు మల్హాణుడు మలయరాజు దండి హలాయుధుడు అను పరమ పాశుపత పండిత కవులు విరచించినారు. వీని ఘనత గణనాతీతము. ఇన్ని స్తోత్రము లుండగ నీ యైదింటికే మాన్యత గలుగుటకుగల కారణము వీనిశ్రేష్ఠతయే! ఈ స్తోత్రకర్తలందరును మహాశివభక్తులై ప్రసిద్ధచరితులగుటవలనను, వీనియందలి శయ్య, భాష, భావము, రమ్యముగా నుండుటవలనను, భక్తిప్రదములగుట వలనను అపూర్వముగా నుండుట వలనను, నివి ప్రచారమునకు వచ్చినవి. కావున నీ పంచస్తవముల కీర్తి నకారణమై యున్నది.

ఈ స్తోత్రములు వేరువేరు కాలములలో పుష్పదంతాదుల వలన విరచితములై యున్నను తరువాత కాలమున శివభక్తులు వీనినన్నిటిని ఒక్కచో జేర్చి 'శివపంచస్తవములు' అను వ్యవహారమును గలిగించిరి. శంకరాచార్యుని శివానందలహరి, ప్రసిద్ధమైన ప్రచారమున నున్నను ఈ పంచస్తవములలో గణింపబడదయ్యెను. ఇట్టిప్రసిద్ధికిగూడ సుకృతా

దృష్టము కావలసినట్లున్నది, ఇందుకు మరికొన్ని కారణములుకూ నగుపడుచున్నవి. శంకరుడు మహాచార్యుడు, అద్వైతస్థాపకుడు. శివా నందలహరిలో నిట్టి భావమును సులభముగ గనిపట్టవచ్చును. శ్రీ భక్తుల దృష్టిలో భక్త్యతిశయము, శక్తివిశిష్టాద్వైతసిద్ధాంతము, శైవత్వము అను మూడింటికి ప్రాధాన్యముంట జేసియిట్టి గుణములుగ స్తోత్రములే ప్రత్యేకముగ నన్వేషించినారు. పంచకృత్యపరుండును, పంచ ముఖుండును, పంచభూతేశ్వరుండును నగు పరశివుని భజించుటకు పంచ స్తవములే పర్యాప్తము లని భావించి యుందురు. ఉత్తమమైన స్తోత్ర ములు ఎన్నియో యుండును. వానినెల్ల జేర్చుచు బోవుచో గ్రంథము ప్రవర్ధమానము కావచ్చునే కాని యంత్యమేర్పడదుక దా! అందువలన సర్వసారములుగను సమర్థములుగను నున్న యీ యైదింటికే ప్రాధా న్యము గల్గినది.

ఈ స్తవములను ఎవరు ఏవత్సరమున ఒకచో జేర్చి శివపంచస్తవ ములు అని నామకరణము గావించిరో స్పష్టముగ దెలియుట కింకను సాధనములు గావలసియున్నవి. పై స్తుతికర్తలలో పుష్పదంత మల్హణ మలయరాజ దండి హలాయుధులలో కడపటి కవి 780 లో నున్న వాడు. కావున 9,10 శతాబ్దములలో నీ పంచస్తవ వ్యవహారము కలి యుండ వచ్చును. 1190 లో నున్న మహాకవి పాల్కురికి సోమనాథుడు మాత్రము తన పండితారాధ్యచరిత్రలో పండితుని శివలింగార్చనను గొనియాడు సందర్భమునను పర్వతవర్ణనమునందును నొక్కచోటుననే నీ యైదింటిని జేర్కొనెను.

"మహిఁజెప్పఁబడు మహిమ స్తవంబునను,
మలహరణంబగు మలహాణంబునను,
శ్రీమయంబైన యనామయంబునను,
ఆయతప్రీతి హాలాయుధంబునను"

"మ
యూఘ స్తవము హలాయుధ మనామయము,
మలహాణంబు మహిమ్నంబను స్తవంబు
మలయరాజీయంబు ..."

శబ్దతః ఇవి శివపంచస్తవము లని సోమనాథు డనలేదు, కాని రెండు మారులును నివి ఒకే సముచ్చయముగా గూర్చుట చేత మల్లికార్జున పండితుని నాటికే (1160) ఇవి బాహాటముగా శైవుల పారాయణమున నర్హత సంపాదించినట్లు దెలియనగును.

క్రీ. 1130 లో కర్ణాటకరాజ్యమందలి ద్వారసముద్రమును పరిపాలించిన నరసింహబల్లాళరాజునొద్ద వీరశైవలోకప్రసిద్ధుడైన కెరెయ పద్మరసు మంత్రిగా నుండెను. [12] ఈతడు కన్నడమున దీక్షాబోధ యను చక్కని గ్రంథమును రచించెను. ఈతని పౌత్రుడగు విశ్వారాధ్యుడు ఈ శివపంచస్తవములకు సంస్కృత వ్యాఖ్యానమును గావించినాడు. [13] అందు:—

సాక్షాదీశ్వరలోకగామి మహిమశ్రీమత్తటాకాబ్జరా
జారాధ్యాన్వయ దుగ్ధసింధు విలసచ్చంద్రో వరాకారవాక్
సద్వృత్తః పదవాక్యతర్కభరతాలంకార సంగీతవిద్
విశ్వారాధ్యవిభు శ్శివాగమముఖవ్యాఖ్యానకృద్ భాసతే.

[ప్రత్యక్ష కైలాసమునందిన కెరెయ పద్మరసు వంశాబ్ధిచంద్రుండును, సుందరుండును, సదాచారుండును, తర్కవ్యాకరణ మీమాంసానాట్యసంగీతసాహిత్య శాస్త్రజ్ఞుండును, శివాగమాదులకు వ్యాఖ్యల రచించినవాడును అగు విశ్వారాధ్యుడు కలడు.]

అని తన పరిచయము నిచ్చినాడు. మన చెరువు కన్నడమున కెరె యనబడును. దీనిని తటాకమనియును, పద్మరసు (పద్మరాజు)ను అబ్జారాధ్యుడనియును విశ్వారాధ్యుడు సంస్కృతించినాడు. ఈ 'తటాకాబ్జారాధ్య' అను మొత్తమును కెరెయ పద్మరసు అని తెలియవలెను. ఇక్కడ నీ కెరెయ పద్మరాజవంశమున విశ్వారాధ్యుడు బుట్టినట్టు మాత్రమే తాత్పర్య మగునుగాని పౌత్త్రుడనుటకు సాధనము లేనందునను, మల్హణస్తుతి వ్యాఖ్యానమున పాల్కురికి సోమనాథుని నామతః బేర్కొనినందున విశ్వారాధ్యుడు సోమనాథునికి చాల

(12) మా గ్రంథమాలలో "వీరశైవ మహాత్ముల" ౭౮ పుట చూడుడు.

(13) ఈ గ్రంథమును కన్నడ తాత్పర్యముతోగూడ మైసూరు హోసమఠ బసవలింగస్వామిగారు 1908 లో ప్రకటించినారు.

తర్వాతివాడు కావచ్చునని శ్రీయుతులు బండారు తమ్మయ్యగారు భావించిరి.[14] నేనును ప్రథమమున నట్లే భావించితిని. కాని కెరెయ పద్మరసు వంశస్థుడే యైన పద్మణాంకుని "పద్మపురాణము"[15] నవలోకించిన పిదప విశ్వారాధ్యుడు కెరెయ పద్మరసుకు పౌత్రుడని నిశ్చయమైనది. ఇందు కవి తన వంశక్రమమును జెప్పుచు, మల్లరసు, సకలేశమాదరసు, మాయదేవ, కెరెయపద్మరసు, కుమారపద్మరసు, విశ్వారాధ్య, దేవారాధ్య, గౌరారాధ్య, దేవార్య, వీరణార్య, పద్మణ, పద్మణాల్ అను పురుషులను ఒకరి కొకరను పుత్రులని నిర్వచించి విశ్వారాధ్యుడు మహిమశాలియును, పండితవర్యుడనియును ఉగ్గడించినాడు.

> ఆకెరియ పద్మణా, ర్యోదరార్ణవ నవసుధాకరం
> సుకుమార పద్మరసాద్య, రీకృతియనోవుగనిశం. ౧-౨౦
> నిరుపమ కుమార పద్మరసార్య రాత్మజం
> పరమతధ్వాంతప్రచండభాస్కరనీశ
> శరణ చరణాబ్జ చంచచ్చంచరీకం నమస్కృత సమస్తలోకం
> కరద లింగదొళె సద్యః ప్రసన్న తే వడెదు
> నిరతిశయ సంవిత్సుఖ మనెయ్దుదార్య ప్ర
> సరచక్రవర్తి విశ్వారాధ్య రెమ్మజిహ్వాగ్రదొళ్నిలైసతతం. ౧-౨౨
>
> —పద్మపురాణ ౧వ సంధి.

అందువలన నీవిశ్వారాధ్యుడు పాల్కురికి సోమనాథునికి ఇంచుమించు సమకాలికుడై 1190 ప్రాంతమున నుండి యుండవచ్చును చాల తర్వాతివాడు మాత్రము కాదు. ఈతడు శాస్త్రవేత్తయే కాక మన సోమనాథుని యాంధ్రకృతులను చక్కగా నవలోకించినవాడని చెప్పవచ్చును. ఈతని వంశమునందే తర్వాత 1385 ప్రాంతమున బుట్టిన[16] పద్మణాంకుడు చెప్పినది ప్రామాణిక మనవలసియున్నది. మరి విరుద్ధప్రమాణములు లేవు.

---

(14) 'విభూతి' 3-8లోని 'శివపంచస్తవములు' చూడుడు—

(15) దీనిని బెంగుళూరు శ్రీమల్లారాధ్యులు (౨౧) పూర్వము ప్రకటించిరి.

(16) కర్ణాటక కవిచరిత్ర ౨వ భాగము చూ.

విశ్వారాధ్యుని శివపంచస్తవవ్యాఖ్యానము మిక్కిలి బాగుగా నున్నది. సరళమై సాన్వయమై సాధారమై సంస్కృతభాషాభిజ్ఞులకు ఏక మాత్రి సహాయకమై యొప్పుచున్నది. దీనిని కన్నడమున ముద్రించిన వారు ఇంక నెక్కువగా శ్రద్ధవహించి యుండుచో విశ్వారాధ్యుని కృతి పండితలోకమున ప్రసిద్ధ మయ్యెడిది. ఇందు మల్హాణస్తవము గ్రంథాదిని ప్రమాదవశమున ముద్రించినట్లున్నది. బిదరు జిల్లా ధన్నూరుమఠమందలి వ్రాతప్రతిలో మహిమ్నస్తవమే మొదట నున్నది. విశ్వారాధ్యుడిదే క్రమము ననుసరించియుండును. అవి ఖండఖండములుగా దొరకినపు డెవరేని మల్హాణమును మొదట జేర్చి యుందురు. మైసూరు ప్రతిలో నది యట్లే నిలచిపోయినది. లబ్ధమైనంతవరకు విశ్వారాధ్యుని వ్యాఖ్యయే పంచస్తవికి ప్రథమము.

శివపంచస్తవికి మొత్త మెన్ని వ్యాఖ్యానములు కలవో సమగ్ర పరిశీలనమువలనగాని తెలదు. 1520 వ ప్రాంతమున నున్న యూర దేచయమంత్రి మరియొక సంస్కృతవ్యాఖ్యానమును గ్రథించినాడు. దీని లిఖితప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది[17] అందు:-

> లక్ష్మీధరకటాక్షేణ దేచయామాత్యశేఖరః
> అకరో దాకరో వాచాం మహిమ్నస్తుతిపంచికాం
> మల్హాణస్తుతిపంచికాం, నీలకంఠ స్తుతేష్టీకాం
> అనామయకృతే ష్టీకాం, హలాయుధకృతే ష్టీకాం

అని లిఖింపబడినది. దీనిని "స్తుతిపంచిక" యని మంత్రి పేర్కొనినాడు. ప్రాచీన విశ్వారాధ్యుని గ్రంథము:లోని మలయ రాజముగాని, ఇటీవల నాంధ్రదేశమున ప్రచారమైయున్న బిల్హాణ స్తవముగాని యీ దేచయమంత్రికృతిలో లేవు. నీలకంఠస్తవ మొకటి నవీనముగా జేర్పబడియున్నది. ఇది వాయుపురాణ, ఉమామహేశ్వర సంవాదమున బ్రహ్మప్రోక్తమై యున్నది. రావణ మార్కండే

---

17 శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మానసంచికలోని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి వ్యాసమునుండి కొన్ని యంశము లిట స్వీకృతములు.

యాదుల స్తోత్రములవలె నిదియు శైవుల పారాయణమున ప్రచా
మైనది. కాని, శివపంచ స్తవములలో దీని గణించి దేచయమంత్రి
యేల వ్యాఖ్యానించెనో తెలియదు. శివపురాణములలోను శివరహస్య
ముఁలోను పెక్కుచక్కని స్తోత్రము లుండగా ఏ ప్రత్యేకతయులేని
ఈ నీలకంఠ స్తవమును శివపంచ స్తవములలో జేర్చుటకు కారణము
దెలియదు. ఈ స్తోత్రటీకలోని విశేషముల నరయుటకు నివేదింపగా
శ్రీ కోరాడ రామకృష్ణయ్య ఎం. ఎ. గారు దయతో వ్రాయించి
పంపిరి. అది శ్రీ బండారు తమ్మయ్యగారి ద్వారా నేనందికొంటిని.
అందు వ్రాతతప్పులు మిక్కిలిగా నున్నందునను, టీకలోని వివరణము
సాధారణముగా నుండుటవలనను ఎక్కువగా నుపయోగ పడదయ్యెను.

దేచయమంత్రి తెనాలి రామలింగని యుద్భటారాధ్యచరి
త్రము నంకితము నందిన ప్రసిద్ధశైవుడు కావున శివపంచ స్తవములకు
వ్యాఖ్యను వ్రాసి తన శివభక్తిని వెల్లడించి యుండును. తన కంటె
పూర్వు లిద్దానిపై వ్యాఖ్యలు విరచించినారను నంశములు దేచయ
చెప్పలేదు.

ఇక కాకినాడ వాస్తవ్యులు శ్రీ పాడి వేంకట స్వామిగారు
1891 లో తమ కళానిధిముద్రాశాలయం దొక శివపంచ స్తవమును
ప్రకటించినారు. ఇందును మలయరాజ స్తవము లేదు కాని బిల్హణ
మున్నది. నీలకంఠ స్తవము దీన లేదని వేరుగా వ్రాయ బనిలేదు.
మహిమ్న మల్హణ బిల్హణము లాంధ్రపద్యానువాదముతోడను, తక్కిన
అనామయ హాలాయుధములు మూలమాత్రముగను కాకినాడ ప్రతిలో
[18] నున్నవి. సాధారణపత్రములమీద సామాన్యముగ ముద్రిత
మగుట వలన నీప్రతిలో చాలపొరపాట్లు దొరలినవి. పాల్కురికి
సోమనాథుడుగాని, వ్యాఖ్యాత విశ్వారాధ్యుడుగాని, తమ కృతులలో
నీ బిల్హణస్తవమును చేర్కొనలేదు. అందువలన 12 వ శతాబ్దము
తరువాత నిది ప్రచారమునకు వచ్చినట్లు భావింపవలెను. దీని కార
ణము స్పష్టముగనే యున్నది. సోమనాథుడు, బిల్హణకవి, విశ్వారా

(18) శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రీప్రతిని, శ్రీ బండారు తమ్మయ్యగారి
కొసంగిరి. వారిద్వారా నా కందెను.

ధ్యుకు దాదాపు సమకాలికులు కావునను, అప్పటికే శివపంచ స్తవము లేర్పడి యుండుట వలనను బిల్హణము చేరదయ్యెను. దీనివలన వీరి సమకాలికత్వముగూడ సాధారణముగ నిశ్చిత మగుచున్నది. ఇట్లు మహిమ్నము మల్హణము మలయరాజము అనామయము హాలాయుధము అను నవియే సోమనాథాదులకు పూర్వము శివపంచ స్తవములుగా ప్రసిద్ధి కెక్కి యున్నవని భావింపవచ్చును. బిల్హణ స్తవము ఆంధ్ర దేశప్రతిలో మాత్రమే యున్నది. నీలకంఠ స్తవము పౌరాణికము కావున చరిత్రకాలమున నున్న పురుషులగు పుష్పదంతాదుల యొక్క కృతులమధ్యమున జేర్ప వీలులేదు.

ఈ శివపంచ స్తవములు అపూర్వములైన భక్తి,సదాచార, నీతి, శివలీలలను బోధించుచున్నవి. ఇందలి భావములను వేదోపనిషత్పురాణము లందలి శ్లోకతాత్పర్యముతో కొంతవరకు పోల్ప వచ్చును. "వ్యాసోచ్ఛిష్టం, జగత్సర్వ"మ్మను నానుడి జగద్విదితము. భర్తృహరి మున్నగు వారి కృతుల సామ్యమును అటనట దోచుచుండును. కొన్ని శ్లోకచరణములు కాకతాళీయన్యాయమున గాబోలు ప్రాచీన శ్లోకములకు ప్రతిరూపములుగా దోచుచుండును. శివపంచ స్తవములు ప్రాచీన కృతులకు అనుకరణములే యని మాత్ర మెవ్వరును భావింప వలదు. ఇందు స్వతంత్రమైనట్టియు మనోహరములైనట్టియు, భావములును మిక్కిలి యెక్కువగా కలవు. కావుననే ఇవి శివకవిపండితభక్తుల యాదరణములను బడసి వన్నె కెక్కి నిగమాగమముల వలె పారాయణ యోగ్యములై పూజ్యములై వెలయుచున్నవి. కర్ణాటకాంధ్రమహారాష్ట్రములందలి యనేకశతకకర్తలును గ్రంథకర్తలును, ఈ పంచ స్తవములనుండి భావములను, భాషను, చాలగా ననువదించి యనుకరించినారు. ప్రసంగవశమున ముందు కొలదిగ నా సంగతి సూచింపబడును కాని విస్తరింప వీలు లేదయ్యెను.

## మా శి వ పం చ స్త వి

మా శివధర్మగ్రంథమాలలో ౧౧వ బిల్వముగా బ్రకటింప బడుచున్న యీ శివపంచ స్తవియొక్క స్వరూపమును పాఠకులు స్వయ

ముగ నవలోకించుచున్నారు. విషయానుక్రమణవలన దీని ముద్రణ, సంకలన పద్ధతిని గమనింపవచ్చును. దీని నామమును శివపంచ స్తవ, శివపంచ స్తవము, శివపంచ స్తవములు, శివ స్తవపంచిక, అని పలువుర పలువిధములుగ వ్రాసిరి. ఐదు స్తవముల నొక్కసమూహముగాను, ఒకే గ్రంథముగాను కూర్చుచున్నాము. కావున నేను 'శివపంచ స్తవి' యను రూపమునే భావించితిని పూర్వోక్తగ్రంథములలో నీ రూపము కనుపడలేదు. ప్రాచీనపండితు లెవరైనను దీని నొక గ్రంథదృష్టితో జూచినపుడు ఇట్టిరూపమునే యాదరించియుందు రని విశ్వసించు చున్నాను. కొన్ని వ్రాతప్రతులలో నట్లు వ్రాయబడియు నుండ వచ్చును. నేను క్రొత్తగా ప్రయోగించితి నని నూత్న మూహింప వలదు. పంచశ్లోకి శతశ్లోకి పంచదశి సప్తశతి శతదూషణి మున్నగు రూపములు ప్రాచీనకాలము నుండియు ప్రసిద్ధములే! శివపంచ స్తవి యను రూపము శ్రావ్యముగ గూడ నున్నది.

మైసూరు ప్రతియు, కాకినాడ ప్రతియు, విడిగా ముద్రితమైన స్తోత్రప్రతులును, రెండు వ్రాతప్రతులును, రెండు శిలాశాసనములును 'మా శివపంచ స్తవి' గ్రథనమునకు దోడ్పడినవి. మహిమ్న మల్హణ మలయరాజ అనామయ హలాయుధ స్తవములను కాలక్రమమునుబట్టి తరువాయిగా ముద్రించితిని. పాఠభేదములు మెండుగా నున్నను సమంజసమని తోచిన ఒకే రూపము గ్రహింపబడెను. పాఠములన్నియు విస్తరింప వీలులేదయ్యెను. మొదలు సంస్కృతమూలమును, తరువాత క్రమముగ పదపదార్థమును, తాత్పర్యమును, విశేషాంశములను, కొన్ని శ్లోకములకు మొదట అవతారికలను వ్రాసితిని. కొన్నిచోట్ల పదముల విడదీసియును, మరికొన్ని తావులలో సంస్కృతమున నున్నట్లే దీర్ఘముగను అర్థమును వ్రాసితిని. సాధ్యమైనంతవరకు సులభముగ దెలియు నటులు ప్రయత్నమొనర్పబడెను. మొదటి స్తవమున తాత్పర్యము కొంత విపులమైనది. విశేషాంశములలో నానాయా సంగతులు, కథలు మూలపురాణాదులనుండి ఎత్తి వ్రాయబడినవి. ప్రమాణ గ్రంథముల విభాగ - అధ్యాయ సంఖ్యలును సూచింపబడినవి. స్తవముయొక్క చివర ఆంధ్రపద్యములను సంస్కృతశ్లోక సంఖ్యాక్రమమును బట్టియే

ముద్రించితిని. ఆంధ్రదేశమందలి యాదరణము ననుసరించి భిల్లాణ స్తవముగూడ ననుబంధముగా బ్రకటింపవలెను. యథాసాధ్యము ఈ గ్రంథ మపూర్వముగ నుండునట్లు ప్రయత్న మొనర్పబడినది. తక్కిన సంగతులను పాఠకులు సులభముగనే గ్రహింపగలరు.

## మ హి మ్న స్త వ ము

ఈ గ్రంథమున నాయా స్తవము యొక్క ప్రథమశ్లోకవివరణమున స్తవమును గూర్చియును, కర్తను గురించియును కొంత వ్రాయబడియున్నది. ఐనను మరికొంత నివేదింపవలసియున్నది.

శివస్తవములలో మహిమ్న స్తవము మిక్కిలి ప్రాచీనమైనది. దీని కర్త పుష్పదంతుడు. ఇతడు గంధర్వరాజని ప్రతీతి. ఈ పుష్పదంతుని గూర్చిన యంశములు స్కాంద (ప్రభా. అ. ౧౮౭) పద్మపురాణ (ఉ. అ. ౮౩) దేవీభాగవత (అ. ౯) ములలో నుల్లిఖితములైనవి. శివరహస్య మను సుప్రసిద్ధ - ఇతిహాస గ్రంథమున[19] పుష్పదంతుని చరిత్రయు, మహిమ్న స్తవమును కలవని యొక పండితుడనెను. కాని నేనా గ్రంథమును సంపూర్ణముగ నవలోకింపనందున నిశ్చితము కాదయ్యెను. పుష్పదంతుడు చారిత్రకపురుషుడనియే నేను భావించుచున్నాను.

> వాక్పతిం పుష్పదంతం చ, కాణ్వం సోమ మథర్వణం
> హేమచంద్రం నమస్కృత్య, వక్ష్యేఽధోక్షజ ఫక్కికాం.
>
> —అధోక్షజఫక్కికా.

ఇందు పేర్కొనబడిన పుష్పదంతుడు వ్యాకరణకర్తయా! సంహితా కర్తయా? ఎప్పటివాడు? అను నంశములు దెలియవయ్యె. సాహిత్యకౌముదియందును పుష్పదంతనామము స్మరింపబడినది. "పుష్పదంతుడు మహాశివభక్తుడు, శాస్త్రవేత్త. వృద్ధాప్యమున జైన పండితులతో వివదించి పరాజితుడై జైనమతమును స్వీకరించి శ్రమణు

(19) శివరహస్యము లక్షశ్లోకాత్మకము. మహాభారతమంత గొప్పది. శైలి గంభీరము. ౧-౨ అంశము (భాగము)లు గలిగి యున్నది. దీనిని మా గ్రంథమాలలో బ్రకటించుచున్నాము. ౧-౨ భాగములు పూర్తిగను ౩వ భాగము సగమువరకును ముద్రితమైనవి.

డయ్యెను'' అను నొక కథను జైనగ్రంథములలో నెప్పుడో పఠిం
నట్లు జ్ఞాపకమున్నది కాని గ్రంథభాగము దెలియదయ్యెను. అంద
వలన నీ పుష్పదంతులెల్ల రొక్కడేనా కాదా యను సందేహము
హారమగుటలేదు. చరిత్రకాలపు సర్వశివస్తవములలో పుష్పదంతు
మహిమ్నస్తవమే ఆదిస్తవముగా దోచుచున్నది. పుష్పదంతుడు మహా
శివభక్తిసంపన్నుడై యుండెను. ఈ కారణమువలననే ఈతడు ప్రసిద్ధు
పురాణప్రఖ్యాతిని గాంచియుండునా? మహిమ్న మా కాలము
గీతికావ్యము వలె కమ్మగ గాన మొనర్పబడుచుండెడిది కాబోలు. ఇ
పుష్పదంతునకు గంధర్వత్వమును గూడ సంపాదించెను.

"గంధర్వ పుష్పదంతుడు ప్రత్యహము కొల్లలుగ పుష్పము
దెచ్చి శివుని పూజించువాడు. అంతతో తనివిదీరక యన్యుల తో
లోను నదృశ్యుడై ప్రవేశించి పుష్పముల సంగ్రహించియు నర్పించు
వాడు. ఆయుద్యానపాలకులు తమతోటచుట్టును శివనిర్మాల్యము
చల్లిరి. దానిని దాటబోయిన పుష్పదంతుడు తన మహిమను
గోల్పోయి వారిచేత జిక్కెను. ఆ యుద్యానాధిపతి యాతని కారా
గారమున బంధించెను. అంత పుష్పదంతు డీ అపూర్వమైన మహిమ్న
స్తవమును రచించి భక్తితో నద్భుతముగ గానమొనర్చుచు తల్లయ
డగుటగాంచి శివుడు ప్రత్యక్షమై కారాగారబంధమునుండి విముక్తి
గావించి కైలాసము ననుగ్రహించెను" అను కథ పుష్పదంతుని గూర్చి
ప్రచారమైనది.

ఈ మహిమ్నస్తవము మిక్కిలి ప్రఖ్యాతమైనది కాబట్టి తర
వాత వచ్చిన కవులు పండితులు ఆచార్యులు మున్నగు వారందరు
దీనిని కంఠస్థము గావించుకొనుటయే కాక తమ కృతులలో దీని భావ
ముల ననువదించియున్నారు. క్రీ. శ. 1 వ శతాబ్దమున నున్న మహా
కవి కాళిదాసు "త్రయీ సాంఖ్యం యోగః" అను సుప్రసిద్ధ శ్లోకము
నకు తన రఘువంశము (౧౦-౨౬)న ఛాయాశ్లోకమును వ్రాసి
యున్నాడు.

బహుధా ప్యాగమై ర్భిన్నాః, పంథానస్సిద్ధిహేతవః,
త్వయ్యేవ నిపతం త్యోఘా, జాహ్నవీయా ఇవార్ణవే.

మల్హాణస్తవ మందలి ౨వ శ్లోకమును, అనామయమందలి మొదటి పది శ్లోకములును, హలాయుధమందలి ౫,౬,౯ శ్లోకములును మహిమ్నమున కనుకరణములు. ఆయాశ్లోకముల విశేషాంశములలో కొన్నింటికి గల ఇట్టి సామ్యమును దెల్పియున్నాను. శంకరాచార్యుని దక్షిణామూర్తి స్తోత్రమందలి "భూరంభాం స్యనల" అను ౯వ శ్లోకమునకు వ్యాఖ్యను వ్రాయుచు నిది మహిమ్నమందలి "త్వమర్కస్త్వం సోమః" అను ౨౬వ శ్లోకమున కనుకరణమని తద్వ్యాఖ్యాతయగు స్వయంప్రకాశస్వామి[20] వివరించెను. శంకరుని "సాంబో నః కులదైవతం" అను దశశ్లోకి మహిమ్నమున కనుకరణమే కదా! శివానందలహరిలోను అనుకరణము లేకపోలేదు. సంస్కృతపండితకవులే పంచస్తవముల ననుకరించి యుండ నిక నాంధ్రకవులను గూర్చి విస్తరింపబనిలేదు. కావ్యములలోను, శతకములలోను, ప్రసంగానుసారముగ నీ పంచస్తవముల నుండి స్వీకరించిన భావానుకరణములు భాషానుకరణములు పెక్కుగలవు. ఇట దిఙ్మాత్రముగ సూచింపనైనది. మహిమ్నము 'క్రియాదక్షో దక్షః' అను ౨౧వ శ్లోకమునకు,

చ. తనర క్రియాతిదక్షుఁడగు దక్షుఁడు తత్క్రతువల్లభుండు; స
న్మునితతి ఋత్విజుల్; సురసమూహము సభ్యులు; తత్ఫలంబు లిం
దనిశము నిచ్చు నీవడచి తట్టి మఖంబది కర్తృభక్తిమైఁ
దనరని యజ్ఞమైనఁ దుది దా నభిచారము గాకపోవునే?

నన్నెచోడుని కుమారసంభవము. ౨-౨౫.

"బహుళరజసే విశ్వోత్పత్తౌ" అను ౩౦వ శ్లోకమునకు.

మ. భువనోత్పత్తి విధించుచో నభవుఁడై పొల్పొందగా దాని ను
త్సవలీలం బ్రతిభవించుచో మృడుడవై, సర్వంబు కల్పాంత భై
రవ సంక్షోభ నటించుచో హరుడవై త్రైగుణ్యశక్తిం దుదిన్
శివనామాంకముఁ దాల్చు నీ మహిమ దాఁ జిత్రంబు సర్వేశ్వరా!

యథావాక్కుల అన్నమయ్య శతకము.

"అసితగిరిసమం స్యాత్" అను ౩౨ శ్లోకమునకు

చ. అరయఁ బయోధిపాత్రమున నంజనశైలము కజ్జలంబు త
త్సురతరుశాఖ లేఖిని వసుంధర పత్త్రముగా నొనర్చి వా

---

(20) ఇది మైసూరు ప్రభుత్వ గ్రంథమాలలో ప్రకటితము (సవార్తికటీకం).

శ్వరనిజకీర్తి వార్ధిను గుణసారము సారము నొందదార మా
నరస నృపాలమౌళి సుజన స్తవ సద్గుణ సంప్రదాయముల్.

— పరసభూపాలీయము - అశ్వాసాంతము.

మహిమ్న స్తవము దాదాపు రెండువేల సంవత్సరములకంటె నెక్కువ కాలము నుండియైనను ప్రచారమున నుండి యుండును. కావున నే దీని భావముల ననేక గ్రంథములలో గాంచనగును. మన దేశపు మధ్యప్రాంతము (సి. పి.) నీమాడ్ జిల్లాలో ఓంకారక్షేత్రము ప్రసిద్ధమై యున్నది. అచ్చోటి అమరేశ్వరలింగము ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటి. ఈ దేవాలయమునకు పూర్వదక్షిణమున మాంధాతృ మండపము కలదు. అందలి విశాలమైన భిత్తిపై ఈ మహిమ్న స్తవము శిలాశాసనముగా జెక్కబడినది. ఈ శాసన ప్రతిబింబమును అజమీర్ నివాసులును పరిశోధకులును అగు పం. రామేశ్వర గౌరీశంకర ఓఝా ఎం. ఏ. గారు దయతో బంపిరి. దీనితో నా శాసనచిత్రముగూడ ప్రకటింపబడినది. విశేషవ్యయప్రయాసల వలనగాని ఇంతకంటె స్పష్టముగనుండు చిత్రము లభింపదు. అందువలన ప్రస్తుత మీ యస్పష్టమైన ఫోటోతోడనే పాఠకులు సంతసము నొందవలసి యున్నది. ప్రాచీనలిపిజ్ఞులు దీనిని భూతద్దముతో చదువవచ్చును. ఈ శాసనము విక్రమశకము ౧౧౨౦ వత్సరము (శా. శ. ౯౮౫ క్రీ. శ. ౧౦౬3) లో జెక్కబడినది కావున మనకు లభించు మహిమ్న స్తవప్రతులలో నిది మిక్కిలి ప్రాచీనమైనది. ఇందు నున్నటులే మహిమ్న స్తవ పాఠమును ముద్రించి విశేషము లాయాస్థలములలో దెల్పితిని. ఇందు ౩౧ శ్లోకములు మాత్రమే యున్నవి. మహిమ్నమును విశేషముగ ననుకరించిన దండికవియు తన యనామయ స్తవమున ౩౧ శ్లోకములనే రచించినట్లున్నది మధుసూదనసరస్వతియు ౩౧ శ్లోకములనే వ్యాఖ్యానించెను. కావున పుష్పదంతుడు రచించినవి ౩౧ శ్లోకము లనిమాత్రమే [21] యూహకలుగుచున్నది. కాలము గడచినకొల్ల ఫలశ్రుతి శ్లోకము

(21) పూజ్యపాదులు మా తండ్రిగారు నాకు పదేండ్ల ప్రాయమున మహిమ్న స్తవమును కంఠపాఠము చేయించుచు "బహులరజసే" యను ముప్పదవ శ్లోకము చెప్పు సందర్భముననే కైలాస వాసులైరి. ఇది కాకతాళీయమో ఈశ్వర సంకేతమో తెలియదు. (స్తోత్రం వర్గు త్వత్తః?) యను ౩౧ శ్లోకము మా నాయనగారికి కంఠస్థమై రాకుండెను. ప్రాచీన ప్రతులలోను, శిలాశాసనములోను ఇది లేదు.



ఓంకార-అమరేశ్వర క్షేత్రమందలి మహిమ్నస్తోత్ర శిలాశాసనము.



'భక్తరంజనీ' కర్త
పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

ఎక్కువగా జేరుచు మహిమ్నము ౪౭ శ్లోకములుగా ప్రచారమై యున్నది. ఇంకను ప్రాచ్యలిఖిత గ్రంథాలయములలోని సర్వప్రతులను జూచిగాని నిర్ణయమునకు రావలసి యుండును.

మహిమ్న స్తవము మిక్కిలి ప్రసిద్ధమైనది. అక్షరాస్యులైన సర్వశివభక్తుల కంఠమందునను ఇది నెలకొని యున్నది. విశాలమైన భారత దేశ మెల్లెడల వ్యాపించినందున దీనికి కొన్ని పాఠాంతరము లేర్పడుట సహజమే! అట్లే దీనియర్థముగూడ కొన్ని తావులలో భిన్న భిన్నముగా జేయబడుచు వచ్చెను. పెక్కు ప్రాచీనపండితు లీ స్తవము నకు సంస్కృత వ్యాఖ్యానములను విరచించిరి. భగవద్గీతకు శైవ భాష్యము లున్నట్లు ఈ శివమహిమ్న స్తవమునకు విష్ణుపరమైన అర్థముకూడ పుట్టెను. ఇట్టి యద్భుతకార్యమును సాధించినవాడు ప్రసిద్ధుడైన మధుసూదన సరస్వతి. శ్రీధరస్వామియు నిట్టి టీకను విరచించెను. ఈ బహుగ్రంథవ్యాఖ్యాత వైష్ణవపండితోత్తముడు. దీనివలన మహిమ్న స్తవము యొక్క మహిమాతిశయము తెలియ దగును. ఉత్తర దేశమునను, గుజరాత్ మహారాష్ట్ర దేశములలోను రుద్రాభిషేకము నొనర్చునపుడు సైతము మహిమ్న స్తవ పారాయ ణము గావింతురు. మహిమ్నవ్యాఖ్యాతల పేరులను, తెలిసినంతవరకు వ్యాఖ్యానామములు ఇట వ్రాయబడినవి.[22]

"అమరకంఠుడు, అహోబలుడు, ఉపదేవుడు, కృష్ణనృపుడు, కైవల్యానందుడు, గోపాలభట్టు, (స్తుతి చంద్రికా), గోవిందరాముడు, (ప్రకాశ), గోవిందానందుడు, (కౌముదీ), జగదీశ పంచాననభట్టాచార్యుడు. (రహస్యప్రకాశ), ఊరదేచయామా త్యుడు, పరమానంద చక్రవర్తి, భగీరథమిశ్రుడు, మధుసూదన సరస్వతి, (హరి హరార్థీ) రామజీవన తర్కవాగీశుడు, రామదేవుడు, రామానంద తీర్థుడు, విశ్వా రాధ్యుడు, విశ్వేశ్వర సరస్వతి బోపదేవుడు. (పంజికాద్యర్థీ) శంకరుడు, శ్రీకృష్ణ తర్కాలంకారుడు, శ్రీధరస్వామి, (శివవిష్ణ్వర్థియార్థీ), హరగోవిందశర్మ. (వైష్ణవీ),"—

సంస్కృత వాఙ్మయము నందలి మరే స్తవమునకును ఇంతమంది విద్వాంసులు టీకలను రచింపలేదని తోచుచున్నది. ఉదయపుర రాజ వంశ్యుండును పరమ యోగీశ్వరుడును అగు కరజాలి చతురసింహ

---

(22) Cotologue's catologram (Ofrect) Vol 1 Page 444. Vol. 2. Page I02. Vol. 3 Page. 96.

మహారాజుగారు తమ మేవాడహిందీభాషయందు ఈ మహిమ్నస్త
మునకు దీని వృత్తములతోడనే అనువాదమును రచించియున్నారు
కాశీ, కలకత్తా, బొంబాయి, లాహోరు, పూనా, మైసూరు, మ
రాసు, బెజవాడ, రాజమహేంద్రవరము మున్నగు నగరములందు
దాదాపు ఎనుబది తెరగుల మహిమ్నస్తవపుస్తకములు ముద్రితములై
యున్నవి. ఈ సామగ్రినంతయు పరిశీలించి మహిమ్నస్తవము
గూర్చిన యొక ప్రౌఢప్రామాణిక గ్రంథమును రచింపవలసియున్నది

ఆంధ్రీకరణములు :— ప్రాచీనకవు లనేకులు మహిమ్నస్తవము
లోని భావములను స్వపద్యములలో నిమిడ్చుచు వచ్చినారు. శా
సంపూర్ణమైన సక్రమ పద్యానువాద మాంధ్రములో నెవరు మొ
మొదట గావించిరో తెలియదు. బహుశః సంస్కృతమహిమ్నము
సర్వజనులకు కంఠగతమై యున్నందున మిక్కిలి ప్రాచీనకాలము
గాక 18,19 వ శతాబ్దములలోనే ఆంధ్రపద్యానువాదము లారంభమై
యుండును. మహిమ్నమునకు శ్రీయుతులు:- అక్కినేపల్లి శివరామయ్య
పన్నాల రామబ్రహ్మశాస్త్రి, శృంగారకవి సర్వారాయడు, జానపాటి
కామశాస్త్రి, చేతపూడి లక్ష్మీకాంతకవి, వడ్డాది సీతారామాంజనేయ
కవి, అనునాఱు పద్యానువాదములు ముద్రితములై యున్నవి. మాకు
దెలియనివి కూడ నింక నుండవచ్చును. ఇందు పన్నాల వారి కృతి
గంభీరముగాను, వడ్డాదివారికృతి లలితముగాను నగుపడుటచే రెండను
వాదములును నీ గ్రంథమున జేర్పబడెను.

శ్రీ పన్నాల రామబ్రహ్మశాస్త్రిగారు : వీరి పూర్తిపేరు సీతారామ
బ్రహ్మశాస్త్రిగారు, తలిదండ్రులు వియ్యమ్మ జగ్గన్నలు, నివాసము
పశ్చిమగోదావరీమండలపు తణుకుతాలూకాలోని విప్పఱ్ఱు. వీరు
స్వగ్రామ మందలి రాజేశ్వరస్వామికి భక్తులు. వెలనాటి వైదికులు
సంస్కృతాంధ్రపండితులు, శంతను చరిత్ర, ఖలకర్ణ రసాయనము, (ద్వ్యర్థి
రాజోద్యోగి రామాయణపరము) మున్నగు ననేక గ్రంథములను
విరచించినారు. శ్రీ కం. వీరేశలింగము పంతులుగారు కోరగా పూచి
పుల్ల శతకము నాశువుగా, వీరు చెప్పిరట. పంతులవారి "వివేకవర్ధని"
పత్రిక కనేక వ్యాసముల వ్రాసియుండిరి. రాజమహేంద్రవరపు కోటి

లింగ క్షేత్రమున వీరు కొంతకాలము నివసించియుండురని మహిమ్న స్తవ ప్రథమ పద్యము వలన దెలిసికొన వచ్చును. వీరి మహిమ్నము సమర్థముగా నున్నది. [23] దీనివలననే వీరి ప్రౌఢపాండితి నూహింప వచ్చును. 1824-1904 ప్రాంతమున నున్నవారు. అనగా బ్రహ్మీభూతులై నలుబది సంవత్సరములు గడిచినవి.

శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి:—వీరి నివాసము గోదావరి జిల్లా దొడ్డమపేటకు జేరువగా నున్న భీమక్రోశపాలెము. ప్రస్తుతము విశాఖపట్టణము జిల్లా ఖాశింకోటలో నివసించుచు నక్కడి బోర్డు మిడిల్‌స్కూలులో నధ్యాపకులుగా నున్నారు. శ్రీపురాణం సూర్యనారాయణ తీర్థులయొద్ద సంస్కృతాంధ్రముల నభ్యసించి 'ఉభయ భాషా ప్రవీణ పట్టభద్రు'లై యష్టావధానముల గావించియున్నారు. ఆంగ్లభాషలోను (S. S. L. C) ఉత్తీర్ణులు. వీరి స్వరాజ్యగీతామృతము, ఆత్మశిక్ష, పులిగోరుశతకము, గజవిహారము, కేసరికిశోరలీలలు, భీమఖండము, శివమహిమ్నస్తవము, గణేశమహిమస్తుతి [24] అను గ్రంథములు ముద్రితములు. మాణిక్యవీణ, గురుదక్షిణ, మాతృపూజ మున్నగునవి ఇంకను నముద్రితములు. వీరి కవిత్వము ధారాళమై లలితమై యున్నదని ప్రత్యేకముగ నివేదింప బనిలేదు. ఇందు ప్రకటించిన ఆంధ్రమహిమ్నము వలననే పాఠకులిద్దాని నెరుగగలరు. వీరు కొంతకాలము దేవిడీ సంస్థాన పండితులుగా నుండిరట! వీరి విద్యార్థులలోను కవులున్నారు. వీరి తండ్రి భీమశంకర కవిగారు, తల్లి వెంకట రత్నమ్మగారు, సుప్రసిద్ధులైన శ్రీ వడ్డాది సుబ్బారాయ కవిగారును, వీరి తండ్రిగారును

---

(23) మా యొద్దనున్న ప్రతి శిథిలమైనందున నివేదింపగా కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్య నిర్వాహకులు, వ్యాకరణ శిరోమణి, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు ప్రాత ప్రతి నన్వేషించి ఆంధ్ర మహిమ్నము మొదటి పదుమూడు పద్యముల వ్రాసి పంపించినారు.

(24) శివమహిమ్నస్తుతికర్త యగు పుష్పదంతుడే యీ గణేశమహిమ్నస్తుతిని రచించెననియును దానిని తా ననువదించిరనియును శ్రీ కవిగారు దెల్పగా నద్దాని విభూతి ౪-౧ లో బ్రకటించితిమి. మూల సంస్కృతము చూడనందున దాని గూర్చి వివరణము జేయజాలనైతిమి.

తాతా సహోదరులు. అనగా వీరి వంశమునందు పరంపరగా పండితులు వెలయుచున్నారు.

## మల్హాణ స్తవము

ఈ మల్హాణకవి పుష్పదంతునివలె మిక్కిలి ప్రాచీనుడై యుండవలెను. పురాణాదులలో నీతని నామము లేదు కాని సంస్కృతాంధ్ర కర్ణాటక శివకావ్యములలో పలుమారులు పేర్కొనబడినాడు. బిల్హణ చరిత్ర మొకటి సంస్కృతమున నున్నది. దీని నేకవి యెపుడు రచించెనో తెలియదు. పదుమూడవ శతాబ్దమున నిది సంగ్రహింపబడి యుండును. అందొకచో

బిల్హణో మల్హాణశ్చేతి, ద్వావేతౌ సరసౌ కవీ
తయోస్తు బిల్హణోనామ కవిరాట్కథ్యతే బుధైః. ౧

గీ. అనిన మల్హాణ బిల్హాణు లనఁగఁ గవులు, సరసు లిరువు రలంకారసహితులందు
బిల్హాణుం డనువాఁడు గంభీరుఁ డధిక, తముఁడు కవిరాజనంగ స్తోత్రములు వడసె.

— చిత్రకవి సింగరార్యుడు ౧-౩౭.

ఇట్లు మల్హాణ బిల్హాణులు సమకాలికులుగా జెప్పబడినారు కాని ఇది సమంజసముగాలేదు. కాశ్మీరదేశజులగు డల్హాణ, కల్హాణ, బిల్హాణ కవులు వేరు వేరు కాలములలో నున్నట్లే చారిత్రకులు భావించుచున్నారు. పాల్కురికి సోమనాథుని నాటికి (క్రీ. 1230) మల్హాణుడొక్కడే ప్రసిద్ధుడు. బిల్హాణుడు పేర్కొనబడలేదు.

"తనరు సద్భక్తిఁ గాంతాకచప్రచయ, యనుచు నచ్యుక్తుడై హాసమనంబలరఁ
బ్రస్తుతాలంకార బంధుర మధుర, విస్తారమతి మల్హాణస్తోత్ర మనఁగ
నప్పాడ ముప్పదియారు శ్లోకముల, నెప్పినంతట మెచ్చి శివుడు మల్హాణుని"

— పండితారాధ్యచరిత్ర - పురాతన ప్రకరణము

సోమనాథునికి సమకాలికుడగు విశ్వారాధ్యుడును మల్హాణ స్తవము ౩౯ వ శ్లోకమునకు వ్యాఖ్యను వ్రాయు సందర్భమున "యద్యపి కాంతాకచేత్యాది షట్త్రింశద్ వృత్తం స్తోత్రమిదం మల్హణేనాభాణీతి పాల్కురికిసోమేశ్వరేణ భణితం, తథాప్యుపరితన వృత్తత్రయం బహుపు సకసమ్మతత్వా ద్వ్యాఖ్యాతం"

(మల్హణునిచే కాంతాకచము మున్నగు ముప్పదియారు వృత్తములు గల స్తవము రచితమైన దని పాల్కురికి సోమనాథుడు చెప్పినాడు. ఐనను ననేక పుస్తకములలోని పాఠమునుబట్టి ఈ యధిక పాఠము లగు తక్కిన మూడింటికిని వ్యాఖ్య యొనర్చితిని.)

శ్రీనాథమహాకవి తన భీమఖండమున మల్హణుని దలంచినాడు.

"మాఘుభారవి బిల్హణ మల్హణులకు
భట్టి చిత్తపకవి దండిపండితులకుఁ
గీలు కొలుపుదు నొసలిపై కేలుదోయి."

సోమనాథుని పండితారాధ్యచరిత్రము నుండియే మల్హణుని కథను గ్రహించి 16 వ శతాబ్దమున నున్న పెదపాటి ఎఱ్ఱనార్యుడు మల్హణచరిత్ర మను ప్రబంధమును విరచించినాడు. [25] బిల్హణీయము వలె నిదియు శృంగారగ్రంథము. ఇది రసికులకు దప్ప చరిత్ర పరిశోధకుల కుపకరించునదికాదు. మల్హణుని గూర్చి పరిశీలన మింకయు ఆవశ్యకమే కాని ఈతడును శివభక్తులలో ప్రాచీనుడును ప్రసిద్ధుడును నై యున్నాడని చెప్పవచ్చును.

ఈ మల్హణునికథ నీ గ్రంథమున ౬౩ వ పుటలో గాంచనగును. మల్హణి (పుష్పగంధి) యను వేశ్యను మోహించి పితార్జితము నెల్ల వ్యయపరచుకొని దరిద్రుడై మరల వేశ్యాబోధవలన శివభక్తుడై ౩౬ శ్లోకములతో తల్లయముగ స్తుతించి శివానుగ్రహమునకు బాత్రుడయ్యెననియును, అదియే మల్హణస్తవముగ ప్రశస్తి కెక్కెననియును ఐతిహ్యము కలదు. ఈ కథ బిల్వమంగళుని చరిత్రను బోలియున్నది. ఆతడు శ్రీకృష్ణకర్ణామృత మను గ్రంథమును రచించి యందలి ప్రథమ శ్లోకమున తన ప్రియురాలి పేరు (చింతామణి ర్జయతు) నుల్లేఖించి యున్నాడు. ఈ మల్హణుడును తన ప్రేయసి (పుష్పగంధి) నామము వచ్చునట్లు "కాంతాకచప్రచయపుష్పసుగంధిగంధ" అని యారంభించినాడు.

మహిమ్నము తరువాత నెక్కువ ప్రచారములో నున్నది మల్హణస్తవమే. కన్నడదేశమున మరియు విశేషముగ వ్యాప్తమై

---

(25) ఈ మల్హణచరిత్రను, శ్రీ మఠం సిద్ధివీరయ్యగారి ద్వారా తమ కందిన మల్హణస్తోత్ర మూలశ్లోకముల వ్రాతప్రతిని శ్రీసురవరము ప్రతాపరెడ్డిగా రొసంగిరి.

యున్నది. ఇది శబ్దాలంకార భూయిష్ఠము. భక్తి భావవిలసితమ
ప్రత్యేకముగ కాముకులకు సైతము, శివభక్తి పుట్టునట్లుగ శృంగా
విలాసములు కైలాసాచలలో సులభములని వర్ణింపబడినవి. వీని తాత్ప
ర్యము విముక్తియే కాని వేరుకాదు. ఆకర్షముగ చక్కని వృత్త
లతో విరచితమైనది కావున కంఠపాఠ మొనర్చుటకు నెంతేని
యున్నది. మైసూరు ప్రతి యొక్క పాఠము ననుసరించియే శ్లోకమ
లెల్ల ముద్రింపబడినవి.

ఆంధ్రీకరణము:—దీని కొన్ని పద్యములకును ప్రాచీనాంధ్ర
కవుల యనువాదములు గన్పట్టు చున్నవి. "క్రీడాప్రపంచనిరత
శ్శైశవః" అను ౧౭ వ శ్లోకమును ఈ క్రింది మహాకవి ఎట్లనుకరించె
గమనింపనగును.

> శా. ఆడం బోయినచోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
> గూడంబెట్టి శివాలయంబనుచు పేర్కొన్నంతటం జేసి వా
> రాడం బోయి సురాంగనాకలితదివ్యారామచంద్రోపల
> క్రీడాశైలవిహారులౌదురు మిమ్ముం గీర్తింప సర్వేశ్వరా!
>
> —యథావాక్కుల అన్నమయ్య. స. ౧

శ్రీ దేవులపల్లి సుబ్బరాయ కవిగారు:—మల్హణ స్తవమునకు వీ
పద్యానువాద మొక్కటియే లభించినది. ఐనను సమర్థముగా నున్నది
కవిత్వము లలితము, ధారాళమునై వీరిసంస్కృతాంధ్రభాషాపటిమక
సాక్ష్యముగానున్నది. వీరు పూర్వము శ్రీ పిఠాపురాస్థాన కవులై యాంధ్ర
భోజులు శ్రీ శ్రీ సూర్యారాయమహారాజేంద్రులవారి విద్యాగు
రువులై శతావధానులై ప్రఖ్యాతి గాంచినారు. సంస్కృతమున శ్రీరామ
పంచాశతి, రామస్తవము, రావువంశముక్తావళి (౧౦ సర్గల కావ్యం)
అను గ్రంథములును; ఆంధ్రమున మందేశ్వరశతకము, మత్తేభశార్దూ
లము, మల్హణస్తవము, కుమారశతకము, మహేంద్రవిజయము
(౬ ఆశ్వాసములు) రామరాయ విలాసము, అను గ్రంథములను ర
చించినారు. 1, 2 తప్ప దక్కిన వన్నియు ముద్రితములు. పిఠాపురము
నకు చేరువనున్న చంద్రమపాలెం వీరి నివాసము. తెలగాణ్యులు
కౌండిన్యసగోత్రులు, శ్రీ వేంకటకృష్ణశాస్త్రి వేంకమాంబలకు పుత్రులు
శాస్త్రిగారనియును వీరికి వ్యవహారము కలదు. వీరు 1853-1911 లో

నుండిరి. కాకినాడ ప్రతి ననుసరించి వీరి యనువాదము సక్రమముగానే యున్నది. (కాని నేను మైసూరు ప్రతి నుపయోగించుటవలన కొన్ని శబ్దములలో భిన్నత పొసగినది. ౨౬వ శ్లోకపాఠము అతిభిన్నముగా నుండుటవలనను, ౩౪,౩౭,౩౮ శ్లోకములు సుబ్బరాయకవిగారు చూచి యుండనందువలనను ఈనాల్గింటికి నేను పద్యముల వ్రాసితిని.)

## మలయరాజస్తవము

మలయరాజస్తవమును రచించిన బాలకవీశ్వరుడు మలయరాజే! ఈతని కథ యంతయు మార్కండేయుని బోలియున్నది. ఇద్దరి పేరులున్ను 'మ' కారముతో నారంభమగుచున్నవి. ఇద్దరును పదునారేండ్లుగా నిర్ణయమైన తమ యాయుష్యమును తపోమహిమచే నభివృద్ధి గావించుకొనిరి. మార్కండేయుడు పురాణప్రసిద్ధుడైనట్లు మలయరాజు కాలేదు. ఇదియే యిరువురకుండెడు తారతమ్యము.

"మేరువుకు దక్షిణముననున్న మలయవతి పట్టణమును దేవరాజు పాలించుచుండెను. ఆయన భార్య శచీదేవి. సంతానము లేనందున రాజ్యము మంత్రి కప్పగించి దీర్ఘముగ తపమొనర్చిరి. అందుకు శివుడు ప్రసన్నుడై షోడశ వత్సరాయుష్యముగల సుపుత్రు ననుగ్రహించెను. అట్లే వారి పుత్రుడు బాల్యమునుండియు గుణగణములతో వన్నెకెక్కెను. ౧౬ వత్సరముల ప్రాయము వరకు ప్రౌఢవిద్యాభ్యాసమును సంఘటిల్లెను. ఇంకొక్క దినము వరకు మాత్రమే తన కాయుష్యమున్నదని తలిదండ్రులవలన నెఱింగి దుఃఖింపక మహాశివభక్తిసంపన్నుడై "యో న ధియా మధిగమ్యః" మొదలుగా ౭౨ శ్లోకములు గల శివస్తవమును గావించి శివానుగ్రహము వలన మృత్యువును జయించి మాతాపితరులను కృతార్థుల గావించెను" అని మల్హణుని గూర్చి పూర్వగాథ కలదు.

ఈతడును మిక్కిలి ప్రాచీనుడు కానగును. ఈకవినిగూర్చిన చారిత్రక సాధనములు కానరావు. ఈమలయరాజస్తవమును పాల్కురికి కవి పేర్కొన్నాడు. విశ్వారాధ్యుడు వ్యాఖ్యానమునే కావించెను. ఆంధ్రదేశమున దీనికి ప్రచార మేలకో తక్కువగానున్నది. మలయ పర్వతము కర్ణాటకమందలిది కావున నీతడును కర్ణాటకుడు గావచ్చును.

కావుననే ఈ స్తవ మాదేశమున బాగుగ ప్రచారము నందినది. కా
శివకవులలో నీతడు ప్రసిద్ధుడు కావచ్చును. అట్లు కానిదే శివపంచ స్త
ములలో నీ బాలకవిరచితమగు సరళమైన మలయరాజ స్తవము
యుండదు. ఈతడు బాలకుడే యైనను శివాగమశాస్త్రజ్ఞానపరిపూ
డనియును, మరణభీతిసంతప్తుడై మిక్కిలి కరుణముగ ఆర్తితో విలపి
ననియును ఈ స్తవమును బట్టియే భావింపవచ్చును. పంచ స్తవముల
నిది మిక్కిలి సాత్త్వికస్తవము. భక్తిస్తోత్రమని కవియే (భక్త్యా భ
స్తోత్రం. 23) యుగ్గడించినాడు. ఇందలి శ్లోకములు చిన్నవియే యై
సంఖ్యాదృష్టితో నన్నిటికంటె పెద్దది. ఈ స్తవమందలి ఒకటి రె
(౧, ౫) శ్లోకములలో మహిమ్నస్తవానుకరణము చాలకొల
భాసమగుచున్నది. సమగ్రముగ స్వతంత్రభావము కలదై యున్న
ఇందు శబ్దార్థాలంకారములు దెచ్చుటకు కవి ప్రయత్నింపలేదు. హృద
పూర్వకముగ వెలువడెడు కరుణభక్తిభావములే ప్రదర్శితము లైన
ఈ కవిని గూర్చి విశేషపరిశ్రమ మవసరమైయున్నది.

ఆంధ్రీకరణము:—దీనిని కూడా మన కవులు శతకకారులు ఆ
కరించియున్నారనవచ్చును. 'కులిశం కుసుమతి' యను ౯వ శ్లో
మును మహాకవి ధూర్జటి తన కాళహస్తీశ్వరశతకమున "పవి పుష్ప
బగు" అను పద్యముగా మార్చినాడు. దీని నీ గ్రంథము ౧౫౬ పుటలో
గాంచనగును. "అంభోధిః స్థలతాం" అను భర్తృహరి శ్లోకమంద
భావమును ఏకచ్ఛాయగా గన్పట్టుచున్నది. ఇంకను అన్వేషించు
ననేకములుగ ననుకరణములు లభింపవచ్చును. దీనికి ప్రాచీనక
లెవరును సమగ్రానువాదము గావించినట్లు తెలియదు. ఇందుకు కారణ
దీనికి కన్నడదేశమున ప్రచార ముండుటయే. దీనిని గమనించి శ్రీ బండా
తమ్మయ్యగారు గతవత్సరమున నీ గ్రంథముద్రణము దలపెట్టిన
వాయి సలక్షణమైన యాంధ్రపద్యానువాదమును విరచించి య
కొరంతను దీర్చిరి.

శ్రీ బండారు తమ్మయ్యగారు:—వీరి పూర్వులు గోదావరి మండ
మందలి యమలాపురము తాలూకాలోని గంగలకుర్రి యగ్రహారమ
నివసించిరి. [illegible]సింట నమలాపురమున ఖర సం॥ భాద

బ॥ 2 గురువాసరమందు (24-9-1891) వీరి జన్మమైనది. తలిదండ్రులు, లింగయ్య పట్టెమ్మలు, వీరశైవులు, నందిగోత్రీజులు. 1907 లో నాంగ్ల ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణులై రెవిన్యూ (తహశీల్దారీ) శాఖలో నుద్యోగులైరి. బాల్యమున శ్రీ పురాణపండ మల్లయశాస్త్రిగారు, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, వీరి కాంధ్రభాషాబోధకులు. తరువాత స్వయంకృషివలన ఆంధ్రాంగ్లసంస్కృతభాషలందు విశేష పాండిత్యము గడించి రెండు పుష్కరముల నుండియును వీరు చేయుచున్న సారస్వత సేవయు, స్వమతసేవయు ఆంధ్రదేశమున సుపరిచితములు. విధివిరామము లేని యుద్యోగమును కేవల ధర్మ్యముగ బాలించుచుండియును ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు, భారతి, కృష్ణాపత్రిక, సమదర్శిని, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, విభూతి, రెడ్డిరాణి మున్నగు పత్రికలలో విపులమైన యనేక వ్యాసములను ప్రకటించినారు. రఘువంశకథనము (విశ్వవిద్యాలయ పఠ్యము) కుమార సంభవము (అముద్రితము) వేమన, శృంగార శ్రీనాథ విమర్శము, (రెడ్డిసంచికలో ము.) చాటూక్తి ముక్తావళి, పాల్కురికి సోమనాథకవిచరిత్ర [26] మున్నగు గ్రంథములను విరచించినారు. శ్రీనాథకవియెడ వీరి కభిమానము మెండు. కావున నే వీరి యాంధ్ర గద్యపద్యములు లలితములై భాషాపరిశుద్ధి గలిగి వెలయుచుండును. ఆంధ్రదేశపు వీరశైవులలో వీరిని బోలిన యాంధ్రభాషావేత్తలు ప్రస్తుతకాలమున మరొకరులేరు. వీరి పరిష్కృతములైన యనేకగ్రంథములును, లిఖితములైన యనేక వ్యాసములును ముద్రణము నందవలసి యున్నవి.

మలయరాజస్తవ శ్లోకములు చిన్నవి యైనను వీరు వృత్తములలో రచించినారు, కావున నీ శివపంచస్తవానువాదములలో వీరి పద్యానువాదము పెద్దది. మలయరాజీయమున కిది తాత్పర్యానుపాదమన వచ్చును.

శ్రీ తమ్మయ్యగారు ప్రస్తుతము కాకినాడ జిల్లాకలెక్టరాఫీసులో ప్రధానగణకులు (Head Accountant) గా నున్నారు. శివనిష్ఠాగరి

(26) ఈ యత్యుత్తమమైన గ్రంథము మా గ్రంథమాలలో శీఘ్రముగ బ్రచురింపబడును.

ష్ఠులు, నిరాడంబరులు, వీరి కైదుగురు పుత్రులును ఇరువురు పుత్రి
లును గలరు. దౌహిత్రులును గలిగియున్నారు. వీరి కుటుంబము
విద్యాసదాచారోన్నతము. అతిథిసత్కార పరీతము.

## అనామయస్తవము

సంస్కృతవాఙ్మయమున ప్రసిద్ధుడైన దండి కవీంద్రు
యనామయస్తవమును విరచించినాడు. తనకు సంభవించిన కుష్ఠవ్యా
వివిధోపాయముల వలన నివారణము కానందున "తృష్ణాంతో
యను శ్లోకముతో నాగంభ మొనర్చి మిక్కిలి భక్తితో చక్కనై
శివస్తవము నల్లి పఠించినాడట! అంత, శివానుగ్రహము వలన త
ఆమయము (వ్యాధి) నశించి యారోగ్యము లభించినది కావున
యనామయస్తవ మని పేరెన్నిక గనెను. 'దండినః పదలాలిత్య'మ్మ
మాట లోకవిదితము. ఈ మహాకవి క్రీ. శ. 640-645 లో నుండెను
కావ్యాదర్శము, దశకుమారచరితము, ఛందోవిచితి యను గ్రంథము
లను విరచించెను.[27]

"భారతవాయవ్య ప్రాంతములో నానందపురమున నొక బ్రాహ్మ
కుటుంబముండెను. వారు అలకాపురమునకు తరలివచ్చిరి. అచ్చో
నారాయణస్వామికి దామోదరుడును, వానికి మనోరథుడును, ఆతని
వీరదత్తుడును పుట్టిరి. వీరదత్తుడు గౌరిని వివాహమాడ దండిక
యుద్భవించెను. ఈతని బాల్యముననే మాతాపితరులు కాలవశమునందిరి
తరువాత నీతడు దేశాటనము గావించి సాహిత్యాదిశాస్త్రము
యందును, స్థాపత్యకళయందును పాండిత్యము సంపాదించి గ్రంథము
రచించి ప్రఖ్యాతు డయ్యెను." అను కథ 'కథాసార'మను గ్రంథమున
గలదు.

ఈ యనామయస్తవమును దండి యే కాలమున రచించెనో తెలియ
జాలము. సంస్కృతపండితులకు కొందరకీ స్తవమున్నటులే పరిచ
యము లేదు. శైవలోకమున మాత్రము విఖ్యాతమే. ఇందలి శ్లోక
ములు కొంతవరకు మహిమ్నమునకు అనుకరణములైనను మిక్కిలి

27. Indian Historical Quarterly, Vol. I.

ప్రౌఢముగా నున్నవి. రమ్యమైన రచన గలవి కావున నివి కంఠస్థ మొనర్చుట సులభము. సంఖ్య తక్కువగా ౩౨ మాత్రముండుటయు నిందుకు సహాయము. పాల్కురికి సోమనాథుడు దీనిని స్మరించినాడు. విశ్వారాధ్యుడును దేచయమంత్రియును ఈ స్తవమును వ్యాఖ్యానించిరి.

ఆంధ్రీకరణములు:— అనామయ స్తవమందలి "యోగీ భోగీ" యను ౩౦ వ శ్లోకమునకు యథావాక్కుల వారి యనువాదము కనుపడుచున్నది.

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి, వత్యంతశాం
తకశాత్మండవు కాదఁమూర్తి, వతిసౌందర్యాంబికాసంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
రికిఁ దా శక్యమె నీ నిజంబెఱిగి వర్ణింపంగ సర్వేశ్వరా!

అన్వేషించుచో నింకను ప్రాచీనానువాదపద్యములు దొరక వచ్చును. దీనికి సక్రమమైన పద్యానువాదమును మొట్టమొదట రచించిన వారుగా శ్రీ శృంగారకవి సర్వారాయకవిగారే మనకు పరిచితులు.

శ్రీ శృంగారకవి సర్వారాయకవిగారు:—వీరు గోదావరీ (భారద్వాజ)తీరమందలి వింజరముగ్రామమున పళ్లను రాజమంత్రి రామాంబా దంపతులకు రక్తాక్షి (1864) వత్సర ఆషా. బ. ౮ గురువాసరమునందు జన్మించిరి. ఆరువేలనియోగులు. ఆపస్తంబసూత్రి కౌండిన్యసగోత్రులు, వీరు తమతండ్రిగారి యొద్దనే విద్యాభ్యాసము గావించిరి. తరువాత తమ విపులమైన పరిశ్రమవలనను, మేధాబలమువలనను విశేషపాండిత్యము బడసి ప్రభుత్వపాఠశాలలోను, శ్రీ పిఠాపురమహారాజావారి కాలేజీలోను అధ్యాపకులై యనేకశిష్యులుగలిగి ప్రఖ్యాతులై యున్నారు. వీరి షోడశరాజచరిత్రము, సీమరాణి, వినాయకవిలాసము, సుభద్రాపరిణయము, సునీతిచంపూ, కావ్యపరిశిష్టము, ప్రబంధనిబంధనము, శివానందలహరి, మహిమ్నము, అనామయము, ప్రతాపరుద్రీయము, వ్యాకరణరాజము మున్నగు శతకములు, నాటకములు, నవలలు మొత్తము డెబ్బదియొక్క పుస్తకములు విరచించినారు. అనేకములు విద్యాలయములలో పఠనీయములు కూడను. వీరు స్వచరిత్రనుగూడ

మిక్కిలి చక్కగా వ్రాసి ప్రచురించినారు.[28] ఈ పండితులు 19౩౬ మార్చి 13 వ తేదిని ఉదయము కాల్యములదీర్చి మాట్లాడుచుండ యాకస్మికముగా ననాయాసముగ పరశివపదము నందిరి.

వీరికవిత్వము గూర్చి వేఱుగా వ్రాయనక్కరలేదు. ఇందు ౨౭౨ పుటలో ముద్రితమైన వీరి యాంధ్రానామయ స్తవమువలన వీరి సామర్థ్యము వెల్లడి కాగలదు. కొన్ని శ్లోకముల యనువాదము సంక్షిప్తముగా నున్నది. ప్రాచీనప్రతి ననుసరించి పాఠభేదము లుండుటవలన కొన్నిచోట్ల ననువాద విషయమున పాఠాంతరములు ఆవశ్యకములని తోచినది. ఈ కారణములవలన మరొక పద్యానువాదమును వ్రాయ నగు నను తలంపొకటి కలిగెను.

నా యనువాదము:—దండి మహాకవికి శారీరకవ్యాధి కల్గినదో లేదో కాని నాకుమాత్రము మకస్మాత్తుగ నీ సంవత్స రాషాఢ శు॥ ౯ గురువాసరమున నొక గొప్ప మనోవ్యాధి సంభవించెను. నిరుపాయముగ నుండెను. అపుడపుడు కొన్ని చిల్లర పద్యముల నల్లితినిగాని ఇంతకాలము దనుక శివునిగూర్చి యొక శతకమైనను వ్రాయనైతిని. ఈ సందర్భముననే శివపంచస్తవికి ఆంధ్రమున నర్థతాత్పర్య విశేషాంశములు వ్రాసి ముగించుట తటస్థించినది. ఇట్టి పరిస్థితిలో నీ యనామయ స్తవమును పారాయణము జేయుచుండ దీని కాంధ్రపద్యానువాదమునుగూడ విరచించి శివార్పితముసేయు తలంపుగలిగి ఆషాఢ శు॥ ౧౫ పూర్ణిమ స్థిరవారమున బూర్తిగావించితిని. దండికవి యభిప్రాయమును సరిగ బ్రకటించుటకు మాత్రమే నా యాంధ్రపద్యానువాదమున ప్రయత్నించితిని. ౧౨ వ పద్యమున 'సింధూ' శబ్దమును ౨౩ వ పద్యమున "చెయిసిక్" అను రూపమును నిరంకుశముగ ప్రయుక్తములైనవి. నా కవితయందలి బాగోగులనుగూర్చి పాఠకులే స్వయముగ నాలోచింప దగుదురు. ౧౯౮ పుటలో స్తవాదినిగల పద్యమువలనను, గ్రంథాంతమందలి గద్యమువలనను దెలిసికొనువారికి ప్రత్యేకముగ విశేషములు నివేదింపవలసి యుండదు.

---

(28) వీరి యనామయ స్తవమును, సంక్షిప్తచరిత్రను, వీరి సోదరులగు శ్రీ శ్రీ.ం. వేంకటరామయ్యగారును; స్వచరిత్రగ్రంథమును, కాకినాడ పిఠాపురకాలేజి ప్రాధ్యాపకులు శ్రీ ఈ యాజ్ఞి వేంకటవీరరాఘవాచార్యులుగారును పంపించినారు.

## హలాయుధ స్తవము

ఈ హాలాయుధుడును సంస్కృత సాహిత్యమున ప్రసిద్ధుడు. అభిధానరత్నమాల, కవిరహస్యము, మృతసంజీవిని మున్నగు నుత్తమ గ్రంథములను విరచించెను. ఈతని జన్మభూమి వంగదేశమందలి దక్షిణరాఢ్ మండలములోని నవగ్రామము. ఆధునికవిభాగము ననుసరించి యిది హుగ్లీజిల్లా ఖుర్షుత్ పరగణాలో జేరినది. కొంత కాలము గడిచినట్లితడు వంగదేశమును వదలి దక్షిణదేశమందలి (నిజాంస్టేట్) మాన్యఖేటము (మల్ఖేడు)ను అప్పుడు పరిపాలించు చున్న రాష్ట్రకూట కృష్ణరాజు నాస్థానము నాశ్రయించి సన్మానము నందినాడు. ఈ హాలాయుధ స్తోత్రముయొక్క ౬౮ శ్లోకమందలి "నవగ్రామ వినిర్గతః"అను విశేషణమువలన నిట్టి యభిప్రాయమే వ్యక్త మగుచున్నది. ఈ స్తోత్రకర్తయగు హాలాయుధుడే పై గ్రంథములకును కర్త యనుటకు స్పష్టమైన కారణములు లేకపోలేదు. తన కవిరహ స్యాంత్యమున—

ఇతి సమాప్త మవాప్తగుణోదయం, కవిరహస్య మిదం రసికప్రియం
సదభిధాననిధాన హలాయుధ, ద్విజనరస్య కృతి స్సుకృతాత్మనః.

అని తనకు "సదభిధాననిధాను"డనుటవలన అభిధానరత్న మాల యను హాలాయుధకోశగ్రంథము నీతడే వ్రాసెనని స్పష్టమగు చున్నది. అభిధానరత్నమాలలో విష్ణునామములను జెప్పినపుడు "శంభు"అను పర్యాయపదమును జేర్చినాడు. ఆ గ్రంథము లన్నిటి మొదటను శివస్తుతి గనుపడుచున్నది. ఇది ఈతని శైవత్వమునకు ద్యోతకము. ఇతడు వీరశైవు డనియే పాల్కురికిసోమనాథాది వీర శైవులు పేర్కొనిరి. ఈ స్తవముయొక్క ౬౮వ శ్లోకమున గల "ద్విజ, హాలాయుధ"శబ్దములు కవిరహస్యపు పైశ్లోకమునను గన్పట్టుచున్నవి. కావున నీ స్తవమునకును గ్రంథములకును కర్త ఒకడేయని నేను భావించుచున్నాను. వీరిరువురు భిన్నులు కావచ్చునని వెనుక నూహించి నది (వీరశైవమహాత్ములు, పుట ౫౭) సరియైనది కాదని తేలినది.

రాష్ట్రకూట కృష్ణరాజు క్రీ. శ. 760-80 లో మాన్యఖేటమును పరిపాలించెను. కావున మన హాలాయుధుడును ఈ యెనిమిదవ శతా

మిక్కిలి చక్కగా వ్రాసి ప్రచురించినారు. [28] ఈ పండితులు 19
మార్చి 13 వ తేదిని ఉదయము కాల్యములదీర్చి మాట్లాడుచు
యాకస్మికముగా ననాయాసముగ పరశివపదము నందిరి.

వీరికవిత్వము గూర్చి వేరుగా వ్రాయనక్కరలేదు. ఇందు
పుటలో ముద్రితమైన వీరి యాంధ్రానామయ స్తవమువలన వీరి సా
ర్థ్యము వెల్లడి కాగలదు. కొన్ని శ్లోకముల యనువాదము సంక్షి
ముగా నున్నది. ప్రాచీనప్రతి ననుసరించి పాఠభేదము లుండుటవల
కొన్నిచోట్ల ననువాద విషయమున పాఠాంతరములు ఆవశ్యకము
తోచినది. ఈ కారణములవలన మరొక పద్యానువాదమును వ్రా
నగు నను తలంపొకటి కలిగెను.

నా యనువాదము:—దండి మహాకవికి శారీరకవ్యాధి కల్గినదో
లేదో కాని నాకుమాత్రి మకస్మాత్తుగ నీ సంవత్స రాషాఢ శు॥
గురువాసరమున నొక గొప్ప మనోవ్యాధి సంభవించెను. నిరుపాయ
ముగ నుండెను. అపుడపుడు కొన్ని చిల్లర పద్యముల నల్లితినిగాని
ఇంతకాలము దనుక శివునిగూర్చి యొక శతకమైనను వ్రాయనైతిని
ఈ సందర్భముననే శివపంచస్తవికి ఆంధ్రమున నర్థతాత్పర్య విశేషా
శములు వ్రాసి ముగించుట తటస్థించినది. ఇట్టి పరిస్థితిలో నీ యనా
మయ స్తవమును పారాయణము జేయుచుండ దీని కాంధ్రపద్యాను
వాదమునుగూడ విరచించి శివార్పితముసేయు తలంపుగలిగి ఆషాఢ
శు॥ ౧౫ పూర్ణిమ స్థిరవారమున బూర్తిగావించితిని. దండికవి యభి
ప్రాయమును సరిగ బ్రకటించుటకు మాత్రమే నా యాంధ్రపద్యాను
వాదమున ప్రయత్నించితిని. ౧౨ వ పద్యమున 'సింధూ' శబ్దమును
౨౩ వ పద్యమున "చెయిసర్" అను రూపమును నిరంకుశముగ ప్రయు
క్తములైనవి. నా కవితయందలి బాగోగులనుగూర్చి పాఠకులే స్వయ
ముగ నాలోచింప దగుదురు. ౧౫౮ పుటలో స్తవాదినిగల పద్యము
వలనను, గ్రంథాంతమందలి గద్యమువలనను దెలిసికొనువారికి ప్రత్యే
ముగ విశేషములు నివేదింపవలసి యుండదు.

---

(28) వీరి యనామయ స్తవమును, సంక్షిప్తచరిత్రను, వీరి సోదరులగు శ్రీ
శ్రీం. వేంకటరామయ్యగారును; స్వచరిత్రగ్రంథమును ... పిఠాపురకాలేజి
ప్రాధ్యాపకులు శ్రీ ఈ యూణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారును పంపించినారు.

## హలాయుధస్తవము

ఈ హలాయుధుడును సంస్కృత సాహిత్యమున ప్రసిద్ధుడు. అభిధానరత్నమాల, కవిరహస్యము, మృతసంజీవిని మున్నగు నుత్తమ గ్రంథములను విరచించెను. ఈతని జన్మభూమి వంగదేశమందలి దక్షిణరాఢ్ మండలములోని నవగ్రామము. ఆధునికవిభాగము ననుసరించి యిది హుగ్లీజిల్లా ఖుర్‌షుత్ పరగణాలో జేరినది. కొంత కాలము గడిచినట్లితడు వంగదేశమును వదలి దక్షిణదేశమందలి (నిజాంస్టేట్) మాన్యఖేటము (మల్‌ఖేడు)ను అప్పుడు పరిపాలించుచున్న రాష్ట్రకూట కృష్ణరాజు నాస్థానము నాశ్రయించి సన్మానము నందినాడు. ఈ హాలాయుధ స్తోత్రముయొక్క ౬౪ శ్లోకమందలి "నవగ్రామ వినిర్గతః" అను విశేషణమువలన నిట్టి యభిప్రాయమే వ్యక్తమగుచున్నది. ఈ స్తోత్రకర్తయగు హాలాయుధుడే పై గ్రంథములకును కర్త యనుటకు స్పష్టమైన కారణములు లేకపోలేదు. తన కవిరహస్యాంత్యమున—

ఇతి సమాప్త మవాప్తగుణోదయం, కవిరహస్య మిదం రసికప్రియం
సదభిధాననిధాన హలాయుధ, ద్విజవరస్య కృతి స్సుకృతాత్మనః.

అని తనకు "సదభిధాననిధాను"డనుటవలన అభిధానరత్నమాల యను హలాయుధకోశగ్రంథము నీతడే వ్రాసెనని స్పష్టమగుచున్నది. అభిధానరత్నమాలలో విష్ణునామములను జెప్పునపుడు "శంభు"అను పర్యాయపదమును జేర్చినాడు. ఆ గ్రంథము లన్నిటి మొదటను శివస్తుతి గనుపడుచున్నది. ఇది ఈతని శైవత్వమునకు ద్యోతకము. ఇతడు వీరశైవు డనియే పాల్కురికిసోమనాథాది వీరశైవులు పేర్కొనిరి. ఈ స్తవముయొక్క ౬౪వ శ్లోకమున గల "ద్విజ, హాలాయుధ శబ్దములు కవిరహస్యపు పై శ్లోకమునను గన్పట్టుచున్నవి. కావున నీ స్తవమునకును గ్రంథములకును కర్త ఒకడేయని నేను భావించుచున్నాను. వీరిరువురు భిన్నులు కావచ్చునని వెనుక నూహించినది (వీరశైవమహాత్ములు, పుట ౫౨) సరియైనది కాదని తేలినది.

రాష్ట్రకూట కృష్ణరాజు క్రీ. శ. 760-80 లో మాన్యఖేటమును పరిపాలించెను. కావున మన హాలాయుధుడును ఈ ఘనిమిదవ శతా

బ్దమున నున్నటులే భావింపనగును. ఈరాజు మూడవ కృష్ణరా
కావున 939-962 సంవత్సరప్రాంతమున హలాయుధు డుండెన
కొందరు పరిశోధకు లూహించిరి. ఇదియే సర్వసామాన్యముగ చల
మణి యగుచుండెను. కాని ఈ నిర్ణయమునకు కారణము గనుపింపదు
ఈతడు ప్రథమకృష్ణరాజాశ్రితుడనియే ఇటీవలి చర్చవలన దేలినది.[29]

శివుడు జంగమవేషమునవచ్చి శిరియాళుని భక్తిని పరీక్షించ
నపుడు మాంస మారగించెనను కథ శైవగ్రంథములలో నున్నది. ఇ
ఇంచుమించు హలాయుధునికి సమకాలమున ఘటించినట్లుగా నున్నది
"వీరశైవుడగు శిరియాళు డిట్టి యభక్ష్యమును వండుటయు, శివు
భక్షించుటయు" అను దురాచారమును కేవల వీరశైవవ్రతనిష్ఠా
గరిష్ఠుడగు హలాయుధుడు విని ఇట్టివారిని బహిష్కరించితి నని చా
నట! అంత శివు డీతని వీరభక్తిని పరీక్షించి అపూర్వమైన యీ హలా
యుధస్తవమునకు మెచ్చి యతనికి నవగ్రామసర్వప్రజలతో గూడ
కైలాసము ననుగ్రహించినట్లు కవిచరిత్రవలన దేటపడుచున్నది.
(ఈ గ్రంథము ౧౯౨ పుట) ఈ శిరియాళుని కథను అపుడు క్రొత్తగ
వినుటయు దానిని చర్చించి హలాయుధుడు బహిష్కరించుటయు
పరస్పరముగ సమీపమైన ఘటనలే కావచ్చును. దక్షిణభారత సామ్రా
జ్యము నేలిన పల్లవవంశరాజుల యొద్ద నీ శిరియాళుడు సేనాపతిగా
క్రీ. శ. 630 వ సంవత్సరమున నుండెననియును, ఈతని కథను పెక్కు
తమిళకవులు వర్ణించిరనియును గోచరించుచున్నది.[30] ఆకాలమున నీశి
యాళుని చరిత్ర ప్రసిద్ధమై దక్షిణదేశము నుండి వంగదేశము దనుక
ప్రచారము నందుటకు కొంతకాలము పట్టియుండును. దీనివలన కూడ
హలాయుధుడు 8వ శతాబ్దమున (శిరియాళుని సమీపకాలమున)
నున్నవాడని భావించుచో ప్రత్యవాయము లేదు.

మహిమ్నస్తవము శిలాశాసనముగా జెక్కబడిన ఓంకారక్షేత్రపు
అమరేశ్వరమందిరముననే ఈ హలాయుధస్తవము క్రీ. శ. 1063 వ

29. भारतवर्ष मध्ययुगीन चरित्रकोश (पं. सिद्धेश्वरशास्त्री) చూడుడు.
30. బెంగుళూరు శ్రీ దొడ్డ వీరప్పగారి శివశరణచరిత్ర (కన్నడ)ము చూ

శిలపై లిఖితమై యున్నది. అంతకు పూర్వమే ప్రచారము నందియుండు టనుబట్టియే ఇట్టి గౌరవము మహిమ్నముతోబాటు హలాయుధ స్తవ మునకును గలిగియుండును. ఇదియు హలాయుధుడు ఎనిమిదవ శతా బ్దము వాడనుటకే సాధనము. ఈ శిలాశాసనపాఠమును పరిశీలించి విద్యావాచస్పతి శ్రీ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి ఎం. ఎ. గారు (Epigraphia Indica (Vol. XXV - Part IV. October, 1939) లో ప్రకటించినారు. [31] ఈ శిలాశాసన ప్రతిబింబమును ప్రకటింపనెంచి ప్రయత్నించితిని కాని సాధ్యపడదయ్యెను. ఐనను ఈ శాసనపాఠము ననుసరించియే హలాయుధ స్తవము నీ గ్రంథమున ప్రకటించినాడను. ఈ శాసనమునుగూర్చి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, శ్రీ ఎన్. పి. చక్రవర్తిగారును, హలాయుధుడు పదవశతాబ్దమువాడు కావచ్చునని యును, ఈ స్తవకర్త, ఆ యభిధానమాలాకర్తలు, ఒకరు కారేమో యనియును; కొంత సందేహాస్పదముగ వ్రాసినారు. కాని ఇది యంత సమంజసముగా లేదని పై నుదహరించిన కారణములవలన దేలుచున్నది. వైష్ణవసర్వస్వాద్యులను రచించిన హలాయుధుడు 1178 వ సంవత్సరము నను, శ్రాద్ధకల్పసూత్రకర్తయగు హలాయుధుడు 1150 సంవత్సరము నను, నున్నవారు కావున మన స్తవకర్త యగు కవి హలాయుధుడు ప్రాచీనుడనియే భావింపనగును.

శివపంచ స్తవములలో నన్నింటికంటె నీ హలాయుధ స్తవము పెద్దది. కావుననే యిది కంఠస్థము చేయుటకు వీలుపడక కొంత తక్కువ ప్రచారము నందినది. కవిత్వము శయ్యాభాషారీతులతో నలంకృతమై భక్తిప్రబోధకమై ప్రౌఢమై హలాయుధుని శాస్త్రవిశారదత నుగ్గడించు చున్నది.

ఆంధ్రీకరణము: — హలాయుధ స్తవశ్లోకములకు భావాను కరణము అనేకకావ్యశతకములలో గన్పట్టుచేని యాశ్చర్యకరముగాదు. ఉదాహరణార్థము "యేషాం యుష్పత్ప్రతికృతిగృహం" అను ౨౧ వ

(31) శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఈ పాఠ్యమును నా కుచితముగా బంపిరి. ఇందలి యాంగ్లవ్యాసమునకు శ్రీ సన్నిధానము శ్రీధరశర్మ బి. ఏ. గారు అంధ్రానువాదమును వ్రాసి యిచ్చిరి.

శ్లోకమును నాగలూటి శేషారాధ్యుడు తన పర్వతపురాణషష్ఠాశ్వాసమున నిట్లనువాదించెను.

క. మలహరుగుడి గోమయమున, నలికినమనుజుండు నలుకు నట కస్తూరీ
మలయజపంకము దివిష,జ్జలజాయతలోచనాకుచద్వయమందున్.

ఈహలాయుధమునకు సమగ్రమైన యనువాదమును రచించినవారు శ్రీ శృంగారకవి వేంకటరామయ్యగారొక్కరే మనకు పరిచితులు.

శ్రీ శృంగారకవి వేంకటరామయ్యగారు:—వీరు కాకినాడ తాలూకా వింజరగ్రామమునందు శృంగారకవి పళ్లమరాజు రామాంబాదంపతులకు 1886 క్షయ. ఆశ్వ. బ. ౧ బుధవారమున జన్మించిరి. పండితవర్యులైన తండ్రిగారియొద్దనే వీరి విద్యాభ్యాసము జరిగినది. శృంగారకవి సర్వారాయుడుగారు వీరి కన్నగారు. వీరు సంస్కృతాంధ్రభాషావిశారదులు, మాధవ సోమేశ్వర వేణుగోపాల శతకములను, ఆంధ్రవ్యాకరణము, నరకాసురవిజయము, బాలరామాయణము, హలాయుధస్తవము, పంచబాణవిజయము, హనుమచ్చరిత్ర, కుమారసంభవము అను పెక్కు గ్రంథములను విరచించినారు. ౪౦ వత్సరములు బోర్డుపాఠశాలలో నుపాధ్యాయవృత్తినిగూడ నిర్వహించిరి. విశ్రాంతినొంది సోమేశ్వరమున నివసించుచుండిరి. ప్రస్తుతము యానామున నున్నారు. కఠినమైన హలాయుధమును మిక్కిలి చక్కగా ననువదించి యున్నారు.

మేము ముద్రించిన గ్రంథక్రమమునుబట్టి శివపంచస్తవములను గూర్చిన చర్చ యథామతి వివృతమైనది.

## అనుబంధము

మహాకవి బిల్హణుడు రచించిన బిల్హణస్తవము గూడ నిటీవల ప్రసిద్ధమైనది. ఇది మిక్కిలి చమత్కారజనకముగను, సరస వినోదకరముగను నున్నది. కాకినాడ శివపంచస్తవప్రతిలో నిదియు జేర్పబడి యుండుటవలనను అనుబంధముగా బ్రకటించితిని. ఆంధ్రదేశమునదప్ప మరి వేరుదేశములలో దీనికి ప్రచారములేదు.

బిల్హణుడు కూడ సంస్కృతసాహిత్యమున గణన కెక్కినవాడు. ఇతడు కాశ్మీరదేశీయుడు. ప్రవరపురమునకు దేమవగా నున్న

శోనముఖ గ్రామ నివాసి. కాశినుండి రామేశ్వరమువర కితడు సంచ రించి పలువురు పండితులయెదుట తన సరసమైన కవిత్వమును ప్రద ర్శించి కీర్తి గాంచెను. దైవవశమున గుర్జర దేశపు నరసింహరాజు పుత్రిక యగు శశిలేఖకు ఇతడు విద్యాబోధకుడుగా నుండి యామెను ప్రేమించి, మిక్కిలి కష్టములపాలై తుదకు[32] వివాహమాడెననియును ఒక యైతిహ్య మిటీవల ప్రకటితమైనది. దీనివలన మన దేశమున బిల్హణ చరిత్రం (సం) బిల్హణీయము (చిత్రకవి సింగరార్యుడు) మొదలుగాగల శృంగారకావ్యములకు ఇతిహాసబలమున్న దని తేలుచున్నది.

క్రీ. శ. 1030 ప్రాంతమున కల్యాణమును పాలించిన చాళుక్య త్రైలోక్యమల్లవిక్రమాదిత్యుని యాస్థానమున నీ బిల్హణకవి పండి తుడై యారాజును గూర్చి 'విక్రమాంకదేవచరితమ్' అను చక్కని కావ్యమును నిర్మించి ప్రసిద్ధికెక్కెను. కర్ణసుందరీ, సురతపంచాశీ, యను నాటికలను గూడ రచించెను. ఈతడు పాల్కురికి సోమనాథుడు విశ్వా రాధ్యుడు మున్నగు వారికంటె ప్రాచీనుడే యైనను 1230 వరకు గూడ నీబిల్హణ స్తవము ప్రచారమునకు వచ్చినట్లు గానుపింపదు. పైగా నంతకు పూర్వమే శివపంచ స్తవములు ప్రఖ్యాతములై యుండెను.

ఈ స్తవము కవిత్వదృష్టితో జూచినయెడల మిక్కిలి చక్కనిది. వినోదకరముగా నుండును. సమయోచితపద్యముల వలె నున్నది. దీనిప్రతి మాకొక్కటియే లభించినది. ఇంచు అపపాఠములు పెక్కున్నట్లు తోచినది. ప్రయత్నించినను రెండవ ప్రతిచిక్కదయ్యె. అందువలన ప్రతిపదార్థమును ప్రకటింపక తాత్పర్యమును మాత్రము వ్రాసితిని.

ఆంధ్రీకరణము:—ఈ బిల్హణస్తవము గూడ శ్రీనాథునినాటికి మిక్కిలి ప్రచారమునకు వచ్చినట్లు భావింపవచ్చును. "పంచబ్రహ్మ షడంగ బీజ'' అను 3వ శ్లోకము సమానశబ్దముగ నిట్లనుకరింపబడినది.

శా. పంచబ్రహ్మ షడంగబీజముఖర ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరాపరమనిష్ఠా తత్పరత్వంబునన్

---

(32) శ్రీవిఠల్ కృత బిల్హణచరిత్ర (మరాఠి) పు. ౧౫౨

మంచుంగొండ యనుంగు పెండ్లికొడుకుగా మధ్యాహ్న కాలంబు నే
వించుగా నిర్జరరాజసూనుఁడు మనోవీథీసదాధ్యాసతగా.

శ్రీనాథుని హరవిలాసము.

కాకినాడపత్రికలో శ్రీ వింజమూరి లచ్చారాయ కవిగారి
ఆంధ్రపద్యానువాదము ప్రకటితమైనది. దానినే ఇట స్వీకరించితిని.
ఇతరుల యనువాదములును కలవేమో! తెలియుదు.

శ్రీవింజమూరి లచ్చారాయ కవిగారు:— ఈ కవి తూర్పుగోదావరి
మండలమందలి సామర్లకోట వాస్తవ్యులు. తెలగాణ్యులు, గౌత
మసగోత్రులు, వేంకటరామయ్య లక్ష్మీదేవుల పుత్త్రులు. వీరు
వాడిన వృత్తమును మరల వాడక అఖిలచ్ఛందోవృత్తములు గల
ధరణిజాపరిణయమును, ద్వాదశవిద్వచ్చరిత్రమును రచించిరి. ఇవి
ముద్రితములు. ఆంధ్రీకృత బిల్హణ స్తవమందలి కవితవలన వీరి పరిష్కృత
మైన సంస్కృతాంధ్రభాషాపాటవము దెలియవచ్చును. వీరి పుట్టు
గిట్టులు 1860, 1927 లలో జరిగినవి.

## కృతజ్ఞత; నివేదన

ఒక పొత్తమును ప్రకటించుట కెన్నివిధముల, నెందరనుండి,
యే యే గ్రంథములవలన సాహాయ్యము నందవలసి యుండునో కృతి
బుద్ధులకు సువిదితము. దాదాపు రెండు వత్సరములనుండి నే నీ శివ
పంచస్తవికి గావలసిన సామగ్రిని సేకరించుచునే యుంటిని. పలువురు
మిత్రులు చేయూత నొసంగిరి. కవులు తమతమ పద్యముల నిందు
జేర్చుట కంగీకరించిరి. వారి వారి సాహాయ్యముల నా యా స్థలములలో
సూచించి కొంటిని, అందునను శ్రద్ధేయులు శ్రీ బండారు తమ్మయ్య
గారు మిక్కిలి యెక్కువగా బరిశ్రమించి వివిధముఖముల సహాయులైరి.
'విభూతి'లో పంచస్తవములనుగూర్చి వీరు వ్రాసిన వ్యాసమూలముననే
యీ పుస్తకప్రకటన కుద్బోధ గలిగినది. ఇరువది సంవత్సరముల క్రితము
నీరడగుంభ శ్రీమన్నిరంజన శ్రీ సిద్ధలింగ స్వాములవారి సంస్కృత
పాఠశాలలో నేను విద్యాభ్యాస మొనర్చుచున్నతఱి మక్తల్ వాస్త
వ్యులును ధర్మభూషణులును వివిధభాషాభిజ్ఞులును అగు శివశ్రీ సా.. బసవ
లింగశాస్త్రిగా రీ శివపంచస్తవీ గ్రంథమును (కన్నడ ప్రతిని) మిక్కిలి

ప్రేమతో నొసగి, తదాదిగ నీ గ్రంథప్రచారమునుగూర్చి హెచ్చరించుచునే యున్నారు.[33] ఈ మహనీయు లందరకు "నా హృదయపూర్వకమైన కృతజ్ఞతను సమర్పించుచున్నాను" అను నామమాత్రోపచారమును ప్రకటించుట దప్ప వే ఱుపాయనము లేదు.

నేనీ గ్రంథమునకు అర్థతాత్పర్యవిశేషముల వ్రాయుట యందును; పీఠికారచనమునందునను యథాబుద్ధి యథాసాధ్యము పరిశ్రమించితిని. ఐనను నే ననుకొన్న సంగతులను కూడ సాకల్యముగ జేర్పజాలనైతిని. ఇందుకు కారణములు గలవు. మా సికిందరాబాదు హైదరాబాదులలో భారతీయుల సర్వవాఙ్మయము గల పెద్ద గ్రంథాలయ మొక్కటియైనను లేదు. పరిశీలనమున కిట్టిది పరమావశ్యకము. నాకు గావలసిన సాధారణగ్రంథసామగ్రి గల మా "శైవభారతీ భవన" గ్రంథములు యుద్ధభీతివలన దూరస్థలమున చేరుటయు బాధాకరముగ నుండెను. విశేషములను సాకల్యముగ వరసిన కొలదియు వ్రాత పెరుగుచునే యుండెను. కాగితముల మహార్ఘత దీనికి భయంకరమైనది కదా! శివానుగ్రహమువలన నిది పునర్ముద్రణ మందునేని విజ్ఞులు సూచించు విశేషములు ప్రకటితము కాగలవు. మానవబుద్ధిసహజముగ దొరలిన పొరపాటులను మన్నించి పరిష్కరింప నివేదించుచున్నాను.

"సర్వారంభాస్తండులప్రస్థమూలాః" అను న్యాయము ననుసరించి నేటికాలమున గ్రంథప్రకటనమునకు విశేషధనము గావలసియున్నది. మహోదారచరితులును ధార్మికగుణపవిత్రులును ఉండవెల్లి (రాయచూరుజిల్లా, అలంపూరుతాలూక) గ్రామనివాసులును అగు శ్రీ శ్రీ దుంపల రామిరెడ్డిగారు స్వయంప్రేరితముగ నీ గ్రంథముద్రణకగు సమస్తద్రవ్యమును కేవల శివధార్మికబుద్ధితో సమర్పించుట యసాధారణమైన విషయము. మొదలూహించినదానికంటె ద్విగుణముగ నీ వ్యయభారమును శ్రీయుతులు వహించి తమ యనుపమమైన

---

33. ఆంధ్ర గ్రంథాలయ ముద్రాశాల పరిశోధకులు, ఉభయభాషా ప్రవీణులు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులుగారు ముద్రణాశోధనమున సహకరించిరి. మా విద్యార్థి మతంనడిపూడి మరెయ్యయు, మా చి. కోటిలింగయ్యయు మూలశ్లోకములను ఆంధ్రపద్యములను ఎత్తి వ్రాసినారు.

రెడ్డికులసహజౌదార్యమును ప్రకటించిరి. శ్రీమంతులలో కొందరు శ్రీరామిరెడ్డిగారి యాదర్శమార్గము ననుసరించి ఒక్కొకగ్రంథమునకు తోడ్పడుచో నీతి మత ధర్మ సాహిత్యముయొక్క దారిద్ర్య మడుగంటి దేశ సౌభాగ్యదేవతను ప్రతిష్ఠించినవారగుదురు. శ్రీ రామిరెడ్డి గారికి సదాశివుడు సర్వశుభముల ననుగ్రహించుగాక !

శా. శ. ౧౮౬౪ స్వభాను
మార్గశీర్ష బ. ౮ సోమవారము

విధేయుడు,
చిదిరెమఠము వీరభద్రశర్మ.

---

# పీఠికాశోధన

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| ఎ | ౯ | ౧౩ | ౭ |
| జ | ౩౪ | స్తుత | స్తుతి |
| చ | ౮ | పద్మ్రణాల్ | పద్మ్రణాంక |
| ,, | ౧౧ | ఆకెరియ | ఆ కెరెయ |
| ,, | ౧౩ | పద్మరసాద్య | పద్మరసార్య |
| ,, | ౧౫ | ప్రిసన్న తే | ప్రసన్న తె |
| ,, | ౧౭ | నిరతియ | నిరతిశయ |
| ఈ | ౧ | క్రమణ | క్రిమణి |

# శివపంచస్తవి

## విషయానుక్రమణిక



### అనుబంధము

# విశేషములు

[ఈ శివపంచస్తవికి వ్రాయబడిన తాత్పర్యవిశేషములలో అటనట కొన్ని యంశము స్మరణార్హముగ నుండుటవలన నవి ప్రత్యేకముగ నీ క్రింద పేర్కొనబడినవి.]

---

# సంకేతవివృతి

[ఈ గ్రంథమున పలుతావులలో సంక్షిప్తాక్షరము లుపయోగింపబడినవి. ఈ క్రింది సంపూర్ణనామములతో నవి సూచింపబడినవి.]

అథ. అథర్వవేదః
అ. శి. అథర్వశిరః
అద్వై. భా. అద్వైత భావోపనిషత్
ఉ. { ఉత్తరార్థం / ఉత్తరకాండః
ఋ. ఋగ్వేదః
గో. బ్రా. గోపథ బ్రాహ్మణం
తై. స. { తైత్తిరీయ సంహిత / ,, ఉపనిషత్
దై. దైవత కాండః
నా. ప. నారద పరివ్రాజకోపనిషత్
ని. నిరుక్తం
పంచబ్ర. పంచబ్రహ్మోపనిషత్
పద్మ.సృ. పద్మపురాణ సృష్టిఖండః
పా. ఆ. పారమేశ్వరాగమః
పారా. పారాయణోపనిషత్
పూ. పూర్వార్థం
బ్రహ్మ. బ్రహ్మపురాణం
భ. గీ. భగవద్గీతా
భ. జా. భస్మజాబాలోపనిషత్
భా. గ. భాగవతం
మత్స్య. మత్స్యపురాణం
మ. క. మహాభారత కర్ణపర్వ
,, వ. ,, వనపర్వ
,, శా. ,, శాంతిపర్వ
మ. నా. మహానారాయణోపనిషత్
మాండు. మాండూక్యోపనిషత్
య. యజుర్వేదః(శుక్ల)
యో. శి. యోగశిఖోపనిషత్
రామో. రామోత్తరతాపినీ
రుద్ర యజుర్వేద శతరుద్రీయం
వరాహో. వరాహోపనిషత్
వాయు. వాయుపురాణం
విష్ణు. విష్ణుపురాణం
శ. బ్రా. శతపథబ్రాహ్మణం
శివ. శివపురాణం
,, రుద్ర ,, రుద్రసంహితా
,, విద్యే ,, విద్యేశ్వరసంహితా
,, శత ,, శతరుద్రీయసంహితా
,, సతీ ,, సతీఖండః
శివ. ధ. శివధర్మసంహితా
శివో. శివోపనిషత్
సి. శి. సిద్ధాంతశిఖామణిః
హరి. హరివంశం

# పాఠకులకు

ఈ క్రిందియంశములను పాఠకులు తప్పక గమనింపవలెను. ఉచ్చారణ సౌక
ర్యమును, ప్రత్యేకముగ తెలియుటకును శ్లోకములలోని శబ్దములు విడివిడిగా ముద్రిం
బడినవి. సంధులు కలచోటను, లేనిచోటను ఎడముగా (స్పేస్ వదలి) నిల్పబడి
వానిని పారాయణ మొనర్చునపుడు ఒకచోటికి చేర్చి కలిపి పఠింపవలెను. ఉదాహ
రణార్థము:—మహిమ్న స్తవమందలి మొదటి శ్లోకమున "మహిమ్నః పారం తే" అ
దానిని "మహిమ్నఃపారంతే" అనునట్లును, ౨ వ శ్లోకమందలి "స్తోతవ్యః కతి
గుణః" అను దానిని "స్తోతవ్యఃకతివిధగుణః" అనునట్లును దగ్గరగా కలిపి యు
రింపవలెను. ఇట్లే విసర్గము తరువాత వచ్చు శ ష స కారములను దానితో చే
శ్శ ష్ష స్స కారములవలె పఠింపవలెను. ఉదా:—'సర్వః స్వమతి'=సర్వస్స్వమతి
దృష్టః శిరసి = దృష్టశ్శిరసి; బాణైః షడ్భిః = బాణైష్షడ్భిః;

ఈ గ్రంథమున సులభమైన తెలుగు వ్రాయబడినది. కేవల వైయాకరణ భా
కాదు. అరసున్నలు, బండిరాలు అకస్మాత్తుగ కొన్ని చోటులలో పడినవియే గా
బుద్ధిపూర్వకముగ వ్రాయబడినవి కావు. గ్రంథకర్తకును, ముద్రాశాలాపరిశోధ
లకును స్పేసులను (సందుల)ను గూర్చి ఐకమత్యము కుదరనందున అవి ఒకే పద్ధ
ననుసరించి లేవు.

మహిమ్నము లోభదారిద్ర్యములను, మల్హణము మోహమును, మలయరాజ
అకాలమృత్యువును, అనామయము వ్యాధిని, హాలాయుధము మదమత్సరముల
హరించి; నిత్యకల్యాణము నిచ్చి; భక్తిని గలిగించి మోక్షమార్గమున బడవేయు
మల్హణస్తవము గూడ లక్ష్మీప్రదమైనది. ప్రత్యహ మీ స్తవములను పూర్తిగాగా
ఒక్కొకటిగాగాని, కొన్ని శ్లోకములను గాని యథాసాధ్యమొక నియమము న
సరించి, భక్తిశ్రద్ధలతో పారాయణ మొనర్చి సంవత్సరమున కొకమారు శివార్చ
నోద్దేశ్యముతో బంధు భక్తమాహేశ్వరాదుల తృప్తిపరచవలెను. పఠించునపుడు
శుచిగా ఏకాగ్రముగా నుండవలెను. నోరు సరిగా తెరచి స్పష్టముగా నుచ్చారణ
మొనర్పవలెను. యథావకాశము అర్థతాత్పర్యములను విశేషపద్యములను గూడ ప
చుచు నవగాహన మొనర్చుకొనుచో సాధారణముగ సంస్కృతభాషగూడ అవగతమ
కాగలదు. అచ్చు తప్పులను మొట్టమొదలు సవరించుకొనవలెను.

శ్రీసాంబశివాయ నమః

# శివపంచస్తవి

## ౧. మహిమ్నః స్తవము

మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ
స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నా స్త్వయి గిరః।
అథావాచ్యస్సర్వః స్వమతిపరిణామావధి గృణ
న్మమాప్యేష స్తోత్రే హర నిరపవాదః పరికరః॥ ౧॥

### భక్తరంజిని

శ్లో. శివం సాంబం నమస్కృత్య, శివపంచ స్తవశ్రితేః।
ఆంధ్రభాషామయీం కుర్వే, వ్యాఖ్యాం శ్రీభక్తరంజినీం॥

క. హరభక్తిసుధానిధు లనఁ
బరగెడు పంచస్తవాఖ్య పావనగీతుల్
విరచించు పుష్పదంతా
ద్యురుశైవులఁ దలఁతు భక్తి నుల్లమునందున్.

గీ. పండితుల మెప్పుఁ బడసెడు భ్రాంతి వీడి
భక్తజనులకుఁ దెలిపెడు పక్ష మూని
'భక్తరంజిని' పేరునఁ బరగుఁ దేట
తెల్గుపల్కుల యథామతి వెల్గఁ జూతు.

గీ. 'ఉండవెల్లి' నివాసి యఖండయశుఁడు
రాజమాన్యుఁడు దుంపల రామిరెడ్డి
నాఁ జెలంగు ధర్మాత్ముఁడు నన్ను గౌర
వింప "భక్తరంజిని" రచియింపఁ బడియె.

అర్థము:—హర=భక్తపాపహరుఁడ వగు నో యీశ్వరా! తే=
నీ, మహిమ్నః=సామర్థ్యముయొక్క, పరం=మహత్తరమైన, పారం=

తుదను, అవిదుషః=తెలియనివాని, స్తుతిః = స్తోత్రము, అసదృ
యది=యోగ్యముగా నుండనిచో, తత్ =అపుడు, బ్రహ్మాదీనాం
బ్రహ్మవిష్ణ్వాదుల,గిరోఽపి=నుడులు సైతము, త్వయి=నీ విషయము
అవసన్నాః=దుర్బలములైనవి. అథ=లేక, సర్వః=సర్వజనము, స్వమ
పరిణామావధి=తమ బుద్ధిబలము ననుసరించి, గృణన్=పొగడుచు
అవాచ్యః=నిర్దోషుడుగా నెన్నబడునేని, స్తోత్రే=స్తుతియందు, మమ
నా యొక్క, ఏషః=ఈ, పరికరోఽపి=ఉద్యోగమైనను, నిరపవాదః
నిర్దుష్టమైనదియ.

అవతారిక—పరమేశ్వరుని మహిమ యపారమైనది కావున ఇట్టిదని నిర్
చింప శక్తిలేని వాడు స్తోత్రము చేయబూనుట అసంగతము కాదాయని, తన్ను
నాక్షేపించుకొని శ్రీపుష్పదంతాచార్యుడు ఇట్లు పరిహరించుచున్నాడు.

తాత్పర్యము:—పరమేశ్వరా! నీ యత్యద్భుతమైన సామర్థ్య
మును దెలియుటకు నీ కంటె మహనీయుడు కావలయును. అట్టివాడ
మఱొకఁడులేడు. కావున నిను సరిగ దెలియని ఎట్టి పండితుడు నీ మహి
మను పొగడినను అది యసంపూర్తిగనే యుండును. ఒకప్పుడు పరిహా
స్పదమైనను ఆశ్చర్యము లేదు. అటులే నిను నుతించిన బ్రహ్మాదుల వాక్కు
లును దుర్బలము లగుట గాంచనగును. ఎవరైనను తమ బుద్ధివైభ
మున్నంత వరకు నిను బొగడుచు గణింప బడుచున్నారు. కావు
నే నల్పజ్ఞుడనని యూరకుండక యథామతి నిను స్తుతింప బూని ఇదియ
నిర్దోషమగు పద్ధతి యని భావించుచున్నాను.

విశేషములు—స్కాందపురాణప్రభాసఖండము ౧౮౭ వ అధ్యాయమున
పద్మపురాణోత్తరార్ధము ౪౩ వ అధ్యాయముననను, దేవీభాగవతము ౯ వ అధ్యా
మునను ఈ మహిమ్నః స్తోత్రకర్త యగు పుష్పదంతాచార్యునిగూర్చి కథావి
ములు గాన నగును— "ప్రభాస మను ఒకక్షేత్రమును నిర్మించి, అందు ఘోర
మాచరించి, శివానుగ్రహము నంది, యట పుష్పదంతేశ్వర నామమున శివలిం
మును స్థాపించి, ప్రత్యహము భక్తివిశేషముతో శివు నారాధించుచు ధన్యుడైన మ
నీయుడే పుష్పదంతాచార్యుడు. ఇతడు గంధర్వరాజు, తన యుపవనపుష్పములతో
తనివి తీరక మరియొక రాజుయొక్క ఉద్యానమున అదృశ్యుడై ప్రవేశించి, కొల్ల
పుష్పముల సంగ్రహించి తెచ్చి యథేచ్ఛముగ శివు నారాధించుచుండెను. వే
వైపు ఆయుద్యానమున గల రాజు తన శివార్చనకు పుష్పములు లభింపక, ఈ పుష్

చోరుని పట్టుటకై యొనర్చిన యత్నము లన్నియు వ్యర్థము లయ్యెను. చివరకు మంత్రుల యుక్తివలన ఉద్యానము చుట్టును శివనిర్మాల్యము వెదజల్లబడెను. పుష్పములపైని భ్రాంతివలన ఎప్పటియట్లు అదృశ్యుడై ప్రవేశించుచుండ పుష్పదంతునిచే శివనిర్మాల్యము దాటబడినది కావున నతని యదృశ్యకరణశక్తి నశించెను. అంతనా యుద్యానపాలకు లతనిబట్టి రాజాజ్ఞ ననుసరించి కారాగారమున బంధించిరి. ఎట్టివాడైనను అపరాధఫలము ననుభవింపక తప్పదని తుదకు గ్రహించి తన చౌర్యమునకు పశ్చాత్తప్తుడై పవిత్రమైన హృదయముతో పరశివుని మహిమను ఈ "మహిమ్న" స్తోత్రమున గ్రథించి కృతార్థు డయ్యెను. అమోఘమగు నీ స్తుతికి శివుడు మెచ్చి ప్రత్యక్షమై పుష్పదంతుని అనుగ్రహించి చౌర్యపాపము నుండియు, కారాగారమునుండియు విముక్త గావించి నిరతిశయ మగు శివసాయుజ్యకైవల్యమును ప్రసాదించెను"—

శివుని మహిమ మిందు కలదు కావున శివమహిమస్తోత్ర మనియో మహిమస్తోత్ర మనియో దీనికి సరియైన నామకరణము గావలసి యుండెను కాని "మహిమ్నః" స్తోత్ర మని విలక్షణముగ వ్యవహరింప బడుచున్నది. కారణ మేమనగా శ్రీ పుష్పదంతాచార్యుడు మహర్షి కల్పుడు. కావున తత్కృతస్తోత్రముయొక్క ఆది యందు ప్రయోగింపబడినటులే షష్ఠీవిభక్తిరూపముతో శ్రుతులవలె "మహిమ్న"ము అనియే వ్యవహరింపబడెను. శ్రీ కాశీక్షేత్రమున జగద్గురు విశ్వారాధ్య సింహాసనపు జంగమవాడి మఠము (బంగాలిటోలా) చౌషష్టీదేవ్యాలయమునకు ఉత్తరము వైపునను శ్రీ పుష్పదంతేశ్వరలింగము ప్రతిష్ఠితమైయున్నది.

ఈ స్తవమునందు మొదటి శ్లోకమునుండి ముప్పది శ్లోకములవరకు శిఖరిణీ వృత్తములు. య మ న స భ గణములును, ఒక లఘువు ఒక గురువును, ఆరవ పదు నేడవ యక్షరముల తర్వాత యతియును ప్రత్యేక పాదమున నున్నచో నది శిఖరిణి యనబడును.

భారతవర్షపు మధ్యప్రాంతమండలి (C. P) నిమాడ్ జిల్లాలో ఓంకారేశ్వర జ్యోతిర్లింగక్షేత్రము కలదు. అచ్చోటి అమరేశ్వరమందిరమున విక్రమశకము ౧౧౨౦ వ సంవత్సరములో (శాలివాహన శకము ౯౮౫. క్రీ. శ. ౧౦౬౩) అనగా నేటికి ౮౯౭ వత్సరములకు పూర్వము ఈ మహిమ్న స్తవము శిలాశాసనముగాఁ జెక్కబడినది. కావున వేనవేల సంవత్సరములనుండియు నీస్తుతి వేదమువలె పారాయణము గావింపబడుచున్నది. తక్కిన వివరణము పీఠికలో గాంచనగును. ॥౧॥

అవ—ఐనను శివమహిమ వాక్కుల కందనిదికావున నుతించుట పరిహాసాస్పదముకాదా యనిన సమాధాన మిడుచున్నాడు.

అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయో-
రతద్వ్యావృత్త్యా యం చకితమభిధత్తే శ్రుతిరపి ।
స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః
పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః ॥౨॥

అర్థము:—తవ = నీ యొక్క, మహిమా = మాహాత్మ్యము వాఙ్మనసయోః=వాక్కు యొక్క మనస్సుయొక్క, పంథానం=మార్గ మును, అతీతః=మీరినది, చ=మఱియు, యం=ఏ నీమహిమమునుగూర్చి శ్రుతిరపి=వేదముకూడ, అతద్వ్యావృత్త్యా=అన్యవ్యావృత్తిరూపముతో చకితం=భయమందినట్లుగా, అభిధత్తే=చెప్పుచున్నదో, సః=ఆమహిమ కస్య= ఎవనికి, స్తోతవ్యః= స్తుతింపశక్యము? కతివిధగుణః= వివిధగుణ ములుగల ఆ యపారమహిమ, కస్య=ఎవనికి, విషయః=గోచరమగును తు=ఐతే, అర్వాచీనే=ఇటీవలి, పదే=మహిమవిషయమునందు, కస్య ఎవని, మనః=మనస్సు, వచః=వాక్కు, న పతతి=ప్రవర్తింపదు?

తా. ఓ పరమేశ్వర! నీ మహిమను వేదము సైతము సూటిగ జెప్పుటలేదు. అదియు భయముతో ఎట్లు నుడివిన నేమగునో యని శంకించుచు శివమహిమకంటె వేరు లేదు లేదని(నేతి నేతి)అభిధావృత్తిచే (పేరుతో పిలిచినట్లు గాక) అన్యవస్తునివృత్తి (రెండవద లేదనుట) ద్వారా బోధించుచున్నది. కాన నీ మాహాత్మ్యము వాఙ్మనసములకు గోచరము గాని దనియే ధ్రువపడుచున్నది. ఇట్టి యపారమగు మహిమ నిరూపించు టెవని తరము? ఎవనికి దెలియును? ఐతే నీ సనాతనమైన సంపూర్ణ రూపమును నిరూపింప జాలకున్నను, ఉపాసకులైన మహాత్ములు నీ త్రినేత్ర, పంచవక్త్ర, విష్ణుచక్రదాతృ, ఉమాపతి, చంద్రధరాది విశేష ణములు గలవాడవని ఇటీవల సంకల్పించి ధ్యానించుచున్నారు. కాన ఇట్టి మనోహరమైన రూపమును వర్ణించుటలో నెవని మనోవాక్కులు ప్రవర్తింపవు? సంపూర్ణ శక్తి లేకున్నను అభూతపూర్వమైన వస్తువు గురించి కుతూహలము గలవాడై యథామతి స్తుతింప నుద్యుక్తుడగు కావున నాస్తుతియు సార్థకమని భావము.

వి:—శివుడే వేదశాస్త్రాది సర్వవాఙ్మయమును చరాచరాది జగత్తు సృజించినాడు. జగత్తు ధర్మమనియు, శివుడు ధర్మియనియు ఎరుగవలయు. అట్టి స్వవాక్కులతో ఆత్మప్రశంస కుదురదుకదా? సత్యమును సాంగముగ జెప్పుటెట్లు లోకమునకు దెలియు టెట్లు? రతిరహస్యము నైనను ఆచార్యుడు అలంకార శాస్త్ర విద్యార్థికి జెప్పవలసియుండును. కాని గూఢముగా సూచించును. అటులే వేదము యందు శివమహిమ గూఢముగను, ప్రసంగానుసారము పురాణాదులలో విస్తారముగ

నిరూపింపబడినది. నిర్గుణము గూఢమనియు, సగుణము విశదమైనదనియు తేలినది కావున మహేశ్వర మహిమను తమ మనోవాక్కుల ననుసరించి ధ్యానించుటకు భక్తు డెవ్వడేని యధికారి యని తెలియదగును॥ ౨॥

అవః—మృదుమధురములైన అమృతవాక్కుల సృష్టించిన శివునకు నీ నిస్సారవచనములు సంతోషము గలిగించునా యనిన చెప్పుచున్నాడు.

మధుస్ఫీతా వాచః పరమమమృతం నిర్మితవత-
స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగురోర్విస్మయపదం।
మమ త్వేతాం వాణీం గుణకథనపుణ్యేన భవతః
పునామీత్యర్థేఽస్మిన్ పురమథన బుద్ధిర్వ్యవసితా॥ ౩॥

అర్థము:—బ్రహ్మన్=సర్వవ్యాపకుడవైన యో మహాదేవా! పరమం=నిరతిశయముగ, అమృతం=అక్షయముగా, మధుస్ఫీతాః=మధుర రసభరితములైన, వాచః=వేదవేదాంతాది వాక్కులను, నిర్మితవతః= సృజించినట్టి, తవ=నీకు, సురగురోః=బృహస్పతియొక్క, వాగపి=నుడి యును, విస్మయపదం=ఆశ్చర్యకరము, కిం=అగునా? తు=మరియు, పురమథన=ఓ త్రిపురదాహా! భవతః=నీయొక్క, గుణకథనపుణ్యేన= గుణములను నుతించెడు పుణ్యముచేత, ఏతాం=ఈ, వాణీం=వాక్కును, పునామి=పవిత్రపఱచికొనుచున్నాను, ఇతి=ఇట్లని, అస్మిన్=ఈ స్తోత్ర రచనారూపమైన, అర్థే = ప్రయోజనమునందు, మమ = నాయొక్క, బుద్ధిః=మతి, వ్యవసితా=ఉద్యుక్తమైనది.

తా. సర్వజ్ఞుడవు సర్వకర్తవు సర్వవ్యాపకుడ వగు నోవిశ్వేశ్వరా! శాశ్వతమైన తేనెల సోనలొలుకు వేదరాశిని నిర్మించినట్టి ఈశానుడ వగు నీకు వాచస్పతియైన బృహస్పతియొక్క కవిత్వము కూడ చమత్కార జనకము కాజాలదు. ఇక నాబోంట్లవాక్కు లేమాత్రమును ఆనందము గలిగింప జాలవనుట నిక్కువమే! హనుమంతుని యెదుట కుప్పిగంతులా! మరి యేల యీ యుద్యమ మందువేని నీపవిత్ర చరిత్రలను నుతించుట వలన నా వాక్కుగూడ కొంత పవిత్రము కాగలదు కదా! ఇట్టి లాభము కొరకే ఈ రచనకు బూనితినిగాని నాబుద్ధి వైభవముతో నీకు సంతోషము గలిగించుటకు కాదని భావము.

వి:—సత్యజ్ఞానానంద స్వరూపుడే శివుడు కాబట్టి వాఁడు సర్వజ్ఞు డని శ్రుతులు చెప్పినవి. శ్రుతులు మహాదేవుని నిఃశ్వాసములు కావున వానితోశా యును శాశ్వతముగ నుండును. సర్వజ్ఞుడైన శివునకు బ్రహ్మేంద్రాదుల యొక్క పుష్పదంతాదులయొక్కయు చమత్కారాదిసామర్థ్య మెంతగలదో తెలిసి యున్నది. కావున శక్తితో శివుని వశపరచుకొనుట కానిమాట. అయితే నిర్మల భక్తితో పరమేశ్వరుని గొనియాడి వశపరచుకొనవచ్చును గాన వ్యర్థమైన చమత్కా రముల జోలికి పోక నిను గీర్తించుటకే నే నీ కార్యము నారంభించినాడనని రహస్యము.

అవ—వెనుక శివమహిమ వర్ణింప తరముగా దనువారికి సమాధానమిడి, మహిమనుగూర్చి అమంగళము బలుకువారిని విమర్శించుచున్నాడు—

తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షాప్రలయకృత్
త్రయీవస్తువ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు।
అభవ్యానామస్మిన్ వరద రమణీయామరమణీం
విహంతుం వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః ॥౪॥

అర్థము:—వరద=అనుగ్రహకారి వగు నో శివా! తవ=నీ యొక్క, యత్=ఏ, ఐశ్వర్యం=మహిమ, (ఈశ్వరత్వము సామర్థ్య కలదో, తత్=ఆశక్తి, జగదుదయ రక్షా ప్రలయకృత్=జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములకు కారణమై, గుణ భిన్నాసు=సత్త్వరజస్తమో గుణములచేత ప్రత్యేకింపబడిన, తిసృషు=మూడైన, తనుషు=బ్రహ్మ విష్ణు రుద్రాత్మక శరీరములలో, వ్యస్తం=అంశరూపముగా బ్రతిష్ఠింప బడినది. (ఇట్లని) త్రయీవస్తు=వేదములయొక్క నిక్కమైన తాత్ప ర్యము. ఇహ=ఈలోకమందలి, ఏకే=కొందరు, జడధియః=మందబుద్ధులు అస్మిన్=ఈ నీ యైశ్వర్యవిషయమునందు, విహంతుం=ఖండించుటకు అభవ్యానాం=అమంగళులగు వారికి, రమణీయాం=రమ్యముగానున్న నట్టియు, అరమణీం=యథార్థముగా విచారహీనమైనట్టియు, వ్యాక్రోశీం=ఆక్షేపపు కేకను, విదధతే=వేయుచున్నారు.

తా. ప్రభూ, కరుణామయా! నీ ఈశ్వరత్వము ఇంతింత నిది. జగదనుగ్రహార్థమై నీ యా మహాసామర్థ్యములోని స్వల్పాం ముతో సత్త్వ రజస్ తమో గుణాత్మకములైన విష్ణు బ్రహ్మ రుద్రా త్మకములైన త్రిమూర్తులను కల్పించి, వానిచే జగత్తుయొక్క

స్థితి సంహారము లనెడు ప్రభుకృత్యములను జేయించు చున్నావు. ఇది సర్వవేదములయొక్క సారమని యుక్తి ప్రమాణములతో నిదివరకే సిద్ధాంతమై యున్నది. యథార్థ మిటు లుండగా ఈ రహస్యము నర యని బుద్ధిహీనులు కొందరు తమబోటి యవివేకులకు రంజనముగ నుండునట్లు అమంగళకర మగు, యుక్తిహీనము లగు ఆక్షేపముల గుప్పించుచు మోసపోవు చున్నారు. కాని నీవే జగత్కర్తవు. నీ యాదేశానుసారముగ జగచ్చక్రము తిరుగుచున్న దనుటయే ముమ్మాటికి సత్యము.

వి:—ఇందు చార్వాకుడు విమర్శింపబడినాడు. "చతుర్భూతములలో స్వాభావికముగ గలుగు చేష్టలవలన జగత్కార్యము తనంత తానే జరుగుచున్నది కాని వీనికి కర్తయగు నీశ్వరు డొకడు వేరుగా లేడు" అని ఇట్లు పామరజన మనోహరముగ (చారువాక్కులు) బల్కుచున్నాడు. కాని ప్రపంచమందలి ఒక కార్యమైనను కర్త లేకయే జరుగుచున్నట్లు నిరూపింపగలడా? ప్రయత్నము లేకయే అన్నపానాదులు ప్రాణికోట్లయొక్క నోటిలో తామే వచ్చి పడుచున్నవా? లేవు. కావున సర్వజ్ఞుడును, సర్వకర్తయును అగు శివుని మహిమ (ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తి)వలననే సర్వము చలించుచున్న దనుట తథ్యము. ఇట్టి గూఢ తత్త్వమును అధ్యాత్మజ్ఞానమువలన తెలియవలయునే గాని పామరుడు స్థూలముగ గనుగొనజాలడు. ॥౪॥

అవ—శివమహిమను సందేహించువారి వాదపద్ధతిని జూపుచున్నాడు.

> కిమీహః కింకాయః స ఖలు కిముపాయస్త్రిభువనం
> కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతి చ ।
> అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః
> కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతః॥౫॥

అర్థ:—సః=ఆ, ధాతా=కర్తయైన ఈశ్వరుడు, కిమీహః=ఏ యుద్యమముగలవాడై, కింకాయః=ఎవ్విధమైన శరీరముగలవాడై, కిముపాయః=ఎట్టి సాధనగలవాడై, కిమాధారః=ఏయాధారముగలవాడై కిముపాదానః=ఏ ముఖ్యమైన సామగ్రిగలవాడై, త్రిభువనంచ=ముల్లోకములను, సృజతి =పుట్టించుచున్నాడు, ఇతి=ఇట్లుగా, అతర్క్యైశ్వర్యే= ఊహాతీతమైన మహిమగల, త్వయి = నీయందు, అనవసరదుస్థః=వ్యర్థమై తుచ్ఛమైన, అయం=ఈ, కుతర్కః=దురూహ, జగతః=

జగముయొక్క, మోహాయ=భ్రాంతికొరకు, హతధియః=బుద్ధిహీనులై కాంశ్చిత్=కొందరను, ముఖరయతి=వదరుబోతుల గావించుచున్నది.

తా.—పరమేశ్వరుడు లోకత్రయమును సృజించుచున్నాడని శ లోకమున ప్రతీతి! అట్లగుచో ఒక కుండను కుమ్మరివాడు చేయు నన్న మట్టి, నీరు, చక్రము, బట్టపేలిక, కోల మున్నగు సామగ్రి నిలుచుట కాధారమును కావలసి వచ్చుచున్నది. అటులే ఈశ్వ చేయు చున్నా డనుచో "వాని కిది యేల కావలసివచ్చినది? అవు దేహమును ధరించును? ఏ యే సామగ్రి నుపయోగించును? ఏ స్థా ములు గలవు? ఎక్కడ నిలుచుండును? ఎట్లు చేయును?" మున్న నానావిధములైన యాక్షేపముల గుప్పించి ఈ దుర్వాదముతో లో లకు భ్రాంతిని గలుగజేయు చున్నారేకాని ఓ పరమేశ్వరా! నీవు ఘ టనఘటనాసమర్థుడ వనియును,నీ మహిమ నూహింపతరముగాదనియు సర్వజ్ఞుడ వనియును, సర్వకర్త వనియును జడమతు లెరుంగరని సిద్ధ తము. అట్టి యుక్తు లన్నియు కేవలము సారము లేని వని భావము

వి:—ఇందు తార్కికులు ప్రత్యుక్తులైనారు. పృథివ్యప్తేజోవాయువుల పరమాణువులు నిరంతర ముండుననియును, కుమ్మరివానివలె ఈశ్వరుడును పరమా వుల సాయమున విశ్వమును సృజించుననియును నైయాయికులు వాదింతురు ఇదియు వ్యర్థమే! అసలు మహాప్రళయమున నంతయు బయలైపోవును "సదేవాసీత్" "అసదేవాసీత్" అనుటవలన ఒకే పదార్థమే మిగులు యుక్తము. దీనినుండియే సర్వము గలుగుచున్న దనుటకు "యతో వా ఇమా మున్నగు శ్రుతులు ప్రమాణము. వేల కార్యములకు లోకమున వేల కారణ గన్పట్టినంత మాత్రమున లోకసృష్టికిని ఇన్ని కారణము లున్నవని భ్రమ జెంద సర్వమునకు కారణమైనట్టియు, తనకు కారణము లేనట్టియు పరమేశ్వరు డొక్క సులభముగ దెలిసికొని శ్రుతివిరుద్ధమైన భ్రాంతిని వీడి శాంతి నందరాదా? ఈశ్వ మనవలె శరీరము గలవాడన్నచో అనిత్యత వాటిల్లునని భయపడుటకంటె, సర్వసమర్థు డని ఒక్కమాటతో ధైర్యము చిక్కబట్టరాదా! యని ప్రబోధము

అవ:—ఇందు పరమేశ్వరుని జగజ్జనకత్వమును సూచించుచున్నాడు.

అజన్మానో లోకాః కిమవయవవంతోఽపి జగతా-
మధిష్ఠాతారం కిం భవవిధిరనాదృత్య భవతి।
అనీశో వా కుర్యాద్ భువనజననే కః పరికరో
యతో మందాస్త్వాం ప్రత్యమరవర సంశేరత ఇమే॥

అర్థము:-అమరవర=దేవశ్రేష్ఠుడవగు నో మహేశ్వరా! యతః= ఏ కారణమునవలన, ఇమే=ఈ,మందాః=మూఢులు, త్వాంప్రతి = నిన్ను గూర్చి, సంశేరతే=సందేహించు చున్నారో? (ఆ కారణము వలన) లోకాః=భువనములు, అవయవవంతోఽపి=వివిధములైన అంగములు కలవియైనను, అజన్మానః=పుట్టుకలేనివి, కిం=అవునా ? భవవిధిః=సృష్టి పద్ధతి, అధిష్ఠాతారం=కర్తను, అనాదృత్య=అపేక్షింపకయె, భవతి కిం=అగుచున్నదా ? వా=అథవా, అనీశః=జీవుడైనవాడైన, కుర్యాత్ = చేయగలడా ? భువనజననే = జగత్సృష్టియందు, కః=ఏ, పరికరః= సామగ్రి కలదు ?

తా. కొందరు ఈ జగము స్వభావసిద్ధముగ నున్నదేకాని దీని నెవరు పుట్టింప లేదని ఓ పరమేశ్వరా ! నీకర్తృత్వ విషయమున సందే హించుచున్నారు కాని, తమలో తామైనను విచారించు కొన్నట్లు తోచదు.జగత్తున స్థావరజంగమాత్మకములగు ననేకావయవములుకలవు. ఇవి పుట్టుచు గిట్టుచు నానారూపములు పొందుచున్నవి. వీనికి జన్మము లేదని అనుభవమునకు విరుద్ధముగ నెవరు చెప్పగలరు ? కర్త లేకయే సృష్టికార్యము జరుగుననుట పరిహాసాస్పదము కాదా? దేవుడు గాక ఒక జీవుడే సృష్టిజేయుచున్నాడందమా! వానికి మాత్రము సామగ్రి యేది? ఈ యద్భుతమైన వైవిధ్యము గల చతుర్దశ భువనములను అంత కంటె నద్భుతుడైన సర్వకర్త సృజించె ననవచ్చును గాని సామాన్యుడు సృజించెననుట బుద్ధిమాంద్యమే కాని సయుక్తికము కాదని భావము.

వి:—ఇందు ముఖ్యముగ మీమాంసకునిమీద కటాక్షము కలదు. జగము సత్యే మా మిథ్యయా ? యని ఒక చర్చ కలదు. జగము సత్యమనుటయే శైవుల కిష్టము. మీమాంసకునికిని ఇదియె యభీష్టము. కాని ఇరువుర విచారపద్ధతిలో గొప్ప భేదము కలదు. జగము స్వాయంభువమనియు, దాని చావు పుట్టుకలు, మారురూపములు, సహ జముగ స్వకర్మవలన గలుగునే కాని; దీని సంచాలనార్థము వేరొక కర్త లేడనియు నిరీశ్వర మీమాంసకమతము. జగము సత్యమనగా ప్రక్రియ ఇట్లు గాదు. సర్వకర్త యగు పరమేశ్వరుడే జగమునకు కర్త! పుట్టింప, పెంప, మార్ప, గిట్టింప, సూక్ష్మ ముగ తనలో నడగింప, గొప్పగఁ జూపింప సామర్థ్యము కలవాడే సర్వేశ్వరుడు. సర్వ మునకు సర్వవిధముల సర్వకాలము స్వామియగువాడె సర్వేశ్వరుడు. ఈశ్వరు నపేక్షిం పకయె జగమును, తదంతర్గతములగు భూతములును, ప్రాణికోటులును నిత్యములుగా,

వేని కవి స్వతంత్రములుగా నుండునని యంగీకరించుచో "ఒక్కఁడె దైవము" అ
వైదికాద్వైతసిద్ధాంతమునకు యుక్తిహీనముగ భంగము వాటిల్లుటయె కాక ద్వైత
త్రైత, వాదములను గూడ దాటి కోట్లసంఖ్యగల నిత్యపదార్థముల నంగీకరించి, 
యన్నియు స్వయంకర్తలు లేక ఈశ్వరులు అని చెప్పవలసివచ్చును. ఇది వెఱ్ఱి
కాని విజ్ఞానము కాజాలదు. జగము నిత్యమనగా దాని మూలతత్త్వము శక్తిరూపము
నెల్లకాలము ఈశ్వరనిష్ఠమై యుండు ననియు, దాని విజృంభణవినాశములు ఈశ్వరా
ధీనము లనియు ఎఱుంగవలెను. అంతియె కాని అది సృష్టి స్థితి లయములు లేక సదా
రూపముగా నుండుననుట పొరపాటు. నెమలి గ్రుడ్డును స్థూలముగ నవలోకించు
వారికి, నెమలికి తర్వాత నేర్పడు రంగురంగుల పింఛములు, ఈకలు కనుపించ
కాని; గ్రుడ్డులోని అవ్యక్తములైన వర్ణములే యుక్తకాలమున నట్లు మారెనని సూక్ష్మ
బుద్ధికి గోచరమే! మఱ్ఱి యంత పెద్దమ్రాను మిక్కిలి చిన్నదైన విత్తునుండి వచ్చి
కదా! లేని వస్తువు వెడలదు కదా! అటులే ఆదికాలమున శివునియందు సూక్ష్మశక్తి
రూపముగ నున్న జగదాదులు శివేచ్ఛ ననుసరించి వివిధరూపముల బొందుననిదే
సిద్ధాంతము. ఇట్టి మర్మము నరయని మందమతులు తమ యపసిద్ధాంతములవలన ఈశ్వర
సామర్థ్యవిషయమున సందేహపడుచున్నారే కాని భగవద్భక్తు లెన్నటికిని నమ్మదగిన
కాదు ॥ ౬॥

అవ:—ఈశ్వరు డొక్కఁడైనయెడల వివిధమతములు తమ తమ ఈశ్వర
స్వరూపమును వేరువేరుగా నేల చెప్పుచున్న వను నాక్షేపమును నిరసించుచున్నాడు.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ।
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥౭॥

అర్థము:—త్రయీ = వైదిక కర్మకాండమతము, సాంఖ్యం =
సాంఖ్యమతము, యోగః=యోగశాస్త్రము, పశుపతిమతం = పాశుప
తము, వైష్ణవం=వైష్ణవము, ఇతి=ఇట్లుగా, ప్రభిన్నే=వేర్వేరువిధము
నున్న, ప్రస్థానే=దర్శన (తత్త్వ) శాస్త్రమునందు, ఇదం=ఇది, పరం=
శ్రేష్ఠమైనది, చ=మరియు, అదః=అది, పథ్యం=హితకరమైనది, ఇతి=
ఇట్లు, రుచీనాం=అపేక్షలయొక్క, వైచిత్ర్యాత్=భిన్నతవలన, ఋజు
కుటిలనానాపథజుషాం = వంకరైనట్టియు చక్కనైనట్టియు వేర్వేరు
త్రోవల నడచుచున్న, నృణాం= జనులకు, త్వం=నీవు, ఏకః=ఒకడవే

పయసాం=జలములకు, అర్ణవఇవ=సముద్రమువలె, గమ్యః=పొందదగిన వాడవు, అసి=ఐ యున్నావు.

తా. యజ్ఞాదికర్మప్రతిధానమత మనియు, పంచవింశతి తత్త్వాత్మకమైన సాంఖ్యమత మనియు, హఠ రాజ లయాత్మక మగు యోగమత మనియు, పశుపాశుపతిరూపమగు పాశుపత మత మనియు, లక్ష్మీధవుడైన నారాయణుని కైంకర్యమును జెప్పు వైష్ణవమత మనియు, లోకమున భిన్న భిన్నములైన ఆత్మతత్త్వబోధకమతములు కలవు. దేనివారు దానిని ఉత్తమ మనుకొనుచున్నారు. ఇందు కొన్ని పెడత్రోవలును, సరళమార్గములును ఉన్నవి. ఎన్ని డొంక తిరుగుళ్ళు కలిగియున్నను, నదీనదములన్నియు ఒక సముద్రమునే చేరునట్లు తమ యభిరుచిభేదమువలన నరులు భిన్నములైన మతమార్గముల ననుసరించి నను, సద్భక్తు లగుచో వీ రందరికిని ఓ పరమేశ్వరా! నీ వొకడవే శరణ్యుడవు. ముమ్మాటికి అన్యము లేదు. వివిధములైన మతశాస్త్రము లున్నను, అది సాధకుని యధికారమును బట్టి తారతమ్యము బోధించు చున్నది కాని, ఈశ్వరులు భిన్నులు కారు, ఒకడే యని భావము.

వి:—త్రయీ యనగా ఋగ్యజుస్సామము (మూడువేదము) లని శబ్దార్థ మగు చున్నను అథర్వవేదమునుజేర్చి సామాన్యముగ చతుర్వేదము లనుకొనవలెను. ఈ వేదము మంత్రమనియు బ్రాహ్మణమనియు రెండువిధములు. ఇవి పెక్కుశాఖలలో విభక్తములైనవి. దీనియందు యజ్ఞాదులను సంబంధించిన విధి, అర్థవాదములు గలవనియు నిరంతరయాగానుష్ఠానమే మానవుని ముఖ్యకర్తవ్యమనియు, దీనివలననే అపూర్వము గల్గుననియు, నదియే పునరావృత్తిరహిత స్వర్గమును గలిగించుననియు, అదియే ముక్తి యనియు మీమాంసకుల మతము. ద్వాదశాధ్యాయములుగా జైమినిమహర్షి ప్రోక్తమగు వేదచర్చాశాస్త్రమునకు పూర్వమీమాంసాశాస్త్ర మని పేరు. త్రయీశబ్దముతో నిట్టి కర్మకాండవాదమే యిట ప్రస్తుతము. ఇట్టి విశేషార్థమునే ఇట గ్రహింపవలెను. లేని యెడల ఉత్తరమీమాంసారూపము లగు సాంఖ్య యోగ శైవవైష్ణవాది వైదిక మతముల కపఖ్యాతిగలుగును. విజ్ఞులైన తత్తత్సంప్రదాయాచార్యులును, నిర్మత్సరులైన సకల విద్వాంసులును, ఈమతము లన్నియు వైదికము లనియే సిద్ధాంతించి తెలిసికొని నారు. కొందరీమతములు అవైదికము లని వాకొనుచుందురు. అది యప్రామాణికము.

సాంఖ్యమనగా కపిలమహర్షిప్రోక్త షడధ్యాయీశాస్త్రము. అవ్యక్త బుద్ధి అహంకార శబ్ద స్పర్శ రూప రస గంధ త్వక్ చక్షుస్ శ్రోత్ర జిహ్వా ఘ్రాణ వాక్ పాణి పాద పాయు ఉపస్థ మనస్ పృథివీ జల తేజో వాయు ఆకాశ పురుషు లనెడు

పంచవింశతి తత్త్వాత్మక మగు ప్రకృతిపురుషుల రహస్యజ్ఞానము వలన త్రివిధ దుఃఖము లడగుటయే ముక్తి. ఇదియే సాంఖ్యమతము.

పతంజలి మహర్షిచేత నాల్గుపాదములుగా నిరచింపబడినది యోగశాస్త్రము. ఇందు చిత్తవృత్తి నిరోధాత్మకములగు సాధనములును, సవికల్ప నిర్వికల్పసమాధులును, యమనియమాది యోగాంగములును, కైవల్యప్రాప్తియును నిరూపింపబడినవి. విజాతీయములైన భ్రాంతులను నిరోధించుటతో నిదిధ్యాసనము సిద్ధించినపిదప సహజముగ ముక్తుడగునని యీ శాస్త్రము చెప్పుచున్నది.

పాశుపతమతమును ఒకవిధముగ యోగశాస్త్రమే! ఇది యైదధ్యాయములుగ శివునిచే విభజింపబడియున్నది. అవి కార్య కారణ యోగ విధి దుఃఖాంతములు. కార్యమగు జీవుడె పశువు. కారణమగు పతి యీశ్వరుడు. యోగము పశుపతియందు చిత్తసమాధి. భస్మస్నానలింగధారణాదులు విధి. శివజీవైక్యమే మోక్షమను దుఃఖాంతము. ఈ మతమునను గల శైవ వీరశైవ ఆదిశైవ మిశ్రశైవాదు లను పెక్కుశాఖలు శివాగమాదులలో నెరుంగునది.

నారదపాంచరాత్రాది వాఙ్మయము వైష్ణవశాస్త్ర మనబడును. ఇందు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధము లను నాల్గు పదార్థములు నిరూపింపబడినవి. కారణపురుషుడు వాసుదేవుడు, జీవుడు సంకర్షణుడు, మనస్సు ప్రద్యుమ్నుడు, అహంకారమె అనిరుద్ధుడు. ఇవి క్రమముగ నొకదానికొకటి పుట్టిన భగవదంశములు. మనోవాక్కాయకర్మముల వాసుదేవు నారాధించిన ముక్తుడగును. వైష్ణవమునను వైవిధ్యముకలదు.

ఇట్లు మతములు నానావిధములుగ నున్నను సముద్రమునుండి పైకెగసిన తరంగసమూహము మరల సందర్భమున నిలీనమగునట్లు ఏతన్మతానుయాయు లందరును చివరకు నీ యందే లయమందుచున్నారని పుష్పదంతాచార్యుని యమోఘవచనము. అనగా భిన్నభిన్నమార్గములను బోధించు తత్త్వశాస్త్రములకు పరమేశ్వరు డొక్కడే కారణ మనియును, వివిధరుచులుగల వ్యక్తుల నుద్ధరించుటకై యిట్టి తరతమభేదములు కల్పితము లనియును తెలియుట లెస్స॥ ౭॥

అవ:—భూలోకమున విష్ణువును, స్వర్గమున ఇంద్రుడును అధిపతులైయుండ శివున కీశ్వరత్వ మెట్లు చెల్లుననగా సమాధానము చెప్పుచున్నాడు.

మహోక్షః ఖట్వాంగం పరశు రజినం భస్మ ఫణినః
కపాలం చేతీయ త్తవ వరద తంత్రోపకరణం।
సురాస్తాం తామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
నహి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి ॥౮॥

అర్థము:— వరద = కామితఫలదా! మహోక్షః = వృద్ధవృష భము, ఖట్వాంగం=మంచపుకోడు, (ఇది యొక యాయుధము) పరశుః= గండ్రిగొడ్డలి, అజినం=చర్మము, భస్మ=విభూతి, ఫణినః=సర్పములు, చ=మరియు, కపాలం=బ్రహ్మశిరస్సు (పుఱ్ఱె), ఇతి=ఇట్లు, తవ=నీకు, తంత్రోపకరణం=పరిధానసామగ్రి, ఇయత్=ఇంతియే! తు=అయితే, సురాః=దేవతలు, భవద్భ్రూ ప్రణిహితాం=నీయొక్క కనుబొమలచే అనుగ్రహింపబడిన, తాం తాం=ఆ యా ఇంద్రత్వాది, ఋద్ధిం=సంప త్తును (పదవిని), దధతి=పొందుచున్నారు, స్వాత్మారామం=తన యాత్మ యందే రమించు పరమేశ్వరుని, విషయ మృగతృష్ణా=విషయాభిలాష యనెడు ఎండమావి, న భ్రమయతి హి=చలింపజేయదు కదా!

తా. భక్తులకు ఇష్టార్థముల ననుగ్రహించు ఓ మహేశ్వరా! నిన్ను చిరకాల తపస్సుచేత నుపాసించి, నీ భృత్యులైన ఇంద్రాదులకు నీ కటాక్షమాత్రమున స్వర్గాధిపత్యము మున్నగు మహాపదవులు లభించి యున్నవి. ఇట్టి మహామహులకు ఈశ్వరుడ వగు నీ సాన్నిధ్యమునం దన్ననో ముసలియెద్దు, మంచపుకోడు, గండ్రిగొడ్డలి, ఏనుగుతోలు, బూడిద, పాములు, పుఱ్ఱెలు అనునవియే సాధనసంపత్తి. విచారించి చూడగా ఆత్మానందఘనుడైన మహానుభావుని, నశ్వరమైన విషయ భోగరూప మైనట్టి ఎండమావులు చలింపఁ జేయ జాలవుగదా! అనగా భృత్యులకు సకలైశ్వర్యముల నిచ్చు శివునియొద్ద అట్టిభోగభాగ్యములు రాశిరూపముగా మన స్థూలదృష్టికి గనుపించనందున విపరీతబుద్ధులు దరిద్రునిగా భావించినచో నది ప్రమాదమనియును, శివుడు శాశ్వత మగు చిదానందముతో నిండియున్నాడనియును, నిత్యతృప్తుడనియును తరుగని సంపదలను కనుసన్నలచే సృష్టింప గలుగువానికి వానియందు వ్యామోహము కలుగ జాలదనియును భావము.

ని:—మంచపు కోడువలెనుండు ఆయుధమును శివుడు ధరించుచునట్లు పురాణగాథ కలదు. ఎండమావులు దూరముగానుండి చూచువారికి నీటివలె గాన్పించును. దప్పి గొన్నవాడు దానివలన తృప్తినంద దలచునేని అది నిష్ఫలమగును. అందు నీరు లేనే లేదు. భ్రాంతులైనవారికి మాత్రమే అది నీటివలె దోచుచుండును.అటులే ఇంద్రియ వశులైన పామరులకు విషయవాసనలచే ...

ఆనందము లేదనుటయే తత్త్వము. దీని నరసియే శివుడు స్వర్గాధిపత్యాదుల నంద, పూల పట్టుబట్టల దాల్పక, రూకలమూట (లక్ష్మి) నెదలో నిడుకొనక విసర్జి నిత్యతృప్తుడైనాడు. వృష భారోహణము; చతుష్పాదధర్మాధిపత్యమును, ఖట్వాంగపరశు త్రిశూలములు; దుష్టనిగ్రహమును, గజచర్మాదులు; విషయసుఖరాహిత్యమును, సర్పధారణాదులు; లోకానుగ్రహమును; గంగాగ్నిధారణము; జగద్వశీకరత్వమును కపాలభస్మాదులు; సర్వసంగపరిత్యాగమును సూచింపుచున్నవని రహస్యము నెరుంగ నది. ఇట్టి మహాలక్షణములు శివునకుమాత్రమే స్వాధీనములు. శివుడే సర్వేశ్వరుడు.

అవ:—జగత్తు స్వయంభువమనియు, శాశ్వతమనియు జెప్పువారి యెడ ఈశ్వరుడు కర్త యను నీ వాద మెందులకనినను; లేక జగత్తుయొక్కయు, ఈశ్వ రునియొక్కయు తత్త్వముల నిర్ణయించుటకు పలువిధములైన శాస్త్రము లుండగా నీవేమి క్రొత్తగా నిర్ణయించెద వన్నను సమాధానము చెప్పుచున్నాడు.

ధ్రువం కశ్చిత్ సర్వం సకలమపరస్త్వధ్రువమిదం
పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే।
సమస్తేఽప్యేతస్మిన్ పురమథన తైర్విస్మిత ఇవ
స్తువన్ జిహ్రేమి త్వా న ఖలు నను ధృష్టా ముఖరతా॥

అర్థము:—పురమథన=ఓ త్రిపురసంహారకా! కశ్చిత్=ఒకా నొకడు, సకలం=సమస్తమైన, ఇదం=ఈ కనుపడుచున్న, జగత్= స్థావరజంగమాత్మకమైన విశ్వమును, ధ్రువం=నిత్యమైన దానినిగాను, అపరః=మరియొకడు, అధ్రువం=అనిత్యమైన దానినిగాను, పరస్తు= వేరొకడును, సమస్తేఽపి=సకలమైనట్టి, ఏతస్మిన్=ఈ, జగతి=జగత్తు నందు, ధ్రౌవ్యాధ్రౌవ్యే = నిత్యానిత్యత్వములను, వ్యస్తవిషయే= వేరువేరుగా నియతములైన వానినిగాను, గదతి=చెప్పుచున్నాడు, తైః=ఇట్టివారిచేత, త్వా=నిన్ను, స్తువన్ = పొగడుచున్నటువంటి అహం=నేను, విస్మిత ఇవ=పరిహసింప బడినవానివలె నున్నను, జిహ్రేమి=సిగ్గుపడుట లేదు, నను=అయితే, ముఖరతా=వాచాలత్వము ధృష్టాఖలు=దిట్టమైనది కదా !

తా. ఓ పరమేశ్వరా! భాట్టమతీయు లీ జగమును నిత్యమని యును బౌద్ధాదులు క్షణికమనియును, జైనులు నిత్యానిత్యమనియును

ఈశ్వరునితో సంబంధము లేదనియును మిక్కిలి చర్చించి విస్తారముగ కోలాహలము గావింపుచుండ నిన్ను జగత్కర్తనుగా స్తుతించు నట్టి యల్పజ్ఞుఁడనగు నేను పరిహాసపాత్రుఁడ నగుచున్నాను. ఇట్లని, (నా వాదము ప్రౌఢము కాదని) సిగ్గుపడ యూరకుండను. ఎవరి ప్రాగల్భ్య మైనను ధైర్యముతో కూడియుండును కదా! అనగా జైనబౌద్ధభాట్టమత ప్రవర్తకులును శ్రుతులకు కొన్నిచోట్ల సామంజస్యమును చెప్పలేక తమ ప్రాగల్భ్యముతో జగద్విషయమున భిన్నభిన్న మతములను విస్తరింపగా నీ భక్తుడను, నీచే జెప్పబడిన వేదాగమములలో ఆస్తిక్యబుద్ధి గల వాడను అగు నేనుమాత్రము కవిత్వము నల్లి సిగ్గుపడుట యెందులకా యని భావము.

వి. మీమాంసాశాస్త్రమున కుమారిలభట్టుని సిద్ధాంతమునకు భాట్టమనియును, ప్రభాకరుని వాదమునకు ప్రాభాకరమనియును పేర్లు కలవు. ప్రభాకరుడు కుమారిలు నకు శిష్యుడైనను ఉభయులకు భిన్నమతము లేర్పడెను. కుమారిలుఁడు గురువు కావున గురుమతమనియును భాట్టమతమునకు మారుపేరు గల్గెను. ఇందు జగత్తు ప్రవాహరూప ముగా నిత్య మని సిద్ధాంతముకలదు. బౌద్ధులు సర్వమును క్షణికమనియును, శూన్య మనియును జెప్పుదురు. జైనులు స్యాద్వాదులు. అనగా "జగత్తు నిత్యముకూడ కావ చ్చును, అనిత్యమును కావచ్చును" అను వాదమును గలిగియున్నారు. (ఇందు ఆకా శాదిపంచకము నిత్యము. ఘటపటాదులు అనిత్యములు) ఈ శ్లోకమున "ధృష్టా-అముఖ రతా" అని పదచ్ఛేదము చేసినపుడు భాట్టాదిమతములు కేవలము ప్రాగల్భ్యమును పురస్కరించుకొనియున్నవి కావున శ్రుతిప్రతిపాదితమైన పుష్పదంతుని వాదమును వివరింప సిగ్గుపడ నవసరము లేదనియును భావాంతరము. ॥౯॥

అవ:—సృష్టికర్తయైన బ్రహ్మయును, రక్షణకర్త యైన విష్ణువును సర్వోత్తమ దేవతలైయుండ శివునకే సర్వేశ్వరత్వము జెప్పనేల యనిన నిరూపించుచున్నాడు.

> తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించో హరి రధః
> పరిచ్ఛేత్తుం యాతావనల మనలస్కంధవపుషః।
> తతో భక్తిశ్రద్ధాభరగురు గృణద్భ్యాం గిరిశ యత్
> స్వయం తస్థే తాభ్యాం తవ కిమనువృత్తి ర్న ఫలతి ॥౧౦॥

అర్థము:—గిరిశ = ఓ కైలాసనిలయా! అనలస్కంధవపుషః = అగ్ని (జ్యోతిస్) స్తంభాకారశరీరము గలిగినట్టి, తవ = నీ యొక్క

ఐశ్వర్యం=స్వరూపమును, యత్నాత్=ప్రయత్నమువలన, పరిచ్ఛేత్తుం=
ఇట్టిదని నిశ్చయించుటకు, విరించః=బ్రహ్మదేవుడు, ఉపరి= మీదికిని
హరిః=విష్ణువు, అధః=క్రిందికిని, యాతౌ=వెళ్ళినవారై, యత్ =ఎం
వలన, అనలం=అసమర్థులైరో, తతః=పిమ్మట, భక్తిశ్రద్ధాభరగు
గృణద్భ్యాం=భక్తిశ్రద్ధలయొక్క నిరతిశయాధిక్యముప్పతిల్లునట్లు స్తో
మొనర్చునట్టి, తాభ్యాం=ఆ బ్రహ్మ విష్ణువులకు, స్వయం=నీవు, త
ప్రత్యక్షుడవైతివి, తవ=నీ యొక్క, అనువృత్తిః = అనుసరణము,
ఫలతి=ఫలించదా, కిం=ఏమి ?

తా. ఓ కైలాసవాసా! ఒకమారు హరిబ్రహ్మలు నీ సమ
స్వరూపముయొక్క ఆద్యంతములను దెలియదలచి, హరి వరాహరూ
ముతో పాతాళమునకును, బ్రహ్మ హంసరూపముతో ఆకాశము
వైపును చిరకాలమువరకు ప్రయత్నపూర్వకముగ ప్రయాణించినను
(స్తంభాకారమైన) జ్యోతిర్లింగస్వరూపముతో భూనభోంతరాళములను
అఖండముగ వ్యాపించియున్నట్టి నీ యాద్యంతముల గనుగొనజాలరైరి
మరల నీవు భక్తిగమ్యుడవని తెలిసి భక్త్యతిశయముతో అహంకా
రహితులై నిను ప్రార్థింప నా హరిబ్రహ్మలకు ప్రసన్నుడవై రక్షి
చితివి. అనగా బ్రహ్మాదులు నీ యధీనులే కాని స్వతంత్రులు కార
యర్థము. దీనివలన నీ భక్తి యమోఘమనియును, తప్పక ఫలించు
ననియును తేలుచున్నది. కావున అటులే ఈ భక్తిపూర్వకమైన స్తో
మునకు మెచ్చి నీ యైశ్వర్యమును నాకు దర్శింపజేసి ధన్యుని గావిం
మని సారము.

వి. ఒకప్పుడు సృష్టి గొప్పదా రక్షణ గొప్పదా యను వాదము చెలరేగి వి
బ్రహ్మలు "నేనేగొప్ప నేనేగొప్ప" యని కలహించుకొని అస్త్రములతో యుద్ధ
చేయసాగిరి. దీనివలన భువనములకు విపత్తు సంభవించెను. అపుడు "మూర్ఖుల
ఓ విష్ణుబ్రహ్మలారా! మీ యిరువురికంటె నధికమగువస్తువు ఇట నుద్భవించు
దాని పాదములనో మస్తకమునో మీలో నెవరు కన్గొనిన వా రధికు" లని ఆకా
వాణి యయ్యెను. అంత నట ఆకాశపాతాళముల వ్యాపించి స్తంభాకారముగ నుద్భ
వించిన మహాజ్యోతిర్లింగముయొక్క పాదదర్శనమునకై విష్ణువు వరాహరూప
తోడను, శిరోదర్శనమునకై బ్రహ్మ హంసరూపముతోడను చిర కాలము ప్రయాణిం

శానక గర్వము వీడి భక్తితో ప్రార్థింప శివుడు ప్రసన్నుడై వివేకము ననుగ్రహించి మరల స్వస్వ కార్యములందు నియోగించెను. భక్తానుగ్రహార్థమై మరల ఈ మహాలింగమే ఆలయములలో స్థాపింపబడు చిన్న స్తంభాకారపు లింగముగాను, వీరశైవులు ధరించు అంగుష్ఠాకారమగు ప్రాణలింగముగాను రూపముల ధరించెనని యెరుగునది. ఈ ఐతిహ్యము స్కాందశివపురాణ శివరహస్యాదులలో సుప్రసిద్ధమై యున్నది. ॥౧౦॥

అవ:––శివునియందు స్థిరభక్తిగలవానికి నెద్దియు అసాధ్యము కాదని నిరూపించుచున్నాడు.

> అయత్నాదాపాద్య త్రిభువనమవైరివ్యతికరం
> దశాస్యో యద్బాహూనభృత రణకండూపరవశాన్।
> శిరఃపద్మశ్రేణీరచితచరణాంభోరుహబలేః
> స్థిరాయా స్త్వద్భక్తేస్త్రిపురహర విస్ఫూర్జితమిదం ॥౧౧॥

అర్థము:–– త్రిపురహర=త్రిపురసంహారకా! దశాస్యః=రావణుడు, అయత్నాత్=అనాయాసముగా, త్రిభువనం=మూడులోకములను, అవైరివ్యతికరం = శత్రువుల సంబంధములేని వానినిగా, ఆపాద్య=పొంది, రణకండూపరవశాన్=యుద్ధపు తీటచేత రేగిన, బాహూన్=భుజములను, యత్=ఎందువలన, అభృత = ధరించెనో, తత్=ఈ ధారణసామర్థ్యము, శిరః పద్మశ్రేణీ రచిత చరణాంభోరుహబలేః=శిరములనెడి పద్మముల పంక్తిచేత చేయబడిన నీ పాదము లనెడు కమలములయొక్క అర్చన గల, భక్తేః=భక్తియొక్క, విస్ఫూర్జితం=విజృంభణము.

తా. పరమేశ్వరా! రావణుడు నీయందు అత్యధికభక్తి గలిగియుండుటే కాక; తన పదితలలనుగూడ నరకి, నీ పాదసన్నిధి నర్పించి, వరముల నందికొని అనాయాసముగ ముల్లోకముల కధిపతియై పాలించెను. వానితో బోరి గెలువగల శత్రువొకడైనను లేకుండెను. అందువలన రావణుడు వినోదముగ యుద్ధమొనర్చుట (తన బాహువుల తీట దీర్చుకొనుట) కైనను అవకాశము లభింపదయ్యె. ఇట్టిమహైశ్వర్యమును నిష్కంటకజీవితమును నీ యనుగ్రహమువలన లభించినదే కాని వేరు కారణము లేదు.

వి. గోకర్ణ మాహాత్మ్యమను పుస్తకమందును, లింగపురాణమునందును ఈ క్రింది కథ కలదు. రావణాసురుడు గోకర్ణేశ్వరుని పూజించుచు, భక్త్యుద్రేకమువలన

తన తొమ్మిది శిరస్సులనుగూడ ఛేదించి తనముందున్న అగ్నికుండమున హోమమొనర్చి శివార్పిత మనుచు పదవతలను సైతము కత్తిరింపబోగా శివుడు ప్రసన్నుడయ్యెను. అం సంతోషసంభ్రమములు పురిగొన, రావణుడు దేవదానవ గంధర్వాదులవలన లే మరణము లేకుండునట్లు వరమును పొందెను. (ఈ సందర్భమున మానవులను, వానరుల సామాన్యులుగా దలచి వదలెను) తరువాత దేవతలను జయించి త్రిలోక నాథుడయ్యె శివుడే సర్వాధికుడు కావున అపుడు విష్ణు బ్రహ్మేంద్రాదులును శివభక్తునితో డీ జాల రైరని భావము. ॥౧౧॥

అవ:—ఇట భక్తుడైనను పరమేశ్వర తిరస్కారమువలన విపత్తు నందున చెప్పుచున్నాడు.

> అముష్య త్వత్సేవాసమధిగతసారం భుజవనం
>
> బలాత్కైలాసేఽపి త్వదధివసతౌ విక్రమయతః।
>
> అలభ్యా పాతాలేఽప్యలసచలితాంగుష్ఠశిరసి
>
> ప్రతిష్ఠా త్వయ్యాసీద్ధ్రువముపచితో ముహ్యతి ఖలః ॥౧౨॥

అర్థము:—— త్వత్సేవా సమధిగతసారం=నీసేవచేత పొందబడి శక్తిగలిగినట్టి, భుజవనం=బాహుసమూహమునుగూర్చి, త్వదధివసతౌ= నీ నివాసస్థానమైన, కైలాసేఽపి=కైలాసమునందును, బలాత్ =బల త్కారముగా, విక్రమయతః = పౌరుషము జూపింప నుద్యుక్తుడైన, అముష్య=ఈ రావణునికి, త్వయి=నీవు, అలసచలితాంగుష్ఠశిరసి = మెల్లన కదలింపబడిన కాలి పెద్దవ్రేలియొక్క కొన గలవాడవు కాగ, పాతాలేఽపి = పాతాళమునందును, ప్రతిష్ఠా=స్థితి, అలభ్యా=దుర్ల మైనట్టిది, ఆసీత్ =ఆయెను, ఉపచితః = ఔన్నత్యమునందిన, ఖలః = దుష్టుడు, ముహ్యతి=వివేకహీను డగుచున్నాడు.

తా. ఈ రావణుడు నీ యనుగ్రహమువలననే పొందిన బాహ బలమును నీ నిలయమగు కైలాసముమీదనే ప్రయోగింప దలచినపు నీవు కాలి పెద్దవ్రేలిని మాత్రమే కదలించి యణచితి, అంత రావణు పాతాళమున సైతము నిలుకడ దొరకక అధఃపతితుడయ్యెను. దుష్టు గొప్పదనమును సంరక్షించుకొనజాలక వివేకరహితుడై పతితు డగు చున్నాడు గదా! ఎట్టివాడైనను నీ తిరస్కారమువలన దుర్గతి నందును భావము.

వి. శివపురాణమునను వాల్మీకి రామాయణమునను (ఉ. కా. ౧౬.) ఈ క్రింది కథ కలదు. రావణుడు సర్వలోక విజయయాత్రకై విమానమున ప్రయాణించుచుండ మధ్యమున కైలాసపర్వత శిఖర మడ్డు దవిలెను. ఏలయని ప్రశ్నింప, సారథి శివోల్లం ఘనమే ఇందుకు కారణ మని నుడివెను. అంత రావణుడు "శివు డెంతటివాడు? కైలాసమునే పెరికివైతు"నని తన దశబాహువులతో కైలాసమును పెళ్ళగింప నారం భించెను. శివుడు తన కాలివ్రేలితో నణచగా చేతులు దానిక్రింద ఇరుకుకొని, రావ ణుడు పాతాళమున బడి, శివుని కరుణకొరకు సామవేదముతో స్తుతించె నని వైతి హ్యము గలదు. రావణుడు శివునివలననే వరము నంది; శివునే తిరస్కరింప బూనుట పాపహేతువనియును, ఇటులే కొంద రసురులు శివానుగ్రహమును నిల్పుకొనజాలక ఇడుముల బడిరనియును, శివభక్తి గలవారు సైతము కర్తవ్యాకర్తవ్యముల నెరుంగ వలయు ననియును దెలియునది ॥౧౨॥

అవ:—శివభక్తియే బాణాసురుని త్రిభువనాధిపత్యమునకు కారణమనుటను జెప్పుచున్నాడు.

> యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపి సతీ-
>
> మధశ్చక్రే బాణః పరిజనవిధేయత్రిభువనః।
>
> న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయో-
>
> ర్న కస్యా యున్నత్యై భవతి శిరసస్త్వయ్యవనతిః ॥౧౩॥

అర్థ:—వరద=భక్తాభీష్టప్రదాయకా! పరిజనవిధేయత్రిభువనః= సేవకులవలె వినీతముగా జేయబడిన త్రిలోకములు గలిగినట్టి, బాణః= బాణాసురుడు, సుత్రామ్ణః = ఇంద్రునియొక్క, పరమోచ్చైస్సతీం = మిక్కిలి యభ్యున్నతినందిన, ఋద్ధిమపి=సంపత్తునుగూడ, యత్ =ఎందు వలన, అధశ్చక్రే=తిరస్కరించెనో, తత్ =అది, త్వచ్చరణయోః=నీ పాదములయొక్క, తస్మిన్=ఆ, వరివసితరి=భక్తునియందు, న చిత్రం= ఆశ్చర్యకరము గాదు, త్వయి=నీ విషయమై, శిరసః = శిరస్సుయొక్క అవనతిః=వంచుట, కస్యై=ఏ, ఉన్నత్యై = సమృద్ధికొరకు, న భవతి= కాదు?

తా. అనుగ్రాహకుడవగు నో యీశ్వరా! బాణుడు ముల్లోకము లను సేవకులవలె స్వాధీనపరచుకొని స్వర్గాధిపతియగు నింద్రుని మహై శ్వర్యమునుగూడ లెక్కసేయక సుఖమైయుండెననుట సుప్రసిద్ధమే! కాని నీ యనన్యోపాసకుడగు ఆ బాణునియందు ఈ త్రిభువనాధిపత్య

ప్రాప్తి యద్భుతమైన విషయమేమియు కాదు. నిను గొల్చినవాని
ఐశ్వర్యము లభింపకుండునా? (నిను మ్రొక్కవలయునే కాని చిక్కనిదేమి)

వి. కుమారస్వామియొక్క అద్భుతమైన పరాక్రమమును గాంచి, బాణుడు తానును శివపుత్రుడు గావలె నని కోరి, యుగ్రమైన తప మాచరింపగా శివుడు ప్రసన్నుడై అటులే బాణుని తన పుత్రునిగా స్వీకరించెను. పిమ్మట బాణుడు పరాక్రమించి యింద్రాదుల జయించె నను పూర్వగాథ (హరివంశ. ౨-౧౧౬) ఇట ప్రస్తుతము. త్రిభువనాధిపత్యమని పేరే కాని కైలాసమునకును ప్రభువై శివునిగూడ నేలినాడా! యను ప్రశ్న మనకు శివుడు బాణుని యింట కావలి గాచె నను కథను గూడ సమాధానముగా జెప్ప నగును. ॥౧౩॥

అవ:— శివుని యాపద్బాంధవ్యము కొనియాడ బడుచున్నది.

అకాండబ్రహ్మాండక్షయచకితదేవాసురకృపా-
విధేయస్యాసీద్య స్త్రినయన విషం సంహృతవతః
స కల్మాషః కంఠే న తవ కురుతే న శ్రియమహో
వికారోఽపి శ్లాఘ్యో భువనభయభంగవ్యసనినః ॥౧౪॥

అర్థ:—త్రినయన = ఓ ముక్కంటీ! అకాండ బ్రహ్మాండ క్షయ చకిత దేవాసుర కృపా విధేయస్య = అకాలమునందు (గానున్న) బ్రహ్మాండముయొక్క నాశముచేత భీతులైన దేవ దానవులయందు గల కృపవలన వశుడవైనట్టియు, విషం = కాలకూటమును, సంహృతవతః = పానమొనర్చి నట్టియు, తవ = నీయొక్క, కంఠే = కంఠమునందు, యః = ఏ, కల్మాషః = నలుపు, ఆసీత్ = అయ్యెనో, సః = అది, శ్రియం = శోభను, న కురుతే న = కలిగించలేదని కాదు, అహో = ఆశ్చర్యము! భువన భయ భంగ వ్యసనినః = లోకముల భయముయొక్క నాశమునందు ఆసక్తి గలవానికి, వికారోఽపి = వికారమైనను, శ్లాఘ్యః = ప్రశస్తమైనదియ.

తా. ఓ విరూపాక్షా! అకస్మాత్తుగ బుట్టిన హాలాహలము యొక్క ఉగ్రమైన జ్వాలలకు జగములు మాడి మహాప్రళయ మగునని భయమంది, నిను శరణాగతులైన దేవదానవులను కరుణించి, విషము మెక్కి కుత్తుకను నల్లబడ జేసికొంటివి. అదియు నొక యలంకారము వలె కాంతి నీనుచున్నది. లోకరక్షణకు గడంగినవానికి వికారము సైతము అలంకారముగా నుండును కదా!

వి. వీరమాహేశ్వరుడైన దూర్వాసుని కోపమునకు గురియైన ఇంద్రుని సకలైశ్వర్యము సముద్రముపాలయ్యెను. ఇంద్రుడు శివునిగూర్చి తపింప క్షీర సముద్రమును మథించిన నీ సంపత్తు లభించు నని శివు డానతిచ్చెను. అంత నింద్రుండు దేవదానవుల సహాయముతో మందరగిరిని కవ్వముగాను, ఆదిశేషుని పగ్గముగాను, ఒనర్చి సముద్ర మథనము నారంభింపగా, ఉగ్రమైన మహాజ్వాలలు గల విష ముద్భవించెను. అంత విష్ణు బ్రహ్మేంద్రాదులు పలాయనమును చిత్తగించి, శివుని జేరి "మహాదేవా! మొదటబుట్టిన వస్తువు నీ కర్పిత మన నందున మహాపరాధమైన"దని వివిధముగ ప్రార్థింపగా; కృపాసాగరుడైన శివుడు వారి కభయప్రదాన మొనర్చి, యా భయంకరమైన విషమును అరచేత నిడుకొని మ్రింగి, కంఠమున ధరించి తదాదిగ నీలకంఠు డయ్యెనని పురాణగాథ (భాగవ. ౮–౭) (విష్ణు. ౧–౯) కలదు. ఆ నలుపు గూడ శివుని తెల్లని కంఠమున శోభిల్లె నని భావము ॥౧౪॥.

అవ:—శివుని జితేంద్రియత్వమును, మన్మథపరాభవమును జెప్పు చున్నాడు.

అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే
నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః।
స పశ్యన్నీశ త్వామితరసురసాధారణమభూత్
స్మరః స్మర్తవ్యాత్మా నహి వశిషు పథ్యః పరిభవః ॥౧౫॥

అర్థ:—ఈశ=ప్రభూ! నిత్యం=ఎల్లపుడు, జయినః=జయశీలురైన, యస్య=ఏ మన్మథునియొక్క, విశిఖాః=బాణములు, సదేవాసురనరే=దేవదానవమానవులతో గూడియున్న, జగతి = విశ్వమునందు, క్వచిదపి=ఒకప్పుడైనను, అసిద్ధార్థాః=ఫలింపని ప్రయోజనముగలవియై, నైవ నివర్తంతే=వెనుకకు మరలవో, సః=అట్టి, స్మరః = మన్మథుడు, త్వాం=నిన్ను, ఇతర సురసాధారణం = అన్య దేవతలకు సమానముగా, పశ్యన్=చూచువాడై, స్మర్తవ్యాత్మా=స్మరింపదగిన శరీరముగలవాడు, అభూత్ =అయ్యెను. హి=ఇదియుక్తమే! వశిషు=ఇంద్రియ వశముగల మహనీయులందు, పరిభవః=తిరస్కారము, న పథ్యః=హితకరముగాదు.

తా. జగన్నియామకా! సదా జయశీలుడైన మన్మథుని బాణములు, ఒకనాడైనను నిష్ఫలత నందియున్నట్లు వినియుండలేదు. ఆ బాణములకు దేవతలు, రాక్షసులు, మానవులు అందరును గురియై పడిపోయిరి. ఈ మన్మథుడు తన పూర్వానుభవమునుబట్టి నిన్నును ఇతరదేవతలవలె భావించి, తన బాణముల నీ మీద ప్రయోగించి,

తానే స్మరించుటకు మాత్రమే పనికివచ్చు శరీరముగలవాడై (భస్మీ
భూతుడై) తనకు గల "స్మర"నామమును సార్థకపరచుకొనెను. ("స్మ
తే జనైః" జనులచే దలపబడువాడు కావున స్మరుడు అని పే రన్వ
మయ్యెనని భావము) మహిమాది సిద్ధులు గలవారియందు అపచార
లొనర్చుచో అవి ఆత్మవినాశహేతువు లగుటదప్ప మహాత్మ్య
చలింపరుగదా !

౨. దేవతలు తారకాసురుని బాధల కోర్వలేక; శివునిపుత్రుడే వీని సం
రింప అర్హుడని నిశ్చయించి, తపస్వియై హేమకూటమున నున్న శివునిపై బా
ప్రయోగముతో కామోన్ముఖుని గావింపుమని మన్మథుని నియోగించిరి. అ
మన్మథుడు, దేవతల కిచ్చిన వాగ్దానమును విడువ నొల్లక, పార్వతీ సహాయమ
ఆశ్రమమున ప్రవేశించి శివునిమీద బాణప్రయోగము గావించెను. శివుడు
సమాధిభంగమువలన ప్రలయకాలరుద్రుడై అగ్ని నేత్రముయొక్క జ్వాలలో
నెదురుగా నున్న కాముని గాల్చివైచెను. అంత రతిదేవి మొరకు "నేను తపస్సో
శివుని యర్ధాంగినినై కామునికి ప్రాణదానము సేయింతు"నని పార్వతి ప్రతిన బూ
యటులే శివునిగూర్చి ఘోరతప మాచరింపగా శివుడు "రతివిషయమున సదే
డయ్యెను, లోకమున అనంగుడయ్యెను ఉండుగాక" యని కాము ననుగ్రహించె
ఇది ప్రాచీన గాథ (మత్స్య. ౧౩౦ - ౧౩౯. పద్మ. స్కా. ర.౨: శివ. సతీ) ॥౧

అవ:—మహాదేవుని మహాకారమును తాండవలీలాముఖమున
చున్నాడు.

మహీ పాదాఘాతాద్ వ్రజతి సహసా సంశయపదం
పదం విష్ణోర్భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్రహగణం।
ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడితతటా
జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా ॥౧౯

అర్థ:—జగద్రక్షాయై = లోకముల రక్షణకొరకు, త్వం=నీ
నటసి=నృత్యము చేయుచున్నావో (అపుడు) మహీ=పృథ్వి, పా
ఘాతాత్ = చరణములయొక్క వేటువలన, సహసా = శీఘ్రము
(ఒక్కుమ్మడిని) సంశయపదం=సందేహాస్పదమును, వ్రజతి = పొం
చున్నది. విష్ణోఃపదం = ఆకాశము, భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్ర
గణం=తిరుగుచున్న భుజము లనెడి గడియలచేత పీడింపబడిన సూర్యా
గ్రహములు గలద్దై, ద్యౌః=స్వర్గలోకము, అనిభృతజటాతాడితతటా

చంచలములైన జడలచేత కొట్టబడిన ఒడ్డుగలదై, ముహుర్ముహుః= మాటిమాటికి, దౌస్థ్యం = దురవస్థను, యాతి = పొందుచున్నది. విభుతా=ప్రభుత్వము, వామైవ నను= వక్రమైనదియ కదా!

తా. నీవు లోకరక్షణార్థమై ఎపుడెపుడు తాండవనృత్యమును గావింపుచున్నావో అపుడపుడు స్వర్గమర్త్యపాతాళము లనెడు త్రిలోకములు భయగ్రస్తములై ప్రళయబాధ ననుభవించుచున్నవి. ఎటులనగా నీపాదాఘాతమునకు భూమియంతయు చలించి చిందరవందరమై పాతాళమున నడగిపోవునా యను సందేహమును బుట్టించుచున్నది. అంతరిక్షము, నీ దీర్ఘపుష్టములైన బాహువులదెబ్బలకు సూర్యాది గ్రహములు తుంపరలుకాగా శూన్యాతిశూన్యతను పొందునట్లున్నది. ఇక స్వర్గలోకమా! తిరుగుచున్న నీ దీర్ఘములైన జడల వ్రేటులకు మిక్కిలిగ ఇటునటు కొట్టుకొనుచు వినాశభీతి ననుభవించుచున్నది. ఇది యంతయు ఒకేమారు సంఘటించుచున్నది కావున నీవు లోకహితమునకై నటించినను లోకబాధయు తప్పుట లేదు. ప్రజాపాలనమునందు ఒకవిధముగ మేలు చేయవలయునన్న, వేరొక విధముగ నష్టముగూడ గల్గుట తప్పదుకదా!

వి. ఒక రాక్షసుడు ఘోరతప మొనర్చి, లోకమున తన ఇచ్చవచ్చిన వినోదముల గావించునట్లును, అందు మరెవ్వరును తనతో బోరకుండునట్లును శివునినుండి వరము నందికొని, ఈ ముల్లోకముల బంతివలె ద్రిప్ప నారంభించెను. ఇది మహా విప్లవమునకు కారణ మగునని శివుడే యత్యద్భుతమైన యాకారముతో దేవతలగూడి యా రాక్షసునకే వినోదముగలుగునట్లు తాండవనృత్యము గావించుననియును, ఒకప్పుడు దానివలన లోకమునకు కంపనాదులవలన భీతిగలుగుననియును ఐతిహ్యముగలదు. ||౧౬||

అవ:— శివునియొక్క దివ్యదేహమును గూర్చి వివరించుచున్నాడు,

వియద్వ్యాపీ తారాగణగుణితఫేనోద్గమరుచిః
ప్రవాహో వారాం యః పృషతలఘు దృష్టః శిరసి తే,
జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి -
త్యనేనైవోన్నేయం ధృతమహిమదివ్యం తవ వపుః ||౧౭||

అర్థః— వియద్వ్యాపీ=ఆకాశమును వ్యాపించినట్టియును, తారాగణ గుణిత ఫేనోద్గమరుచిః = చుక్కలగుంపుచేత ఇబ్బడిగాజేయుబడిన

నురుగుల పుట్టుకచేత శోభ కలిగినట్టియు, వారాం=గంగాజలమునుయొక్క, యః=ఏ, ప్రవాహః=ప్రవాహము, తే=నీయొక్క, శిరసి=తలమీద, పృషతలఘు = జలబిందువునవలె చిన్నదిగా, దృష్టః = చూడబడెనో! తేన=ఆ ప్రవాహముచేత, జగత్ = భూలోకము, జలధి వలయం= సముద్రమే అగడ్తగాగల, ద్వీపాకారం=నీటిలోని మట్టి దీవివలె, కృతం=చేయబడినది. ఇత్యనేనైవ = ఇట్లనుటచేతనే, ధృతమహిమ= ధరింపబడిన మహిమగలిగినట్టి, దివ్యం = ప్రకాశమానమైనట్టి, తవ= నీయొక్క, వపుః=దేహము, ఉన్నేయం=ఊహింపదగినది.

తా. పరమేశ్వరా! నీ యద్భుతమైన ఆకారమును ప్రత్యక్షముగ గనుగొనుటకు సాధ్యము గాకున్నను; ఆకాశభాగము నెల్ల నాక్రమించుకొని యున్నట్టియు, తనయందు ప్రతిబింబించు చున్న చుక్కల యొక్క తెల్లని కాంతివలన నురుగులచే గప్పిన దానివలె నున్నట్టియు విశాలమైన గంగాప్రవాహమును ఒక చిన్ని నీటిచుక్కవలె నీ జడలో ధరించుటను, అగస్త్యపానమువలన శుష్కించి పోయిన సముద్రమును ఈ నీ గంగాజలముచేతనే పూరింపబడుటయును జూడగా నీ యాకారము దివ్యమైన దనియును, అద్భుతమైన దనియును ఊహింప వచ్చును.

వి. శ్రీమత్ప్రమథనాథుడైన రేణుకాచార్యుని యుపదేశము నందుట పూర్వము అగస్త్యమహర్షి సముద్రజలము నొకే ఆచమనముతో శోషింప జేసె యును, శివుని జడలోని గంగాజలముతో మరల సముద్రము పూరింపబడె ననియు పురాణవార్త (పద్మ. సృ. ౧౯. మ. వ. ౧౦౫) కలదు. సముద్రమును బిందువుగాను బిందువును సముద్రముగాను గావించుశక్తి శివునకు, శివభక్తునకు గూడ గల దని నిరూపించుట విశేషము ॥౧౪॥

అవ:—శివుని సర్వతంత్రస్వతంత్రమైన ప్రభుత్వమును జెప్పుచున్నాడు.

రథః క్షోణీ యంతా శతధృతిరగేంద్రో ధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిః శర ఇతి।
దిధక్షోస్తే కోఽయం త్రిపురతృణమాడంబరవిధి -
ర్విధేయైః క్రీడన్త్యో న ఖలు పరతంత్రాః ప్రభుధియః॥౧౫॥

అర్థ:—త్రిపురతృణం=మూడుపురములనెడు తృణమును, దిధ

క్షోః=దహింపదలచిన, తే=నీకు, క్షోణీ=పృథ్వి,రథః=రథము,శతధృతిః= బ్రహ్మదేవుడు, యంతా=సారథి, అగేంద్రః=మేరుపర్వతము, ధనుః = విల్లు, అథో=మరియు- చంద్రార్కౌ=సూర్యచంద్రులు, రథాంగే= చక్రములు, రథచరణపాణిః = సుదర్శనధారియైన విష్ణువు, శరః = బాణము, ఇతి=ఇట్లుగా, అయం=ఈ, ఆడంబరవిధిః=ఆడంబర వ్యాపారము. కః=ఎట్టిది? ప్రభుధియః=రాజచిత్తములు,విధేయైః=సేవకులతో, క్రీడంత్యః=ఆడుచున్నవియై, పరతంత్రాః=పరాధీనములైనవి, న ఖలు = కావుకదా !

తా. పరమేశ్వరా ! లోకకంటకులైన అసురుల త్రిపుర దహనము చేయునెడ నీవు గావించిన సర్వస్వతంత్రమైన ప్రభుత్వమును కొనియాడి తీరవలసి యున్నది. నీవు తలంచినచో త్రిపురములను ఒక గడ్డిపోచవలె కాల్చివేసి యుందువు. కాని భూమిని రథముగాను, బ్రహ్మను సారథిగాను, మేరువును విల్లుగాను, సూర్యచంద్రులను చక్రములుగాను, హరిని శరముగాను విరచించి యుద్ధయాత్రను సాగించితివి. ఇంతటి యాడంబర మేల కావలసి వచ్చినది? ప్రభువుయొక్క చిత్తము సర్వతంత్ర స్వతంత్రమైనది కావున ఒకప్పుడు పరిచర్యసేయు సేవకుల తోడను వినోదార్థముగా నాడుకొనును కదా !

వి. కుమారస్వామి తారకాసురసంహారము గావించిన పిమ్మట; తారకుని తారకాక్ష, కమలాక్ష, విద్యున్మాలి యను ముగ్గురు పుత్త్రులు, బంగారము వెండి ఇనుములతో నూరు యోజనముల వెడల్పుగల మూడు పట్టణముల గట్టికొనుటకును, దివ్యసహస్ర వత్సరములు గడిచిన తరువాయి ఈ ముప్పురము లేకమగునట్లును, అపుడు ఒకే బాణముతో వీనిని నెక్కుబెట్టువాడు వచ్చువరకు కీడు గలుగకుండునట్లును బ్రహ్మనుండి వరము నందికొని, అట నివసించుచు లోకముల పీడింప మొదలిడగా దేవతలు శివుని మొరవేడిరి. అపుడు పరమేశ్వరుడు ఈ శ్లోకమున వివరింపబడిన ప్రకారము త్రిపురసంహారముయొక్క మహత్తును చాటుటకై, అప్పటి విశ్వమందలి గొప్పగొప్ప సాధనములతో మిక్కిలి యద్భుతమైన త్రిపురసమూహమును బాణమునకు గురిజేసి కాల్చివైచెనని ఇతిహాసము (మ. క. ౨౮. కు) కలదు ॥౧౮॥

అవ:—శివానుగ్రహమున గల్గిన విష్ణుతపఃఫలమును జెప్పుచున్నాడు.

హరిస్తే సాహస్రం కమలబలిమాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజముదహరన్ నేత్రకమలం।
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం ॥౯౯॥

అర్థ:—త్రిపురహర=ఓ త్రిపురదహనా! హరిః = మహావిష్ణువు, తే=నీ యొక్క, పదయోః=చరణములందు, సాహస్రం = ఒక వేయి లెక్కగల, కమలబలిం=పద్మములతో పూజను, ఆధాయ = ఒనర్చి, తస్మిన్=ఆపూజ, ఏకోనే=ఒకటి తక్కువగలది కాగా, నిజం=తనదైన, నేత్రకమలం=కన్నను యెడి కలువను, యత్=ఏకారణమువలన, ఉదహరత్=సమర్పించెనో, (ఆ కారణమువలన) అసౌ=ఈ, భక్త్యుద్రేకః=భక్తివిశేషము, చక్రవపుషా=సుదర్శన చక్రాకారముతో, పరిణతిం=పరిణామమును, గతః=పొందినదై, త్రయాణాం = ముత్తెరంగులైన, జగతాం=లోకములయొక్క, రక్షాయై= సంరక్షణకొరకు, జాగర్తి= జాగరూకమై యున్నది.

తా. ఓ పరమేశ్వరా! శ్రీమహావిష్ణువంతటివాడు సహస్రకమలములతో నీ పాదపూజ గావింప నుద్యమింపగా నందొక కమలము తక్కువయ్యెను. అప్పు డతడు మహాభక్తితో కమలమువలె నున్న తన నేత్రమునే పెరికి సమర్పించి యా సంఖ్యను పూర్తిగావించెను. ఆ భక్త్యతిశయమునకు నీవు మెచ్చి ముల్లోకముల సంరక్షింపజాలు సుదర్శనచక్రమును విష్ణువునకు ప్రసాదించితిగాదే! జనార్దనునకును లోక రక్షణ సామర్థ్యము నీ యనుగ్రహమువలననే లభించినదికదా!

వి. బ్రహ్మవరముతో మదించిన రక్కసులు మిక్కిలి హింసింపగా, దేవతలు విష్ణువునొద్ద మొరపెట్టుకొనిరి. దానికి హరి, దైత్యుల సంహరింతు నని చెప్పి దేవతల మరల్చెను. తానే స్వతంత్రుడ నని భావించి, యభిమానముతో దామోదరుడు చక్రము బూని త్రిప్పి, దైత్యులపై వైచెనంచెను కాని యా చక్రము కదలక మెదలక పట్టి బండి గ్రిరవలె జడమయ్యెను. అంత ఇది శివుని స్మరింపమి గల్గినదని యెంచి సహస్రకమలములతో శివలింగపూజ నారంభించెను. అప్పుడు శివసహస్ర నామములతో ఒక్కొక్క కమలము నర్పించెను. శివుడు భక్తిపరీక్షార్థమై అందొక్క

లము సదృశ్య మొనర్చెను. అంత విష్ణువు మరియొక కమలమును దెచ్చి పూర్తిచేయు చుండగా మాటి మాటి కొక కమలము తగ్గుచునే యుండెను. అంత శివమాయ కెదురు లేదని తన నేత్రకమలమునే యూడబెరికి సమర్పింపగా భక్తవత్సలు డగు శివుడు మెచ్చి త్రిలోకరక్షాదక్ష మగు సుదర్శనచక్రము ననుగ్రహించెను. దానితో దైత్యుల దునిమెను. ఇది స్కాందమున ౨.౮. ౩౨-౩౫ లో గలదు. అనుబంధముగా బ్రహ్మ పురాణమును (౧౯) అవలోకింపదగు. ॥౧౯॥

అవ:—శివుడే సర్వయజ్ఞాధ్యక్షు డని చెప్పబడుచున్నది.

క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం
క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే।
అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం
శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా కృతపరికరః కర్మసు జనః ॥౨౦॥

అర్థ:—క్రతుమతాం=యజ్ఞ మొనర్చువారికి, ఫలయోగే = ఫల రూపమైన స్వర్గము సంబంధమునందు, క్రతౌ=యజ్ఞము, సుప్తే=నిద్రించు చుండగా, త్వం=నీవు, జాగ్రత్ =జాగరూకుడవు, అసి=అయియున్నావు, కర్మ=యజ్ఞరూపమైన కర్మ, ప్రధ్వస్తం=నష్టమైనదై, పురుషారాధనం= పరమశివునిపూజను, ఋతే=విడిచి, క్వ = ఎచ్చోట, ఫలతి = ఫలించు చున్నది? అతః=ఆ కారణమున, క్రతుషు=యాగములందు, ఫలదాన ప్రతిభువం=ఫలము నొసంగుటయందు బాధ్యుడైన, త్వాం=నిన్ను, సంప్రేక్ష్య=చూచి (తెలిసికొని), శ్రుతౌ=వేదమునందు, శ్రద్ధాం=విశ్వా సమును, బద్ధ్వా=కట్టుకొని, జనః = ప్రాకృతజనుడు (యజమానుడు), కర్మసు=క్రియలందు,కృతపరికరః=ప్రయత్నింపబడిన సాధనము గలవాడు, (అయియున్నాడు.)

తా. కర్మాధ్యక్షుడ వైన పరమేశ్వరా! యజమాను డొనర్చిన యాగము జడమై యూరకయుండుటయే కాని; తత్ఫలము ననుగ్రహించు నీవుమాత్రమే ఎల్లపుడు జాగరూకుడవై వెలుంగుచున్నావు. పరమపురు షుడవగు నీయొక్క యారాధనలేకయే, అగ్నియందు వేల్వబడిన యజ్ఞ హవిస్సు (కర్మము) ఎప్పటికప్పుడు నష్టమొందుచుండ ఫల మెట్లు కలు గును? నీ నామస్మరణతో అట సమర్పింపబడుచున్నది కావుననే నీవు ఫలము ననుగ్రహింతువు కావున నిన్నే ఫలదాతవుగ దెలిసికొనిన

జనము, వేదములందు శ్రద్ధవహించి జన్నములకొరకు నింత అట్టహాస
ముగా సామగ్రిని కూర్చుకొని వ్యయము చేయుచున్నవి.

వి. "పురుషో వై రుద్రః" "మమ కర్తా మహేశ్వరః" మున్నగు ప్రమాణములవలన
యాగాది కర్మఫలమును శివుడే అనుగ్రహించు ననియు, కర్మము ఎప్పటి కప్పుడు
పూర్తియై నశించుచు అపూర్వ మగు ఫలమును గలిగించుటకు సాక్షియగు పరమపురుష
డవసర మనియును, కర్మమే చేతనమగుచో చేయగానే కర్మ ఏల ఫలించుట లేదు
యును మీమాంసకుని కేవల కర్మజడవాదమునకు నిట ప్రత్యుత్తర మొసగబడినది.
భూమిని నాటిన విత్తనము సైతము శివానుగ్రహమువలన అనుకూలమైన జలవాయువు
లతో గూడి అంకురించునని భావము. ॥౨౦॥

అవ:—శివానుగ్రహములేని దక్షాదుల యాగనిష్ఫలతను సూచించుచున్నాడు.

క్రియాదక్షో దక్షః క్రతుపతిరధీశ స్తనుభృతా-
మృషీణామార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః।
క్రతుభ్రేష స్త్వత్తః క్రతుఫలవిధానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయ హి మఖాః ॥౨౧॥

అర్థ:—శరణద=ఓ రక్షకా! క్రియాదక్షః = కార్యనిర్వహణ
సమర్థుడును, తనుభృతాం = ప్రాణులకు, అధీశః = పాలకుడును అగు,
దక్షః=దక్షబ్రహ్మ, క్రతుపతిః=యజమానుడు, ఋషీణాం = భృగ్వాది
ఋషులయొక్క, ఆర్త్విజ్యం = ఋత్విజత్వము, సురగణాః = దేవతల
సమూహములు, సదస్యాః=సభ్యులు, క్రతుఫల విధాన వ్యసనినః=యజ్ఞ
ఫలము నిచ్చుటలో నాసక్తుడవైన, త్వత్తః=నీవలన, క్రతుభ్రేషః =
యజ్ఞముయొక్క నాశము. (కల్గెను) హి=ఏలయనగా, శ్రద్ధావిధురం =
విశ్వాసము లేనట్లుగా, (చేయబడిన) కర్తుః = యజమానునియొక్క
మఖాః=యజ్ఞములు, అభిచారాయ=అనర్థము కొరకు (కదా)!

తా. సర్వరక్షకుడ వగు నో దయామయా! యాగాది క్రియ
లందు సకలసామర్థ్యము గలవాడును, బ్రహ్మకు ప్రతిబ్రహ్మయైన
వాడును, లోకపాలకుడును అగు దక్షునకు స్వయముగా యజమానత్వము
వహించి; దివ్యశక్తిసంపన్నులైన భృగ్వాదిమహర్షులు ఋత్విజము
నెరపుచుండ; విష్ణుబ్రహ్మాదిసురలు సభలో నుండియుండ, యజ్ఞ

మును నిర్వహింప మొదలిడెను గాని యజ్ఞఫలదాతవగు నీవలననే యజ్ఞ ధ్వంసము కలిగినది. ఎంతటి సామర్థ్యము గలవాడైనను నీయందు భక్తిశ్రద్ధలు లేవేని తన క్రతువు వలన ఫలము బొందక పోవుటయే కాక; అనేకములైన అనర్థములకు గురియై నశించును కదా!

వి. ఈ సుప్రసిద్ధమైనకథ భాగవతము (౪. ౨; ౩-౭) నందును, మహాభారతము (శాం. ౨౮౫.) నందును, బ్రహ్మాండపురాణము (౧. ౧. ౬౪) నందును శివలింగ స్కాంద పురాణములందును కలదు. "ఒకప్పుడు శివునిద్వారా నియమింపబడిన బ్రహ్మదేవుని సృష్టిని అవలోకించుటకు మహామహులందరును సభ దీర్చియుండిరి. ఇంతలో దక్షుడు రాగా సభవారందరును లేచి నిలిచిరి. అందు శివు డొక్కడు మాత్రము కూర్చొని యుండుటను దక్షుడు సైరింపక వైరము పూనెను. తర్వాత నొక మహాయాగము జేయ నారంభించి విష్ణుబ్రహ్మేంద్రుల నందరను రావించెను. కాని శివసతులకు పిలుపురాదయ్యె. సతి (పార్వతి) స్వయముగ తండ్రియగు దక్షుని యాగమున కేగి అవమానితయై జన్మమున దేహమును పరిత్యజించెను. ఇది తెలిసి రుద్రుడు వీరభద్రుని బంపి, యాగవిధ్వంస మొనరింపజేసి దక్షుని తల నరికించెను. ఇందు పాల్గొన్న విష్ణుభృగు సూర్యాదులకును దండనములు దవిలెను. బ్రహ్మప్రార్థన ననుసరించి శివుడు దక్షునికి గొర్రె తల నతికించి రక్షించెను" గొర్రెతల గలవాడనగా పశువదుడని యర్థము ॥ ౨౧॥

అవః—శివభక్తి నిరోధ మేర్పడినపుడు పితాదులను గూడ లెక్కింపరాదనుచున్నాడు.

> సతాం వర్త్మ త్యక్త్వా శ్రుతిసమధిగమ్యం సహభువం
> ఘృణామప్యున్మూల్య స్వజనవిషయస్నేహగుణితాం।
> ద్విజః కృంతన్ పాదే పితరమపరాద్ధం త్వయి విభో
> మనుష్యత్వం సద్యస్త్రిదశపరిణామేన విజహౌ ॥౨౨॥

అర్థః—విభో=ఓ సర్వవ్యాపకా! ద్విజః=బ్రాహ్మణుడు (కాటకోటడు), శ్రుతిసమధిగమ్యం=వేద వేద్యమైన, సహభువం=తోబుట్టువైన, సతాం=సత్పురుషుల, వర్త్మ=మార్గమును, త్యక్త్వా=వీడి, స్వజనవిషయస్నేహగుణితాం=తనవానికి (తండ్రికి) సంబంధించిన ప్రేమచేత నెక్కువగా చేయబడిన, ఘృణామపి = దయనుగూడ, ఉన్మూల్య = పెరికివైచి, త్వయి=నీయందు, అపరాద్ధం=తప్పుగావించిన, పితరం=తండ్రిని, పాదే=చరణమునందు, కృంతన్ = ఛేదించినవాడై, సద్యః=వెంటనే, త్రిదశ

పరిణామేన=దేవత్వమునొందుటతో, మనుష్యత్వం = మానవత్వమును విజహౌ=విడిచెను.

తా. ఓ సర్వాంతర్యామీ! ఆ బ్రాహ్మణుడు పెద్దలమార్గమున వేదబోధితములైన యాచారములను ఎరిగి, సహజమైన దయాదాక్షిణ్యములు కలిగియున్నవాడే! కాని; వీని నన్నిటిని త్రోసిపుచ్చి, నీ విషయమున నపచారమొనర్చినట్టి తన తండ్రియొక్క పాదమునికూడ భగ్నపక సరకినైచెను. అతని యద్భుతమైన శివభక్తికి నీవు మెచ్చి యతనికి ప్రమథపదవి ననుగ్రహించి మానవజన్మమునుండి విముక్తునిగావించితివి. శివాపరాధము వాటిల్లుచున్నప్పుడు సామాన్యమైన శాస్త్రాచారమును దయాదాక్షిణ్యములను వీడినను ప్రత్యవాయము లేదనికదా భావము.

వి. ఈ శ్లోకము ఉత్తర పశ్చిమదేశపు ప్రతులలోగాని, ఓంకారేశ్వర - అమరేశ్వర మందిరమందలి శిలాశాసనమునగాని లేదు. దక్షిణదేశపు అన్ని ప్రతులలోను ప్రాచీనకాలమునుండియు కలదు. ఇందలి కాటకోటడు దక్షిణదేశమున రెండువేలేండ్లకు పూర్వమువాడు. ఈ కథ "శివభక్తవిలాస" మను సంస్కృత గ్రంథమునను పురాతన భక్తవిలాస బసవపురాణాదులలోను సుప్రసిద్ధము. షట్కాల లింగార్చనపరుడగు కాటకోటడను ఒక బ్రాహ్మణబాలకుడు మార్గవశమున సాయంకాల మేకలమందకు జేరి, యట శివాలయములేమికిఁ జింతించి, అక్కడనున్న మేక పెంటలను లింగాకారముగా రాశిచేసి ధ్యానింప మొదలిడెను. అంత వాని తండ్రి యచ్చోటికివచ్చి యద్దాని తిరస్కరించి కాలితో నా రాశిని దన్నెను. ఈ శివద్రోహమునకు తాళజాలక, ఆ బాలుడు తండ్రికాలిని నరకివేయుటయేకాక, ఇట్టి శివాపచారమును గాంచినందులకు తన రెండుకన్నులను సైతము బెరికికొనెను. ఈశ్వరుడు భక్త్యతిశయమునకు మెచ్చి సద్యస్కాలముననే యతనికి కైలాసమున ప్రమథపదవి ననుగ్రహించెను" తండ్రి సామాన్యముగ పూజ్యుడేయైనను "శివనిందాకరం దృష్ట్వా ఘాతయే దథవా శపేత్." (శివుని నిందించినవానిని చంపవలెను లేక శపింపవలెను) అను వీరశైవాచారమును (సిద్ధాంతశిఖామణి ౯-౩౭) ఈ బాలకుడు ప్రదర్శించెను. ఈ కాటకోటునకు చండు డను మారుపేరుండెననియును, చండుడు వేరనియును భేదముకలదు. అరువదిమువ్వురు పురాతనులలో నీ చండుడొకడు. తమిళ మహాకవి మాణిక్యవాశగర్ (క్రీ. శ. ౬వ శతాబ్ది) రచించిన "పెరియ పురాణ"మున నీ కథ కలదు. శివయోగి శివాచార్యుని సిద్ధాంతశిఖామణి (౧౦-౫౦) యందును "చండో యథా పురాభక్త్యా, పితృహాప్తి శివో౽భవత్," (పూర్వము చండుడు తండ్రిని చంపియు ననుభక్తిచేత ఎట్లు శివస్వరూపుడయ్యెనో) అని చండుని వార్త కలదు.

అవ:—బ్రహ్మాదుల యపరాధములందును శివుడే దండనకర్త యనుట.

ప్రజానాథం నాథ ప్రసభమభికం స్వాం దుహితరం
గతం రోహిద్భూతాం రిరమయిషుమృశ్యస్య వపుషా।
ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృతమముం
త్రసంతం తేఽద్యాపి త్యజతి న మృగవ్యాధరభసః ॥౨౨॥

అర్థ :—నాథ = లోకేశ్వరా! రోహిద్భూతాం=లేడిరూపము బొందిన, స్వాం=స్వకీయమైన, దుహితరం = కుమార్తెను, ఋశ్యస్య= జింకయొక్క, వపుషా = శరీరముతో, గతం = వెన్నంటినవాడును, ప్రసభం = బలాత్కారముగా, రిరమయిషుం = రమింపనిచ్ఛగల వాడును, అభికం = కాముకుడును, సపత్రాకృతం = బాణముతో గొట్టబడినవాడును, త్రసంతం=భయగ్రస్తుండును, దివం = స్వర్గమును గూర్చి, యాతమపి = వెళ్ళినవాడైనను, అముం = ఈ, ప్రజానాథం= బ్రహ్మను, ధనుష్పాణేః=చేతధనుస్సుగల, తే=నీయొక్క, మృగవ్యాధ రభసః = వేటకానివంటి సంభ్రమము, అద్యాపి=ఇప్పటికిని, న త్యజతి= విడుచుటలేదు.

తా. సర్వలోకనియామకా! తానే సృష్టించినట్టియు, తన కూతురైనట్టియు ఒక సుందరిని బ్రహ్మ కామోద్రిక్తుండై వెంటబడి యెను. ఇది గని యాకాంత ఆడులేడిరూపము బొందగా; బ్రహ్మ మగ లేడిరూపమును బొంది దాని బలాత్కరింపదలంచెను. అంతనీవు పినాక ధనుస్సుతో బ్రహ్మను స్వర్గమునకు బారిపోవుచున్నను వదలక, కిరాత రూపముతో బాణమును ప్రయోగించి, శిక్షించితివి. ఇప్పటి పినాక ధారిత్వము జూడగా అప్పటి వేటకానితన మింకను నిన్నుదొలగి పోనట్లు న్నది. విశ్వసృష్టికి కర్తయైనను నీశాసనమునకు లోబడియున్నాడుకదా!

వి. ఈకథకు మూలము ఐతరేయబ్రాహ్మణము (3-33; ౫-౨) నందును, శతపథబ్రాహ్మణము (౧-౭-౪) నందును స్కాందమత్స్య శివపురాణములందును గాంచనగును. బ్రహ్మదేవుడు తానే సృష్టించిన కాంతల సౌందర్యమునకు భ్రమసి, వెంటబడి బలాత్కరించెననియును, శివునిచే దండింపబడెననియు ఈ ఐతిహ్యము యొక్క సారాంశము. ఈ కాంత ముఖ్యముగ ఎవరో కాని పేరులు పైగ్రంథములలో వేరువేరుగా గలవు, ద్యౌ, ఉషా, గాయత్రీ, సతీ,సావిత్రీ, సరస్వతీ అను సుందరీమణు

లందరితోడను ఇట్టి వ్యవహారము బ్రహ్మకు జెప్పబడినది. ఈ కథయే ఆకాశము
మృగవ్యాధరోహిణీ నక్షత్రరూపమున కలదందురు. ఆదిసృష్టియంతయు బ్రహ్మ
నైనది కావున అప్పుడుద్భవించిన స్త్రీలందరును బ్రహ్మకు పుత్రికలేరైరి. అందు
బ్రహ్మకు నీయపవాదము తప్పదయ్యెను. సరస్వత్యాదులు బ్రహ్మకు పుత్రికలే
పత్నులు కారని యెరుంగునది ॥౨౩॥

అవ:—మహాదేవుడు ప్రసన్నుడగుచో ఇష్టార్థముకంటె ఎక్కు
లభించుననుట—

స్వలావణ్యాశంసా ధృతధనుషమహ్నాయ తృణవత్
పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి।
యది స్త్రైణం దేవీ యమనిరతదేహార్ధఘటనా-
దవైతి త్వామద్ధా బత వరద ముగ్ధా యువతయః ॥౨౪॥

అర్థ:—పురమథన=ఓ త్రిపురవిధ్వంసకా! దేవీ=పార్వతీదే
స్వలావణ్యాశంసా = తన సౌందర్యము:యొక్క ప్రశంసగలదై, ధృ
ధనుషం = ధరింపబడిన విల్లుగలిగినట్టి, పుష్పాయుధం = మన్మథు
పురః = ఎదుట, తృణవత్ = గడ్డిపరకవలె, అహ్నాయ = శీ
ముగా, ప్లుష్టం = కాల్పబడిన వానినిగా, దృష్ట్వాపి = చూచిన
కూడ, యమ నిరత దేహా=తపోవశము చేయబడిన దేహముకల
అర్ధఘటనాత్ = శరీరార్ధ భాగమును సంఘటించినందువలన, త్వాం
నిన్ను, స్త్రైణం = కాంతాలోలునిగా, అవైతి యది = భావించు
అద్ధా=సరియే, వరద = ఇష్టముల నిచ్చు ఈశ్వరా!, యువతయః
తరుణులు, ముగ్ధాః = మూఢలుగా, బత = ప్రసిద్ధము!

తా. వరదాయకా! లోకైకసుందరియైన పార్వతి లోకేశ్వ
వగు నీభర్తృత్వము నపేక్షించి, కామునిద్వారా పుష్పబాణము
నాటించి, నీయందు కామము అంకురింప ప్రయత్నించెను గాని నీ
క్షణమాత్రమున నా మారుని గరికపోచవలెఁ గాల్చివైచితివి. ఆ
నినుగూర్చి మిక్కిలి తపమాచరింపగా భక్తులకు వశంవదుడ వగు
ఆమె నర్ధాంగినిగా స్వీకరించి గొప్పగా ననుగ్రహించితివి. ఈ రహ
మరయక నిన్ను స్త్రీలోలునిగా ఆమె భావించుచున్నది. ఇది య
తులు వెఱ్ఱివారనుట కుదాహరణమే. కాని నీవు మోహితుడ
వనుటకు ప్రమాణము గానేరదు.

వి. ఈ కథయు (శివపు. రుద్ర. సతీ. 3) సర్వప్రసిద్ధము. ఈ శ్లోకమున గల 'పురమథన' విశేషణమువలన ఉక్కుచే నిర్మింపబడిన త్రిపురముల గాల్చిన శివునకు పుష్పాయుధుడైన మన్మథుడొక గడ్డిపోచకంటె హీనమనియును, కామదహనము వలన శివుడు కామవశుడు కాడనియును సూచిత మగుచున్నది. పార్వతీ లావణ్యము లోకప్రసిద్ధ మైనప్పటికిని; ఆమె నవలోకించినంతనే ఎట్టి వికారము శివునకు గలుగ లేదు. ఆమె తపస్సుచే కృశించుచుండ భక్తురాలనియు, నిర్మల యనియు తన శరీరార్ధ భాగమును ప్రదానించి, ఆమె కోరిన భర్తృత్వముకంటె ఎక్కువే శివు డనుగ్రహించెనని భావము. ॥౨౪॥

అవః— బైరాగివేష మున్నను శివుడు సర్వమంగళమూర్తి యనుట.

శ్మశానేష్వాక్రీడా స్మరహర పిశాచాస్సహచరా -
 శ్చితాభస్మాలేపః స్రగపి నృకరోటీపరికరః।
అమంగల్యం శీలం తవ భవతు నామైవమఖిలం
 తథాపి స్మర్తౄణాం వరద పరమం మంగలమసి. ॥౨౫॥

అర్థ:— స్మరహర=ఓ మారహరా! తవ=నీకు, శ్మశానేషు= వల్లకాడులందు, ఆక్రీడా=విహారము, పిశాచాః= దయ్యములే, సహ చరాః=సంగడికాండ్రు, చితాభస్మ=కాటిబూడిద, ఆలేపః = గంధము, నృకరోటీ పరికరోఽపి=నరుల పుఱ్ఱెలగుంపుకూడా, స్రక్=పూలదండ, ఏవం=ఇట్లు, అఖిలం=సమస్తమైన, శీలం=నడవడి, అమంగల్యం=అశుభ మైనదిగా, భవతు నామ=అగుగాక! వరద=భక్తేష్టప్రదా, తథాపి= అటులైనను, స్మర్తౄణాం=భజించువారికి, పరమం=ఉత్కృష్టమైనట్టి, మంగళం=కల్యాణస్వరూపము, అసి=అయియున్నావు.

తా. పరమేశ్వరా! నీకు క్రీడాస్థలము శ్మశానము. స్నేహితులు పిశాచములు, కాటి బూడిదయే శరీరమునకు కస్తూరీగంధపు పూత; కపాల మాలయే మల్లెపూలదండ. ఇట్లు నీ బాహ్యవేషము జూడగా వికారముగ దోచును గాని నిను స్మరించు భక్తుల కందరకు నీవు కేవల కల్యాణస్వరూపుడ వనుటయే నిక్కము. ఈ వేషము సామాన్యముగ నట్లు గన్పట్టినను అంతస్తత్త్వమెల్ల మంగళకర మైన దని భావము.

వి. శివు డిటులు పురాణాదులలో వర్ణింపబడినను, చంద్రుడు గంగ డమరు మున్నగునవి లోకకల్యాణ కరములు. పీతాంబరము, పూలదండలు మొదలగునవి లోకవాసనాపీడితులకే కాని శివునకు వానియందు వ్యామోహము లేదు. శ్మశాన

వాసము నిత్యముక్తస్వరూపమునకును, పిశాచసహవాసము పతితపావనత్వ
నకును, భస్మధారణము వైరాగ్యమునకును. కపాలధారణము లోకశాంతికిని నిదర్శ
నము లని యెరుంగవలెను. ఈ విధముగ శివుని స్వరూప మంతయు నిత్యమంగళ
కర మనుట సిద్ధాంతము. ॥౨౭॥

అవ:— ఇక శివుని చిదానందత్వమును నిర్దేశించుచున్నాడు.

మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్తమరుతః

ప్రహృష్యద్రోమాణః ప్రమదసలిలోత్సంగితదృశః।

యదాలోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్జ్యామృతమయే

దధత్యంతస్తత్త్వం కిమపి యమినస్తత్కిల భవాన్.॥౨౮॥

అర్థ:—ఆత్తమరుతః = నిరోధింపబడిన ప్రాణములు గల
యమినః=యోగీశ్వరులు, ప్రత్యక్చిత్తే=వాసనారహితమగు ఆత్మయందు,
సవిధం=విధ్యుక్తముగా, మనః=మనస్సును, అవధాయ=చేర్చి, అమృత
మయే=అమృతస్వరూపమైన, హ్రదే=మడుగునందు, నిమజ్జ్య=మునిగిన
ఇవ=వలె, ప్రహృష్యద్రోమాణః=పులకితములైన రోమములు గల
వారును, ప్రమదసలిలోత్సంగితదృశః=ఆనందబాష్పములతో నిండిన
దృష్టిగలవారును, ఐ, కిమపి=యెద్దియో యైన,యత్=ఏ, తత్త్వం=ప
వస్తువును, ఆలోక్య=కాంచి, అంతః=లోపల, ఆహ్లాదం=ఆనందమును
దధతి=ధరించుచున్నారో, తత్=ఆ చిదానందవస్తువు, భవాన్ కిల
నీవు కదా!

తా. ఓ సచ్చిదానందఘనా! మహాయోగులు యోగశాస్త్ర
రీత్యా ప్రాణాదుల నిరోధించి పరమాత్మమునందు మనము నిల్పి, గగు
ర్పాటునందుచు, ఆనందబాష్పముల రాల్చుచు, అవాఙ్మానస గోచర
మగు ఏపరవస్తువును లోలోపల నవలోకించి అమృతసరస్సులో మునిగిన
వారి వలె మహాసుఖము ననుభవింతురో ఆ సచ్చిదానంద మూర్తి
నీవే కావా! అధ్యాత్మతత్త్వవేత్తలు చివర నిన్ను దెలిసియే సుఖింతురు

వి. శివుడు చంద్రధర, గంగాధర, మారహర, అను సాకారరూపము నేకాక
యోగీశ్వరులు పెక్కు కష్టములతో గాంచదగు అఖండానందైక స్వరూపమును గ
యున్నాడని తేలుచున్నది. ఇందుకు "శివ ఏకో ధ్యేయః" "శివమద్వైతం చతుర్థం
మన్యంతే" "ఉ తైనం విశ్వాభూతాని" మున్నగు ప్రమాణము లసంఖ్యాకము

గలవు. విష్ణు బ్రహ్మేంద్రాదుల కెల్ల అంత్యమున శివుడొక్కడే శరణ్యుడని భావము. ॥౨౬॥

అవ:—శివుని విశ్వాత్మకత్వమును నిరూపించుచున్నాడు.

త్వమర్క స్త్వం సోమ స్త్వమసి పవన స్త్వం హుతవహ-
స్త్వమాప స్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితి చ।
పరిచ్ఛిన్నామేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం
న విద్మ స్తత్త్వం వయమిహ తు య త్త్వం న భవసి॥ ౨౭॥

అర్థ:—త్వయి=నీయందు (నీవిషయమునందు), పరిణతాః=విన మ్రులైనవారు, (పండితులు) త్వం=నీవు, అర్కః=సూర్యుడవు, త్వం = నీవు, సోమః = చంద్రుడవు, త్వం=నీవు, పవనః = వాయువు, అసి = అయియున్నావు, త్వం=నీవు, హుతవహః=అగ్నివి. త్వం=నీవు, ఆపః= జలము, త్వం = నీవు, వ్యోమ = ఆకాశము. త్వము = నీవు, ధరణిః = భూమి, చ=మరియు, త్వం=నీవు, ఆత్మా=యజమానుడవు. ఇతి=ఇట్లు, పరిచ్ఛిన్నాం = పరిమితిగల, గిరం=వాక్కును, బిభ్రతు=ధరింతురుగాక! తు=అయితే, వయం=మేము, ఇహ= ఈలోకమున, త్వం=నీవు, యత్ = ఏవస్తు స్వరూపుడవు, న భవసి= కావో, తత్ =ఆ, తత్త్వం=వస్తువును, న విద్మః = తెలియము.

తా. ఓ పరమేశ్వరా! నీ భక్తులైనవారును, నీ విషయము కొంత దెలిసికొని పండితులైన వారును కొందరు, నిన్ను సూర్యుడ వని చంద్రుడవని వాయ్వగ్ని జ్వాలస్వరూపుడవని ఆకాశమవని భూమివని ఆత్మ (యజ్ఞపతి) వని ఇవ్విధముగ ఒక సీమకు లోనై చెప్పుదురు గాక! ఈ విశ్వమున నీవుగాని పదార్థ మెద్ది కలదో మేము మాత్రము మద్దాని నెరుం గము. సర్వము నీ వనియే మా దృఢవిశ్వాసము. నీవు ఫలానా అని సంక్షిప్తముగ నిర్దేశించుట పరిహాసాస్పద మని భావము.

వి. పంచ భూతములును, సూర్య చంద్రాత్మలును మొత్తము అష్టమూర్తు లన బడును. ఈ యష్టమూర్తి స్వరూపుడే శివు డని ఆగమసిద్ధాంతము. ఆ సిద్ధాంతము స్థూలముగ లేక పాండిత్యము వలన చెప్పబడినను, ఇది శివుని విశ్వాత్మునిగా చూచు భక్తునకు సంకోచము గల్గించును. కావున సమస్తమైన చరాచరాత్మక స్వరూపుడవు. నీవే కానిచో ఈ జడమైన ప్రపంచమునకు ప్రకాశము లేదు కదాయని హెచ్చరిక ॥౨౭॥

అవః— పరమేశ్వరుని ప్రణవ ప్రతిపాద్యత్వమును సూచించుచున్నాడు.

త్రయీం తిస్రో వృత్తీస్త్రిభువనమథో త్రీనపి సురా-
నకారాద్యైర్వర్ణైస్త్రిభిరభిదధత్తీర్ణవికృతి,
తురీయం తే ధామ ధ్వనిభిరవరుంధానమణుభిః
సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితి పదం॥ ౨౭॥

అర్థః— శరణద=ఓ రక్షకా! ఓమితి=ఓంకార మనెడు, పదం= శబ్దము, త్వాం=నిన్ను, సమస్తం=పరిపూర్ణునిగాను, వ్యస్తం = వ్యష్టిస్వ రూపునిగాను, అభిదధత్ = చెప్పుచున్నదై, త్రయీం = వేదత్రయ మును, తిస్రః = మూడైన, వృత్తీః=గుణవ్యాపారములను, త్రిభువనం= లోకత్రయమును, అథో = మరియు, త్రీన్ = ముగ్గురైన, సురానపి = దేవతామూర్తులను, అకారాద్యైః =అకార, ఉకార, మకార రూపము లైన, త్రిభిః = మూడైన, వర్ణైః = అక్షరముల చేతను, అణుభిః = సూక్ష్మములైన, ధ్వనిభిః = నాదములచేతను, తీర్ణవికృతి =దాటబడిన వికారము గల్గినట్టియు, తురీయం=కడపటిదైనట్టియు, అవరుంధానం = సర్వాతిశయ మైనట్టియు, తే = నీయొక్క, ధామ = తేజస్సును గృణాతి = పొగడుచున్నది.

తా. ఓ సర్వరక్షకా! వేదములకెల్ల మూలభూతమైన ఓంకా ప్రణవము నీ చరాచరాత్మకమైన స్వరూపము నిట్లు పొగడుచున్నది ఈ ఓంకారమునందు అ, ఉ, మ్, అనెడు మూడక్షరములు కలవు ఇవి ఋగ్యజుస్సామము లనెడు మూడు వేదములను, సత్త్వరజస్తమము లనెడి మూడు గుణములను, బ్రహ్మ విష్ణు మహేశ్వరు లను ముగ్గు మూర్తులను, సూచించునవై నాద బిందు కళ లనెడి మూ ధ్వనులతో,అపక్షయ వినాశ పరిణామము లనెడు వికారములు లేనట్టియు వ్యస్త, అవ్యస్త, వ్యస్తావ్యస్తము లనెడు రూపములకంటె అతీతమైనట్టియు సర్వానర్థకరమగు మాయావరోధక మైనట్టియు నీ దివ్య తేజము స్తుతించుచున్నవి. ఓంకారముయొక్క తత్త్వమును విచారింప నదెల్లయు నీ గుణప్రతిపాదనను చేయుచున్నది. కావున నీవే ప్రణవస్వరూ డవు. నిత్యచిదానంద ప్రకాశస్వరూపుడవు.

వి. ఓంకారము కేవలకల్యాణస్వరూపమైనది. వేదాదులను బ్రహ్మ; శివుని వలన నభ్యసించి మరల శిష్యులకు జెప్పబూనగా మొట్టమొదట బ్రహ్మయొక్క కంఠమును భేదించుకొని హఠాత్తుగ శివస్వరూపమైన ఓంకారము వెలువడెను. తదాదిగ వేదపఠనమునందు మొదలు ఓంకార ముచ్చరింపబడుచున్నది. ఇందుకు "ఓంకారశ్చాథశబ్దశ్చ, ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్త్వా వినిర్యాతౌ, తస్మాన్మాంగలికావుభౌ" "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను ప్రమాణములు కలవు. కొందరు వేదారంభమున హరిః ఓం అనుటను ప్రచారమునకు దెచ్చియున్నారు. ఇది అప్రామాణికము. ఓంకారమును అ, ఉ, మలుగా విడదీసినపుడు పరమేశ్వరుని వ్యష్టిస్వరూపమును; కలిపి 'ఓం' గానున్నపుడు సమష్టి రూపమును సూచించునని భావము. "తస్య వాచకః ప్రణవః" అనుటవలన శివుని జెప్పు శబ్దము ఓంకారమేయని సిద్ధాంతము ॥౨౭॥

అవ:—శివుని భవశర్వాది అష్టనామాభిధానములు వివరింపబడుచున్నవి.

భవః శర్వో రుద్రః పశుపతిరథోగ్రః సహమహాం-
స్తథా భీమేశానావితి యదభిధానాష్టకమిదం।
అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతిరపి
ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహితనమస్యోఽస్మి భవతే॥

అర్థ:—దేవ=ఓయీశ్వరా, భవః=భవుడవు, శర్వః=శర్వుడవు, రుద్రః=రుద్రుడవు, పశుపతిః=పశుపతివి, అథ=మరియు, ఉగ్రః=ఉగ్రుడవు, సహమహాన్=మహాదేవుడవు, తథా=అటులే, భీమేశానౌ=భీముడవు, ఈశానుడవు, ఇతి=ఇట్లు, యత్=ఏ, ఇదం=ఈ, అభిధానాష్టకము=నామాష్టకము(ఎనిమిది పేరులగుంపుకలదో), అముష్మిన్=ఈఅష్టకమునందు, ప్రత్యేకం=ప్రతి యొక నామముతోగూడ, శ్రుతిరపి=వేదమైనను, ప్రవిచరతి = ప్రవర్తించుచున్నది, అస్మై = ఈ భవాది శబ్దరూపమగు, ధామ్నే=తేజోరూపమగు, ప్రియాయ=ప్రియకరమగునట్టి, భవతే=నీకొరకు, ప్రణిహితనమస్యః = చేయబడిన నమస్కారముగలవాడను, అస్మి=అగుచున్నాను.

తా. ఓదేవా! భవ, శర్వ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహాదేవ, భీమ, ఈశాను లనెడు ఈ యెనిమిది నామములు నీ ముఖ్యవాచకములుగా శ్రుతియే చెప్పుచున్నది. కావున ఏతచ్ఛబ్దవాచ్యుడవును, తేజో

చూపుడవును భక్తవత్సలుడవును అగు నీకు సర్వాత్మనా విధేయుడ
నమస్కరించుచున్నాను.

వి. ౨౭ వ శ్లోకమున శివుని అష్టమూర్తి స్వరూపమును జెప్పి, ఆ యష్టమూ
వాచకములగు అష్టనామములుగూడ నిందు జెప్పబడినవి. పుట్టించుటవలన భ
(పృథ్వీమూర్తి),సంహరించుటవలన శర్వుడు(జలమూర్తి), రోదన హరణమువలన రుద్రు
(వాయుమూర్తి), బ్రహ్మవిష్ణ్వాది పశుపాలనమువలన పశుపతి, (యజ్ఞమూర్తి) అ
తేజస్సువలన ఉగ్రుడు (తేజోమూర్తి), పరిపూర్ణత్వము వలన మహాదేవుడు (
మూర్తి), వైరిభయంకరత్వమువలన భీముడు, (ఆకాశమూర్తి), సర్వైశ్వర్య ప్ర
నము వలన ఈశానుడు, (అర్కమూర్తి), అని తెలియవలెను. ఈ మూర్తి విషయమ
మతభేదము కలదు కావున, శ్లోకమున నున్న క్రమము ననుసరించి భవాది శబ్ద
పృథ్వి అప్ తేజోవాయు ఆకాశ సూర్య చంద్ర యజమానమూర్తులకు వా
ములుగాగూడ చూచుకొనవలెను. శివునికి ఓంకారమే ముఖ్యనామ మైనప్పటి
భవాది అష్టశబ్దములును, ఇట్టి యర్థమునే ఇచ్చు శంభు శంకరాది శబ్దములును వా
కము అని తెలియవలెను. ॥౨౮॥

అవ:—శివుని అష్టసిద్ధుల సూచించి, అవాఙ్మనసగోచరత్వమును జెప్పు
చున్నాడు.

నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో
నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః।
నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో
నమః సర్వస్మై తే తదిదమతిసర్వాయ చ నమః ॥౨౯॥

అర్థ:—ప్రియదవ=వనవాసప్రియుడా! నేదిష్ఠాయ = మిక్కి
దగ్గరగానున్న, చ=మరియు, దవిష్ఠాయ=మిగుల దవ్వుననున్న, తే=నీ
నమః=నమస్కారము, స్మరహర = ఓ కామారీ! క్షోదిష్ఠాయ=అ
స్వరూపముగా నున్న, చ=మరియు, మహిష్ఠాయ = మహత్తరము
నున్న, (నీకు) నమః=నమస్కారము, త్రినయన=ఓ ముక్కంటీ! వ
ష్ఠాయ=మిగుల వృద్ధుడవైన, చ=మరియు, యవిష్ఠాయ = మిక్కి
యువకుడవైన, (నీకు) నమః=నమస్కారము, సర్వస్మై=విశ్వరూపు
వైనట్టి, (నీకు) నమః=నమస్కారము, చ=మరియు, అతిసర్వాయ
సర్వము నతిక్రమించినట్టి, (నీకు) నమః=నమస్కారము.



తా. భవకాంతీ భాసీ! మహాదేవా! భక్తులైనవారికి మిక్కి

సమీపస్థుడవును, అజ్ఞానులకు దూరతరముగా నున్నవాడవును అగు నీకు నమస్కారము. ఓ మన్మథమథనా! అణుస్వరూపుడవును మహత్స్వరూపుడవును అగు నీకు నమస్కారము. ఓ త్ర్యంబకా! మిక్కిలి పురాణ పురుషుడవును మిక్కిలి తరుణుడవును అగు నీకు నమస్కారము. సర్వస్వరూపుడవును సర్వము నతిక్రమించినవాడవును అగు నీకు నమస్కారము! నమస్కారము!!

వి. ఈ శ్లోకముయొక్క రచన వేదమును బోలియున్నది. ఇట్టి అమూల్యమైన భాష మానవుని ముఖమునుండి వెలువడునది కాదు. కావుననే ఈ మహిమ్న స్తోత్రమును రచించిన పుష్పదంతాచార్యుడు, ప్రమథపుంగవుడుగా, మహర్షిగా నెన్నబడినాడు. ఇందు శివునియొక్క అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి ప్రాకామ్య. ఈశిత్వ, వశిత్వము లనెడు అష్టసిద్ధులు గంభీరముగా చెప్పబడినవి. శివుని మహిమ అపారమును అతర్క్యమును నైయున్నది. కావున ఇట్టి నామములతో దలచుచు నమస్కరించి, ఆత్మార్పణము జేయుటతప్ప వేరు లేదని భావము ॥30॥

అవః—త్రిమూర్తిత్వము నుద్ఘాటించి స్తోత్ర ముపసంహరించుచున్నాడు.

బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమో
జనసుఖకృతే సత్త్వోత్పత్తౌ మృడాయ నమోనమః ।
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః
ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః ॥3౧॥

అర్థః—విశ్వోత్పత్తౌ=జగత్తుయొక్క పుట్టుకలో. బహుళరజసే= అధికమైన రజోగుణము గలిగినట్టి, భవాయ= కారణభూతుడైన భవునకు, నమోనమః= అనేక నమస్కారములు, జనసుఖకృతే= సృష్టిలోని సమస్త ప్రాణుల సుఖము కొరకు, సత్త్వోత్పత్తౌ = సత్త్వముయొక్క పుట్టుకలో, మృడాయ=సుఖకరుడైన మృడునకు, నమోనమః = నమస్సులు. తత్సంహారే = ఆ జగత్తు యొక్క ప్రళయమునందు, ప్రబలతమసే=అధికమైన తమోగుణము గల్గినట్టి, హరాయ = లయకరుడగు హరునకు, నమోనమః = నమస్కారములు, నిస్త్రైగుణ్యే = త్రిగుణాతీతమైన, ప్రమహసిపదే= మిగుల శ్రేష్ఠమైన (పరంజ్యోతి) స్థానమునందు, శివాయ = కల్యాణ స్వరూపుడగు శివునకు, నమోనమః = నమస్కారములు.

తా. విశ్వమును సృష్టించుటలో రజోగుణసంపన్నుడై భ
డనబడువాడును, జనుల రక్షణమునందు సత్త్వగుణపూర్ణుడై మృ
డనబడువాడును, ఈ జగత్ప్రళియమునందు తమోగుణ భరిత
హరు డనబడువాడును, త్రిగుణాతీతమైన పరంధామపదమునందు వె
యుచు శివు డనబడు నట్టియును నీకు మహాప్రభూ! నమస్కారము
నమస్కారములు!!

వి. ఈ స్తుతిగూడ వేదమందలి రుద్రనమకమువలె నున్నది. స్తోత్రము
కావ్య సర్గములను ముగించునపుడు అంత్యమున ఛందస్సును మార్చుట సంప్రదాయ
ఈ మహిమ్నమున మొదటినుండి ముప్పది శ్లోకములవరకు శిఖరిణీవృత్తములు. ఈశ్లోక
హారిణీవృత్తము. న స మ గ స ల గ ములును, ౬ వ ౧౦ వ స్థానముల యతియు
ఉన్నచో నది హారిణి యనబడును. ఈ శ్లోకమున విశ్వముయొక్క సృష్టి స్థితిలయము
భవ మృడ హరాది రూపములతో జేయుననియును, దీని నంతయు తనలో నణగిం
కొని కేవలము దివ్య మంగళస్వరూపము గల శివనామముతో సదా వెలుంగుననియు
భావము. అనగా సాకార నిరాకార రూపములు రెండు పరమేశ్వరునకు గలవని ని
శంకముగ సిద్ధాంత మగుచున్నది, "యతోవా ఇమాని భూతాని" "శివ మద్వైత
చతుర్థం" మున్నగు ప్రమాణము లిందుకు సిద్ధముగా నున్నవి. ॥౩౧॥

అవ:— కవి వినమ్రుడై తనస్తుతిని శివపాదసన్నిధి నర్పించుచున్నాడు.

కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం
క్వచ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః
ఇతి చకితమమందీకృత్య మాం భక్తిరాధాత్
వరద చరణయోస్తే వాక్యపుష్పోపహారమ్. ॥౩౨॥

అర్థ:—వరద=ఓ భక్తపాలకా! కృశపరిణతి = అల్పమైన ప
పాకముగల, క్లేశవశ్యం=దుఃఖమున కధీనమైన, ఇదం=ఈ (నాయొక్క
చేతః=మనస్సు, క్వచ=ఎడనో, గుణసీమోల్లంఘినీ =గుణముల మర్యా
దను మీరినట్టి, తవ=నీయొక్క, శశ్వదృద్ధిః = లోకోత్తరమైన మహై
శ్వర్యము,క్వచ=ఎడనో? ఇతి=ఇట్లు, చకితం=భీతుడనైన, మాం=నన్ను
భక్తిః=నీ పదభక్తి, అమందీకృత్య=అభయము నిచ్చి, తే=నీయొక్క
చరణయోః = పాదయుగ్మమునందు, వాక్యపుష్పోపహారం = వాక్యము
లనెడు పుష్పముల పూజను, ఆధాత్ = చేయించెను.



తా. ఓ పరమేశ్వరా! ముక్తిదాయకా! నా బుద్ధియూ మిగుల

కొంచెమైన ప్రజ్ఞగలది. సంసారతాపత్రయముచే నాశమొందెడు స్థితిలో నున్నది. ఇట్టి నా యల్పబుద్ధి యెక్కడ? త్రిగుణాతీతమైనట్టియు, అద్భుతమైనట్టియు నీ యొక్క మహిమ యెక్కడ? ఇట్లు తలపోసి కంపించు చుంటిని. కాని నీపాదములందు నాకుగల అనన్యమైన భక్తి నాభయమును బోనాడి, ఉత్సాహము గల్గించి నీ చరణద్వంద్వమునందు నాయీ స్తోత్రరూపమైన పుష్పముల నర్పింపజేసి ధన్యుని గావించినది.

వి. కవి మిక్కిలి వినయముగ తన యహంకారమును పరిహరించుకొనుచు భక్తి వశుడై ఇట్టి స్తోత్రమును రచించితినే కాని నిను బొగడ నాతరమా యని సమాప్తి గావించినాడు. ఇది ముమ్మాటికి సత్యము. పరమేశ్వరభక్తిసంపన్నుడు కానిదే ఇట్టి యమూల్యమైన ఆమ్నాయమువంటి స్తవమును విరచింపజాలడనుట నిక్కువము. ఇంకొక సంగతి గమనింపదగియున్నది. ఈ యాచార్యునకు పుష్పదంతు డని నామము కలదు. పువ్వులవలెనుండు పలువరుస గలవాడని దీని కర్థము. ఇతడు శివుని చేతితో పూజించినపుడును పుష్పముల నర్పించుచుండెను, నోటితో ధ్యానించు నపుడును పుష్పములతో, వాక్యపుష్పములతో శివు నలంకరించెను. అనగా పుష్పములవలె హృద్యములైన పద్యములను బల్కెనని నిస్సంశయముగ జెప్పవచ్చును. పుష్పదంతుని నోటినుండి పుష్పములు గాక మరేమి వెలువడును? ఇట్టి భక్తుని బుట్టించిన భవుడును ఇట్టి పుష్పపూజ గావించిన పుష్పదంతుడును జగద్వంద్యులు. ఈ శ్లోకము మాలినీవృత్తము. ననమయయ గణము లుండవలెను ॥౩౨॥

[మహిమ్నస్తవ మింతవరకే యని కొందరమతము. శిలాశాసన ప్రతిలోను ఇంతవరకే కలదు. క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతమున నున్న విశ్వారాధ్యుడను పండితుడు ౩౧ శ్లోకముల వఱకు వ్యాఖ్యను రచించినాడు కావున నివియును ప్రాచీనములే! విశేషములు పీఠికలో జూడుడు.]

అవః—కవి తన ప్రాగల్భ్యమును పరిహరించుచున్నాడు.

అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖినీ పత్రముర్వీ ।
లిఖతి యది గృహీత్వా శారదా సార్వకాలం
తదపి తవ గుణానామీశ పారం న యాతి. ॥౩౩॥

అర్థః—ఈశ=ఓమహేశ్వరా! అసితగిరి సమం = అంజనాద్రికి సమమైన, కజ్జలం=కాటుక (సిరా) గా, సింధుపాత్రే = సముద్రమనెడు పాత్ర (సిరాబుడ్డి) లో, సురతరువరశాఖా=కల్పవృక్షముయొక్క పెద్ద

కొమ్మ, లేఖనీ=కలముగా, ఉర్వీ=భూమి, పత్రం=కాగితముగా, స్యాత్=అగుచో, గృహీత్వా=గ్రహించి, శారదా = సరస్వతి, సార్వకాలం=ఎల్లప్పటికి, లిఖతి యది=వ్రాయుచో, తదపి=అటులైనను, తవ=గుణానాం=గుణములయొక్క, పారం=తుదను, న యాతి=పొందదు.

తా. ఓ మహేశ్వరా! సముద్రమునే సిరాబుడ్డిగాజేసి, అం గిరి యంతటి కాటుక నందు బోసి, ఎన్నటికిని అరుగని కల్పవృక్షము యొక్క పెద్దకొమ్మను కలముగావించి పృథ్వినంత కాగితముగా దీసి విద్యాస్వరూపిణి సరస్వతీదేవియే నీ గుణగణములను యావజ్జీవితము వ్రాయబూనినను వ్రాయజాలదు. నీ వపారమహిముడవు. నీ బూర్ణముగ బొగడ నెవరితరమునుగాదు.

వి. ఇది అతిశయోక్తిగాదు. స్వభావోక్తి. ఇదియు మాలినీవృత్తమే ॥౩౩॥

అవ:—కవి తననామము దెల్పుచున్నాడు.

అసురసురమునీంద్రైరర్చితస్యేందుమౌళే-
ర్గ్రథితగుణమహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య ।
సకలగుణవరిష్ఠః పుష్పదంతాభిధానో
రుచిరమలఘువృత్తైః స్తోత్రమేతచ్చకార ॥౩౪॥

అర్థ:—సకలగుణవరిష్ఠః=సమస్త సద్గుణాధికుడైన, పుష్పదంతాభిధానః = పుష్పదంతు డను పేరుగల వీరమాహేశ్వరుడు. అసుర సుర మునీంద్రైః=దేవాసుర,మునీశ్వరులచేత, అర్చితస్య=పూజింపబడినవాడు, ఇందుమౌళేః=చంద్రశేఖరుడును, గ్రథితగుణ మహిమ్నః = పరికల్పింపబడిన గుణము లనెడి మహిమగలవాడును, నిర్గుణస్య = గుణాతీతుడు అగు, ఈశ్వరస్య = పరశివునియొక్క, రుచిరం = రమ్యమైన, ఏతత్ ఈ, స్తోత్రం = స్తవమును, అలఘువృత్తైః = శిఖరిణి మున్నగు వృత్తములచేత, చకార = చేసెను.

తా. సద్గుణభూషితుడును పుష్పదంతనామము గలవాడు అగు వీరమాహేశ్వరుడు విష్ణ్వాదిదేవతలు, రావణాద్యసురులు, దాది మహర్షులు మున్నగు సకల భక్తుల పూజలు గొన్నవాడు

ఎప్పటి కప్పుడు స్వేచ్ఛవలన మహామహిమల సృజించువానిను, త్రిగుణాతీతుడును అగు పరమేశ్వరునియొక్క ఈ రమ్యమైన స్తవమును చక్కని వృత్తములతో విరచించెను.

వి. ఇక్కడ "సకల గణవరిష్ఠః" అను పాఠమున్నపుడు సమస్తప్రమథాధిపుడైన అను అర్థమును గ్రహింపవలెను.

అవ:—ఫలశ్రుతిని జెప్పుచున్నాడు.

> అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్ర మేతత్
> పఠతి పరమభక్త్యా శుద్ధచిత్తః పుమాన్ యః।
> స భవతి శివలోకే రుద్రతుల్యస్తథాత్ర
> ప్రచురతరధనాయుః పుత్రవాన్ కీర్తిమాంశ్చ ॥౩౫॥

అర్థ:—అహరహః = ప్రతినిత్యమును, ధూర్జటేః = శివునియొక్క, ఏతత్ = ఈ, అనవద్యం = నిర్మలమైన, స్తోత్రం = స్తవమును, పరమ భక్త్యా = మిగుల భక్తితో, శుద్ధచిత్తః = నిర్మలాంతఃకరణముగల, యః = ఏ,పుమాన్ = దేహి, పఠతి = పఠించుచున్నాడో, సః=వాడు, శివలోకే = కైలాసమునందు, రుద్రతుల్యః = శివసమానుడును, అత్ర = ఈ లోకమునందు, ప్రచురతరధనాయుః = మిక్కిలి దీర్ఘాయుర్భాగ్యములు గలవాడును, పుత్రవాన్=సంతానసంపన్నుడును, చ=మరియు, కీర్తిమాన్=యశఃపరిపూర్ణుడును, భవతి=అగుచున్నాడు.

తా. నిర్మలమైన ఈ శివస్తోత్రమును ఎవ్వడు పరిశుద్ధమనస్కుడై ప్రతినిత్యము భక్త్యతిశయముతో పారాయణ మొనర్చునో, వాడు ఈ లోకమున ఆయురారోగ్యభాగ్యములను, సంతానమును బడసి అంత్యమున కైలాసప్రాప్తి గల్గి శివసాయుజ్యము పొందగలడు.

వి. నిక్కముగ నీ స్తవమును ఇందు జెప్పబడిన విధముగ అనగా ప్రతినిత్యము, శుచిర్భూతుడై, స్థిరచిత్తముతో, భక్తితో పఠించిన సర్వవిపత్తులు తొలగి సౌఖ్యము చేకూరుననుట పెద్దల వాక్యమువలనను స్వానుభవమువలనను తెలియబడినది. ॥౩౫॥

[ఇక ముందు ముద్రింపబడు శ్లోకములు ప్రాచీనప్రతులలో సరిగా లేవు. కొన్ని శ్లోకము లున్నను పాఠభేదములు మెండు. క్రమభేదమును గలదు. ఇవి పుష్పదంతుడు

విరచించినని కావని పండితు లనుచున్నారు. ఐనను చాల దీర్ఘ కాలమునుండి పారా యణములో నున్నవి కావున నిట నీయబడినవి. ఇవి సులభముగా నున్నందున తాత్పర్యము మాత్రిమే వ్రాయబడినది.]

వపుః ప్రాదుర్భావాదనుమితమిదం జన్మని పురా
పురారే న క్వాపి క్షణమపి భవంతం ప్రణతవాన్।
నమన్ ము క్తః సంప్ర త్యహ మతనురగ్రేఽప్యనతిమా।
నితీశ క్షంతవ్యం తదిదమపరాధద్వయమపి ॥౩౬॥

తా. ఓ పురారీ! నేను ఇపుడు పొందిన ఈ దేహమువలననే వెనుక నే జన్మమునందును నినుబూజింప లేదని ఊహించుకొనవచ్చును. నిన్ను పూజించినచో అపుడే ముక్తుడ నయ్యెడివాడను; ఈ శరీరము వచ్చియుండదు కదా! ఇక ఇపుడా నిన్ను స్తుతించుచున్నాను కావున ముక్తుడనై పోదుననుటలో సందియమే లేదు. అయితే ఇకముందు నాకు జన్మము లేదు కావున ఈ దేహత్యాగానంతరముకూడ నిను స్తుతింపజాలను. ఇవ్విధముగ పూర్వజన్మముననను, భవిష్యజ్జన్మముననను నిను స్మరింపలేదను ఈ రెండు అపరాధములను క్షమింపగోరుచున్నాడ ని. ఈ శ్లోకము దక్షిణ దేశమున మాత్రిము ప్రిచారము గన్నది.

శ్లో. దీక్షా దానం తప స్తీర్థం, జ్ఞానం యాగాదికాః క్రియాః।
మహిమ్నః స్తవపాఠస్య, కలాం నార్హంతి షోడశీం ॥౩౭॥

తా. వ్రతదీక్షలు, గోభూహిరణ్యాదానములు, చాంద్రాయణాది తపములు, కాశీరామేశ్వరాది తీర్థయాత్రలు, వాజపేయాది యాగములు మున్నగు వాని నన్నింటిని గలిపినను; మహిమ్న స్తవ పఠనము వలన గలుగు ఫలముయొక్క పదారవవంతుకు గూడ సరిరావు. అనగా ఈ స్తోత్రిము సర్వశ్రేష్ఠమైన దని భావము.

శ్లో. మహేశాన్నాపరో దేవో, మహిమ్నో నాపరా స్తుతిః।
అఘోరాన్నాపరో మంత్రో, నాస్తి తత్త్వం గురోః పరం ॥౩౮॥

తా. మహేశ్వరునికంటె వేరు దైవము లేదు. మహిమ్నము కంటె వేరు స్తుతి లేదు. అఘోరముకంటె వేరు మంత్రిము లేదు. గురువుకంటె వేరు తత్త్వము లేదు. అనగా దేవతలలో మహేశ్వ

రుడే యధికు డైనట్లు స్తుతులలో కెల్ల మహిమ్న స్తవము సర్వశ్రేష్ఠ మని సూచితము.

శ్లో. అసమాప్తమిదం స్తోత్రం, పుణ్యం గంధర్వభాషితం ।
అనౌపమ్యం మనోహారి, శివ మీశ్వరవర్ణనం . ॥౩౯॥

తా. పుష్పదంత గంధర్వ నిర్మితమైనదియు, పవిత్రమైనదియు, అసమాన మైనదియు; మనోహరమైనదియు నగు నీ స్తోత్రము సమాప్తము కాకపోయినను ఈశ్వరవర్ణన కలిగియున్నది కావున సర్వదా మంగళకరముగ వెలుంగును.

వి. అసమాప్తం (సమాప్తము కానిది) అను పాఠమే సర్వత్ర కలదు. ఈ స్తోత్రము సమాప్తము కాలేదని యేల భావింపబడుచున్నదో తెలియదు. ౩౧ వ శ్లోకమువలన నీ స్తుతిని సమాప్తము గావించియే పుష్పదంతుడు శివున కర్పించినట్లు స్పష్టమగుచున్నది. బహుశా శ్లోకములు కొలదిగా నున్నందుననో ఈ ఫలశ్రుతిని తర్వాతివారు వ్రాసినందుననో దీనిని అసమాప్తముగా భావించి యుందురు. కొన్ని చోట్ల 'ఆసమాప్తం' అను పాఠమును కలదు. అపుడు "స్తోత్రముయొక్క సమాప్తి పర్యంతము" అని అర్థము నుడువవలెను.

కుసుమదశననామా సర్వగంధర్వరాజః
శిశుశశిధరమౌళే ర్దేవదేవస్య దాసః।
స ఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏవాస్య రోషాత్
స్తవనమిద మకార్షీద్ దివ్యదివ్యం మహిమ్నః ॥౪౦॥

తా. బాలచంద్రుని తల దాల్చినవాడును, దేవదేవుడును అగు శివునియొక్క కేవలదాసుడైన పుష్పదంతు డను గంధర్వరాజు శివాపరాధమువలన (శివనిర్మాల్యము దాటుటవలన) తన మహిమ గోల్పోయినవాడై ఈ దివ్యమైన మహిమ్న స్తుతిని విరచించి మరల శివప్రీతి సంపాదించె నని భావము.

సురవరమునిపూజ్యం స్వర్గమోక్షైకహేతుం
పఠతి యది మనుష్యః ప్రాంజలిర్నాన్యచేతాః।
వ్రజతి శివసమీపం కిన్నరైః స్తూయమానః
స్తవనమిదమమోఘం పుష్పదంతప్రణీతం ॥౪౧॥

తా. సురలకు మునీశ్వరులకు పూజ్యమైనట్టియు స్వర్గమునకు ముక్తికి కారణమైనట్టియు అమోఘమైనట్టియు ఈ పుష్పదంతవిర చితమైన స్తోత్రమును ఎవ్వడు ఏకాగ్రచిత్తము గలిగి భక్తితో చేతులు మొగిడ్చి పఠించునో; వాడు కిన్నరులతో పొగడబడుచు అంత్యమున శివసన్నిధిని జేరును. అనగా వాని కీర్తిని కిన్నరులు గానము చేతు రని యును, శివసాయుజ్యముక్తి గల్గుననియును భావము.

శ్రీపుష్పదంతముఖపంకజ నిర్గతేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ।
కంఠస్థితేన పఠితేన సమాహితేన
సుప్రీణితో భవతి భూతపతిర్మహేశః ॥౪౨॥

తా. శ్రీ పుష్పదంతుని ముఖకమలము నుండి యుద్భవించి నట్టియు, పాపహరమైనట్టియు,శివున కానందకరమైనట్టియు ఈమహిమ్న స్తుతిని కంఠస్థము గావించి, సమాధానముగా ఎవడేని పఠించుచో భూతనాథుడగు మహేశ్వరుడు ప్రసన్నుడై వరముల ననుగ్రహించు నని భావము.

శ్లో. యత్కృత్యం తన్న కృతం, యదకృత్యం కృత్యవత్తథాచరితం।
ఉభయోః ప్రాయశ్చిత్తం, శివ తవ నామాక్షరద్వయోచ్చరితం ॥౪౩॥

తా. ఓ మహేశా! చేయదగిన వాని వదలితిని. చేయదగని దానిని ప్రీతితో చేసితిని. శివ యను నీనామముయొక్క రెండక్షరముల స్మరణమే నా పై రెండపరాధములకు ప్రాయశ్చిత్తము, అనగా ఆ యప రాధములు నశించుటకు నీనామోచ్చారణమే సాధనము.

శ్లో. సంసారసర్పదష్టానాం, జంతూనా మవివేకినాం।
చంద్రశేఖరపాదాబ్జ స్మరణం పరమౌషధం ॥౪౪॥

తా. సంసార మనెడు సర్పముల కాటున బడినవారును, అవివేకు లును అగు ప్రాణులకు శ్రీశివుని పాదకమలముల స్మరణమే గొప్ప మందు. భవసర్పవిషమునకు శివస్మరణ మహౌషధమని మెరుగునది,

శ్లో. ఏకకాలం ద్వికాలం వా, త్రికాలం యః పఠేన్నరః।
సర్వపాప వినిర్ముక్తః శివలోకే మహీయతే ॥౪౫॥

తా. ఈ స్తుతిని దినమున మూడుమారులుగాని రెండుమారులు గాని చివరకు ఒకమారుగాని వారివారి శక్తివంచన లేకుండ పఠింతురేని సర్వపాపముల నుండియు విముక్తి నంది శివసన్నిధి జేరుదురు.

శ్లో తవ తత్త్వం న జానామి, కీదృశోఽసి మహేశ్వర।
యాదృశోఽసి మహాదేవ, తాదృశాయ నమోనమః॥ ౪౬॥

తా. ఓ మహాదేవ! ఓమహేశ్వర! నీ తత్త్వ మెట్టిదో నీ వెట్టి వాడవో నే నెరుగను. నీవు ఎట్టివాడవై యున్నావో అట్టి నీకు నమస్కృతులు.

శ్లో. ఇత్యేషా వాఙ్మయీ పూజా, శ్రీమచ్ఛంకరపాదయోః।
అర్పితా తేన దేవేశః ప్రీయతాం మే సదాశివః ॥౪౭॥

తా. ఈ విధముగ వాగ్రూపమైన పూజ శ్రీ శంకరుని పాదము లందు సమర్పింపబడినది. దీనితో దేవదేవుడైన యా సదాశివుడు ప్రసన్నుడగు గాక!

ఇది శ్రీ మద్వేదాగమోపనిషత్సిద్ధవిమలవీరశైవమహామతస్థాపనాచార్యశ్రీజగద్గురు
రేణుకాచార్యవర్యశిష్యప్రశిష్యపారంపర్యధర్మ, వీరగోత్రచిదిరేమఠవంశ్య
నాగభూషణార్య శ్యామలాంబాదంపతీగర్భావిర్భూతికర్మ, కాశీపండిత
గురుకులసమాసాదిత వేద కావ్యస్మృతితీర్థసాహిత్యవిశారదధర్మా
చార్యవిద్యానిధివిద్యారత్నాదిబిరుదవర్మ, పండిత
చిదిరేమఠీయవీరభద్రశర్మ విరచితంబగు
శివపంచస్తవీభక్తరంజినీ వ్యాఖ్యానమున
మహిమ్నఃస్తుతి సమాప్తము.

ఓం

# ఆంధ్ర మహిమ్నములు

## (౧) శ్రీ పన్నాల రామబ్రహ్మశాస్త్రికృతి

మ. చెలువౌ రాజమహేంద్రి గౌతమికిఁ బ్రాచిం గోటిలింగాఖ్య ని
ర్మల తీర్థంబున, జల్లపల్లికుల రామబ్రహ్మసంప్రేరణా
విలసద్వైశ్యవరాప్త పందిరిమహాదేవేత్థ సత్రాంతిక
స్థలిఁ దత్కారిత నూతనాలయుని నిష్ఠంగొల్తుఁ గోటీశ్వరున్.

చ. పరమము నీ మహామహిమ, పార మెఱుంగనివాఁడు నిన్నుతిం
ప రహి ననర్హుఁడైన నల బ్రహ్మముఖుల్ గననట్ల యాదు ర
స్వరుసఁ దలంప కంద రనవద్యత బుద్ధికొలంది నిన్నుతిం
తు రిపుడు నాదు పూన్కియును దుష్టము గాదు హరా, మహేశ్వరా!

మ. హర వాఙ్మానస దూరగంబని యతద్వ్యావృత్తిచేఁ బల్కుఁ దే
వర భీతిన్ శ్రుతియు న్భవన్మహిమ నెవ్వం డర్థి వర్ణింపఁ గో
చర మేతీరు గుణంబు లెన్నియని కాంచన్ వచ్చుఁ ద్రైగుణ్య భా
వరతిం జెందినవేళ సందఱి మనోవాక్కుల్ ప్రవర్తించెడున్.

చ. పరమ సుధామధుప్రచురభవ్యరసోక్తులు నేర్చు నీకు నా
సురగురువాక్కులైనఁ బురసూదన! మెప్పొనగూర్చునే! భవ
త్సరసతరోరుసద్గుణకథానుకృతంబున నాదు వాణి సా
దరతఁ బవిత్రఁ జేయఁగ నెదం దొరకొంటిని గాని యిత్తరిన్.

మ. జగదుత్పత్త్యవన ప్రశాంతికర మం చత్త్రయ్యుపాస్యంబు భి
న్నగతోపాధిగత త్రిమూర్తిధర మెన్న న్నీ మహైశ్వర్య మి
జ్జగతిన్ మూఢులు కొంద ఱీశ! చెఱుప న్సత్యాజ్య యాక్రోశి మ
ర్భగ రమ్యస్థితి విన్కిఁ జేసెదరు వారల్ దానఁ జేటొందరే.

---

* ఈ మహిమ్నమునకు పెక్కు ఆంధ్రీకరణములు కలవు. అందు ప్రాచీ
కవికృతి యొకటియు, ఆధునిక కవికృతి యొకటియు నిట ప్రకటింపబడినవి.

ఉ. ఏనెఱిఁ జెంది యే మెయిని యేమి యుపాయముఁ బూని ధాతయై
యే నెలవొంది యేమిటికి నీ త్రిజగంబులు సేయు నే యుపా
దానము చే ననంబడు కుతర్క మతర్క్య విభూతి నొప్పు నీ
పైని జగంబు మోహపడఁ బాడను గొందఱు వ్రేల దుస్థమై. ౫

చ. అమరవరా! ధరాద్యవయవాప్తి జగంబుల పుట్టు కల్లయే?
యమర నధీశుఁ బాసి యది యౌనె, జగంబుల కీశ్వరుండ కా
క మరి యొకండు చేయ సమకట్టుట సాగునె, నిన్నుఁ గూర్చి మం
దమతు లధీశ! సంశయమునం బడి గుందుదు రంతియే కదా! ౬

ఉ. పాశుపతంబు, వైష్ణవము, బ్రాహ్మము, సాంఖ్యము, యోగమంచు న
క్లేశపథంబు భేదము లలిం గొన నందిది యొద్ది మంచి యం
చాశల జీవితం బరుగు నయ్యయి దాల మెలంగు వారి కీ
శా! శరణంబ వీవొకఁడ వైతి జలంబుల కబ్ధికై వడిన్. ౭

ఉ. అంగజభూతి, పాములు, గజాజినముం, గకపాల, మెద్దు ఖ
ట్వాంగము, నక్కుఠార మభయప్రద! నీ కివియే ఫలాప్తిఁ జే
ర్పంగల సాధనంబులు, సురల్గొని రయ్యయి వృద్ధి నీదు భ్రూ
రింగణమీాయ, భోగమృగతృష్ణఁ గలంచునె నిర్మలాత్మునిన్? ౮

చ. ధ్రువ మను నొక్కఁ డధ్రువ మరూఢియనున్, మఱియొక్కఁ డధ్రువ
ధ్రువతల వ్యస్తరీతి, నొకరుండు సమస్తము వల్కు, వారిచే
త విహసితుండు వోలె పురదైత్య విమర్దన! నిన్నుతింప సి
గ్గువడుదు ధార్ష్ట్యమే యనఁబడున్ గద వాఙ్ముఖరత్వ మెన్నఁగన్. ౯

చ. గిరిశ! భవన్మహత్త్వఁ బరికింపఁ దలంచి విరించి మీఁదికిన్,
హరి యిల క్రిందికిన్ జని, మహానలమూర్తి నినుం గనంగఁ జా
ల రయిరి, భక్తి నమ్మిక యెలర్ప నుతింపఁగ, వారి కంత దా
న రహిఁ గొనెన్, భవన్మహిమ నమ్మి భజింప ఫలింపకుండునే? ౧౦

చ. అలయక ముజ్జగంబది భయంపడి యేలె దశాస్యుఁ డాహవ
స్థలి నలి తీటబాటిలు భుజంబుల మేటిగనుంట మస్తకా
బ్జలలితమాల్యకల్పితభవత్పదకంజబలిప్రదాతయై
వెలసినవాని భక్తికిది విస్ఫురితంబ కదా త్రియంబకా! ౧౧

ఉ. ఆస భవన్నివాస మనియైనఁ దలంప కితం డధీశ! కై
లాసమునన్ భవద్భజన లంచితసారభుజావనంబుతో
వేసరి బూన్ప నీవు పెనువేఁలికొనన్ గదలింప గ్రింద దా
నీసు చెఁఱ బడెన్ ఖలుఁ డహీనపదస్థితి మూఢుఁడౌ కదా. ౧౩

చ. పరిజనవశ్య! లోకతతి బాణుఁడు కిందుగఁ జేసె నా పురం
దరు సిరి నుచ్చతన్ బరగుదాని వరప్రద! యబ్రిమే! భవ
చ్చరణసమర్చనాపరత సల్పెడు వానికి సట్టి పేర్మిఁ గాం
చ రమణ నెట్టియున్నతి నొసంగదు నీపయిఁగూర్చు మొక్కిలన్.

చ. అరిది యకాండకాండజభవాండపరిక్షయభీతియుక్సురా
సురకరణావిధేయమతిఁ జూపి విషంబును సంహరించు నీ
కురుగతి నైన కప్పు మెడ కొప్పు సిరి న్నెఱి నీక పోవునే
హర! భువనాభయవ్యసని కైన వికారము శ్లాఘ్యమే కదా. ౧౪

చ. సనరసురాసురంబయిన సర్వజగంబున నెప్పు డెచ్చటం
బని నెరవేర్చకాని తన పజ్జకు గావు జయాఢ్యుఁడైన యె
వ్వని విశిఖంబు లా స్మరుఁ డవద్యత నందఱి వేల్పులట్ల బో
రన నిను డాసి రూపఱెఁ దిరస్క్రియ దాంతులపైఁ బొసంగునే. ౧౫

చ. చరణవిఘట్టనన్ ధరణి సంశయగోచర మయ్యె మిన్ను నీ
శ్వర! పరితోభ్రమన్నిజభుజాపరిఘాభిహతగ్రహోత్కరో
ద్ధురదశఁ జెందె, నాకము విధూతజటాహతి దౌస్థ్య మొందె సా
రె రతి జగంబుఁ బ్రోచు విపరీతవిభుత్వముతో నటించుచోన్. ౧౬

చ. గగనము నిండి ఋక్షగణకాంతిగుణోచ్ఛ్రితఫేనరాశిఁ జె
న్నగు నది జాలు నీ శిరమునందు బృషల్లఘుదృష్ట మయ్యెఁ దా
నొగి మునిపీతవార్ధివలయోరుజగంబును ద్వీపరూప మొం
దఁ గఱపె దీననే యనుమితం బగు దివ్యమహత్త్వ నీ మెయిన్. ౧౭

చ. రథ మిల, వేదముల్ హరులు, రవ్యమృతాంశులు బళ్ళు, వేధ సా
రథి, గిరి విల్లు, శ్రీపతి శర మ్మిటులేల హళాహళుల్ నెఱిం
బ్రథితముగాఁ బురత్రియతృణంబు దహింపఁ దలంచు నీకు ద్వి
ణాశ్రిత! విధేయులనే బ్రభు లమర్చుట లీలకుఁగాని కార్యమే! ౧౮

చ. పురహర! వేయి పద్మములఁ బూజ నొనర్చుచు నిచ్చలు న్భవ
చ్చరణముల న్మురారి యల సంఖ్యకు నొక్కటి తక్కువైన భ
క్తిరతి నిజాక్షిపద్మమును దీసి యొసంగుటఁ జక్రధారి తా
బరిణతిఁ జెంది లోకముల బాగుగఁ బ్రోవఁగ జాగరూకుఁడౌ. ౧౯

చ. క్రతువు వినష్టమైన క్రతుకర్తల కీవ ఫలంబు నీఁ దొడం
గతిక్రియ నశ్వరం బగుటఁ గేవల మేడ ఫలించు దేవస
న్నుత! పురుషార్చ లేక క్రతునూత్నఫలాప్తికి నిన్ను నమ్మి కా!
రతి శ్రుతి గూర్చుచుం బరికరంబు జనుం డొగిఁ జేర్చుఁ గర్మలన్.

చ. తనుభృదధీశుఁడుం గ్రియల దక్షుఁడు దక్షుఁ డతండు యజ్వస
న్మునులకు నర్త్విగున్నతి ఘనుల్ సురలెల్ల సదస్యులిట్లు చే
సిన సవనంబు యజ్ఞఫలసిద్ధిద! నీవ హరించి తీశ! శ్ర
ద్ధ నతినవాని జన్నము లధఃపతనంబునకే యగుం గదా! ౨౧

చ. శ్రుతిహితనై జసత్పథనిరూఢిని బాసి స్వబంధుహార్ద వి
స్తృతకృప రోసి విప్రుఁ డొకఁ డీశ్వరపూజ నొనర్చువేళ దు
ర్మతిఁ దన తండ్రి నీకు నపరాధ మొనర్చినఁ గాలుఁ ద్రెంచి మ
ర్త్యత నపుడే యతండు ద్విదళతాపరిణామముచేత నీదయన్. ౨౨

ఉ. నాథ! స్వపుత్రి నేణిక యనం జనుదాని మృగాకృతిం బ్రజా
నాథుఁడు కోరి వెన్క మదనక్రియకై గమకింపగా మృగ
వ్యాధరయంబు సూపుచు శరాసముతో వెనువెంట నేగి య
వ్వేధ శరార్తి పాల్పరచి వ్రేలెద నిప్పుడు నట్ల గన్పడున్. ౨౩

మ. ననవి ల్బూను మరుం దృణంబుగతిఁ దోసం గాల్చఁగాఁ జూచియుం
దన లావణ్యము సూప మెచ్చి వపురర్ధప్రాప్తి మన్నించి తం
చును గౌరీసతి నిన్ను స్త్రీవశుఁడ వంచుం గాంచెనేనిం గటా!
వనితల్ ముగ్ధలు గారె? నిక్కముగ భాస్వద్ధీరతాభూషితా! ౨౪

చ. స్మరహర! నీ విహారము శ్మశానములందుఁ, బిశాచముల్ సఖుల్
హర! నృకపాలము ల్సరు,లహా! చితిభస్మ విలేప మిట్లు, దు
ర్భరమగు నీదు శీల మశివంబగుఁ గాక తలంచువారికిన్
బరమసుమంగళాకృతి [illegible] ౨౫

చ. మననమున బ్రిత్యగాత్మయుచు మానితయోగవిధిఁ మరుఁ నిరో
ధన మొనరించుచుం బులకితస్వతనూరుహులై ప్రమోదబా
ష్పనిచితనేత్రులై యతులు శర్వ! సుధాహ్రదమందు మున్గుభం
గి నెడఁద నద్ది గన్గొని సుఖించెద రప్పరతత్త్వ మీవ కా!.

చ. ఇనుఁడవు నీవు సోముఁడవు నీవు సమీరుఁడ వీవు హవ్యవా
హనుఁడవు నీవు విశ్వమయ! యప్పులు నీవు నభంబు నీవు పే
రనువగు భూమి నీవు పురుషాత్మవు నీ వని యింతనట్టు ని
న్నెనసి వచింతురే మెఱుఁగ మెయ్యది కేవలవస్తుతత్త్వముఁ.

చ. తివిరి త్రివర్ణభంగిఁ ద్రియిఁ ద్రిస్వరపాళిఁ ద్రిలోకిఁ ద్రిస్వరూ
ప విదితదేవులఁ వికృతిఁ బాసి వచించుచుఁ ద్వత్తురీయ ధా
మవివృతమై యణుధ్వనుల మన్నన మీఱుచు నిన్నుఁదా సుమా
ధవ! వినుతింతు నో మనుపదంబు సమస్తము వ్యస్తరూపునిఁ.

ఉ. పావనసూక్తి చెప్పు శ్రుతిభాతిగ నొక్కకరీతిని న్మహా
దేవభవోగ్రరుద్రు లని ధీరత భీముఁడు శర్వుఁ డంచు స
ద్భావన సీశుఁ డంచుఁ బశుపత్యభిధానుఁడ వంచు నొప్పు నా
మావళి నేతదష్టకమునందు వెలింగెడు నీకు మ్రొక్కెదఁ.

ఉ. మ్రొక్కెద నంతికస్థున కపూర్వవనప్రియ! దూరవర్తికిఁ
మ్రొక్కెద సూక్ష్మదేహి కభిభూతమనోజమహోరుమూర్తికిన్
మ్రొక్కెద వృద్ధరూపికిని రూఢిఁ ద్రినేత్రయువస్వరూపికిన్
మ్రొక్కెద సర్వవాచ్యునకు మ్రొక్కెద నీ కతిసర్వవృత్తికిఁ.

చ. బహుళరజంబునం జగముఁ బన్నెదు నో భవ నీకు మ్రొక్కెదఁ
మహురుదతంబు సత్త్వరతిఁ బ్రోచెదు నో మృడ నీకు మ్రొక్కెదఁ
మహితతమంబుచే భవుల మాన్పెదు నో హర నీకు మ్రొక్కెదఁ
రహితగుణుండవై పరత రాజిలు నో శివ నీకు మ్రొక్కెదఁ.

చ. కృశపరిపాక గోచరము క్లేశవశంబును నాదు చిత్తమే
డ శివ నెఱిఁ గుణావధి నొడంబడనట్టిది నీ మహత్త్వమే
డ శతవిధం బటంచు నెగడున్నను భక్తి యె భీతి వాపి త్వ
ద్వశతి వచన్సు మోపద భవచ్చరణంబుల కొప్పగూరిచెఁ.

మ. ఘననీలాచల మంత కజ్జలము చక్కఁ సింధు వ న్పాత్రి నుం
చి నిలింపద్రుమశాఖకం గలముఁగాఁ జేబూని భూపత్రిపైఁ
గొని యాశారద సార్వకాలమును గోర్కల్ మీఱ వ్రాయంగఁబూ
నిన నో యీశ! సమాప్తిఁ జెందవుగదా నీ సద్గుణోదంతముల్.

చ. హితమతియై సురాసురమునీంద్రసమర్చితుఁ డిందుమౌళి గుం
భితగుణుఁడయ్యు నిర్గుణతఁ జేర్చిన యీశుని కర్పితంబుగా
వితతగుణోత్తరుం డలఘువృత్తములన్ రుచిరంబుగాఁగ నీ
స్తుతి నల పుష్పదంతుఁడను సూరివరుం డొనరించె భక్తిచేన్. ౩౪

చ. అహరహ మగ్రభక్తి మెరయన్ విమలాశయుఁ డేమనుష్యుఁ డీ
యిహపరసాధనంబయిన యీశ్వరసంస్తవముం బఠించు వాఁ
డిహమునఁ బుత్రపౌత్రసుసమృద్ధియశఃకనకాయురాది నం
దు హరసమానుఁడై ముదముతో శివలోకము నందు నున్నతిన్.

చ. అనుమిత మయ్యె నాకిది పురాంతక మేన్గొని యుంటఁ గ్రింది జ
న్మను నిను నే నొకప్పుడు క్షణంబును మ్రొక్కఁడ నిప్డు మ్రొక్కి ము
క్తినెనయు చుంట నీ పయిని దేహము లేమిని మ్రొక్కఁజాల నా
ర్యనతచరిత్రి యిట్టి యపరాధయుగంబు సహింపగావలెన్. ౩౬

గీ. దీక్ష దానంబు తపమును దీర్థయాగ
హోమముఖ్యక్రియల్మఱియును వ్రతములు
పడయ నీ మహిమ్నస్తోత్రపాఠమునకుఁ
గనఁదగవు పదియాఱవకళకు సాటి. ౩౭

గీ. ఎన్న లేఁడు మహేశునికన్న దేవుఁ
డెన్న లేదు మహిమ్నంబు కన్న స్తోత్ర
మెన్నగా లే దఘోరము కన్న మంత్ర
మెన్నఁ దత్త్వంబు స్వగురుని కన్న లేదు. ౩౮

క. ముగియని యీస్తోత్రము పూ
జ్యగతిన్ గంధర్వభణితమై యసమానం
బగుచుఁ దమోహర మనఁ జె
న్నగు శివవర్ణనముల శుభావహమూర్తిన్. ౩౯

ఆ. కుసుమదశననామకుం డొక్క గంధర్వ
రాజబాలశశిధరావతంస
దాసుఁ డమితమహిమఁ దనరు దేవుని రోష
వశతఁ జెంది యీ స్తవం బొనర్చె.

చ. సకలామర్త్యమునీంద్రపూజ్యగరిమన్ స్వర్గాతిమోక్షైక హే
తుకమౌ నీ శుభపుష్పదంతరచితస్తోత్రంబు నే మానవుం
డకలంకాశయుఁడై కృతాంజలియునై యర్థిన్ జపించున్ శివాం
తికమున్ జెందు నతండు కిన్నరవరాతిస్తూయమానాత్ముఁడై.

ఉ. భాసురపుష్పదంతముఖపంకజనిర్మితమై హరప్రియం
బై సుకృతావహంబయి నిరాకృతకిల్బిషమైన యీ స్తవం
బే సుచరిత్రు కంఠమున నింటను బొత్తమునం దిరంబుగా
భాసిలు వాని భూతపతి ప్రబ్బి మహేశుఁడు ప్రోచుఁ బ్రీతుఁడై.

ఆ. కృత్య మెద్ది దానిఁ గెరలి చేయక యకృ
త్యంబు కృత్య మట్టు లాచరింపఁ
జెలఁగె నుభయమునకు శివ! నీదు నామాక్ష
రద్వయోచ్చరితమ రహిని కృతిగ.

క. భవసర్పదష్టులై తా, రవివేకిత మసలుచున్ భయార్తు లయిన జ
తువుల కల చంద్రశేఖరు, పరివిమలపాదాబ్జసంస్మరణ మౌషధమ్

ఆ. అమర నేకకాలమైనఁ ద్రికాలము
లైన నిత్య మెవ్వఁ డాదరించి
భక్తి నుడువు సర్వపాపనిర్ముక్తుఁడై
యొసఁగు నతఁడు శివునివసతియందు.

స్రగ్ధర. శ్రీమద్ధ్యానాఢ్య విప్పర్లినగర నిలయోద్రిక్త రాజేశభక్త
శ్రీమత్పన్నాలవంశోచ్ఛ్రిత మధురసుధాసింధుసంపూర్ణ రాకా
సోమ శ్రీ జగ్గనార్యస్తుత వియమసతీ సూనుతా శాలి సీతా
రామబ్రహ్మాఖ్యుఁ డా శర్వమహిమనుతి కాంధ్రంబుగాఁ గూర్చె దీనిన్

ఇతి శ్రీ పుష్పదంతాచార్య విరచిత మహిమ్నస్తోత్రమ్
శ్రీ పన్నాల రామబ్రహ్మశాస్త్రి విరచితపద్యసహితమ్.

ఉభయభాషా ప్రవీణ, అష్టావధాని

## (౨) శ్రీ వడ్డాది సీతారామాంజనేయ కవికృతి

శ్రీమంగదేవీ సతీమణీ రామయార్యోత్తములకుఁ దనయుండు నగుచు
శిష్టపరిపూజిత శ్రీపురాణమువంశలసమానముక్తాఫలంబు నగుచు
విద్వజ్జగన్నాథ విఖ్యాతి వెలయంగఁ దీర్ఘాదిబిరుదాళిఁ దేజరిలుచు
శ్రితశిష్యతతిహయగ్రీవుఁడు దక్షిణామూర్తియు మందార భూజ మగుచు

గీ. మహిత దేవీస్వరూపమై మహిని మనుచు, నాకుఁ బ్రత్యక్షదైవమౌ నాదుగురుని
సూర్యనారాయణకవీంద్రు శుభపదాబ్జ, పీఠిపై నీ స్తుతిఁ సమర్పించుకొందు.

క. రామస్వామి విబుధునకు, గామేశ్వరి కాత్మజుఁడు జగన్నాథగురు
స్వామి యతనిఁ గప్పలవా,యీ మహనీయాన్వవాయు నెద సేవింతున్.

---

చ. భవ! భవదీయసన్మహిమ పార మెఱుంగని వా రొనర్చు నీ
స్తవ మది నింద్యమేనియు విధాతృముఖామరసంస్తుతుల్ వృథా
వ్యవసితముల్ గదా! నిజహృదంతరసత్పరిణామజాతసం
స్తవ మది యోగ్యమైనను బ్రశస్తము నా స్తుతియత్న మిత్తఱిన్.

ఉ. ఆ నిగమమ్ము లెల్ల నభవా! నినుఁ గూరిచి "నేతి నేతి" యం
చూనిన భీతిఁ బల్కు మహిమోన్నతిఁ బ్రస్తుతిసేయ శక్య మె
వ్వానికి? నిర్గుణాత్ముని నెవండు కనుంగొనఁ జాలు? నిన్న వా
జ్మానసగోచరున్; సగుణగణ్యత యన్న సుసాధ మేరికిన్. ౨

చ. అమృతముఁ జిమ్ము నమ్మధురమౌ శ్రుతిసర్గ మొనర్చినట్టి బ్ర
హ్మమ వగు నీకు వింతయె! బృహస్పతిసంస్తుతి యైనఁగాని; నీ
విమలచరిత్రఁ బాడుచుఁ బవిత్రిత మామకజిహ్వ యొంద, డెం
దము దయివాఱ నో త్రిపురదాహక! నిన్ స్తుతిసేయఁ బూనితిన్.

చ. వరద! శ్రుతిప్రదర్శితము త్వన్మహిమోన్నతి, సృష్టిరక్షణా
హరణ! గుణత్రయాత్మక, మజాచ్యుతశంకరరూపసంభృతం
బరయ; జడుల్ కుతంత్రులయి నాస్తికవాదముఁ జేసి సన్మనో
హరపరమార్గమున్ మిగుల హర్షతఁ దిట్టి నశింతు రజ్ఞులై. ౪

శా. ఏ రూపంబుగలాఁడొ? కార్యమెచిదియో? యేవోయుపాయంబు లా
ధారంబెట్టిదియొక్కొ! యెయ్యది యుపాదానంబొ? తా బ్రహ్మయై
యీరేడుఁ జగముల్ సృజింపఁగ నటంచి వ్వాద మజ్ఞాళి దు
ర్వారభ్రాంతి నొనర్చు; నిట్టిద యతర్క్యంబందుఁ దుచ్ఛంబగున్. ౬

చ. అవయవయుక్తమైన భువనాళికి జన్మము లేదె? లోక సం
భవవిధి సృష్టి లేకయె ప్రవర్తిలునే? జను లేల శంకలన్
దవులుచు నీశ్వరేతరుఁ డొనర్పఁగ రాదొకొ యందు రజ్ఞులై
యెవఁడు సమర్థుఁ డీ భువనసృష్టికి నీశునికంటె నో ప్రభూ! ౬

మ. అలశైవాగమవైష్ణవంబులును, సాంఖ్యంబుల్, శ్రుతుల్, యోగ మీ
పలు తెన్నుల్ రుచిభేదజాబులు గదా! వక్రంబులున్ సక్రమం
బులునౌ భిన్నపథానువర్తులకు గమ్యుం డౌదు వీవే కృపా
కలితా! వాహినులంబుధిన్ దుదను నైక్యంబొందు చందంబునన్. ౭

మ. ఘనఖట్వాంగము, భస్మమున్, బరశు, వృక్షంబున్, గపాలంబు, స
ర్పణులున్, జర్మముఁ దంత్రసాధనము లాత్మారాముఁడౌ నీకు; నిన్
జెనకన్ లేవు మరీచికాభవిష యోత్సేకంబు; లింద్రాదిదే
వనికాయంబు భవత్కటాక్షమున నైశ్వర్యోన్నతిన్ బొందదే! ౮

చ. పురమథనా! సమస్తజగముల్ ధ్రువమంచు నొకండు పల్కు, న
శ్వరమను నొక్కఁ, డింకొకఁడు వస్తువివేచన రెండు పల్కులున్
సరి యను; వీర లెల్ల నను నవ్వఁగ సిగ్గును బొందియున్ నినున్
వరమతి సన్నుతించెద నపారవచోనిపుణత్వసంపదన్. ౯

ఉ. గాలియు, నగ్గియున్ దనువుగాఁగొను నీమహిమం బెఱుంగఁ బా
తాళము, స్వర్గమున్ హరియు, ధాతయుఁ గ్రుమ్మరి నిన్ గ్రహింపఁగాఁ
జాలక నిండుభక్తియును, శ్రద్ధయుఁ బూని నుతింప వారికిన్
లీల మహత్త్వుఁ జూపితివి; నీపదసేవ యొసంగు నన్నియున్. ౧౦

శా. రావణుఁ డప్రియత్నత హరా! త్రిజగమ్ము లకంటకంబుగా
లావునఁ జేసియున్ భుజబలప్రభ డీల్పడ కుంట, శీర్ష ప
ద్మావళి నీపదాంబుజములందు విసిశ్చలభక్తిఁ జేర్మి, సం
భావితవృత్తిమై నిడుట త్వత్పదభక్తివిజృంభణం బగున్. ౧౧

శా. నీ సేవాధిగతోరుబాహుయుగళీసిద్ధప్రవిక్రాంతిఁ గై
లాసం బా దశకంఠుఁ డెత్తఁ గడుఁ జుల్కంగాఁ బదాంగుష్ఠ శీ
ర్షాసంగంబున నదిమి నొత్తవె మహేశా! వాఁ డధోలోకసం
వాసంబేఁ గనంబు, ద్రోహమతికిం బ్రాపించునే సద్గతుల్. ౧౨

చ. వరద! త్రిలోకముల్ స్వజనవశ్యమొనర్చుచు బాణుఁడింద్రరా
జ్యరమ నిరాకరించె; నది యబ్రమె? వాఁడు భవత్పదద్వయీ
సరసిజభక్తుఁడౌట నయసమ్మత మిప్పని వానికిఁ; నినున్
శిరమును వంచి మ్రొక్కిన విశేషమహామహిమంబు గల్గదే? ౧౩

చ. త్రినయన! లోకముల్ ప్రళయతీవ్రహాలాహలవహ్ని మ్రగ్గ న
య్యనువున సంచలించిన సురాసురులన్ దయఁజూచి యవ్విషం
బును గళమందు నుద్ధృతిగను బొల్చిన నల్లనిమచ్చ భూష నీ
కనఁ దగు; లోకవిప్లవము నాపెడు నీ కిది శోభయే సుమీ! ౧౪

మ. హర! దేవాసురమానవుల్ వెలయు లోకానీకమున్ గెల్చు న
మ్మగు కేలన్, జయశీలతన్ దనరు శంభద్బాణముల్ వ్యర్థమై
స్మరుఁడయ్యెన్ మరుఁ డన్యదేవునటు సామాన్యుం డటంచున్ నినున్
బరిభావించి; వశీకృతేంద్రియపరీభావోద్యమం బొప్పునే! ౧౫

చ. తటమట నొందె నీచరణతాడన నిబ్బువి; యభ్రమెల్ల నీ
చటులభుజార్గళప్రహతి జర్జరితగ్రహరాజి యయ్యెఁ; నీ
జటల పటుప్రహారమున స్వర్గము ఘూర్ణిలె; లోకరక్షకై
నటనము నీ వొనర్చు తరుణమ్మున నో విపరీతవర్తనా! ౧౬

మ. దివి నిండారుచు జిక్కఁజాల్ ద్విగుణదీప్తిం బూర్వ ఫేనచ్ఛవి
ప్రసరోద్గాఢత నబ్ధియై జగము ద్వీపం బట్లు వేష్టించు జా
హ్నవి నీమౌళిని మిర్రుమిర్రు మనెడున్ స్వల్పాంబుబిందుస్థితిన్
భవ! యుష్మత్తనుసంభృతోజ్జ్వలమహత్త్వస్ఫూర్తి సామాన్యమే!

చ. పురదహనం బనం గటికపోఁచయుఁ గాదు కదయ్య నీకు న
ర్వర యరదంబు, సూతుఁ డలబ్రహ్మ, నగేంద్రము విల్లు, చంద్రభా
స్కరులు రథాంగముల్, నృహరి కాండముగాఁగఁ జరించి మించవే
హర! యివి నీకు బ్రాంతియొకో? యాడమగాక భవత్ప్రభా[illegible] !

శా. అంభోజాక్షుఁడు మున్ సహస్రకమలాభ్యర్చైకదీక్షాసమా
రంభుం డౌనెడ నంబుజం బొకటి రుద్రా! లుప్తమైయుంట నే
త్రాంభోజంబుఁ ద్వదంఘ్రులం బురహరా! యర్పించె సద్భక్తి నా
శుంభద్భక్తియె చక్రరూపమునఁ బ్రోచున్ గాదె లోకత్రయిన్. ౧౯

చ. క్రతువు నశించు, నాశ మగు కర్మ మెటుల్ ఫలకారి? నీవు జా
గ్రతమెయిఁ దత్ఫలం బిడుదు కాదె? త్వదర్చన లేక యెయ్యెడన్
గ్రతువు ఫలించునే? జనులు కన్గొని నిన్ ఫలదప్రభుండుగా
శ్రుతులను నమ్మిచేయుదురు సూవె మఖాళి దృఢప్రయత్నతన్. ౨౦

మ. యజమానుండు క్రియైకదీక్షితుఁడు దక్షాఖ్యుం డుపబ్రహ్మ, ఋ
త్విజు లమర్త్యనివహుల్, సదస్యగణ మద్దేవప్రజం బిట్లుగా
యజియింపంబడియున్ మఖంబు, వరదా! వ్యత్యస్త మయ్యెన్ ఫల
ప్రజదానోత్సుకుఁ డైన నీయెడ నవిశ్వాసం బనర్థం బగున్. ౨౧

మ. సుజనాలంబితమార్గమున్, సహజమున్, శ్రుత్యుక్తమున్ నిర్భర
స్వజనప్రేమరసార్ద్రదివ్యకృప విధ్వంసమ్ముఁ గావించి యో
యజ! నీ కత్యపరాధియౌ జనకు పాదాబ్జమ్ము ఖండించియున్
ద్విజుఁ డొందెన్ వెనువెంటనే దివిజమూర్తిన్; వీడె మర్త్యత్వమున్.

మ. హరిణీరూపముఁగొన్న కూతును గురంగాకారమున్ బూని, శం
కరుహోద్భూతుఁడు మున్ రమింపఁగ బలాత్కారమ్ముఁ గావించు న
త్తరి నీ శాతశరాహతిన్ బడి, వియద్భాగంబునన్ భీతితోఁ
బఱచున్ నీ మృగయావిహారరభసప్రస్ఫూర్తిమై నేఁటికిన్. ౨౩

మ. పురసంహార! గృహీతచాపుఁ డగు నప్పుష్పాస్త్రు భూసక్రియన్
ద్వరమైఁ గాల్పఁగఁ జూచియున్ గిరిజ గర్వస్ఫూర్తితో స్త్రీయని
ర్భరలావణ్యము మెచ్చుచు న్నియమసంపత్తావకార్ధాంగభా
స్వరయాటన్ నినుఁ గామిగాఁ దలఁచు;వహ్వా! స్త్రీలు ముగ్ధల్ గదా!

మ. స్మరసంహార! శ్మశానమే విహరణస్థానమ్ము, భూతావళుల్
పరివారమ్ములు, లేపనం బగుఁ జితాభస్మంబు, రుండంబులే
సరముల్ నీ, కిటు లీ యమంగళవిలాసం బూనియున్ భక్తులన్
వరదా! ప్రోవఁగ [illegible] వై [illegible] భ్యలీలాగతిన్. ౨౫

శా. శ్వాసల్ నిల్పి మునీశ్వరుల్ మెయి గగుర్పాటొంద సర్వేంద్రియ
వ్యాసంగంబును మాని, స్వాంతమును బ్రత్యక్చిత్తమున్ జేర్చి, యు
ల్లాసోత్సంగితదృక్కులై కనుచుఁ బల్కన్ రాని జ్యోతిన్, సుధా
కాసారంబునఁ దోఁగి, కైకొనెడు సౌఖ్యశ్రీవి నీవే కదా! ౨౬

శా. నీవే సూర్యుఁడ, వీవె చంద్రుడవు; నీవే వాయు, వీవే జలం
బీవే యగ్నివి, నీవె యాకసము, వీవే భూమి, వాత్ముండవున్
నీవే యందు రిటుల్ త్వదాకృతివిదుల్ నిన్నున్ బరిచ్ఛిన్న వా
గావిర్భావముచే! నెఱుంగము త్వదన్యంబౌ పదార్థం బిలన్. ౨౭

చ. వరద! సమస్తమున్ మఱియు వ్యస్తము నొచు నకారమాదిగన్
బరఁగఁ ద్రివర్ణయుక్తి నిగమత్రితయంబు స్వరత్రయంబునున్
గరముఁ ద్రిమూర్తులన్ ద్రిభువనంబులఁ దెల్పి తురీయధామమున్
ద్వర నణునాదమై యెసఁగు తత్ప్రణవంబు నినున్ నుతించెదన్ ౨౮

శా. నీనామాష్టకమున్ నుతించును శ్రుతుల్ నిచ్చల్ "మహాదేవ! యీ
శానా! రుద్ర! మహోగ్ర! యో పశుపతీ! శర్వా! భవా! భీమ!" యం
చే నీ హేతువుచేఁ దురీయమయి నీ కెంతేఁ బ్రియంబౌ మహా
స్థానాధిష్ఠితదివ్యదీప్తికి నమస్కారమ్ముఁ గావించెదన్. ౨౯

మ. దరి వర్తిల్లెదువాఁడవై ప్రియదవా! దాదాల వర్తింతు; వు
ద్ధురసూక్ష్మాకృతివై స్మరాంతక! మహాస్థూలాకృతిన్ బొల్తు; వీ
శ్వర! వృద్ధుండవుగాఁగఁ దోఁచియు వయఃప్రౌఢిన్ విడంబింతు; వో
హర! సర్వాకృతి నొప్పెడీ వపుర! సర్వాతీత! నీకంజలుల్. ౩౦

మ. ఘనవిశ్వోద్భవకర్తవై భవ! రజోత్కర్షుండవౌ నీకు వం
దనముల్; సత్త్వము పేర్మి సౌఖ్యముల నందన్ జేయు నీకో మృడా!
ప్రణతుల్; తామసవృత్తి లోకములఁ గూల్చన్ బూను నీకో హరా!
వినతుల్; నిర్గుణుఁ, బూర్ణదీప్తు నిను సంప్రీతిన్ భజింతున్ శివా! ౩౧

మ. పరిపక్వంబును బొంద కార్తిఁ బడు నా భావోద్గమం బేడ నో
వరదా! నిర్గుణమైన తావకమహత్త్వం బేడ? నంచున్ దిగుల్
వారయంగా భవదంఘ్రియుగ్మరతి, వాక్పుష్పోపహారమ్ము, ని
ర్భరతాత్పర్యముతో సమర్పణ మొనర్పన్ జేసె భక్తిన్ ననున్.

ఉ. కాటుకకొండ యంత నుసిఁ గల్పిన, సింధువుఁ బాత్రిఁజేసి యా
హాటకగర్భురాణి, భువనాతతపత్త్రము నందుఁ గల్పకో
త్పాటితశాఖ లేఖినిగఁ బాణి గ్రహించి భవన్మహత్త్వమున్
బాటవ మొప్ప వ్రాసియును బారము నొందదు సూవె యీశ్వరా!

చ. అసురసుపర్వమానినిచయార్చితుఁ డీశుఁడు, నిర్గుణుండునై
యెసఁగు శశాంకభృన్మహిమ నెల్ల ననూనమనోజ్ఞవృత్తసా
రసమకరందపూరము విరాజిలఁ బ్రస్తుతి సేసెఁ బుష్పదం
తసురుచిరాభిధానుఁడు, గుణప్రవణుండు నితాంతభక్తితోన్. ౩౮

మ. అనవద్యం బగు ధూర్జటిస్తవము సత్యంతంబు సద్భక్తితో
ననయం బెవ్వఁడు సన్మతిన్ జదువునో యవ్వాఁడు కైలాసమం
దున సాక్షాచ్ఛివుఁడై వెలుఁగు, నిహమందున్ బుత్రపౌత్త్రాభివ
ర్ధనుఁడై సద్యశమున్ జిరాయువు, నుదారశ్రీలనున్ గాంచెడున్. ౩౯

మ. వపువుత్పాదనమాట నూహ్యము నమింపన్ లేదు నీకేను బూ
ర్వపు జన్మంబులలో తృణంబయిన; నిప్పట్లన్ నతిన్ జేసి జ
న్మపురాహిత్యమునన్ హాగుండ నగుటన్ భావిస్థితిన్ నేర నీ
త్రిపురారీ! ప్రణుతింప నియ్యుపకృతుల్ రెండున్ క్షమింపన్ దగున్.

క. దానతపోదీక్షాను
స్నానక్రతు హోమముఖ్య సత్క్రియలు మహే
శానమహిమ్నస్తుతి పఠ
నానందమునందు షోడశాంశము సరియే? ౩౨

గీ. పరుఁ డగు మహేశుకన్న దైవంబు లేఁడు;
శివమహిమ్నస్తుతిన్ మించు స్తవము లేదు;
మంత్రములలో నఘోరమంత్రంబు లేదు;
పరమగురుమూర్తి కన్నఁ దత్త్వంబు లేదు. ౩౪

క. అసమానమయ్యె నీస్తుతి
యసమానమనోజ్ఞమై మహాపూజ్యంబై
యెసఁగు శివంబై గంధ
ర్వసుభాషితమై మహేశవర్ణనమగుచున్. ౩౫

మ. నెలబాలున్ దలదాల్చు వేలుపుల మన్నీనిన్ సదా గొల్చువాఁ
డలగంధర్వవిభుండు పుష్పదశనుం డాచార్యరోషానలో
జ్జ్వలమాహాత్మ్యమునన్ స్వకీయమగు దివ్యత్వంబుఁగోల్పోవుటన్
విలసచ్ఛూలిమహత్త్వ సంస్తుతినిఁ జల్పెన్ దివ్యదివ్యంబుగన్. ౪౦

చ. మునివరదేవతానికరపూజితవృత్తము, స్వర్గమోక్షసా
ధనము, నమోఘమున్, గుసుమదంతమహాకవినిర్మితంబు; దీ
ని నెవఁ డనన్యచిత్తమున నిత్యముఁ బ్రాంజలియై పఠించు వాఁ
డెవయు శివస్వరూపమును నెంతయుఁ గిన్నరకీర్తనీయుఁడై. ౪౧

మ. శతకంఠప్రియమై, సమస్తదురితశ్రేణీసముత్పాటనా
యతశీలంబయి, పుష్పదంతముఖపద్మావిష్కృతంబై, గుణో
న్నతమౌ నీస్తుతి వ్రాయఁగాఁబడినఁ గంఠస్థంబయైనన్, గృహ
స్థితమై యున్న, శివుండు, భూతపతి ప్రీతిం బొందు నత్యంతమున్.

క. చేయఁదగినపని మానుట,
చేయంగా రానిదానిఁ జేయుట రెండౌ
నీ యపరాధములకుఁ దగు
ప్రాయశ్చిత్తము శివాక్షరద్వయజపమే. ౪౩

గీ. ధరణి సంసారవిషసర్పదష్టమగుచు
నుంతయు వివేకమే లేని జంతుతతికి
నిందుశేఖరపాదారవిందచింత
నామృత మదొక్కటియె పరమౌషధంబు. ౪౪

గీ. శివమహిమ్నస్తుతిం గొని యెవఁడు సమువు
నిత్య మొకమాఱో ముమ్మాఱో నిశ్చలమతి
వాఁడు సకలపాపవిముక్తభావుఁ డగుచుఁ
జేరి శివలోకమునఁ బ్రకాశించుచుండు. ౪౫

గీ. * నీదు తత్త్వమదెట్టిదో నీలకంఠ!
నీవదెట్టి వాఁడవో మఱి నేను దెలియ
నెట్టి రూపుతో నున్నాఁడ వట్టి నీకు
నతులు ఘటియింతు భక్తిమై నాగభూష! ౪౬

గీ. ఇట్లు వాఙ్మయపూజ గౌరీశు పాద
పద్మములలోన నర్పింపఁ బడియె నిదియు,
దీన సంప్రీతుఁ డగుఁగాత! దేవదేవుఁ
డిందుఖండధరుండు మహేశ్వరుఁడు. ౪౭

ఆంధ్రమహిమ సమాప్తము.

* [మహిమ్న స్తవమందలి చివర రెండు శ్లోకములకు ఆంధ్రకవుల పద్యములు కానుపింపనందున ఈ రెండు పద్యములను వ్రాసితిని.
—[illegible] వీరభద్రశర్మ.]

# శివపంచస్తవి

## ౨. మల్హణస్తవము

కాంతాకచప్రచయ పుష్పసుగంధిగంధ-
లుబ్ధభ్రమద్భ్రమర కర్బురకంధరాయ
గంధర్వయక్షసురసిద్ధ కిరీటకోటి-
సంఘట్టఘృష్టచరణాయ నమశ్శివాయ ॥౧॥

అర్థ:— కాంతా...కంధరాయ – కాంతా = శ్రీసతియైన పార్వతీదేవియొక్క, కచప్రచయ = కొప్పు సందుగల, పుష్ప= పువ్వుల, సుగంధి = సువాసనయొక్క, గంధ = మదముచేత, లుబ్ధ=ఆసక్తములై, భ్రమత్ = తిరుగుచున్న, భ్రమర = భృంగములచేత, కర్బుర= చిత్రమైన, కంధరాయ = కంఠము కలిగినట్టియు, గంధర్వ...చరణాయ- గంధర్వ = గంధర్వులేమి, యక్ష = యక్షులేమి, సుర = దేవతలేమి, సిద్ధ = సిద్ధులేమి - వీరలయొక్క, కిరీట = కిరీటముల, కోటి = తుదల, సంఘట్ట = రాపిడిచేత, ఘృష్ట = అరగిపోవుచున్నటి, చరణాయ = పాదములు గలిగినట్టియు, శివాయ = కల్యాణకరు డగు శివునకు, నమః = నమస్కారము.

తా. శ్రీపార్వతీదేవి కొప్పులో నున్న కుసుమ సుగంధముచే నాకృష్టములై వచ్చి గుంపులుగా జేరిన పెక్కు వన్నెల తుమ్మెదలచేత చిత్ర విచిత్రమైన గళము గలవాడును, సురాసురగంధర్వ కిన్నర సిద్ధ సాధ్యులు సమూహముగా వచ్చి యెడ తెగక నమస్కరించు చున్నందున వారి కిరీటముల యొక్క యగ్రభాగములచే సంఘర్షణ గల పాదములు గలవాడును, నిత్యమంగళ విగ్రహుడును అగు శివునకు నమస్కారము.

౨. కాశ్మీరదేశపు భారతీపీఠనగరమున నివసించిన మధుభట్టారకు డను శివద్విజు (శివార్చకుని)నకు మల్హణుడను కుమారుడుండెను. ఇతడు శివదీక్షితుడై వేదాగమశాస్త్ర

ముల నభ్యసించి, శివగణసేవకుడై తండ్రికి ప్రీతిపాత్రుడై యుండెను. అంత యువకుడైన మల్హణునకు దినమునకు వేయి స్వర్ణముల లెక్కతో నూరు వత్సరములకు సరిపోవు ధనము నిచ్చి తండ్రి కైలాసము నొందెను. పిదప ఈ మల్హణు డొకనాడు దేవాలయమున సేవార్థమై వచ్చిన పుష్పగంధి యను వేశ్య లావణ్యమున కాసక్తుడై, ద్రవ్యము నంతయు దాని పాలు గావించి, దానికి మల్హణి యను నామ మిడి కొంత కాలము సుఖించుచుండ, మల్హణి తల్లి తన కూతును మరియొక ధనికుని కంటగట్ట నెంచి ఈ మల్హణుని బహిష్కరించెను. ఆ మల్హణి క్రొత్త ధనికునితో మాట్లాడుచున్నను, హృదయమంతయు మల్హణునకర్పితమై యుండుటవలన ఆ ధనికుడు నిద్రింపగానే యా రాత్రి యిలు వెలుపలికి వచ్చి, తనకై వేచియున్న మల్హణుని గలిసికొని, విజయేశ్వరాలయమునకు వెళ్ళి, కొన్ని యుపశమన వాక్యముల బలుకుచు "హృదయేశ్వరా! నీవు విద్వచ్ఛరేణ్యుడవు, నీ వాక్చాతుర్యమును నను వినోదించుటకే వినియోగపరచుచున్నావుగాని యీ మహేశ్వరుని వర్ణించినచో శాశ్వతసౌఖ్యము చేకూరదా?" యనెను. అంత మల్హణుడు "నా హృదయము భవన్మయముగా (నీవే నీవగా) నున్నది కావున నీవు శివలింగము వెనుక సరిగా నిలుచుచో స్తుతి సలిపెద" నని యట్లే యామె నునిచి భావోద్రిక్తుడై "కాంతాకచప్రచయ"మ్ము వాదిగాచేసి ౩౮ శ్లోకములతో నద్భుతముగ స్తుతి గావించి. శివుని ప్రత్యక్షత నంది మహాశివభక్తుడగు మల్హణుడు తన్నే కాక మల్హణిని, ఆమె వృద్ధమాతను, ఆమె సాకుచుండిన చిలుకను గూడ నుద్ధరించి శివలోకము నందించెను.

ఈ మల్హణ కవి కాలమును సరిగా దెలియుటకు సాధనములు కానిపింపవు. కల్హణ, డల్హణ, బిల్హణ మున్నగు నామములు గలవారు కాశ్మీర దేశీయులు కావున నీ మల్హణకవియు కాశ్మీరదేశభవు డనవచ్చును. క్రీ. శ. ౧౨౩౦ (శా. శ. ౧౧౫౫) ప్రాంతమున నున్న పాలకురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రమున నీ మల్హణుని కథను వివరించినాడు. ఈ కవికి తర్వాతి వాడైన కన్నడదేశపు విశ్వారాధ్యుడు ఈ మల్హణ స్తవమునకు సంస్కృత వ్యాఖ్యానమును విరచించినాడు. అష్టాదశ పురాణములలో నీ మల్హణుని చరిత్రాంశములు అగుపడలేదు గాని మహిమ్నస్తవము తర్వాత మల్హణస్తవమునకు గూడ మిక్కిలి ప్రఖ్యాతిగలదు. ఇతడును ప్రాచీనుడనుటయే శివకవి పండితుల యాశయము. ఈతని చరిత్ర యించుమించు బిల్వమంగళ (లీలాశుక - చింతామణి) కవిని బోలియున్నది. లీలాశుకుడును తన కృష్ణకర్ణామృతము ప్రథమమున "చింతామణి ర్జయతు" అని తన ప్రియుసిరాలైన చింతామణి (వేశ్య) నామము నుల్లేఖించినాడు. అటులే ఈ మల్హణ కవియు, తన స్తోత్ర ప్రారంభమున "కాంతాకచ" "పుష్పగంధి"యను శబ్దములచే తన మల్హణి యను ధ్వని వచ్చునట్లు ప్రయోగించినాడు. ఇర్వురును దమ ప్రియురాండ్రవలన సన్మార్గము నవలంబించిరి. కావున వారి పేరులనుగూడ చిరస్థాయి జేయ నెంచి యిట్లు ప్రయోగించి యుందురు. భగవంతుని స్తోత్రము జేయునెడల [illegible] యభిధానము పవిత్ర మగునట్లు విరచించిన వారు

సంస్కృత వాఙ్మయమున వీ రిరువురు మాత్రమే గోచరు లగుచున్నారు. శైలి ధారాళము, శబ్దాలంకారభూషితము.

ఈ స్తోత్రమున ౩౮ శ్లోకములు గలవు. అన్నియు వసంతతిలకావృత్తములు. త భ జ జ గ గ ము లు (పదునాలుగక్షరము లు)న్నచో వసంత తిలక మనబడును ||౧||

న బ్రహ్మవిష్ణువచసామపి గోచర స్త్వ
మస్మద్విధస్య కిమహో తదవైమి సర్వం।
భ క్తి స్తథాపి శివ మాం ముఖరీకరోతి
యుష్మత్స్తుతౌ కథయ కిం కరవాణి దేవ ||౨||

అర్థః— శివ = ఓ పరమేశ్వరా! త్వం = నీవు, బ్రహ్మవిష్ణువచసామపి = బ్రహ్మవిష్ణ్వాదుల వాక్కులకును, గోచరః = గోచరుడవు, న = కావు. అస్మద్విధస్య = నాబోటివానికి, కిమహో = ఏమి చెప్పను? తత్ = ఆ, సర్వం = సమస్తమును, అవైమి = తెలియుచున్నాను. దేవ = భగవంతుడా! తథాపి = అటులైనను, భక్తిః = అనురాగము, యష్మత్ స్తుతౌ = నీస్తుతివిషయమున, మాం = నన్ను, ముఖరీకరోతి = వాచాలుని జేయుచున్నది. కిం = ఏమి, కరవాణి = చేయుదును? కథయ = చెప్పుము.

తా. ఓ కల్యాణస్వరూపా! విష్ణుబ్రహ్మేంద్రాదులు కూడ నిను స్తుతించి నీతత్త్వమును కనుగొన జాలరు.నాబోటి యల్పజ్ఞుని వాక్కులకు నీవు గోచరుడ వగుదు వనుట మిక్కిలి యాశ్చర్యమైన విషయము. ఈ సంగతిని నేనెరింగియే యున్నాను. అయినను నీయందు నాకుగల అసాధారణమైన భక్తి యీస్తోత్రరచనము నందు నన్ను వాచాలుని(వదరుబోతు)గా జేయుచున్నది. దేవదేవా! పరవశుడనై నే నీ స్తుతి సల్లుచున్నాడనే కాని పాండిత్యబలమువలన కాదు. నేనేమి చేయుదును స్వామీ! నీవే యనుగ్రహించి యాజ్ఞాపింపుము.

వి. ఇందు కవి మహేశ్వరుని వర్ణించుటలో తనకు సామర్థ్యము చాలదనుటతో తన నిరహంకారమును సూచించుచు, భక్తి నాశ్రయించి రచించెద నని మిక్కిలి సమంజసముగా నిరూపించినాడు. "స్తుతి ర్బ్రహ్మాదీనామపి" అను మహిమ్న స్తవము రెండవ శ్లోకమందలి యభిప్రాయముతో నిది యేకీభవించుచున్నది. "న దానై ర్నతపోభిర్వా నాశ్వమేధాదిభి ర్మఖైః। భక్త్యైవానన్యయా రాజన్, జాయతే స మహేశ్వరః" అను శివాగమశాస్త్రానుసారముగ శివుడు భక్తిగమ్యుడనుట నిది నొక్కి చెప్పుచున్నది.౨

యే త్వాం మరీచిచయచామరచారుచన్ద్ర-
చూడామణే శ్రుతివచోభి రిహార్చయంతి।
మాయాప్రపంచరచనానిచయం విలంఘ్య
గచ్ఛంతి తే శివపురం రుచిరై ర్విమానైః ॥౩॥

అర్థః—మరీచి...మణే, మరీచి = కిరణములయొక్క, చయః సమూహముచేత, చామర = చామరమువలె, చారు = మనోహరమైన, చన్ద్ర = చంద్రుడే, చూడామణే = శిరోరత్నముగా గలవాడా! యే = ఎవరు, త్వాం = నిన్ను, శ్రుతివచోభిః = వేదమంత్రములచేత, అర్చయంతి = పూజించుచున్నారో, తే = వారు, మాయాప్రపంచరచనానిచయం = అవిద్య యనెడు విశ్వముయొక్క రచనల సమూహమును, విలంఘ్య = దాటి, రుచిరైః = మనోహరములైన, విమానైః = పుష్పకాది విమానములతో, శివపురం = కైలాసమును, గచ్ఛంతి = పొందుచున్నారు.

తా. ఓ చంద్రశేఖరా! ఈ లోకమున నిన్ను విధ్యుక్తముగ వేదమంత్రములతో బూజించిన భక్తులు, ఇంద్రజాలమయమైన ఈ ప్రపంచముయొక్క నిరంతరకార్యకలాపమునుండి విముక్తులై, మనోహరములైన పుష్పకాదివిమానముల నధిరోహించి, పరమకల్యాణస్వరూపమైన కైలాసమును పొందుచున్నారు.

వి. చంద్రశేఖరా యనుటలో కొంత విపులమైన భావము కలదు. చంద్రుడు తన కిరణసమూహములచేత తెల్లని చామరమువలె శివుని తలలో ప్రకాశించుచు ధన్యుడగుట నిక్కువమే కాని, ఎంత మహత్తరముగ శివునిగూర్చి తప మొనర్చి, వేదమంత్రములతో జపించి పూజింపగా నిట్టి మహాభాగ్యము లభించినదో యూహింప దగును. శివభక్తి ప్రభావమువలన బొందితో కైలాస మేగిన మహనీయు లెందరో కలరు. వేదమందలి శతరుద్రీయమును జపించి శివు నర్చించినవారు గతకల్మషులై శరీరముతో గూడ రుద్రస్వరూపులై శివలోకము నందగల రనుటకు శివపురాణ వాయవీయ సంహితలో నిట్లు ప్రమాణము కలదు. "శతరుద్రం జపేద్యస్తు, ధ్యాయమానో మహేశ్వరం। స తేనైవ శరీరేణ, రుద్రః సంజాయతే ధ్రువం॥ జపేనానేన విప్రేంద్రా, నృపాశ్చాన్యే ద్విజాతయః, హిత్వైవ సకలం పాపం, గతా శ్శివపురం పురా॥ అహంచ పరమేశస్య, సామీప్యం లబ్ధవాం స్తథా" ఇక్కడ శతరుద్రాదు లుపలక్షణార్థముగ చెప్పబడినను త్ర్యంబక పంచబ్రహ్మాది వేద మంత్రముల నెల్ల నిట్లనియును, వేదానుసారములైన శివాగమ ధర్మశాస్త్రములు ప్రమాణము లనియును గ్రహింపదగునది ॥౩॥

ఉర్వీసమీరయజమానజలానలార్క-
సోమాంబరాదిభి రహో భవత స్తనూభిః।
వ్యాప్తం సమ స్తభువనం సమవేక్ష్య విద్వాన్
కుర్యాన్న కోఽత్ర భగవం స్త్వయి పక్షపాతః ॥౪॥

అర్థః— భగవన్ = ఓ సకలైశ్వర్య సంపన్నా! ఉర్వీ...దిభిః, ఉర్వీ = పృథ్వియేమి, సమీర = వాయువేమి, యజమాన = యజమానుడేమి, జల = జలమేమి, అనల = అగ్నియేమి, అర్క = సూర్యుడేమి, సోమ = చంద్రుడేమి, అంబర=ఆకాశమేమి, ఇవియే, ఆదిభిః = మొదలుగాగల, భవతః = నీయొక్క, తనూభిః = అష్టతనువులచేత, అహో = ఆహా!, సమస్త భువనం= సర్వ ప్రపంచమును, వ్యాప్తం = వ్యాపింపబడిన దానినిగా, సమవేక్ష్య = బాగుగా దెలిసి, అత్ర = ఈ లోకమందు, కో విద్వాన్ = ఏ పండితుడు, త్వయి = నీయందు, పక్షపాతం = భక్తిని, న కుర్యాత్ = చేయడు?

తా. ఓ పరమేశ్వరా! ఈ సమస్తప్రపంచమును పృథ్వి అప్ తేజస్ వాయు ఆకాశ సూర్య చంద్ర యజమాను లనెడి అష్టమూర్తులతో అహాహా! నీవు వ్యాపించి యున్నావు. ఇది సుప్రసిద్ధము. ఈ సంగతి నెరిగిన విద్వాంసు డెవ్వడైనను, నిన్ను శరణము పొందక యుండగలడా? నీ తనువు లేని విశ్వమేలేదు కావున జ్ఞానమున్నవారు నీ భక్తులే యగుదురు.

వి. భక్తుని భావనాసిద్ధికొరకు పరమేశ్వరుడు మూర్తిరూపమును ధరించునని "సాధకస్యతు లక్ష్యార్థం తస్య రూప మిదం స్మృతం" అను పౌష్కరాగమ ప్రమాణమును, శివుని దేహమునందు మనవలె రక్తమాంసాదు లుండ వనుటకు "సవీర్యమపి నిర్దేహం, మాంసాస్థిరుధిరం నచ, ఇంద్రచాపవదా కాశే, దర్పణే ప్రతిబింబవత్" అను వాతూలాగమోక్తియును, శివుని యష్టమూర్తు లనుటకు "వినా కాశం జగన్నేహ, వినా క్ష్మా వాయునా వినా తేజసా వారిణాచైవ, యజమానేన భావినా, భానునా శశినాలోక, స్తస్యైతా స్తనవః ప్రభో, తదస్య దేవదేవస్య మూర్త్యష్టకమయం జగత్" అను లింగపురాణ ప్రమాణమును గలవు. శివుడే భక్తలోకమునకు ఏకైకప్రభు వనియును నిశ్చయము. ॥౪॥

బ్రహ్మేంద్రవిష్ణుసురదానవలోకపాలై-
రన్యైశ్చ సిద్ధమునిభిః పరిపూజితం త్వాం

దృష్ట్వా యదత్ర పునరిచ్ఛతి దేవ మన్యం
సంసారిణో నరకహేతురయం విమోహః ॥౫॥

అర్థః— బ్రహ్మేంద్ర...పాలైః, బ్రహ్మ = పరమేష్ఠియేమి, ఇంద్ర = దేవేంద్రుడేమి, విష్ణు = దామోదరుడేమి, సుర = దేవతలేమి, దానవ = రాక్షసులేమి, లోకపాలైః = చక్రవర్తులేమి, వీరందరిచేతను, చ = మరియు, అన్యైః = ఇతరులైన, సిద్ధమునిభిః = సిద్ధులచేతను మునీశ్వరులచేతను, పరిపూజితం త్వా = అర్చింపబడిన నిన్ను, దృష్ట్వాపి=కాంచి (తెలిసి)యును. అత్ర=ఇచట,పునః=మరియు,అన్యం=ఇతరుడైనట్టి, దేవం= క్షుద్రదైవమును, యత్ =ఎందువలన, ఇచ్ఛతి=అపేక్షించుచున్నాడో, తత్ = అందువలన, సంసారిణః = జీవునకు, అయం=ఈ, విమోహః=అజ్ఞానము, నరకహేతుః=దుర్గతికి కారణము.

తా. ఓ మహాదేవా! విష్ణుబ్రహ్మదేవేంద్రులును, రావణాది రాక్షసులును, వాయు కుబేరాది దేవతలును, హరిశ్చంద్ర నలాది చక్రవర్తులును, రేణుకాది సిద్ధులును సానందాది మహర్షులును నిన్ను గొలిచియే తరించి యున్నారు. ఇట్టి మహాదేవునిగా నిన్ను దెలిసియు, క్షుద్రదేవుల నారాధించి వారిద్వారా ఫలముల నపేక్షించు బుద్ధి, మరల మరల సంసారనరక మనుభవింప దలచువానికి దప్ప జ్ఞానికి గలుగదనుట తథ్యము.

వి. భవుని వదలి అన్యదేవుల భజించువానికి భవము దప్పదనియును, అన్యుల విసర్జించి శివునే కొలువవలయు ననియును "శివ ఏకో ధ్యేయః శివంకరః, సర్వమన్యత్పరిత్యాజ్య" మన్నగు శ్రుతులును, "విహాయ సాంబ మీశానం, యజంతే దేవతాంతరం, తే మహాతమసా క్రాంతా న తేషాం పరమాగతిః" అను శివపురాణాదులును ఘోషించుచున్నవి ॥౫॥

త్వం పాసి హంసి విదధాసి తిరస్కరోషి
ముక్తిం పరాం నయసి నిత్య మశేషలోకాన్।
సర్వప్రదోసి శివ సర్వకర స్త్వమేవం
మత్వాఽవికల్పమితి జంతు రలేపకః స్యాత్ ॥౬॥

అర్థః— శివ = ఓ సాంబ, త్వం = నీవు, నిత్యం = సదా, అశేషలోకాన్ = సమస్తములైన లోకములను మానవులను, పాసి=రక్షించు

చున్నావు, హంసి=ఉపసంహరించుచున్నావు, విదధాసి = సృజించు చున్నావు, తిరస్కరోషి = మాయము గావించుచున్నావు, పరాం = ఉత్కృష్టమైన, ముక్తిం= కైవల్యమును, నయసి=పొందించుచున్నావు, ఏవం=ఇట్లు, సర్వప్రదః = సమస్తము నిచ్చువాడవును, సర్వకరః = సర్వమును జేయువాడవును, అసి=అయియున్నావు. ఇతి=ఈ ప్రకార ముగా, అవికల్పం=నిస్సంశయముగా, జంతుః = మానవుడు, మత్వా= తెలిసికొని, అలేపకః=నిర్లిప్తుడు, స్యాత్ =అగును.

తా. ఓ సాంబప్రభూ! ఈసమస్తలోకములను, లోకులను, సృష్టి స్థితి తిరోధాన అనుగ్రహములను పంచకృత్యములలో ఎల్లపుడు జిక్కించుచు దక్కించుచు నున్నందువలన, నీవు సర్వజ్ఞత్వ సర్వకర్తృత్వ సర్వకాలసత్త్వ సర్వవ్యాపకత్వాది షడ్వైశ్వర్యసంపన్నుడ వనుట ధ్రువము. అనవసరముగ నెట్టి సందేహముల నందక ఈతత్త్వమును దెలిసికొనిన ప్రాణులు మరల సంసారబంధనముల పాలుగాక ముక్తి నొందుదురు.

వి. ఇందు నిగమాగమ ప్రసిద్ధములైన సృష్ట్యాది పంచకృత్యములు శివాధీనము లనియును, అవి శాస్త్రముల వలనగాని,సద్గురువువలనగాని తెలిసికొని స్వానుభవమున స్థాపించి కృతార్థుడు కావలెననియును, కంఠోక్తిగా బోధింపబడినది ॥౬॥

శాఠ్యేన యేఽపి భగవంతమనంతశక్తిం
శంభో భవంతమభవం భవినో నమంతి।
తేఽప్యంధకారమతిఘోరకృతాంతదంత-
యంత్రాంతరాళగహనం న పునర్విశంతి ॥౭॥

అర్థ :—శంభో=చిదానందస్వరూపా! అనంతశక్తిం=అఖండము లైన, ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులు గలవాడును,అభవం=జన్మరహితుడును, భగవంతం = షడ్గుణైశ్వర్యసంపన్నుడును, అగు భవంతం=నిన్ను, యే భవినః=ఏప్రాణులు, శాఠ్యేనాపి = కాపట్యముతోనైనను, నమంతి= మ్రొక్కుచున్నారో, తేఽపి=వారును, అంధకారం=చీకటిగా నున్నట్టి, అతి...గహనం—అతిఘోర=అతిభయంకరమైన, కృతాంత=యముని యొక్క, దంత = దంతములనెడు, యంత్ర = యంత్రముయొక్క,

అంతరాళం = మధ్యమునగల, గహనం=దుఃఖమును, పునః = మరల, న విశతి = ప్రవేశింపరు.

తా. నిత్యానందకరుడవగు నో శివుడా! ఇచ్ఛాక్రియాజ్ఞాన శక్తులనెడు నఖండమహిమ గలవాడవును, సర్వజ్ఞత్వ సర్వకర్తృత్వ నిత్యతృప్తత్వములు మొన్నగు షడ్విధములైన అష్టైశ్వర్యములుగలవాడవును, జన్మజరామరణరహితుడవును అగు నిన్ను భక్తిపూర్వకముగా గాకపోయినను, వ్యాజముతోనైనను స్తుతించినచో వానికిని నీవు కైవల్యము ననుగ్రహించుచున్నావు. పునర్జన్మము నెత్తి మరల మరల అతిభయంకరమైన యముని పాశమునబడి పరితపించకుండునట్లు చేయుచున్నావు.

వి. ఇందు శివనమస్కార మాహాత్మ్యము సూచింపబడినది. అజ్ఞానమువలనగాని ఆనుకూల్యము లేకగాని, దుర్గుణమువలన గాని సరియైన విధ్యుక్తముగా కాక వక్రముగా నమస్కరించినను ఆ నమస్కారము తప్పక సద్గతిని గలిగించితీరు ననియే దీనిభావము. ఎట్లు నమస్కరించినను శివుడు ప్రసన్నుడగుననుటకు "అనాదరేణ శాఠ్యేన, పరిహాసేన మాయయా, నమస్కారే కృతే లింగే, సర్వపాపహరో హరః" అని ప్రమాణము కలదు. ‖౭‖

కస్యాపరస్య మకరాహతఘోరనక్ర-
చక్రక్రమాత్ కమలలోలజలాచ గంగా।
ఖండేందుకోటికరకోరక భారభాజి
బభ్రామ బభ్రుణి జటాపటలే విమూఢా ‖౮‖

అర్థ:— మకరా...జలా- మకర=మొసళ్ళచేత, ఆహత=కొట్టబడిన, ఘోర=భయంకరములైన, నక్ర=కుంభీరముల, చక్ర=సమూహముయొక్క, క్రమాత్=ఆక్రమణమువలన, కమలలోలజలా=కమలములవలె చంచలములైన జలములుగల, గంగాచ=మందాకిని యన్నన్, అపరస్య=నీకంటె వేరైన, కస్య=ఏ దేవునియొక్క, ఖండ.....భాజి ఖండేందు=బాలచంద్రుని, కోటి=కొమ్ములయొక్క, . కర=కిరణములనెడు, కోరక=మొగ్గల, భార=సమూహమును, భాజి=పొందినట్టియు, బభ్రుణి=పింగళవర్ణము గలిగినట్టియు, జటాపటలే = జడలగుంపునందు, మూఢా=పరాధీనమై, భ్రమించుచున్నదో!

తా. ఓ పరమేశ్వరా! మొసళ్ళును కుంభీరములును అను జల జంతువులు పరస్పరముగ పోరాడుచున్నందువలన కమలములబోలె తనయందలి జలములు ఉల్లోలకల్లోలము లగుచుండ గంగానది భయంకరాకారమును పొందినపుడు; బాలచంద్రుని శృంగములనుండి వెలువడి మల్లెమొగ్గలవంటి కిరణముల గలిగినట్టియు, బంగరువన్నె గలిగినట్టియు నీ జడలయందు తప్ప మరెవ్వని శిరమునందు బద్ధమై నిరంతరము తిరుగుచు వసతి నేర్పరచుకొనినది! అట్టి వికరాళమైన గంగను నీవు మాత్రమే జడలో అణచి దాచగలిగితి వని భావము.

వి. ఇందు శివుని గంగాధరత్వము నిరూపితమైనది. పూర్వకాలమున గంగానదిలో ఇంద్రుని యైరావతముయొక్క జలక్రీడవలన ఆ మందాకిని యుప్పొంగి బ్రహ్మాండము మునిగిపోవునట్లు దోపగా హరిబ్రహ్మాదులు భయమంది శివుని సన్నిధిని మొరపెట్టిరి. అపుడు మహాదేవుడా గంగను ఒక పుష్పమువలె తన జడలలో ధరించి లోకమును రక్షించెను. ఈ గంగయే భగీరథుని మహాప్రయత్నరూపమైన తపము వలన భూలోకమునకు వచ్చి అరువదివేల సగరపుత్రులను ఉద్ధరించె ననియును తెలియవలెను. ||౮||

ప్రోత్తుంగపీవరఘనస్తన హారభార-
విద్యాధరీ భుజలతాయుగపాశబద్ధాః।
తే పర్యటంతి భగవన్ గగనే విమానై-
ర్యైరర్చితో హర నరై రుమయా సహ త్వం ॥౯॥

అర్థః— భగవన్=భగవంతుడవైన, హర=ఓ పాపవిధ్వంసకా! ఉమయాసహ = పార్వతీదేవితో సహితుడవైన, త్వం=నీవు, యైః=ఏ, నరైః=జనులచేత, అర్చితః=పూజింపబడిన వాడవగుచున్నావో, తే=ఆ నరులు, ప్రోత్తుంగ..... బద్ధాః—ప్రోత్తుంగ= ఉన్నతములైనట్టియు, పీవర=గట్టివైనట్టియు, ఘన=గొప్పవైనట్టియు, స్తన=పయోధరముల మధ్యమున్న, హార=చంద్రహారాదులనెడు, భార=బరువుగలిగిన, విద్యాధరీ=విద్యాధర స్త్రీలయొక్క, భుజలతా=తీగలవలెనున్న బాహువుల, యుగ=ద్వంద్వమనెడు, పాశ=పగ్గముచేత, బద్ధాః = కట్టబడినవారై, విమానైః=పుష్పకాది విమానములతో, గగనే=ఆకాశమునందు, పర్యటంతి=సంచరించుచున్నారు.

తా. అష్టవిభూతి సంపన్నుడవగు నోహరా! నిన్ను చిచ్ఛక్తి యగు ఉమాదేవితో సహితునిగా దెలిసి భజించు భక్తులను; యౌవన సౌందర్యముగలవారును, దివ్యాభరణభూషితులును అగు విద్యాధర కాంతలు తమ పుష్పకాదివిమానములలో గూర్చుండ బెట్టుకొని; తమ మృదువైన భుజములతో నాలింగనముచేసికొనుచు; గగనమున సంచరింపజేయుచు సేవికలవలె ఆ భక్తుల యాజ్ఞలు పాలించుచున్నారు.

వి. ఇందు "శివుడు శక్తివిశిష్టుడు" అను శివాద్వైత సిద్ధాంతము నిరూపింపబడినది. పరమేశ్వరుడు నామరూప గుణ ధర్మరహితుడని కొందరు భ్రమించుచున్నారు. అది మల్హణునిచేత ఆక్షేపింపబడినది. ఎవ్విధమైన గుణములులేని పదార్థము కలదని చెప్పుట; శూన్యము కలదని అంగీకరించి నటులే యగును. కుందేటికొమ్ము కలదనుట వంటి దిది. "శివః శక్త్యా యుక్తః" "పరాస్య శక్తిర్వివిధా" మున్నగు అనంతప్రమాణములవలన శివుడు చిచ్ఛక్తిసంపన్నుడనియును, ఇచ్ఛ గలిగినపుడు ఈ జగత్తును సృజించుచు మరల హరించుచుండు ననియును దెలియుచున్నది. ఈ శక్తియే ఉమా, పార్వతి మొదలగు నామములతో వ్యవహృత మగుచున్నది. ఇట్టి శక్తి (గుణములతో) పరబ్రహ్మము సదా కూడుకొని యున్నది. కావున సగుణోపాసనయే కర్తవ్య మనియు; గుణములేనిదాని (నిర్గుణము) యొక్క ఉపాసన నిష్ఫల మనియు ఎరుంగవలయును. దీనివలన ఈ స్తోత్రకర్తయగు మల్హణుడు శక్తివిశిష్టాద్వైతవాది యని తెలుచున్నది. యజ్ఞమువలన గలుగు స్వర్గరంభాసుఖము మున్నగునవి, శివభక్తులకు ఒక లెక్క కాదనియును, ఉమాపతిని ఉపాసించు భక్తులను, గంధర్వ కిన్నర సిద్ధసాధ్య విద్యాధరులయొక్క సుందరీమణులు శివాజ్ఞ ననుసరించి తమ విమానములలో ఎక్కించుకొని వారిని మహానుభావులుగా దలచుచు మిక్కిలి యుపచరించుచు కైలాసమునకు జేర్చెద రనియును భావము ॥౯॥

భేరీమృదంగ సురదుందుభిశంఖనాదై-
ర్దేవాంగనాకలకలాకులదిఙ్ముఖేషు।
క్రీడంతి దివ్యభవనేషు సహాప్సరోభి-
ర్భక్త్యా కృతం తవ పురో ముఖవాదనం యైః ॥౧౦॥

అర్థ:— తవ=నీయొక్క; పురః= ముందర, యైః = ఎవరిచేత, భక్త్యా = భక్తితో, ముఖవాదనం = ముఖవాద్యము (లేక వేణువీణా వాద్యము), కృతం = చేయబడునో, (తే=వారు), భేరీ......నాదైః భేరీ=పెద్దనగారాయేమి, మృదంగ=మద్దెలయేమి, సురదుందుభి=దేవభేరి యేమి, శంఖ=శంఖమేమి, [illegible] నాదైః=ధ్వనులచేతను

దేవాంగనా...ముఖేషు- దేవాంగనా = దేవతా స్త్రీలయొక్క, కలకల = మధురమైన శబ్దములచేతను, ఆకుల = వ్యాప్తమైన, దిఙ్ముఖేషు = దిక్కుల యొక్క అగ్రిములు గలిగినట్టి, దివ్యభవనేషు = స్వర్గమందిరములందు, అప్సరోభిఃసహ = రంభాద్యప్సరలతోఁగూడి, క్రీడంతి = ఆడుచున్నారు.

తా. ఓ నటరాజా! ఏ మహానుభావులు నీ సన్నిధిని భక్తితో "భం భం" అను ప్రణవద్యోతక మైనట్టి ముఖవాద్యమును; అథవా వీణావేణుగానము గావింతురో, అట్టి ధన్యులు స్వర్గమందలి సౌధము లందు, భేరులు మృదంగములు దుందుభిశంఖములు మ్రోగుచుండ, గుమిగూడియున్న దేవతాస్త్రీల మంజులములైన కలకలారావములు చెలంగుచుండ, రంభోర్వశీ మేనకాది లోకోత్తర సుందరీమణులు స్వాగతము లిడుచుండ పాడుచు నాడుచు కాలమును సుఖముగా గడుపగలరు.

వి. ఇందు శివలింగసన్నిధిని గావించు ముఖవాద్యఫలము చెప్పబడినది. శివ పూజ ముగిసినపిమ్మట బుగ్గల నుబ్బించి నోటితో ఓం అను శబ్దరాజము నుచ్చరించుచు చేతితో వాయించిన యెడల భంభం అను మధురమైన ధ్వని వెలువడును. ఇది శివు నకు మిక్కిలి ప్రియకరమయినది. దీనిని ముఖవాద్య మందురు. జంతువుల హింసించిన చర్మములతో నిర్మించినట్టి వాద్యములకంటె ఈ ముఖవాద్యము మహాశ్రేష్ఠమైనది. కావున భూతేశ్వరుని కృపాపాత్రమైనది. ఇందుకు "అర్చయిత్వా తు యోలింగం, ముఖవాద్యాంతు కారయేత్" "నృత్యంవా ముఖవాద్యం వా, సోఽపీశ్వరపదం లభేత్" మున్నగు శివాగమప్రమాణములు కలవు. ముఖవాదన మనగా వేణువు మున్నగువాని వాద్యములకు గూడ అర్థ మగునని విశ్వారాధ్యుడు వ్యాఖ్యానించెను. "హిమాచల మందలి జ్యోతిష్క శిఖరమున తప మాచరించుచున్న మతంగముని శివ ధ్యానాదులను మిక్కిలి దీర్ఘ కాలము గావించుచు, వేసరపాటు దీరుట కొక నాడు వెదురుకోలను దీసికొని రంధ్రములు పొడిచి శివలింగసన్నిధిని వాయింపగా, శివుడు ప్రత్యక్షుడై ఇష్టార్థము ననుగ్రహించుటే కాక శివజ్ఞానము నుపదేశించెను. ఇదియె "మతంగ పారమేశ్వరాగమ" మని ప్రఖ్యాత మయ్యెను. ఈగాథ మతంగపారమేశ్వ రాగమముయొక్క ఉపోద్ఘాతప్రకరణమున గలదు. ॥౧౦॥

శంభో ప్రసిద్ధవిబుధాధిపసిద్ధసాధ్య-
విద్యాధరా హరిపితామహలోకపాలాః।
అన్యేఽపి సాధు విధినా సుధియో భవంత-
మారాధ్య జగ్ముఱమరాః పరమామరత్వం. ॥౧౧॥

అర్థ:—శంభో=సుఖధామా! ప్రసిద్ధ....ధరాః, ప్రసిద్ధ=ప్రఖ్యాతులైన, విబుధాధిప=ఇంద్రుడేమి, సిద్ధ=సిద్ధులేమి, సాధ్య=సాధ్యులేమి, విద్యాధరాః=విద్యాధరులేమి- వీ రందరును, హరిపితామహలోకపాల్యాః= విష్ణుబ్రహ్మలును, హరిశ్చంద్రాది చక్రవర్తులును, అన్యే=ఇతరులైన, సుధియః=పండితులును, అమరా అపి=దేవతలైనను, భవంతం=నిన్ను, విధినా= శాస్త్రవిధితో, సాధు=చక్కగా, ఆరాధ్య=అర్చించి, పరమామరత్వం=శ్రేష్ఠమైన దేవత్వమును, జగ్ముః=పొందిరి.

తా. ఓ శంకరా! దేవతలకు రాజైన ఇంద్రుడును, బ్రహ్మవిష్ణులును, సిద్ధులును, సాధ్యులును, విధ్యాధరులును, కుబేరాది దిక్పాలకులును, హరిశ్చంద్రాది చక్రవర్తులును, పాణినిగౌతమాది మహర్షి పండితులును, ఇంకను బ్రఖ్యాతులైన ఇతర దేవతలు మున్నగువా రందరును, నిన్ను భక్తియుక్తముగను విధ్యుక్తముగను గొలిచి ఆయా పదవుల నంది ధన్యులైనారు.

వి. ఇట దేవతాజన్మగూడ శివలింగార్చనఫల మనుటను జెప్పియున్నాడు. నరులు కొందరు జడబుద్ధులై కామ్య కర్మల నతికష్టముతో గావించి ఇంద్రత్వాది పదముల నందజూచు చున్నారే కాని, ఇంద్రాదు లందరును నీ కృపవలననే గణనకు వచ్చి రనుసంగతిని దెలియరు. "ఇంద్రస్సలమయం లింగం, విష్ణుః పూజయతే సదా బ్రహ్మ విష్ణుస్తథా శక్రో,లోకపాలాశ్చ దేవతాః। లింగార్చనరతా హ్యేతే,మానుషేషు తు కా కథా" మున్నగు ప్రమాణములు శివధర్మశాస్త్రము, సిద్ధాంతశిఖామణి మొదలగు గ్రంథరత్నములలో గలవు. కావున సర్వాధికుడును, సర్వాశ్రయుడును శివు డనియే దృఢముగ నమ్మి యుపాసించుట వివేకులకు శ్రేయస్కరము. ॥౧౧॥

గౌరీప్రదానసమయే గదితేఽచలేన
గోత్రం తవేశ కిమితి క్షణజాతచిత్తం।
ధన్యైః పితామహపురందరలోకపాలై-
ర్దృష్టం నిరుత్తరముఖం భవతో హసద్భిః ॥౧౨॥

అర్థ:— అచలేన=హిమవంతునిచేత, గౌరీప్రదాన సమయే= పార్వతిని దానముచేయు వేళ, "ఈశ=ఓ పరమేశ్వరా! తవ=నీయొక్క, గోత్ర=వంశక్రమము, కిం=ఏమి?" ఇతి=ఇట్లు, క్షణజాతచిత్తం=క్షణకాలమున ఉత్పన్నమైనబుద్ధి గలినట్లు, గదితే=చెప్పబడగా, హసద్భిః=

నవ్వుచున్నట్టి, ధన్యైః=ఘనులైనట్టి, పితామహ పురందర లోకపాలైః= బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని మున్నగు లోకపాలకులచేత, భవతః = నీయొక్క, నిరుత్తరముఖం=ప్రత్యుత్తరములేని వదనము, దృష్టం = అవలోకింపబడెను.

తా. హిమవంతుడు తన పుత్రియగు పార్వతీవివాహమును శివునితో నొనర్ప నిశ్చయించి; కన్యాదాన ముహూర్తమున "ఓయీశ్వరా! నీ తండ్రితాతలపేరేమి?" అని క్షణమున అకస్మాత్తుగ చిత్తమునకు జ్ఞాపకమునకు వచ్చినట్లు ప్రశ్నింపగా అక్కడ నున్నట్టియు ధన్యులైనట్టియు బ్రహ్మేంద్ర కుబేరాదులు నవ్వుచు;ప్రత్యుత్తరమును గూడ దలపోయక ఊరకయున్న నీయొక్క ముఖమును సందర్శించిరి.

వి. ఇందు శివుని సర్వేశ్వరత్వము సూచింప బడినది. సర్వలోకములకెల్ల ఆది మహేశ్వరుడైనట్టియు, తనకు ఆది లేనట్టియు మహాదేవునియొక్క గోత్రమడుగుట పరిహాసము కావున బ్రహ్మాదులు నవ్విరి. "ఏష ఏవ జగద్యోని ర్గోత్రమస్య కథం భవేత్" (జగత్తునకు కారణ మీతడే కావున నీయనకు గోత్ర మెట్లుండును?" అను కథా సందర్భమును సూతసంహితలో గాంచనగును. మరియొకచోట "శివుని తండ్రి; శ్రీకంఠుడనియు, తాత; నీలకంఠుడనియు, ముత్తాత, ఉగ్రకంఠుడనియు" బ్రహ్మాదులు ప్రత్యుత్తరించి నట్లు కలదు.) బ్రహ్మాదులు తమ కాశ్చర్యముగ నున్నందున శివుని ముఖ మవలోకించిరి. శివుడైనను ప్రత్యుత్తర మీయరాదా యనిన ఆయనకు వివాహములో స్వప్రేరణ లేనందున ఔదాసీన్యము వహించి "గోత్రము లేనందున వివాహ మెత్తి పోవునా" అని ఆందోళన పడుచున్న పార్వతిని విలోకించుటయు ఒక పనిగా నుండెను. ॥౧౨॥

ఝంకారడంబరవిరాజిజలాకులేషు
కైలాసమేరుగిరిగహ్వరనిర్ఝరేషు ।
తే ప్లావయంతి సురసిద్ధవధూకులాని
యే నీలకంఠ తవ పాదయుగం నమంతి ॥౧౩॥

అర్థః—నీలకంఠ=విషధరా! యే=ఎవ్వరు, తవ=నీయొక్క, పాదయుగం=చరణయుగళమును, నమంతి = నమస్కరించుచున్నారో, తే= వారు, ఝంకార......లేషు, ఝంకార = భ్రమరధ్వానముల, డంబర = ఆడంబరములవలె, విరాజి = శోభించుచున్న, జల = ఉదకములచేత, ఆకులేషు=వ్యాప్తములైన, ... ...రేషు, కైలాస = కైలాస

మేమి, మేరుగిరి=మేరుపర్వతమేమి-వీనియొక్క, గహ్వర=గుహలలోని, నిర్ఝరేషు=ప్రవాహములందు, సురసిద్ధవధూకులాని=దేవతలయొక్కయు సిద్ధులయొక్కయు స్త్రీల సమూహమును, ప్రాప్నువంతి = పొందుచున్నారు.

తా. ఓ శ్రీకంఠా! భక్తితో నీ పాదద్వంద్వమును భజించు మహనీయులకు తత్ క్షణమే కైలాసమందలి మహాభోగములు లభించును. ఆ కైలాసమునందును సుమేరు పర్వతమునందును గల సెలయేళ్ళన్నియు ఒక మహాప్రవాహముగా పారుచుండును. వాని జలముల చప్పుడు; కమలములయొద్ద గుంపుగా జేరిన తుమ్మెదలఝుంకారమువలె మనోహరముగా నుండును. ఆ నదులందు సిద్ధసాధ్యాది దేవతా రమణీమణులు నావలలో విహరించుచుందురు. ఆ స్త్రీలు శివునిపాదభక్తులను తమ నావలలో నెక్కించుకొని ఆనందము గల్గునట్లు విహరింపజేయుచు నేఁ తురుగదా!

వి. శివభక్తులకు ముక్తియేకాక సరసములైన సౌఖ్యములును దొరకుననుటకిదియు నొక సూచన. ఈ శ్లోకమున శివపాద నమస్కారఫలము చెప్పబడినది. లింగరూపుడైన శివునకు పాదము లెక్కడ యనినచో, భక్తుడు శివాగమ శాస్త్ర ప్రకారము లింగమునందు హస్తపాదాదుల కల్పించి పూజించుట సుప్రసిద్ధము. కావున భక్తవత్సలుడైన పరమేశ్వరుడు భక్తుని సంకల్పము ననుసరించి తత్తదాకారములతో ప్రత్యక్షమగుచుండును. ఇట్టి యాకారమును భగవంతుడు దాల్పజాలడని యెవరైన భ్రమించినచో, అట్టివాడు భగవంతుడే కాజాలడు. సర్వకాలముల సర్వవిధముల జేయు సామర్థ్యముగలవాడే సర్వేశ్వరుడు. కొంచెముగా నేదో చేయగలవాడు జీవునివలె సామాన్యుడే! ఈవిలాసములు శివభక్తుల కేల యనిన, లౌకిక సౌఖ్యములు సైతము శివోపాసనవలన లభించు ననియు ఇతర క్షుల్లక దేవతల భజింప నవసరము లేదనియు భావము. ॥౧౩॥

అన్యేఽరవిందమకరందహృతాళివృంద-
మందారకుందదళదామభిరిందుమౌళే ।
పూజాం విధాయ భవతో విలసంతి దేవ
దేవేంద్రమందిరవరే సహసుందరీభిః ॥౧౪॥

అర్థః — ఇందుమౌళే=చంద్రశేఖరా, దేవ=చిన్మయా, అన్యే= ఇతరపురుషులు, అరవింద... దామభిః అరవింద...కమలములయొక్క

మకరంద=మకరందముచే, హృత=ఆకర్షింపబడినట్టి, అళి = తుమ్మెదల యొక్క, వృంద=సమూహముగల, మందార=మందారములేమి, కుంద= మల్లెలేమి, వీనియొక్క, దళ=రెక్కలయొక్క, దామభిః = దండలచేత, భవతః=నీయొక్క, పూజాం=అర్చనను, విధాయ = ఒనర్చి, దేవేంద్ర మందిరవశే=ఇంద్రుని సుందరమైన మందిరమందు, సుందరీభిఃసహ = సుందరీమణులతో గూడి, విలసంతి=శోభించుచున్నారు.

తా. ఓ చిదానందఘనా! శశిమోహనా! తామరలు, తెల్ల జిల్లేడులు, మల్లెలు, మొల్లలు మున్నగు పువ్వులు వికసించియున్నపుడు; వానియందలి సుగంధమువలనను, మకరందమువలనను తుమ్మెదలు గుంపులుగా నట వాలునుగదా! ఇట్టి పరిపుల్లములైన పూలదండలచే నిన్ను చేతులార బూజించిన పుణ్యాత్ములు, ప్రపంచములోనికెల్ల గొప్పదగు ఇంద్రభవనమున దేవతాయువతులతో గూడికొని సుఖించు చున్నారుగదా!

వి. తమదేహమునకు అపేక్షతో నెట్లు సుగంధాదుల నలంది యానందింతురో; అట్టి ప్రేమతో శివలింగమూర్తిని గూడ పూజించి శివప్రీతికి పాత్రులైన వారికి శివుడు పరలోకమున మిక్కిలి యెక్కువైన సుఖమును ఈయగలడు. కావున ఇహ లోకమున తమ శరీరమును మాత్రమును భూషించుకొను వారికి పరమున సుఖము లేదనియును శివప్రీతికరముగ బూజించినవారు ఇహమునను పరమునను సౌఖ్యము నొందుదు రనియును భావము. ॥౧౮॥

గర్జత్ప్రచండఘనఘర్ఘరమేఘసంఘ-
సంఘట్టఘోషఘనఘోరరవేణ కోఽన్యః।
శ్వేతం నయంతమతిఘోరకరాళకాలం
భస్మావశేష మకరోద్ధర! హుంకృతేన ॥౧౯॥

అర్థ:— హర=భక్తపాపహరా, శ్వేతం=శ్వేతుడను రాజర్షిని, నయంతం=కొంపోవుచున్నట్టి, అతిఘోరకరాళకాలం=అతినిర్దయుడును, భయంకరుడును అగు యమధర్మరాజును, గర్జత్......రవేణ, గర్జత్= గర్జించుచున్నట్టియు, ప్రచండ=భయంకరములైనట్టియు, ఘన=పెద్దగా, ఘర్ఘర=ఫడిల్‌మను చప్పుడు గల్గినట్టియు, మేఘ = మేఘములయొక్క, సంఘ = సమూహములయొక్క, సంఘట్టన=తాకిడిచేత పుట్టిన, ఘోష=

ధ్వనివలె, ఘోర=భయంకరమైన, రవేణ = నినాదముగల్గినట్టి, హుం కృతేన = హుంకారముచేత, అన్యః=ఇతరుడైన, కః = ఏ, దేవః = దేవుడు, భస్మావశేషం = బూడిదమాత్రము మిగిలిన వానినిగా, అకరోత్ =చేసెను.

తా. ఓ పరమేశ్వరా! క్రూరుడైన కాలుడు ఇసుమంతయైన దయలేక రాజర్షియైన శ్వేతుని గొంపోవుచుండ అనేకములగు మేఘములు గర్జన మొనర్చుచు కలియబడునపుడు ఎట్టి ధ్వని పుట్టునో అట్టి భయంకరమైన ధ్వనితో నీవు హుంకార మొనర్చి యా భీకరుడగు యముని నిముసమున భస్మీపటలము గావించినాడవుగదా! ఇట్టి యసాధ్యమైన కర్తవ్యమును నీవుమాత్రమే నిర్వహింప గలిగితివి. ఇతర దేవతలకు శక్యమా?

వి. "శ్వేతుడను రాజు సుఖముగ కొంత కాలము రాజ్యము నేలుచుండ ఆయుః పరిమాణము తీరినదని అకస్మాత్తుగ యముడు వచ్చి కాలపాశము వేయదొడగెను. శ్వేతు డపుడు శివపూజ నొనర్చుచుండెను కావున పూజయైనట్లు వత్తు ననెను. కాని నిర్దయుడైన కాలుడటులే బలాత్కారముగ లాగుచున్నందున, శ్వేతుడు నిరుపాయుడై శివుని గూర్చి మిక్కిలి దైన్యముతో నిలపించెను. అంత శివుడే తెంచి భయంకరమైన హుంకారముతో యముని బీర మడగించి వాని నగ్నిహోత్రముతో గాల్చివేసి తనభక్తుడైన శ్వేతుని రక్షించెను. అపుడు సమస్త దేవతలు మిక్కిలిగా ప్రార్థింప కరుణామయుడైన శివుడు మరల యముని బ్రదికించెను" అని పురాణగాథ కలదు. శ్వేతుడు గొప్పరాజు కావున యముడు స్వయముగ వచ్చినాడు. సామాన్యుల వద్దకు యమభటులే వత్తురు. మొదట బ్రహ్మ నిర్దేశించిన ఆయుష్యముగూడ శివానుగ్రహము గలుగుచో వృద్ధి యగునని యిట తాత్పర్యము. మార్కండేయాదు లిట ఉదాహరణము. శివుని యందు భక్తిగలవానికి భయ మిసుమంతయు లేదని భావము. ॥౧౫॥

యే జీవనాయ భవభస్మజటాస్థిమాలా
మాయావినోపి దధతేహి భవంతి శంభో,
కర్ణాటలాటభటహేమకిరీటకోటి-
సంఘట్టఘృష్టచరణా యది భూమిపాలాః॥ ౧౬॥

అర్థః— భవ=సర్వకారణా! శంభో = సుఖనిలయా! యే= ఎవ్వారు, జీవనాయ = బ్రదుకుకొరకు, భస్మజటాస్థిమాలాః=భస్మము జడలు కపాలమాలలు రుద్రాక్షలు ముద్రలు మొదలగునవి యది దధతే=

ధరించుచో, మాయావినోఽపి=ఆ మాయ వేషధారులైనను, కర్ణా...
...చరణాః, కర్ణాటలాట = కర్ణాటము లాటము మున్నగు దేశము లందలి, భట= భటులయొక్క, హేమకిరీట = బంగారు కిరీటముల, కోటి=తుదలయొక్క, సంఘట్ట = సంఘర్షణవలన, ఘృష్ట=అరగిపోవు చున్న, చరణాః=పాదములుగల, భూమిపాలాః=నరపాలురు, భవంతి హి=అయ్యేతీరుచున్నారు.

తా. ఆనందఘనా! అఖిలకారణా! కొందరు భక్తితో గాక దంభముతో ఉదరంభరణార్థము నీ చిహ్నములైన భస్మ కపాల రుద్రాక్షలను ధరించి యిట్టి మాయవేసములతో భిక్ష మెత్తి పొట్ట బోసికొనుచున్నారు. ఇట్టి దాంభికులు సైతము శివచిహ్నముల ధరించిన పుణ్యమువలన ఈ జన్మమున లేక ముందు జన్మమున అంగ వంగ కళింగ గాంధర్వ కర్ణాటకాది దేశములకు రాజులై మహైశ్వర్యముల ననుభవింపగలరు. ఇక నిక్కముగ నీ భక్తులైనవారి సద్గతినిగూర్చి చెప్పవలసినది లేదు కదా!

వి. భక్తితో అంతశ్శుద్ధిగ ధర్మము ననుసరించిన వారికే సద్గతి కలదు కాని బాహ్య వేషధారులకు లాభము లేదని కొందరనుచుందురు. ఇందు వారికి ప్రత్యుత్తర మీయబడినది. అంతశ్శుద్ధికి గొప్ప మహత్త్వము కల దనుట సత్యమే కాని బాహ్యా చారమునకు లాభమే లేదనుట సరియైనది కాదు. తాను చోరుడైనను అందరికి దానిని చేయుడని బోధింప రాదు. తన కిష్టము లేకున్నను మత చిహ్నములను ధరించుటవలన ఒరులకుగూడ ధార్మికబుద్ధి జనింపజేయు చున్నాడు. కావున నతడును కొంతవరకు ధార్మికుడే యగుచున్నాడు. తనకు ప్రియకరమైనది కాక పోయినను, చేసిన భోజనము తప్పక పొట్టను నించియే తీరును. భక్తి లేక ధరించినను భస్మరుద్రాక్షాదులు తమ ఫలమును గలిగించు ననియే భావము. కేవల మంతశ్శుద్ధియే సర్వ సౌఖ్యములు గలిగిం చుచో బాహ్యాచారము సర్వము వ్యర్థమగును గదా? మనశ్శుద్ధితో ఋత్పిపాసలను మానుకొనగలమా? అట్టిది మహాత్ములకు మాత్రమే సాధ్యము కావున సర్వ సామాన్య ముగ బాహ్యాచార ధర్మముల ద్వారా తర్వాత అంతశ్శుద్ధి సంపాదింపవలెనని విశే షము నెరుగునది. ॥౧౯॥

క్రీడాప్రపంచనిరతా శ్శివ హే భవంత-
మారాధయంతి వివిధేషు వనేషు దేవాః।
సిద్ధాః సమస్తకులశైలగుహాంతరేషు
విద్యాధరా మలయమందరకందరేషు ॥౨౦॥

అర్థ:— క్రీడాప్రపంచనిరతాః = ఆటలపాటలందు నిరంతరమాసక్తులైన, శిశవః=బాలురును, వివిధేషు=అనేకములగు, వనేషు=దివ్యవనములందు, దేవాః = దేవతలును, సమస్తకులశైలగుహాంతరేషు = అఖిలములైన మహాపర్వతములయొక్క గుహాలలో, సిద్ధాః=సిద్ధులును, మలయమందరకందరేషు=మలయాచలము మందరాచలము మున్నగువానియొక్క గుహాలలో, విద్యాధరాః = విద్యాధరులును, భవంతం= లింగరూపుడవైన నిన్ను, ఆరాధయంతి = పూజించుచున్నారు.

తా. ఓ పరమేశ్వరా! బాలురు ఆటలయందును, దేవతలు వివిధోద్యానములయందును, సిద్ధులు కులపర్వతపు గుహాలందును, విద్యాధరులు మందరమలయాచలములందును నిన్ను పూజించుచున్నారు. (నిన్నర్చింపనివారెవరు? గోపాలుడు మొదలుకొని భూపాలుని వరకు సర్వులును నిన్ను మ్రొక్కువారే!)

వి. బాలకులు ఆడునపుడు ఇసుకతో లింగములజేయుట సుప్రసిద్ధము. దేవగంధర్వ సిద్ధసాధ్యకిన్నర కింపురుషాదు లెల్లరును శివుని గొల్చి ఇష్టార్థముల నందిన సంగతి పురాణాదులలో గలదు. ఇట్లనుట వలన శివుని సర్వోత్తమత్వము సూచితమగుచున్నది. వనములు పర్వతములు గుహాలు మున్నగునవి వారువారు నివసించు స్థలములని తెలియవలెను. దీనివలన స్వర్గమర్త్యములలో నెల్లెడల శివార్చనయే కలదని తేలుచున్నది. ॥౧౭॥

హే దేవ హేమపురరమ్యరసాతలేషు
నాగాంగనాభిరసురేంద్రనితంబినీభిః।
నిత్యం నితంబభరమంథరగామినీభి-
రారాధ్యసే చ హర మన్మథవిహ్వలాభిః ॥౧౮॥

అర్థ:— హేదేవ=ఓ యీశ్వరా! హర=దురితహరా! హేమపురరమ్యరసాతలేషు=స్వర్ణముతో నిర్మింపబడిన పట్టణములలోని మనోహరములైన పాతాళములందు, నాగాంగనాభిః=నాగయువతులచేతను, చ=మరియు, నితంబభరమంథరగామినీభిః=నితంబములయొక్క బరువువలన మెల్లగా నడచునట్టియు, మన్మథవిహ్వలాభిః = కామముచేత పీడింపబడినట్టియు, అసురేంద్ర నితంబినీభిః = రాక్షసరాజుల సుందరీమణులచేతను, నిత్యం = నిరంతరము, ఆరాధ్యసే = పూజింపబడుచున్నావు.

తా. ఓ పరమేశ్వరా! రంగైన బంగారు మేడలుగల పాతాళము నందు నివసించు నాగకన్యలును; ఘనమైన నితంబము లుండుటవలనను, మన్మథబాధవలనను, నడువజాలని దనుజుల తరుణీమణులును నిన్ను పూజించుచు వరముల నందికొనుచునే యున్నారుగదా!

వి. పైశ్లోకములలో స్వర్గమర్త్యము లందలి శివపూజామహిమ చెప్పబడినది. ఇందు పాతాళలోక మందలి శివప్రభావము నిరూపితమైనది. పామరులైన భక్తులే గాక యొయ్యారముగల వనితామణులును తమ ప్రియుల జాడదెలియక పరితపించి శివుని గొలిచి యిష్టార్థము లందిరను పురాణపవిత్ర గాథలు తెలియునది. నాగకన్యలవలె తార, మందోదరి మున్నగు రాక్షసస్త్రీలును సౌందర్యమున ప్రసిద్ధులై యున్నారు. రావణాదులు బ్రాహ్మణులే కావున రాక్షసశబ్దము గుణవాచకమే కాని జాతివాచకము కాదు. పాతాళమున హాటకేశ్వర(స్వర్ణ)లింగమున్నట్లు ఆగమములు చెప్పుచున్నవి. ॥౧౮॥

దివ్యౌషధీరసరసాయనధాతువాదా
యోగా వశీకరణగారుడఖన్యవాదాః ।
పాతాళఖడ్గఘటికాంజనసిద్ధివాదాః
సిధ్యంతి తస్య శివ యస్య భవాన్ ప్రసన్నః ॥౧౯॥

అర్థః— శివ=సర్వకల్యాణకరా! యస్య = ఎవనికి, భవాన్= నీవు, ప్రసన్నః = ప్రత్యక్షుడవైనాడవో, తస్య = వానికి, ది...... వాదాః- దివ్యౌషధీ=సంజీవినీలత, రస=పాదరసభస్మము, రసాయన = జరారోగనాశకరము లగు ఔషధములు మున్నగు, ధాతువాదాః = ధాతుసిద్ధులును, యోగాః=హఠయోగములు, వశీకరణ=రాజవశ్యము, గారుడ=విషచికిత్స, ఖన్య = గుప్తధనలాభము మున్నగు, వాదాః= సిద్ధి క్రియలును, పాతా......దాః, పాతాళ = పాతాళగమనము, ఖడ్గ = సమ్మోహనాస్త్రము, ఘటికా=ఘటికాసిద్ధి, అంజన = కాటుకతో త్రికాలజ్ఞానము మున్నగు, సిద్ధివాదాః = మంత్రక్రియలును, సిధ్యంతి = సిద్ధించుచున్నవి.

తా. ఓ సర్వమంగళస్వరూపా! నిన్ను పూజించి నీ కృపకు పాత్రుడైన భక్తునకు, సంజీవినీలతతో ప్రాణుల బ్రతికించుట, రసభస్మముతో బంగారము చేయుట, కాయకల్పముతో ముసలితనము పోగొట్టుట, [illegible] ఆకాశగమనము

జేయుట, రాజాధిరాజులను భూతప్రేతములను వశీకర మొనర్చుట, సర్పవిషాదుల నివారించుట, భూమిలోని గుప్తధనము దీయుట, పాతాళాది దివ్యలోకముల కేగుట, సమ్మోహనాస్త్రములతో శతృవుల నచ్చెరువొందించుట, ఘటముతో నదీసముద్రముల దాటుట, అంజనముతో భూతభవిష్యద్వర్తమానముల దెల్పుట, మున్నగు సమస్త సిద్ధులును వశము లగును.

వి. ఇన్ని క్రియలను ప్రత్యేకముగ సిద్ధింప జేసికొనుట కంటె ఒక్క శివ యోగమువలన సర్వమును వశపరచుకొనవచ్చునని శివమహిమాతిశయము జెప్పబడినది. పై సిద్ధులలో నేడు కొన్ని లోపించినను కొన్నింటి నైనను అట నట మహాత్ముల యొద్ద గాంచనగును. ॥౧౯॥

పాతాళతాళతలదానవసుందరీభి-
రాలింగితా మకరకేతుశరాతురాభిః ।
తే శేరతే ధ్వజపటాకులమందిరేషు
యేషాం త్వమేవ శివ పుణ్యవతాం ప్రసన్నః ॥౨౦॥

అర్థః— శివ=శంకరా! యేషాం = ఏ, పుణ్యావతాం = పుణ్యపురుషులకు, త్వమేవ = నీవే, ప్రసన్నః = సంతుష్టుడవో, తే=వారు, మకరకేతుశరాతురాభిః=కామబాణముతో పీడితులైనట్టి, పాతా...భిః పాతాళ=పాతాళమునందలి, తాళ = నాగులయొక్కయు, తల = రసాతలమందలి, దానవ=రాక్షసుల యొక్కయు, సుందరీభిః = యువతులచే ఆలింగితాః = ఆలింగింపబడినవారై, ధ్వజపటాకులమందిరేషు = పట్టు పతాకములతో నిండిన మేడలందు, శేరతే = శయనించుచున్నారు.

తా. మంగళకరా! నిన్ను భజించి నీ యనుగ్రహము పడయవలయునే కాని; సౌఖ్యమునకు తక్కువేమి? పాతాళమందుగల నాగకన్యకలును; రసాతలమందలి దానవసుందరీమణులును, స్వాంతముగ ప్రేరితలై, మన్మథపీడితలై వచ్చి యాలింగనము జేసికొనుచు, పట్టు జెండాలతో దట్టముగా నలంకరింపబడిన తమ మేడలందు శయనింపజేయరా?

వి. శివుడు ప్రసన్ను డగుచో, సర్వలోకములును వానిని గొలుతురని భావము. శివభక్తున కిట్టి సౌఖ్యములు తృణప్రాయము లనియును, సులభము లనియు నెరింగి శాశ్వతానందదాయక మైనట్టి శివభక్తి నే ఆశ్రయించుట వివేకము. ॥౨౦॥

స్వర్గే విచిత్రసురపాదపమంజరీభి -
ర్మందాకినీకనకపంకజయోజితాభిః ।
ఇంద్రోఽప్సరోభిరమరైరసురైరుపేతః
పూజాం విధాయ భవతః ప్రణతో మహేశ ॥౨౧॥

అర్థ :— మహేశ=మహాదేవా! భవతః=నీయొక్క, పూజాం= అర్చనను, విధాయ = విధ్యుక్తముగా నొనర్చి, (ఎవడు) ప్రణతః = నమస్కరించినవాడు, (అగుచున్నాడో, వాడు) స్వర్గే=సురలోకమున, విచి...రీభిః, విచిత్ర = నానావిధములైన, సురపాదప = కల్పవృక్షము యొక్క, మంజరీభిః=పుష్పగుచ్ఛములు గలిగినట్టియు, మందా...తాభిః, మందాకినీ = ఆకాశగంగయందలి, కనకపంకజ=బంగారుతామరలచేత, యోజితాభిః=కూర్పబడినట్టియు, ఇంద్రాప్సరోభిః=ఇంద్రుడును అప్సరలు మున్నగు వారితోడను, అమరైః=సురలతోడను, అసురైః=దానవులతోడను, ఉపేతః=కూడినవాడై (శోభించుచున్నాడు.)

తా. ఓ మహేశ్వరా! నిన్ను భక్తితో విధ్యుక్తముగా పూజించి శరణాగతుడైన మహానుభావుని, స్వర్గమునందు చిత్రవిచిత్రములైన కల్పతరుపుష్పములను, ఆకాశగంగలో:బూయు బంగారు తామరపువ్వులను చెండ్లుగా గట్టి చేతబట్టుకొని, మహానంద మొలుకగ ఇంద్రుడును, అప్సరఃస్త్రీలును, ఇతర దేవదానవులును, ఎదుర్కొని తమ పంక్తిలో ప్రముఖునిగా సన్మానించుచున్నారు గదా!

వి. శివభక్తుని పదవి ఇంద్రోపేంద్రాదులకంటె నధికమైనదని యిందు నిరూపింపబడినది. "ఇంద్రోఽప్సరోభిః" అను పాఠాంతరము నంగీకరించి నపుడు ఇంద్రుడు గూడ అట్టి సుందరీమణుల తోడను దేవదానవుల తోడను కూడుకొని శివార్చన గావించుచు ధన్యు డగుచున్నాడని గ్రహించునది. "బ్రహ్మణః సృష్టికర్తృత్వం, విష్ణో ర్దానవమర్దనం, ఇంద్రస్య స్వర్గరాజ్యం చ, శివపూజావిధేః ఫలం" అను ఆగమవచనము ఇట[illegible] స్మర్తవ్యము.

త్వాం దీప్యమానమకుటోత్కటచారుహార -
కేయూరకుండలధరా గిరిగహ్వరేషు ।
గంధర్వలోకలలనాలలితైర్వచోభి-
రుచ్చైఃకృతాంజలిపుటం భగవం స్తువంతి. ॥౨౨॥

అర్థ:— భగవన్=పరమేశ్వరా! గిరిగహ్వరేషు= మేరుమందర పర్వతముల గుహాలలో గల, గంధర్వలోకలలనాః = గంధర్వసుందరీ మణులు, ఉచ్చైఃకృతాంజలిపుటం = పైకి నెత్తబడిన కైమోడ్పుల మడుపు లుండు నట్లుగా, దీప్య...ధరాః- దీప్యమాన=మెరయుచున్నట్టి, మకుట = కిరీటము లేమి, ఉత్కట చారుహార= మిక్కిలి మనోహరము లగు ముత్యాలదండ లేమి, కేయూర=భుజకీర్తులేమి, కుండల = కుండలములేమి; వీనిని, ధరాః=ధరించుకొనినవారై, లలితైః = మధురము లైన; వచోభిః = వాక్కులచేత, త్వాం = నిన్ను, స్తువంతి=కీర్తించు చున్నారు.

తా. ఓ ప్రభూ! మేరుమందరాచలములలో నివసించు గంధర్వ కాంతలు మిక్కిలి భక్తితో మొ్రక్కుచు; ప్రకాశమానము లైనట్టియు మిక్కిలి సుందరములైనట్టియు కిరీటములను, ముత్యాలసరములను, భుజకీర్తులను, పుష్యరాగపు కమ్మలు మున్నగు భూషణముల దాల్చినవారై కమ్మని పాటలతో నీ మహిమను గొనియాడుచున్నారుగదా!

వి. సిద్ధులు గంధర్వులు పర్వతగుహాలలో సానువుల సారికలలో నివసింతురని మృగేంద్రాదులలో ప్రమాణము కలదు. "సిద్ధగంధర్వ మరుతాం,తదధఃపర్వాసు స్థితిః" వివాహాది శుభకార్యములకువలె, శివపూజాసమారంభములకును శుచిర్భూతులై, దేదీప్యమానములగు వస్త్రభూషణములతో నలంకృతులై వెళ్ళి. లోకోత్తరమగు తమ గాన మాధుర్యమును సమర్పించి గంధర్వాదులును శివుని ఉపాసించు చున్నారని భావము. ॥౨౨॥

జ్ఞానం త్రికాలవిషయం గగనేచరత్వ -
మైశ్వర్యమష్టగుణితం శ్రవణం చ దూరాత్ ।
ఉత్క్రాంతిముక్తి-పరకాయపరప్రవేశా
శంభో భవంతి భవినాం భవతః ప్రసాదాత్ ॥౨౩॥

అర్థః:— శంభో=సుఖసాగరా! త్రికాలవిషయం = త్రికాలము లకు సంబంధించిన, జ్ఞానం=జ్ఞానమును, గగనేచరత్వం=ఆకాశమునందు చరించుటయును, అష్టగుణితం=ఎనిమిదివిధములగు, ఐశ్వర్యం=సంప త్తును, చ=మరియు, దూరాత్=దూరమునుండి, శ్రవణం=వినుటయును, ఉత్క్రాంతిముక్తి - పరకాయ పరప్రవేశా=శరీరమునుండి ప్రాణముల విడదీయుటయు; ఒరుల దేహములలో ప్రాణముల ప్రవేశింపజేయు టయు అను రెండు సిద్ధులును, భవినాం=ప్రాణులకు, భవతః=నీయొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, భవంతి=అగుచున్నవి.

తా. ఆనందఘనా! భూతభవిష్యద్వర్తమానములనెడు త్రికాల ములయొక్క సమాచారమును, బయలులో పైన సంచరించుటయును, అణిమాద్యష్టైశ్వర్యములను స్వాధీన మొనరించుకొనుటయును,దూరశ్రవ ణమును, తన దేహమున ప్రాణముల లేకుండునట్లు చూపుటయును, ఇతరుల దేహమును తనప్రాణముల ప్రవేశింపజేయుటయును, అను నెల్ల తెరంగు లగు మహాసిద్ధులు నీకృపవలననే జీవులకు లభించు చున్నవి.

వి. ప్రత్యేక ప్రత్యేకముగ మిక్కిలి కష్టతరమగు యోగ సాధనము వలన ఒక్కొక్క సిద్ధిని సంపాదించుకొనుట సుప్రసిద్ధమే, కాని యంతగా క్లేశపడుటకంటె సర్వేశ్వరుడగు శివుని దృఢముగ నుపాసించి ప్రసన్నతకు పాత్రుడైన శివభక్తునకు నీ సమస్తసిద్ధులును మిక్కిలి సులభము లని విశేషము. వేలమంది భటులను వశపరచు కొనుటకు కష్టపడుటకంటె రాజునొక్కనే ప్రసన్నుని గావించుకొనుటవంటిది. ॥౨౩॥

ఉక్తం శివేతి శివ యేన దివాపి రాత్రి -
వుత్కంఠనాద్ధర హరేతి సకృన్మృషాపి।
సత్యం బ్రవీమి సురనాథ న పక్షపాతం
మూఢోఽపి ఘోరనరకాత్స బిభేతి కస్మాత్ ॥౨౪॥

అర్థః:— సురనాథ = దేవచక్రవర్తీ, శివ=మంగళస్వరూపా, యేన=ఎవనిచేత, దివా=పగటియందును, రాత్రౌ = రాత్రియందును, అపి=కూడ, ఉత్కంఠనాత్ = అపేక్షచేతను, మృషా = వట్టిగనైనను, శివేతి=శివయని, హరహరేతి=హరహరయని, సకృత్ = ఒకసారు, ఉక్తం = ఉచ్చారణ మొనర్చబడునో, సః ... మానవుడు,

మూఢోఽపి=మూర్ఖుడైనను, ఘోరనరకాత్ =భయంకరమైన పాపము వలన, కస్మాత్ =ఎందుకు, బిభేతి=భయమందుచున్నాడు, సత్యం=సత్యమును, బ్రవీమి = చెప్పుచున్నాను, పక్షపాతం = పక్షపాతమును, న= కాదు.

తా. దేవరాజా! దివ్యమంగళవిగ్రిహా! భక్తితోగాని, భక్తి లేకగాని, రాత్రింబవలు 'శివ శివ'యని 'హర హర' యని ఒక పర్యాయము ఎవ్వాడు స్మరించునో వాడు శాస్త్రము దెలియని మూర్ఖుడైనను భయంకరములైన రౌరవాది నరకములనుండి యేమాత్రమును భయపడ నవసరములేదు. సర్వపాప రహితుడై పరిశుద్ధుడగుచున్నాడు. ఇది మున్మాటికి నిక్కువము. పక్షపాతముతో చెప్పుట కాదు.

వి. ఇందలి విషయ మెంతేని సత్యము. శివభక్తుండ నని నటించువానికే ఇంత సౌఖ్య ముండ నిక్కముగ శివభక్తి నొనర్చువాడు మహానందము నొందు ననుటలో సందేహ మేమి? ఇంతకంటె శివనామస్మరణమునుగూర్చి చెప్పవలయునా? ॥౨౮॥

> చర్యావబోధరహితా భవభక్తిమాత్రా-
> నీతా స్త్వయా శివపురం యదహో కిరాతాః ।
> జాతిస్మరత్వమథవా పరమామరత్వం
> యే త్వాం విముక్తిరథవా భవతః ప్రసాదాత్ ॥౨౯॥

అర్థః— భవ=సర్వకారణా! చర్యావబోధరహితాః = ఆచారక్రియాజ్ఞానశూన్యులైన, యే = ఏ, కిరాతాః = బోయలు, భక్తిమాత్రాత్ = కేవలము నీయందు భక్తిగలవారైనందువలన, అథవా= మరియు, త్వాం=నిన్ను, (పూజించుచున్నందువలన) త్వయా = నీచేత, శివపురం = కైలాసమునుగూర్చి, యత్ =ఎందువలన, నీతాః=కొని పోబడిరో, అహో=ఆశ్చర్యము! (అందువలన) జాతిస్మరత్వం=పూర్వజాతిస్మరణగాని, అథవా=లేక, పరమామరత్వం శ్రేష్ఠదేవత్వముగాని, విముక్తిః=జన్మరాహిత్యముగాని, భవతః=నీ యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, (కలుగుచున్నది).

తా. లోకకారణా! శాస్త్రోక్తములైన ఎట్టిక్రియలు దెలియకున్నను భక్తిమాత్రమున కరుణతో ... బోయలు కైలాసమును

జేర్చితివే! ఆహా! నీ భక్తపక్షపాతము! తాను ఇట్టిజాతివాడను జ్ఞానము గాని, శ్రేష్ఠమైన దేవతాజన్మముగాని, శాశ్వతమైన ముక్తిగాని నీ కృపకు అధీనములై యున్నవి. నీ కరుణవలన కలుగని దేది?

వి. ఇందు శివుని భక్తపక్షపాతమును; కరుణామయత్వమును సూచింపబడినవి. ఈ సందర్భమున బోయకన్నప్ప యను మహాభక్తునిగాథ స్మరింపదగియున్నది. "కాళహస్తినివాసి బోయకన్నప్ప. దినక్రమము ననుసరించి, ఒకనాడు వేటకువెళ్లివచ్చుచుండ మార్గమధ్యమున రాత్రి కాగా, ఆ యరణ్యముననే వృక్షము క్రింద నిద్రించుచుండ అట నొక శివలింగమున్నట్లు స్వప్నమున మునివేషధారియైన శివునివలన దెలిసికొని, ప్రాతః కాలమున వెదకికొని ఆశివలింగమును దర్శించి మిక్కిలి భక్తిశ్రద్ధలతో బూజించెను. కాని పూజాక్రమ మెరుగనివాడు కావున తన నోటిపుక్కిట దెచ్చిన నీటితో యభిషేకమును, తన జుట్టులో బెట్టుకొనిన పువ్వులతో అలంకారమును, తాను దినగా మిగిలిన మాంసముతో నైవేద్యమును ఒనర్చి వేటకు వెడలి యుండెను. నిత్యమునువచ్చు అర్చకుడు ఇట్టియనార్యమైన పూజాక్రమము నవలోకించి కినిసి ఈ గుప్తపూజకు డెవడో పట్టి వధింప నిశ్చయించి, మరుచటిదినమున ఖడ్గము చేతబూని చాటున నిలిచియుండెను. ఆ నాడును కన్నప్ప యెప్పటియట్లు విలక్షణమైన పూజ గావించి ధ్యానించుచు నిలిచి యుండెను ఆసమయమున లింగముయొక్క నేత్రస్థాన మెర్రనై నీరు గార్పజొచ్చెను. దాని కా భక్తుడు చింతాక్రాంతుడై తన నేత్రము బాగుగా నున్నది కదా యని పెరికి లింగనేత్రముమీద నతికించెను. తదుపరి లింగముయొక్క రెండవ కన్నుగూడ నట్లే నీరుగార్చి బాధనొందుటను జూడజాలక, కన్నప్ప తన రెండవకన్నును గూడ బాణము తుదతో పెకలింప నుద్యమించుచుండగా ఈపరమ శివభక్తుని భక్త్యతిశయమునకు మెచ్చి శివుడు ప్రసన్నుడై కైలాసము ననుగ్రహించెను. ఇక ఖడ్గముతో నరకబూనిన శివార్చకుని సంగతి జెప్ప నవసరములేదు" - ఇట్లే అందరును పూజింపవచ్చునా అను దురర్థమును స్వీకరింప గూడదు. తెలియని వాడు చేసిన పూజ క్రియారహితముగ నున్నను భక్తి దృఢముగ నగుపడునేని పరమేశ్వరు డనుగ్రహించునని గ్రహింపవలెను. ॥౨౫॥

> తస్మాత్కరోమి యదభీకరమప్రమేయం
> మూఢేన శంకర మయా యదకారి పాపం ।
> న త్త్వం పశుత్వతిమిరం భవపాశమీశ
> చ్ఛింది ప్రసహ్య భగవ న్నపునర్భవాయ ॥౨౬॥

అర్థ:—భగవన్ = పరమేశ్వరా! శంకరా = సుఖప్రదాయకా! తస్మాత్ = ఆ కారణమునుబట్టి, మూఢేన = మూఢుడైనట్టి, మయా = నాచేత, అభీకరం = మిక్కిలి క్రూరమైనట్టి, అప్రమేయం = అగాథమైనట్టి, యత్ = ఏ, పాపం = దురితము, అకారి = చేయబడెనో, కరోమి = చేయు

చున్నాడనో (దానిని) సః = ఆ కరుణామయుడవైన, త్వం = నీవు, పశుత్వతిమిరం = పశుత్వమనెడు అంధకారమును, భవపాశం = జన్మ జాలమును, ఈశ = ఓ ప్రభూ! సపునర్భవాయ = పునర్జన్మము కలుగకుండుకొరకు, ప్రసహ్య=బలాత్కారముగా, ఛింది = ఛేదింపుము.

తా. మహాప్రభూ! సుఖదాతా! పై కారణమును బట్టి మూఢుడనైన నేనును ఎట్టి అద్భుతములైన అనంతములైన దురితముల నాచరించినాడనో, చేయుచున్నాడనో, వానికి కారణమైన అజ్ఞానాంధకారమును పారద్రోలుము. అనేక జన్మములకు కారణమైన మాయా సూత్రమును బలాత్తుగ ఏమి యాలోచింపకయే త్రెంచివేయుము. ఇక ముందు జన్మ మెందులకు వచ్చును?

వి. ఇందు భక్తుడు చక్కని యుక్తిని బన్నినాడు. వివిధములైన పాపములకును, అజ్ఞానవిలాసములకును కారణము జన్మము కదా! దాని దీసివేయుచో ఇకముందు అప్రశ స్తము జరుగజాలదు! జన్మము లేనిచో కర్మమెక్కడిది? కారణములేకయే కార్యమెట్లగును? కర్మపరిణామవాదులు కొందరు ఎట్టిదైనను అనుభవింపకయే తీరదనియు, మధ్యను భగవత్కటాక్షము గల్గినను భక్తుడు తన కర్మఫలమును భోగించుననియు జెప్పుదురు. ఇందు కొంత సత్యమున్నను సరియైనసిద్ధాంతము కాదు. ఉత్కటమైన భక్తిప్రభావమువలనను, తపస్సువలనను పూర్వకర్మను సమూలముగ భస్మమొనర్పవచ్చు ననియే శివాగమసిద్ధాంతములు భేరీనినాదముల జేయుచున్నవి. మార్కండేయ సానందాదు లిందు కుదాహరణము. నిక్కమైన భక్తుని ఆర్తిని బోనాడని దేవుడు కలడనుటకన్నను లేడని నాస్తికు డగుటయే మేలు. ॥౨౬॥

త్వత్పాదపూజనరతా మునయో వనేషు
తిష్ఠంతి మూలదలకందఫలాశినో యే।
తే యాంతి ముక్తిపద మీశ్వర తావదాస్తాం
ధన్యాస్తు తే తవ ముఖాన్యవలోకయంతి ॥౨౭॥

అర్థః— ఈశ్వర=ఓ ప్రభూ! యే=ఏ, మునయః = భృగ్వాది మహర్షులు, మూలదలకందఫలాశినః=చెట్లవేళ్లు, ఆకులు, గడ్డలు, కాయలు మున్నగువాని యాహారము గలవారై, వనేషు = వనాశ్రమములలో, త్వత్పాద పూజనరతాః = నీ చరణపూజలో నిరతులై, తిష్ఠంతి=నివసించుచున్నారో, తే=వారు, ముక్తిపదం=మోక్షధామ

మును, యాంతి=పొందుచున్నారు, (ఇది), ఆస్తాం తావత్ = ఉండు గాక ! తు=ఐతే, (ఎవరు) తవ=నీయొక్క, ముఖాని=పంచవదనము లను, అవలోకయంతి=దర్శించుచున్నారో, తే=వారు, ధన్యాః = కృతార్థులుగదా !

తా. వనములలో నివసించి, మిక్కిలి యల్పము లగు కంద మూలాదుల దినుచు, నిరంతరము శివపూజాపరాయణులై ముక్తిని పొందుచున్నా రనుచో గావచ్చును. అందు ఆశ్చర్య మేమియును లేదు. కాని నీముఖముల నవలోకించు మునులే ధన్యులని చెప్పవలసియున్నది.

వి. యోగశాస్త్రప్రకారము కష్టముతో ప్రత్యాదుల నాచరించుచు ముక్తిని అంద రును పొందవచ్చును. కాని యిది యొక ఘనకార్యము కాదు. శివభక్తులై శివునియొక్క ఆ యద్భుతములైన సద్యోజాతాది పంచముఖములను, ఆ యందమైన చందమా మను, గాంచుటయే ధన్యత కదా! దీనివలన శివుని రూపము లోకాతీతరమ్యత గల దనియు, అది ప్రత్యక్ష మగుచో భావుకు డగు భక్తుడు అద్భుతమైన ఆనందము నను భవించి యుద్బాష్పు డగుననియు తెలియవలెను. దారుకావనమున ఋషుల బరీక్షింప నెంచి శివుడు మనోహరాకారము కలవాడు కాగా ఋషిపత్నులు మోహితలైరి. దానికి ఋషులు క్రుద్ధులై శాపమిడగా, అద్దానిని వారికే మరల్చి ప్రతిశాప మిడి; వారి ప్రార్థనవలన విముక్తులై నన్ను గాంచగల రని వరమిడెను. ఇది స్కాందపురాణ కాశీఖండమున గలదు. దీని వలన ముక్తికంటె శివదర్శనమే ఘనమైన దని తెలియు చున్నది. ||౨౭||

స్ఫీతే ప్రథిమ్ని జఘనే ఘనపాటలిమ్ని
బింబాధరే కుచయుగే ద్యుతపింజలిమ్ని ।
స్త్రీణాం మహేశ విలసంతి కుతో నరాశ్చ
యై ర్నార్చితోఽసి న నతోఽసి న సంస్తుతోఽసి ॥౨౮॥

అర్థః— మహేశ=దేవాధీశా! యైః=ఏ, (మానవులచేత, నీవు) అర్చితః=పూజింపఁబడినవాడవు, నాసి=కాలేదో, నతః=నమస్క రింపఁబడినవాడవు, నాసి= కాలేదో, సంస్తుతః = కీర్తింపబడినవాడవు' నాసి=కాలేదో, (ఆ) నరాః = మానవులు, స్త్రీణాం = సుందరీమణుల యొక్క, ప్రథిమ్ని = విస్తారమైన, స్ఫీతే = గొప్పదైన, జఘనే= నితంబమునందును, ఘనపాటలిమ్ని=మిక్కిలి యెఱ్ఱనైన, బింబాధరే= దొండపండువంటి పెదవియందును, ద్యుతపింజలిమ్ని = మెఱయుచున్న

పచ్ఛదనముగల, కుచయుగే=ఉరోజములందును కుతః = ఎవ్విధమున, విలసంతి = శోభించుచున్నారు?

తా. మహాప్రభూ! ఏ మహానుభావులు నిన్నర్చించి నమస్కరించి, కీర్తింపలేదో అట్టిమానవులు, మనోరమలయొక్క విశాలమైన జఘనమునందును, బింబాధరమునందును, పుష్టమైన వక్షఃస్థలమునందును విలాసము నందుటలేదు. సుఖములను విలాసములనుగూడ నిను పూర్వ జన్మమున పూజించినవారే అనుభవించుచున్నారు. శివానుగ్రహము లేక యే ఈషణ్మాత్రముగనైనను సౌఖ్యము లేదని భావము.

ప్రోద్దామకామమదిరామదలోలనేత్రా

రత్నావళీఝణఝణారవరమ్యగాత్రాః ।

తే యక్షలోకవనితాసు చిరం రమంతే

యే త్వాం స్మరంతి సతతం మకరధ్వజారే ॥౨౯॥

అర్థ:— మకరధ్వజారే = ఓకామదహనా! యే = ఎవ్వారు, త్వాం=నిన్ను, సతతం=సదా, స్మరంతి=స్మరించుచున్నారో, తే=వారు, ప్రోద్దా......నేత్రా—ప్రోద్దామ = అధికమైన, కామ = మన్మథుడనెడు, మదిరా=మద్యముయొక్క, మద=మబ్బుచేత, లోల = చంచలములైన, నేత్రాః = కన్నులుగలవారై, రత్నా......గాత్రాః— రత్నావళీ=నవరత్నముల సరములయొక్క, ఝణఝణారవ=ఝణఝణ ధ్వనిచేత, రమ్య = మనోహరమైన, గాత్రాః = దేహములుగలవారై, యక్షలోకవనితాసు=యక్షలోకమందలి రమణులలో, చిరం = దీర్ఘకాలమువఱకు, రమంతే=సుఖించుచున్నారు.

తా. మహేశ్వరా! నీవు మదనాంతకుడవైనప్పటికిని నిను భక్తితో సదా కీర్తించి భజించువారు; అత్యధికమైన కామోద్దీపనముతో కనులతిరుగుడు గలవారై; ధరించుకొనిన రత్నపు సరముల గల్లు గల్లుమను చప్పుడుగలవారై యక్షలోకపు దివ్యసుందరీమణులతో క్రీడించుచు నిరంతర సౌఖ్యము ననుభవించుచున్నారు. (తాను గామ విరోధియైనను అనన్యభక్తులయొక్క కామములను, ఇష్టార్థములను

అనుగ్రహించు మహాకరుణామయుడు శివు డని భావము. శివభక్తున కసాధ్య మెద్దియు లేదని తెలియునది.)

అంధస్య మే హృతవివేకమహాధనస్య
చోరైః ప్రభో బలిభి రింద్రియనామధేయైః।
సంసారకూపకుహరే వినిపాతితస్య
దేవేశ దేహి కృపణస్య కరావలంబం ॥౩౦॥

అర్థ:— దేవేశ=ఓ సురేశ్వరా! అంధస్య=అజ్ఞానాంధకారము గల, ఇంద్రియ నామధేయైః=ఇంద్రియములనెడు పేరుగల, బలిభిః=బల శాలురైనట్టి, చోరైః=దొంగలచేత, హృతవివేక మహాధనస్య=హరింప బడిన జ్ఞాన మనెడు గొప్ప ధనము గలిగినట్టి, సంసారకూపకుహరే = సంసారమనెడు బావి యొక్క గర్తములో, వినిపాతితస్య=వేయబడినట్టి, కృపణస్య=దీనుడనైనట్టి, మే=నాకు, ప్రభో=ఓసర్వేశ్వరా! కరావ లంబం=చేదోడును, దేహి=ఈయుము.

తా. ఓ పరమేశ్వరా! మిక్కిలి బలముగలవారును, ఇంద్రి యములను పేరుగలవారును అగుచోరులు అజ్ఞానమను గ్రుడ్డితనము గల నాయొక్క వివేక మనెడి ధనరాశిని అపహరించి సంసార మనెడు కూప మున బడ వేసినారు. ఇందుఁబడి మిగుల పరితపించుచున్నాను. ఇట్టి దీనునకు జేయూత నొసగి యుద్ధరింపుము.

వి. ఇందు సుందరమైన భావసంపద కలదు. "బలవా నింద్రియగ్రామో, విద్వాంస మపి కర్షతి" "చంచలం హి మనః పార్థ, ప్రమాథి బలవద్దృఢం" మున్నగు భగవద్వాక్యములే యిట సమంజసముగా నిరూపింప బడినవి. ఇంద్రియజయమే జీవితమున ప్రధానయుద్ధము. శివానుగ్రహము వినా ఇంద్రియముల జయము కలలోని వార్త. భక్తుని అనన్యశరణాగతివలన శివకృప తప్పక కలుగును. ॥౩౦॥

మూఢో వివేకవికలోఽసకృదూర్ధ్వబాహుః
కిం న శృణోషి యదహం హర రారటీమి।
మాం తత్ర కర్మణి నియోజయ దేవ యేన
సంసారచక్రగహనం న పునర్విశామి ॥౩౧॥

అర్థ:—హర=భవహరా! మూఢః=మూర్ఖుడను, వివేకవికలః=జ్ఞానశూన్యుడను, (ఇట్లు) అసకృత్=చాలమారులు, ఊర్ధ్వబాహుః=పైకెత్తిన చేతులు గలవాడనై, యత్ =ఎందువలన, అహం=నేను, రారటీమి=మిక్కిలి మొరపెట్టుచున్నాడను. (నీవు దానిని) కిం=ఎందువలన, నశృణోషి=వినుటలేదు? దేవ=ప్రభూ! యేన=దేనిచేత, సంసారచక్రగహనం=జన్మ జరామరణముల పునరావృత్తి దుఃఖమును, పునః=మరల, నవిశామి = పొందనో, తత్ర = ఆ, కర్మణి = క్రియయందు, మాం = నన్ను, నియోజయ = ప్రవేశింపజేయుము.

తా. పరమేశ్వరా! నేను "అపరాధిని అవివేకిని చపలుడ కడు హీనమతిని" అని యనేకపర్యాయములు చేతులుచాచి నీకు మొఱపెట్టుచున్నాను- నీ వెందులకు దానిని వినుటలేదో తెలియదు. కరుణామయా! దేనితో జననమరణరూపమైన ఈ దుర్గమసంసారమున మరల నేను ప్రవేశింపజాలనో అట్టిపనిలో నన్ను నియోగింపుము ప్రభూ!

వి. ఇక్కడ భక్తుడు శివునియొద్ద ఉద్యోగమునకై అర్జీని పెట్టికొనినట్లున్నది. శివుడు ఏ యుద్యోగమును, ఎంత స్వల్పముగ జీతము నిచ్చినను భక్తుడు సేవింప సిద్ధముగా నున్నాడు. కాని తన పక్షమునుండి ఒక్క షరతును మాత్రమే కోరినాడు. అది జన్మమరణచక్రమున మరల ప్రవేశము గావింపకుండుట! యుక్తి మిక్కిలి చక్కనిది. కరుణామయుడు శంకరు డీ మాత్ర మనుగ్రహింపడా! ॥౩౧॥

మాయాప్రపంచరచనాచతురా సమస్త -
వస్తుప్రభేదభిదురా శివ సర్వకర్త్రీ ।
సంసారపాశవిషమచ్ఛిదురా నరాణాం
మోహాంధకారభిదురా చ తవైవ శక్తిః ॥౩౨॥

అర్థ:—శివ =కల్యాణకరా! తవైవ =నీదియే యైన, శక్తిః=ఇచ్ఛాక్రియాజ్ఞానరూప మగు శక్తి, మాయాప్రపంచరచనా చతురా=మాయయొక్క జగత్తును చేయుటలో సమర్థమైనదై, సమస్తవస్తుప్రభేదభిదురా=వివిధములైన కార్యములయొక్క విశేషములను లయమొనర్చునదై, సర్వకర్త్రీ = సమస్తమును చేయునదై, నరాణాం = జనులయొక్క, సంసారపాశవిషమచ్ఛిదురా=సంసారమనెడు పాశమునందుగల వైషమ్యమును ధ్వంస మొనర్చునదై, చ = మఱియు, మోహాంధకా

భిదురా=మోహ మనెడు అంధకారమును బోనాడునదై (విరాజిల్లు చున్నది.)

తా. మహాప్రభూ ! నీయొక్క ఇచ్ఛాక్రియాజ్ఞానాత్మకమైన అద్భుతశక్తి, అధోమాయ, ఊర్ధ్వమాయ యను ద్వివిధమాయయొక్క శుద్ధాశుద్ధకార్యములను నిర్వహించుటలో సమర్థమైనదై; (స్థితికృత్యం) సకలకార్యములయొక్క విశేషములను (ప్రసరించుటను) ఉపసంహరించు నట్టిదై; (సంహారకృత్యం) పై యుభయకార్యముల నెల్ల మహామాయతో బుట్టించునదై; (సృష్టికృత్యం) సంసారబాధను భోగానుభవముతో నివారించునదియునై, (తిరోధానకృత్యం) అజ్ఞానాంధకార (ఆణవ మాయా కార్మికమలత్రియ) మును శివదీక్షాజ్ఞానముతో శమింపజేయునదై; (అనుగ్రహకృత్యం) సర్వదా వెలుంగుచున్నదిగదా!

వి. "త్వం పాసి హంసి" యను ౨వ శ్లోకమున పరశివునియొక్క సృష్టిస్థితి సంహారతిరోధాన అనుగ్రహము లనెడు పంచకృత్యములు సూచింపబడియుండెను. ఇందు ఆ కృత్యములు శివునిచే శక్తిద్వారా చేయింపబడునను అంశము కొంతవిపులము చేయబడినది. ఈ శ్లోకమున సరిగా ఐదుకృత్యములు స్ఫురించునట్లు ఐదు ప్రత్యేకము లైన విశేషణములతో రచన చేయబడినది. మరియు మాయ, వస్తు, సర్వ, సంసార, మోహము లనెడు ఐదు శబ్దములును, ఊర్ధ్వమాయ, అధోమాయ, శుద్ధాశుద్ధ, జగదుపాదాన, మలత్రియ, దీక్షాత్రియములు అను అర్థము వచ్చునట్లు మిక్కిలి ప్రతిభతో ప్రయోగింప బడినవి. దీనివలన మల్హణుడు శివాగమశాస్త్ర సంపన్నుడని తెలియుచున్నది. ॥౩౨॥

ఛిత్త్వా సమస్తమశుభం భవపాశరాశి -
మీషత్ప్రకాశమవశం స్వబలాసినా మే ।
తేజోనిధాన మమలం భగవన్ ప్రయచ్ఛ
సర్వజ్ఞతాయుతమశేషకరం శివత్వం ॥౩౩॥

అర్థః — భగవన్=భగవంతుడా! అశుభం = అమంగళకరమైనట్టియు, అవశం=పరాధీనమైనట్టియు, ఈషత్ప్రకాశం = స్వల్పకాంతిగల్గినట్టియు, సమస్తం=అఖిలమైనట్టియు, మే=నాయొక్క, భవపాశరాశిం= జన్మబంధముల సమూహమును, స్వబలాసినా = నీ శక్తియనెడు ఖడ్గముతో, ఛిత్త్వా=ఛేదించి, తేజోనిధానం = చిన్మయమైన, అమలం =

నిర్మలమైన, సర్వజ్ఞతాయుతం = సర్వజ్ఞత్వముతో గూడినట్టి, అశేష కరం=సర్వకర్తయైనట్టి, శివత్వం=శివత్వమును, ప్రయచ్ఛ=ఈయుము.

తా. ఐశ్వర్యనిలయా! జనన, మరణ, జరా, వ్యాధి, దుఃఖ, భీతి, మోహ, రాగ, ద్వేషములకు కారణమై అమంగళకరమైనదియు; పరతంత్రమైనట్టిదియు; కించిజ్జ్ఞత్వాది దౌర్బల్యము గలదియు, అగు నా యొక్క భవబంధనమును నీవు జ్ఞానశక్తి రూపమైన ఖడ్గముతో కోసి వేసి, చిదానందమయమైనట్టియు; పరిశుద్ధమైనట్టియు; సర్వజ్ఞత్వ సర్వ కర్తృత్వాది మహిమలు గలిగినట్టియు; శివత్వమును అనుగ్రహింపుము.

వి. జీవుని శివునిగా మార్పు మని భావము, సంపూర్ణసాయుజ్యముక్తి. విధ్యుక్తముగ శివదీక్షనంది సదాచారము గలవానికి ఇట్టి శివజీవైక్యము; (లింగాంగసామరస్యము) లభించును. ॥33॥

బాలోఽపి సంస్మరణమాత్ర మచేతనస్తే
లింగం కరోతి హర పాంసుమయం వినోదాత్ ।
అత్యంతదేశధనధాన్యసమృద్ధిభాజి
రాజ్యం కరోషి హతకంటకమున్నతం చ ॥౩౪॥

అర్థః— హర=ఈశ్వరా, అచేతనః=అజ్ఞుడైనట్టి, బాలోఽపి= బాలకుడైనను, వినోదాత్=ఆటపాటలవలన, పాంసుమయం=మట్టితో జేయబడిన, తే = నీయొక్క, లింగం = లింగమూర్తిని, సంస్మరణ మాత్రం=గురుతుండునట్లుగా మాత్రమే, కరోతి = చేయుచున్నాడో, తస్య=వానికి, త్వం=నీవు, అత్యం.....భాజి, అత్యంత = అపరిమిత మైన, దేశ=ప్రాంతములేమి, ధన=ధనములేమి, ధాన్య=ధాన్యములేమి వీనియొక్క, సమృద్ధి=సంపూర్ణతను, భాజి=పొందినట్టి, హతకంటకం= నశింపజేయబడిన విఘ్నములుగలట్టి, చ=మరియు, ఉన్నతం=అత్యధిక మైన, రాజ్యం=రాష్ట్రమును, కరోషి=చేయుచున్నావు.

తా. పురారీ! ఆగమశాస్త్రమందలి లింగప్రతిష్ఠావిధాన మును తెలియకున్నను; ఊరకయే వినోదముగా ఇసుక మన్నుగు వానితో లింగమును బాలకుడు చేసినంత మాత్రముననే నీవు మిక్కిలి సంతృప్తుడై ధనధాన్యములతో తులదూగుచున్న రాష్ట్రమునకు

వానిని సార్వభౌమునిగా జేయుచున్నావుగదా! ఇక విధ్యుక్తముగ బ్రతిష్ఠింపగల్గువారి పరమైశ్వర్యలాభమునుగూర్చి వేరే చెప్పవల యునా!

వి. వినోదార్థము లింగపూజాదుల జేయువారికిని నిట్టి మహాభాగ్యము గల్గు ననుటకు సౌరసంహితలో ప్రమాణ మిట్లు గలదు. "పాంసునా క్రీడమానోపి లింగం కృత్వా సవై నరః। ప్రోత్యాంతే లభతే రాజ్యం, సుసంపన్న మకంటకం॥ క్రీడంతి శిశవో యత్ర, లింగం కృత్వా యజంతి యే। సైకతం మృన్మయం వాపి, తే భవంత్యేవ భూభుజః" ఈ శ్లోకములకు పై శ్లోకము చక్కని ప్రతిబింబమువలె నుండి బిల్హాణుని సమస్తాగమపారగత్వమును సూచించుచున్నది. ॥౩౪॥

యే పాపకర్మగురుతల్పగహేమచోర -
బ్రహ్మఘ్నగోఘ్నచపలాతురపాతకాశ్చ।
తే నీలకంఠ పరమేశ్వర పాదలగ్న-
నిర్ధాత పాప శశినిర్మలశుద్ధదేహాః ॥౩౫॥

అర్థః—— నీలకంఠ=విషధరా! పరమేశ్వర=మహేశ్వరా, యే= ఎవ్వారు, పాప.....పాతకాః, పాపకర్మ = మాతృపితృపరిత్యాగ మొనర్చినట్టి, గురుతల్పగ=గురుదారల బొందినట్టి, హేమచోర=బంగా రము దొంగిలించినట్టి, బ్రహ్మఘ్న=బ్రహ్మహత్య గావించినట్టి, గోఘ్న= గోహత్యజేసినట్టి, చపలాతుర=జారులైనట్టి, పాతకాః=పాతకులుగలరో, చ=మరియు, తే=వారు, (నీయొక్క) పాద... దేహాః, పాద=పాదము యొక్క, లగ్న=సంబంధముచే, నిర్ధాత=కడుగబడిన, పాప = పాపము గలవారై, (కావుననే) శశి=చంద్రునివలె, నిర్మల=అమలమైన, శుద్ధ= పావనమైన, దేహాః=తనువు గలవారు (అగుచున్నారు.)

తా. శ్రీకంఠా! అత్యంతగర్హ్యములైన గురుతల్పగమన, బ్రహ్మహత్య, గోహత్య, భ్రూణహత్యలు మున్నగు మహాపాతకము లను, స్వర్ణచౌర్య, జారత్వ దేహద్రవ్యాపహారములు మున్నగు ఉప పాతకములను గావించినవారు సైతము; నీ పాదములలో శరణాగతు లగుచో సమస్తపాపములు తొలగి పరిశుద్ధులై చంద్రునివలె సత్కార పాత్రు లగుచున్నారు. ॥౩౫॥

యే త్వాం విభో సవనకాలనకల్పితేషు
సమ్యగ్యజంతి వివిధేషు శివవ్రతేషు।
తే చాతురంగఘనకుంకుమపింజరేషు
విద్యాధరీషు విలసంతి కుచాంతరేషు ॥౩౬॥

అర్థ:—విభో=సర్వవ్యాపకా! యే=ఎవరు, సవనకాలన కల్పితేషు=త్రిసంధ్యలందు౹ జేయబడిన, వివిధేషు=పలు తెఱగులైనట్టి, శివవ్రతేషు=మంగళవ్రతములందు (లేక శివరాత్రి శ్రావణ కార్తిక సోమవారములందు) సమ్యక్=విధ్యుక్తముగా, త్వాం=నిన్ను, యజంతి=పూజించుచున్నారో, తే=వారు, విద్యాధరీషు=విద్యాధర స్త్రీల సంబంధము లైన, చాతు...రేషు, చాతురంగ=నాల్గు సుగంధ ద్రవ్యముల చేత, ఘన=సాంద్రములైనట్టి. కుంకుమ = కుంకుమ కేసరమువలె, పింజరేషు = పీతవర్ణముగలట్టి, కుచాంతరేషు=స్తనమధ్యములలో, విలసంతి=శోభిల్లుచున్నారు.

తా. సర్వాంతర్యామీ ! త్రికాలములందును, వివిధములైన కృష్ణ చతుర్దశీ, శనిప్రదోష, సోమవారాది శివవ్రతములందును భక్తియుక్తులై శాస్త్రోక్తముగా నెవ్వరు నిన్ను పూజింతురో, వారు మహా విలాసినులైన విద్యాధరరమణులయొక్క; కర్పూరాగురుకస్తూరీ తక్కోలముల సుగంధముచే నిండుగా వ్యాప్తమైనట్టియు; వక్షోజముల మధ్యమున సుఖముగా నివసింపగలరు. సర్వకామములును శివలింగ పూజతో సిద్ధించునని భావము ॥౩౬॥

యత్పద్యతే కమలయోనిరభిష్టువం స్తం
సాక్షాచ్చతుర్భిరధినాథః ముఖైర్భవంతం।
త్యక్త్వా వయంతు ఘనసంస్తవనక్రియాసు
భక్తిప్రమాణమితి సర్వ మిదం క్షమస్వ ॥౩౭॥

అర్థ:—అధినాథ=లోకాధ్యక్షా! యత్ = ఎందువలన, కమలయోనిః=బ్రహ్మదేవుడు, చతుర్భిః=నాలుగైన, ముఖైః=ముఖములచేత, అభిష్టువన్=ఎల్లవైపుల స్తుతించువాడై, తం = ఆ పంచముఖుడవైన, భవంతం=నిన్ను, సాక్షాత్=ప్రత్యక్షముగా, పద్యతే=తెలియుచున్నాడో,

తు=ఐతే, వయం=మేము, ఘనసం స్తవనక్రియాసు = గొప్పవైన స్తుతి రూపక్రియలందు, త్యక్తాః = విడిచిన వారము (ఐనాము), ఇదం = ఈ, సర్వం=సకలమును, భక్తిప్రమాణం=భక్తి హేతుభూతమైనది, ఇతి=ఇట్లు (భావించి) క్షమస్వ=క్షమింపుము

తా. ఓ ప్రభూ! నీచేత విష్ణునాభికమలమున సృష్టింపబడిన చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు నిన్ను సర్వతోముఖముగఁ బొగడుచు, నిన్ను ప్రత్యక్షముగా గాంచఁగల్గుచున్నాడు. మేమన్ననో ఒకటియేయైన జిహ్వగలవారము కావున అట్టి నీఘనమైన రూపమును వివరించు స్తోత్రరచనాకర్మమున అసమర్థులమై ఇంతవరకే యుదాసీనత నందితిమి. ఇది యంతయు భక్తితో విరచితము కాబట్టి మా దౌర్బల్యాదిదోషముల ననుగ్రహముతో క్షమింప వేఁడుచున్నాము.

వి. ఈ శ్లోకమున కవి తన యహంకారమును పరిహరించినాడు. కమలయోని యనగా విష్ణునాభికమలమే కాని, నారాయణుని నాభికమలము కాదనియును, నారాయణ పరబ్రహ్మాదిశబ్దములు శివవాచకము లనియును విశ్వారాధ్యుడు తన సంస్కృత వ్యాఖ్యానమున వివరించినాడు. ఇందు త్యక్తాః (విడిచినారము) అను శబ్ద ముండుట గాంచి మల్హణు డింతవరకే రచించెనని కొందరందరు ॥౩౭॥

గంగాతరంగజలధౌతజటాకలాప
కామాంగదగ్ధసితభస్మవిభూషితాంగ ।
చంద్రార్ధశూలఫణిరాజవిరాజితాంగ
దేవాధిదేవ తవ పాదయుగం నమామి ॥౩౮॥

అర్థ:—గంగా...లాప, గంగా=గంగయొక్క, తరంగ=తరంగములచేత, ధౌత=ప్రక్షాళితమైన, జటా=జడలయొక్క; కలాప=సమూహము గలిగియున్నట్టి; కామాం...తాంగ, కామ=మన్మథునియొక్క, అంగ=తనువుల, దగ్ధ=దహింపబడిన, సిత=శుభ్రమైన, భస్మ=విభూతిచే, విభూషిత=అలంకరింపబడిన, అంగ=దేహముగలట్టియు; చంద్రా...తాంగ, చంద్రార్ధ=అర్ధచంద్రుడేమి, శూల=త్రిశూలమేమి, ఫణిరాజ=సర్పశ్రేష్ఠములేమి, వీనిచే - విరాజిత=శోభించుచున్న, అంగ=తనువు గలట్టియు; దేవాధిదేవ=ఓ మహాదేవ, తవ=నీయొక్క, పాదయుగం=చరణయుగళమును. నమామి=నమస్కరించుచున్నాను.

తా. గంగోదకములచే నిరంతరము ప్రక్షాళితము లగు జడల గుంపును దాల్చినవాడా! కాముని భస్మము గావించి దానితో దేహ

మును శుభ్రముగ నలంకరించినవాడా! చంద్రవంక, త్రిశూలము, సర్పరాజము మున్నగు భూషణములుగలవాడా! ఓ దేవదేవా! మహాదేవా! నీ పాదద్వంద్వమును నమస్కరించుచున్నాను.

వి. శివుని యద్భుతాకారమును ధ్యానించుచు కవి యీ శ్లోకమున నమస్సుల నర్పించుచున్నాడు. దారుకావనలీలలో ఋషులు హరుడని తెలియక క్రోధవశమున మారణహోమమునుగావించి శూలాద్యాయుధములను, పడగలుగల పాములను పుట్టించి శివునిమీద ప్రయోగింపగా శివుడవ్వానిని ఆభరణములుగా ధరించెనని పురాణగాథ కలదు ॥౩౮॥

స్తోత్రం మయా కృతమిదం భవతో గణేన
వృత్తై ర్వసంతతిలకైః శివ మల్హణేన।
ఆయాసమత్ర భగవన్ గదితం దురుక్తం
భక్తిప్రమాణమితి సర్వమిదం క్షమస్వ ॥౩౯॥

అర్థః— శివ=శంభూ! భవతః = నీయొక్క, గణేన=పారిషదుడైన (భక్తుడగు) మల్హణేన=మల్హణుడను పేరుగల, మయా=నాచేత, వసంతతిలకైః = వసంతతిలకము లను సంకేతముగల, వృత్తైః=పద్యములతో, ఇదం=ఈ, స్తోత్రం=స్తవము, కృతం=ఒనర్పబడినది. భగవన్= ఈశ్వరా! అత్ర=ఈ స్తోత్రమున, గదితం=వాక్రుచ్చినట్టి, ఆయాసం= బాధాకరమైనట్టి, దురుక్తం = దోషప్రయుక్తమైనట్టి, ఇదం = ఈ, సర్వం=సమస్తమును, భక్తి ప్రమాణం = భక్తి హేతుభూతమైనది, ఇతి=ఇట్లుగా (భావించి) క్షమస్వ = క్షమింపుము.

తా. ఓపరమేశ్వరా! నీ భక్తగణములోని వాడను, మల్హణ నామకుడను, అగు నేను వసంతతిలకచ్ఛందస్సుతో ఈ నీ స్తోత్రమును విరచించినాడను. ఇందు శబ్దములు, అర్థములు, భావములు మున్నగు వానికి సంబంధించినట్టి దోషముల నెన్నింటిని ప్రయోగించితినో, కష్టకరముగా నెట్లు బల్కితినో తెలియను. వీనినన్నిటిని లెక్కింపక నేను భక్తితో గ్రథించినాను కావున నన్ను క్షమించి స్వీకరింపుము.

వి. క్షమింపుమనగా నా కృతినిగ్రహించి నన్నుద్ధరింపుమని భావము. ౩౭ శ్లోకములనో ౩౮ శ్లోకములనో మల్హణుడు రచించెనని కొందరందురు. ౩౯ శ్లోకము కూడ మిక్కిలి ప్రాచీనమునుండి ప్రచారమున నున్నందున నిచ్చోటను చేర్పబడినది. ఇందుగల గణశబ్దము; మల్హణుడు ప్రాచీనప్రమథగణములో జేరినవాడనుటకు సాధనము ॥౩౯॥



ఇది శివపంచస్తవీభక్తరంజనీ వ్యాఖ్యానమున మల్హణస్తుతి సమాప్తము.

# ఆంధ్ర మల్హణస్తవము

## శ్రీ దేవులపల్లి సుబ్బరాయకవిగారు

ఉ॥ శ్రీకరమై మహేశ్వరవశీకరపంచమహా స్తవైక కీ
ర్త్యాకరమైన మల్హణసమాఖ్య కవిప్రవర ప్రణీతమా
సీ కృతి నాంధ్రభాష రచియించెద శ్రీశివభక్తిసంపదు
దేకత సుబ్బరాయకవి దేవులపల్లి కులప్రసూతుఁడన్.

ఉ॥ శ్రీకరకామినీకచపరీత సుమప్రచయోరు సౌరభ
స్వీకరణ భ్రమద్భ్రమరవిభ్రమ కర్బురకంఠకాంతికిన్
నాకిసదుత్తమాంగమకుటాగ్రవిఘట్టనఘట్టితాంఘ్రి పీ
ఠీ కమనీయమూర్తికి ఘటించెద వందన మిందుమౌళికిన్. ౧

చ॥ విధివిధులున్నినుం బొగడ వేసరి యోసరిలంగ నార మ
ద్విధుల కశక్యమా ననుచు దేవ! యదెల్ల నెఱుంగుదైన నో
విధుశకలావతంస నిను బేర్కొనఁగాఁ బురికొల్పుచుండె నో
విధుతనతార్తి భక్తి నను వేమఱు నేమి యొనర్తుఁ దెల్పుమా. ౨

చ॥ ప్రవిమలకాంతిపూరరుచిరద్విజరాజశిఖావిభూషణా
స్తవనవచఃప్రసూనములఁ దావకభావుకపూజ సేయు వా
రెవ రిల వారు నీనగరి కేగుదు రింపగు వ్యోమయానులై
భవములతోడనే భవ! భవప్రభవంబగు మాయఁ బాయుచున్. ౩

చ॥ ఘనభువనాంతరాత్మ త్రిజగంబులు నంబునభోనిలానలా
వని నళినారిమిత్రమఖివర్య సమాఖ్యల ముఖ్యమైన నీ
తనువులచే సతంబును రతంబులుగాఁ దిలకించి యొందు మిం
చిన మతిఁ బండితుం డెవఁడు సేయఁడు నీయెడఁ బక్షపాతమున్. ౪

చ॥ హర హరియు న్విరించియు సురాధ్య సురాసురలోకపాలురున్
సురమును లన్యులుం గొలువఁ జూచుచు నుండియు నన్యదేవతా
పరిచరణంబుఁ జేయుటకు భావమునందుఁ దలంచుచుండు నే
నరుఁ డది [illegible] కన్న భవ! [illegible] జుమీ. ౫

చ॥ శివ! సకల ప్రపంచము సృజింతువు పెంతువు సంహరింతు వీ
వవలఁ దిరస్కరింతు వనయంబును ముక్తిని జేర్తు వెప్పుడుం
వివిధఫలప్రదాతవును విశ్వకరుండవు నీవ యాట మా
నవుఁ డది నీ వికల్ప మనినం గనుపట్టును లేపశూన్యుఁడై. ౬

చ॥ భవ! భగవంతు ని న్నభవు భావుకదాయి ననంతశక్తి సం
భవు లెవరేని మోడిగ నమస్కృతి సేయుచు నుందు ర్వారలుం
దివిరియుఁ జేరఁ బోవ రతి నిష్ఠురదుష్టకృతాంతదంతయం
త్రివివరమధ్యభాగగహనం బగు ఘోరతరాంధకారమున్. ౭

మ॥ ఒరుఁ డెవ్వానికి ఖండచంద్రకరకాంబూచ్చైర్భరోపేత ని
ర్భరబభ్రుద్యుతియౌ జటాపటలి విభ్రాంతాంతరంగఁ బుత్తోఁ
దిరిగెన్ గ్రాహసమూహ దేహవిహతోద్రిక్తాంగనక్రాద్రికో
ద్ధురయాదఃక్రమణభ్రమత్కమలనిర్ధూతాత్మయై గంగయున్. ౮

మ॥ అతిపీనోన్నతఫల్గువృత్తకుజభారానమ్రవిద్యాధరీ
తతిబాహాలతికాయుగీగుణనిబద్ధస్వాంగులై మింట ను
న్నతి వర్తింతురు వ్యోమయానముల నా ధన్యుల్ మహాదేవ! య
ర్చితుఁ గావింతురొ నిన్ను నెవ్వరిల గౌరీయుక్తునిన్ భక్తిచేన్. ౯

చ॥ పురహర! నీ సమక్షమునఁ బూరుషు లెవ్వరు భక్తియోగత
త్పరమతులై రచింతు రిముఖవాదన మా పురుషు ల్లరింతు ర
ప్సరసలఁ గూడి శంఖమురజత్రిదశానకభేరికామనో
హరనినదామరీకలకలాకులదిఙ్ముఖదివ్యశాలలన్. ౧౦

శా॥ రారాజద్విధిసంప్రయుక్తవిధి నో రాజావతంసంబ! ని
న్నారాధించి ప్రసిద్ధవిష్ణువిధిసిద్ధాధ్యక్షయక్షాప్సరో
నారీకిన్నరసాధ్యకింపురుషగంధర్వాహివిద్యాధర
స్వారాజాదులు నెమ్మి నన్యులును దేవత్వంబుఁ బ్రాపిల్లరే! ౧౧

చ॥ కులగిరినేత నీకు దన కూఁతు వివాహ మొనర్చునత్తఱిం
దెలుపుము గోత్ర మెద్ది యొకో దేవ యటంచును బ్రీతిఁ గోర మా
ర్వలుకని సస్మితంబగు భవద్వదనంబును జూచినట్టి యా
నలినభ వేంద్రముఖ్యసురనాయకు లెన్నఁ గృతార్థులే కదా. ౧౨

ఉ॥ ఓ జగదీశ నీదు పదయుగ్మము నెవ్వరు గొల్చుచుండు వా
రా జను లొందుచుందురు గదా సురసిద్ధవధూరతంబులన్
భ్రాజితరత్నకాంక్రుతిభ్రమరరాజివిరాజిజలాకులంబు లౌ
రాజతశైలకందరనిరంతర నిర్మల నిర్ఝరంబులన్. ౧౩

ఉ॥ కొంద అమందభక్తిఁ దమకుం దులకింప మరందబిందుని
ష్యందమిళిందబృందహరిచందనకుందనవారవిందకో
టిం దగ నీదు పూజల ఘటించి పురందరమందిరంబు లం
దుందురు సుందరీకలన మొందుచు సందుల నిందుశేఖరా! ౧౪

మ॥ ఉరునిర్ఘాతనిపాతఘర్ఘరఘనప్రోద్దండచండార్భటీ
గురువిస్ఫూర్జితగర్జితాభ్రపటునిర్ఘోషదభ్రోన్మేష ని
ర్భరహుంకారముచే నొనర్చె నొరుఁ డెవ్వం డుర్వి శ్వేతాఖ్యునిం
బరిమార్పం గొను కాలు నిష్ఠురశరు న్భస్మావశేషంబుగన్. ౧౫

మ॥ శివ! యెవ్వారలు జీవనార్థముగ నర్థిస్రగ్జటాభస్మముల్
భువి మాయాపరతంత్రబద్ధు లయి తాల్తు ర్వారలున్ లాటమా
ళవకర్ణాట భటచ్ఛటామకుటజాలస్థూలరత్నౌఘ ఘ
ట్టవిఘృష్టాంఘ్రిమహీన్ద్రు లయ్యెదరు చూడావ్యూఢచన్ద్రాంకురా!

ఉ॥ ఓధరచాప! బాలకులు నొయ్యన నాటలపాటలందు నా
రాధనముం బొనర్తురు, సుర ల్వివిధాటవులందు, సిద్ధులున్
ధూమ్రధరయూథభూరితరగహ్వరగర్భతలంబులందు, వి
ద్యాధరులుం బటీరవసుధాధరమందరకందరంబులన్. ౧౭

చ॥ భవ! సతము న్నితంబయుగభారవశాలసయానలున్ మనో
భవవివశాంతరంగ లగు పన్నగకన్యలచేత దానవ
ప్రవరనితంబినీజనపరంపరచేఁ బరిపూజితుండ వౌ
దువు గద దేవ! హేమపురదుర్గరసాతలలోకసీమలన్. ౧౮

మ॥ శివ! నీ నెవ్వనికిం బ్రసన్నుఁడవొ సంసిద్ధించుఁ జూ వానికిన్
భువిపై దివ్యరసాయనౌషధిరసంబు ల్ధాతువాదంబు మో
గవశీకారము లంజనంబు ఘటికాఖడ్గంబులున్ ఖన్యవా
దవిధు ల్గారుడమారణప్రవిద్యలును [illegible] వాదంబులున్. ౧౯

మ॥ ఇల నెవ్వారికిఁ బుణ్యవంతులకు నీవే సుప్రసన్నుండవౌ
లలి వారల్ శయనింతు్రి కేతుపటలీలాగేహసీమంబులన్
బలిసద్మంబునఁ బద్మసాయకకలంబవ్యగ్రితా నాగక
న్యలచే దానవలోకకామినులచే నాశ్లిష్టులై శంకరా.! ౧౦

మ॥ హర! నీ కర్చనముం బొనర్చి నతఁ డైనాతండు శుంభన్మరు
త్సరిదష్టాపదకంజగుంభితవిచిత్రస్వస్తరూద్భూతమం
జరులం దాలిచి యప్సరస్సతులతో జంభద్విషన్ముఖ్య ని
ర్జరసంఘంబులతోడ దానవులతో సంయుక్తుఁడై భాసిలుఁ. ౧౧

శా॥ స్వామీ! ని న్నిల సన్నుతించును లసద్వాచాప్రచారంబులఁ
భూమీభృద్గుహాలందు రత్నమకుటీభూయిష్ఠముక్తామణీ
దామప్రోజ్జ్వలకుండలాంచితము గంధర్వాంబుజాతేక్షణా
స్తోమం బుచ్చతరస్వరంబు దనరం దోయిళ్ళు గీలింపుచుఁ. ౧౨

మ॥ ధరపైఁ గల్గు భవత్ప్రసాదమున మర్త్యశ్రేణి కెంతే మనో
హారదూరశ్రవణంబు ఖేచరత యష్టైశ్వర్యసంయుక్తియుం
బరకాయాన్యపురప్రవేశ విధిసామర్థ్యంబు గాలత్రయీ
స్ఫురితజ్ఞానము ముక్తి యుత్క్రమణము న్బాతేశ! యశ్రాంతముఁ.

చ॥ భవహర ! పక్షపాతమునఁ బల్కను సత్యముఁ దెల్పెదం జుమీ
శివశివయంచు నెవ్వడు వచించునొ వేడుకతోడ రేయునుం
బవలు హరాహరాయనుచు వ్యర్థత నైన నెవండు వల్కు వాఁ
డవని విమూఢుఁడైన నిరయంబుల ఘోరభయంబు లందునే ౧౪

శా॥ నీ చారిత్రముఁ దత్త్వముం దెలియకే నీ భక్తిమాత్రంబునఁ
నీచుండైన కిరాతకుం డొకరుఁ డొందింపంబడె న్నీపురిఁ
నీచే నిన్నుఁ దలంచు కష్టకుజనుండే దివ్యతం బొందగాఁ
బ్రాచుర్యంబగు ముక్తి చేకురదె దేవా! నీ ప్రసాదంబునఁ. ౧౫

*ఉ॥ జ్ఞానము లేమి నేను భువి సల్పితి పాప మమేయ మంబికా
జాని! మరేమి నేటికిని సల్పుచు నుందునొ భీకరంబుగాఁ
గానఁ బశుత్వతామసము, గాఢతరంబగు జన్మబంధముల్
బూనికతోడ ద్రుంచుము వపుఃపునరుద్భవబాధ బాయఁగన్. ౨౬

శా॥ ఏ మానుల్భవదర్చనాభిరతులై యేకాగ్రభక్తిన్మహా
రామక్షోణులఁ గందమూలఫలనీరప్రాశనాసక్తులై
స్వామీ! యుందురొ వారు ముక్తిపదముం బ్రాపించు టట్లుండనీ
నీమోముల్పరికించువారలె సుమీ నిక్కంబు ధన్యాత్మకుల్. ౨౭

చ॥ స్తుతుఁడవు నర్చితుండవు నతుండవు గావొ మహేశ! యేరిచే
క్షితిపయి వార లెట్లు విలసిల్లుదు రింతుల కాంతిదంతురో
న్నతకుచయుగ్మకంబున ఘనప్రథిమంబగు తన్నితంబమం
దతులితశోణిమస్ఫురిత మైన తదీయరదచ్ఛదంబులన్. ౨౮

ఉ॥ వంచనలేక యెప్పు డభవా! నిను నెవ్వరు సన్నుతింతురో
మించినలీలఁ జేకొని రమింతురు వారలు యక్షకాంతలన్
భ్రాంచితపంచబాణ మదిరామదచంచలనేత్రలన్ మణీ
కాంచనకాంచికావలయ ఘూళఘుళీరవ రమ్యగాత్రలన్. ౨౯

మ॥ బలశాలీంద్రియనామధేయ విలసత్పాటచ్చరవ్రాతముల్
బలిమింబట్టి వివేకభూరితరసర్వస్వంబు గైకొంచు న
వ్వల మోహాంధమహాంధకూపమున వైవందానఁ గన్గాన కు
మ్మలికం జెందెదు నాకు దేవవర! యిమ్మా నీ కరాలంబముల్. ౩౦

చ॥ విను మిదె చేతు లెత్తి వినుపించెద నే నొకతూరి దెల్విమా
లిన జడుఁడ న్విమూఢుఁడ మలీమసవృత్తుఁడ ఛిన్నుఁడ న్నరుం
డ నగుట యంత్రికర్మకలనంబు ఘటింపకు మాజవంజవం
బను గహనంబు నింక నభవా! చొరఁజాలను జుమ్మి వెండియున్. ౩౧

---

*౨౬ వ పద్యమును దే. సుబ్బరాయకవిగారు వ్రాసియుండిరి గాని, అది మా యొద్దనున్న సంస్కృత శ్లోకమునకు సరిపడనందున ఈ పద్యమును మూలానుసారముగ వ్రాసితిని, ... వీరభద్రశర్మ.

మ॥ మదనారీ! భవదీయశక్తి పరిజను న్మాయాప్రపంచక్రియా
సదభివ్యక్తియు వస్తుభేదభిదతాసంయుక్తియు న్సర్వక
ర్తృదశాకల్పితరక్తియు న్విహితసంసృత్యాపదున్ముక్తియు
న్మదమోహాంధతమఃప్రభేదనవిధానప్రౌఢిసంసక్తియుఀ. ౩౨

మ॥ అనిశంబున్ బలహీనమై విచలితంబౌ సర్వసంసారసం
జనితాఘాశుభసంహతిం దునిమి నిచ్చల్నాకు సర్వజ్ఞభా
వనితాంతాచితము న్సమస్తకరము న్భవ్యంబు దివ్యంబు పా
వనతేజం బమలంబునై తగు శివత్వం బిమ్ము సర్వేశ్వరా. ౩౩

*ఉ॥ బాలిశుఁడైన బాలుఁడును బాంసుకణంబుల నొక్క చోటికిఀ
లీలగఁ గూర్చి దాని శివలింగ మటంచును జెప్పినంతనే
నీలగళా! మహావనికి నేతగ నిల్పెదు వాని, సర్వభో
గాళికి నష్టకంటకకుఁ గాంచనరత్నసమృద్ధిభాజికిఀ. ౩౪

మ॥ మదిరాపానపరాంగనాగమన హేమస్తేయ గోఘ్నత్వ భూ
త్రిదశఘ్నత్వ గురుప్రియాభిగమనాది క్రూరదుష్పాతకా
స్పదు లెవ్వారలు వారు నాదురు మహేశా! నీలకంఠా! భవ
త్పదసంస్పర్శనధూతపాపవిమలప్రస్ఫీతశుద్ధాత్మకుల్. ౩౫

చ॥ కరితుహర! తద్విభాగపరికల్పనకల్పిత సర్వశర్వస
ద్వ్రితముల నెవ్వ రొప్పెదురు బాగుగ వారలు సౌరు గాంతు రు
న్నతఘనపీనవృత్తఘుసృణద్రవముద్రితపింజరాగ్రియా
వతకుచసీమలందుఁ గులపర్వతరాజసుతామనోహరా! ౩౬

*చ॥ నలినభవుండు నిన్ను తన నాల్గుముఖంబుల నోలి కీర్తనల్
సలిపినకారణంబుననె సాంబ! కనెఀ గద నీదు రూపముఀ
బలుకగలేక నీదు ఘనపావనగాథల నొక్క నాలుకఀ
నిలిచితి నింతకే, [illegible]యము భ[illegible]క్తి[illegible] బ్రోవవే. ౩౭

*ఉ॥ గాంగపయఃపవిత్రపరికల్పితపీతజటాకలాప! కా
మాంగకలాపదగ్ధసితభస్మవిభూషణరాజితాంగ! సా
రంగనిశాకరార్ధఫణిరాజత్రిశూలధరా! సురేంద్ర! శ్రీ
లింగ! త్వదీయపాదయుగళిన్ సుమనస్కుఁడనై నుతించెదన్. ౩౮

ఉ॥ నీ నుతి దీని మల్హాణుఁడ నే నొనరించితిఁ ద్వద్గణీయుఁడన్
జ్ఞానిగతి న్వసంతతిలకంబుల వృత్తముల న్మహాత్మ! యా
ఖ్యానమునందు నిందచటనచ్చటఁ గల్గినచో దురుక్తి సం
ధానము నెల్ల భక్తియ ప్రధానముగాఁ గొని సైచఁగాఁ దగున్.౩౯

చ॥ ఒనరిచినాఁడ దీనిఁ గొను మో శివ మల్హాణసంస్తవంబు నే
డెనుఁగున రామభక్తుఁడను దేవులపల్లికులోద్భవుండ స
ద్వినుతకు వేంకమాంబకును వేంకటకృష్ణసుధీంద్రమౌళికిం
దనయుఁడ సుబ్బరాయకవి దమ్మనశాస్త్రికి నగ్రిజన్ముఁడన్.

చ॥ తెలియఁగ దీన దృగ్వ్యధినిధిశ్రుతిసంఖ్య నెసంగుచున్న యి
క్కలిసమయంబున న్వికృతి కార్తికశుక్లగురుత్రయోదశీ
నలినవిరోధివాసరమునం దగ మల్హాణసంస్తవంబు నేఁ
డెలుఁ గొనరించితిం గొనఁగదే శివ! యాశశితారకంబుగన్.

ఆంధ్రిమల్హాణస్తవము సమాప్తము.

* ఈ గురుతుగల ౩౬, ౩౭, ౩౮. పద్యములు మూలానుసారముగ ననువదించి
తి. శ్రీ దే. సుబ్బరాయకవిగారి మూలము కాంచియుంటిని.—తి. వు. వీరభద్రశర్మ.

# శివపంచస్తవి

## ౩. మలయరాజస్తవము

యో న ధియామధిగమ్య -
　　స్తస్య కుతస్సంభవో గిరాం వృత్తేః ।
స్తౌమి తథాపి భవంతం
　　మనోరథో యాత్యభూమి మపి ॥౧॥

అర్థ:—యః=ఏ పరమేశ్వరుఁడు, ధియాం=బుద్ధులకు, అధిగమ్యః= పొందఁదగినవాఁడు, న = కాఁడో, తస్య = అట్టి నీయొక్క, సంభవః= ఉపలబ్ధి, గిరాం = శబ్దముల, వృత్తేః = వ్యాపారశక్తివలన, కుతః = ఎందుండి, యగును, తథాపి = అటులైనను, భవంతం = నిన్ను, స్తౌమి=నుతించుచున్నాను, మనోరథః= కోరిక, అభూమి మపి = అందని దానినైనను, యాతి = పొందుచుండును.

తా. ఎవ్వాడు మహానిశితములైన బుద్ధులవలనగూడ దెలియఁ బడజాలఁడో అట్టివానిని శబ్దముల శక్తివలన కనిపట్టుట అసంభవమేకదా! ఐనను, ఓ భగవంతా! నిన్ను గొనియాడఁబూనినాడను. మానవుల మనములు అందనిదానిని సైతము అపేక్షించుట సహజమే! నీవు దెలియ శక్యుడవు కావని యెరిగియు నీ స్తుతిని యథాశక్తి నల్ల బూనినాడనని భావము.

వి. ఈ శ్లోకమున సాధారణముగ నే దేవుని పేరును గానుపింపదు. కాని ఈ కవి "దేవుఁడు బుద్ధితో దెలియఁబడువాఁడు కాఁడు" అను మాటను మిక్కిలి చమత్కారజనకముగా బల్కినట్లున్నాఁడు. ఆ దేవునివలె ఈ శ్లోకములో ప్రయోగించిన దేవుని నామమునుగూడ సామాన్యబుద్ధులు గ్రహింపఁజాలరు. శివానుగ్రహమువలన విశేష బుద్ధిగలవారు గ్రహింపగలరని భావము. ఇందు "భవంతం" అను శబ్ద మొకటి కలదు.

దీనికిమీద "నిన్ను" అని సామాన్యముగ అర్థము వ్రాయబడినది. కాని "భవం, తం" అను నట్లు విడివిడిగా దాని యుచ్చారణ మొనర్చినపుడు; తం = ఆ ప్రసిద్ధుఁడైనట్టి, భవం = శివుని, (కొనియాడుచున్నాను) అను సరియైనట్టి (అనగా కవి తన ప్రతిభతో ప్రయోగించినట్టి) అర్థము గోచరించుచున్నది. దీనివలన నీ స్తుతికర్త యగు మలయరాజు మిక్కిలి సమర్థుఁడని తెలియవలెను. ఇట్లే సామాన్యముగ శివుఁడు బుద్ధిగమ్యుఁడు కాఁడు, ఇక శబ్దగమ్యుఁ డంతకన్న కాడు. శబ్దమునకు 'అభిధా, వ్యంజనా, లక్షణా' అను మూఁడు వృత్తులు గలవు. ఈ మూఁటివలనను మహేశ్వరుని యథార్థముగ దెలియశక్యముగాదు. ఐతే శివుఁడు లేనేలేఁడాఁదుమా! కాదు లోకమందు గల ఎంత నిశితబుద్ధులును, సమర్థము లైన ఎన్నిశబ్దములును, స్పష్టముగ భగవంతుని సర్వస్వరూపమును జెప్పజాల వనుట నిక్కువమే. కాని; భగవద్భక్తులును; యోగబుద్ధులును అగువారు భవుని తప్పక తెలియ గలరని భావము. ఈ కవియు శివునినుతించి శివభక్తుఁడైనాడు. కావున శివుఁడున్నాఁడని తత్స్వరూపమును తెలిసికొని స్తోత్రమును విరచించినాడు. "భగవంతుడు తెలియ బడడు" అను మాటయె సర్వాత్మనా నిజమగుచో ఈ భగవత్ స్తోత్రమును రచించి యుండఁడు. "భవం తం" అను శబ్దార్థమును శుద్ధముగ దెలిసికొని నటులే ఆ భగ వంతునిగూడ విశేషమైనట్టియు: పరిశుద్ధమైనట్టియు; భక్తియోగబుద్ధితో దెలియ దగునని భావము. భవశబ్దముతో శివుడు విశ్వకారణుడని సూచింపబడెను.

ఇది ఆర్యావృత్తము—దీని ౧ వ ౩ వ పాదములందు ౧౨ మాత్రలును, ౨వ పాదమున ౧౮ మాత్రలును, ౪ వ పాదమున ౧౫ మాత్రలును, ఉండవలెను. గణ ముల లెక్క ఇందు లేదు.

ఈ స్తోత్రకర్త యైన మలయరాజుయొక్క పూర్వగాథ యిట్లు కలదు. "మేరు పర్వత దక్షిణమునగల మలయదేశమునందలి మలయవతిరాజధానిలో దేవరాజు, శచీ దేవి యను రాజదంపతు లుండిరి. వారు సమస్త భోగభాగ్యముల ననుభవించుచున్నను సంతానము లేనందున రాజ్యభారమును మంత్రి కప్పగించి ఊరిబైట నిర్మింపబడిన రహస్య శివాలయమున శివునిగూర్చి ఘనమైన తపము నాచరించిరి. అందుకు శివుఁడు ప్రసన్నుఁడై. శతవత్సరాయుష్యముగలదుష్పుత్రునిగాని, షోడశవర్షాయుష్యముగల సుపు త్రునిగాని వరముగా గోరుకొమ్మని చెప్పగా అయుష్య మల్పమైనను సుపుత్రనే ఆ దంపతులు కోరికొని ఇంటికి జేరి రాజ్యమును పరిపాలింపఁదొడగిరి. శచీదేవి నవ మాసములు గడపి సుముహూర్తమున కుమారుని గనెను. మలయరాజను నామ మిడఁ బడెను. మలయరాజుకూడ మిక్కిలి సుగుణసంపన్నుఁడై క్రీడలవలనను; విద్యాభ్యాసము వలనను మాతృపితరులకు సంతోషము గలుగజేయుచుండెను. కాని పదునారు వత్స రములు ముగియుట కొక దినము మాత్రమే మిగిలెను. తలిదండ్రులు తన యాయుష్యము సమాప్తమగుచున్నదని తెలిపి దుఃఖింప దొడఁగిరి. అందులకు దుఃఖింపవలదని తలి దండ్రులకు జెప్పి మలయరాజు శివభక్తియుక్తుడై "యోనధియా మధిగమ్యః" అనుశ్లోకము మొదలుకొని ౭౨ శ్లోకములతో శివుని ధ్యానించి శివానుగ్రహమువలన ఆ కాల మృత్యువును జయించి తలిదండ్రులకు సంతోషము కలిగించెను.

ఇది మార్కండేయుని కథను బోలియున్నది. సాధారణముగ పురాణములలోను ఈతనికథ గానుపింపదు. తక్కిన యంశములు పీఠికలో గాంచనగును ॥౧॥

యామి మనోవాక్కాయైః
శరణం కరుణాకరం జగన్నాథ ।
జన్మజరామరణార్ణవ-
తరణతరండం తవాంఘ్రియుగం ॥౨॥

అర్థ:—జగన్నాథ=విశ్వేశ్వరా! జన్మజరా మరణార్ణవ తరణతరండం=పుట్టుక, ముదిమి, చావు లనెడు సముద్రమును దాటుటలో ఓడయైనట్టియు, శరణం=రక్షకమైనట్టియు, కరుణాకరం=కృపానిలయమైనట్టియు, తవ=నీయొక్క, అంఘ్రియుగం=పాదయుగళమును, మనోవాక్కాయైః=మనస్సు, వాక్కు, కాయముల చేత, యామి = భజించుచున్నాను.

తా. విశ్వాధారుడ వగు నో శివ! భక్తులను జన్మజరా మరణములనెడు అగాధ సముద్రమునుండి ఓడవలె సులభముగ దాటించునదియును, దయాసారమైనట్టిదియు, సర్వదా సంరక్షకమైనట్టిదియు అగు నీ పాదయుగళమును త్రికరణములచేత శరణముఁ బొంది నమస్కరించుచున్నాము.

వి మొదటి శ్లోకమున 'దేవుఁడు సామాన్యముగ దెలియఁబడువాఁడు కాఁడు' అని చెప్పినను ఈ శ్లోకమున స్పష్టముగ భక్తవశుఁడు, కృపాసాగరుఁడు మున్నగు విశేషణములతో శివుని గుణముల వివరించుచు, తాను అట్టి శివు నాశ్రయించినట్లు చెప్పినాడు. ఇందు మూఁడు (మనోవాక్ కాయ) కరణములచేఁ బొగడి, మూఁడు (జన్మజరామరణ) బాధల బోనాడు మనినాఁడు. నమస్కారము రెండుచేతులతో జేయబడును. కావున రెండుపాదములు లక్ష్యము చేయ బడినవి. ఇవి జ్ఞానశక్తి, క్రియాశక్తి యను ద్వివిధశక్తులకు సూచకములు. దీనితో కవి తన యహంకారమును పరిహరించి వినయమును ప్రదర్శించినాడు ॥౨॥

సర్వత్ర ఏవ శ్రుతిమాన్
సర్వగతశ్చేతి గీయసే సద్భిః ।
అత ఇద మర్హసి భగవన్
స్థాణో కృపణాద్వచః శ్రోతుం ॥౩॥



అర్థ:—స్థాణో=సనాతనా! భగవన్=షడ్విధైశ్వర్యసంపన్నా!

సర్వతః ఏవ=ఎల్లనైవ్రులను, శ్రుతిమాన్=కర్ణములు గలవాఁడవు, చ=మఱియు, సర్వగతః=సర్వవ్యాపకుఁడవు, ఇతి=ఈ ప్రకారముగా, సద్భిః=సత్పురుషులచేత, గీయసే=కీర్తింపఁబడుచున్నావు, అతః=ఇందువలన, కృపణాత్=దీనునివలన, ఇదం=ఈ, వచః=వాక్కును, శ్రోతుం=వినుటకు, అర్హసి=యోగ్యుఁడ వగుచున్నావు.

తా. సర్వకాలసత్త్వముగల ఓ పరమేశ్వరా! నీవు ఎల్లవైపుల (దవ్వుల)నుండి వినెద వనియును, సర్వవ్యాపకుఁడ వనియును వ్యాసాగస్త్యాది సత్పురుషులు మిక్కిలిగా కొనియాడి యున్నారు. కావున నేను ఎంతదూరమునుండి చెప్పినను, ఎట్టి దీనుఁడనై వేడుచున్నదియును నీవు సరిగ దెలిసికొనుచునే యున్నావు. ఈ పనికి నీవు సర్వవిధముల తగియున్నాఁడవు స్వామీ !

వి. నీ వెక్కడనో భూలోకమున మూలకుబడి యఱచినచో శివునికి వినఁబడునా యనుచో "సర్వతశ్చక్షు రుత సర్వతో బాహుః" "సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" "సర్వతః పాణిపాదం తత్, సర్వతోఽక్షిశిరోముఖం" మున్నగు వేదాగమ పురాణ వచనములతో శివునకు సర్వము దెలియు ననియును, సర్వము వినఁబడుననియును ప్రత్యుత్తరము జెప్పఁబడును. సర్వము దెలియనివాఁడును, సర్వత్ర లేని వాఁడును దేవుఁడే కాడని యెఱుంగునది ॥3॥

శరణమసి సంశ్రయోఽప్యసి
గతిరసి నాథోఽసి సర్వభూతానాం ।
భూతేశ తేన తే మయి
విజ్ఞాపయతి క్షమా కార్యా ॥4॥

అర్థ:— భూతేశ=లోకేశ్వరా! హి=ఎందువలన (నీవు), సర్వభూతానాం=సర్వప్రాణులకు, శరణం=రక్షణము, అసి=అయ్యున్నావు, సంశ్రయః=ఆశ్రయము, అసి=అయ్యున్నావు, గతిః = దిక్కు, అసి=అయ్యున్నావు, నాథః=ప్రభుఁడవు, అసి=అయ్యున్నావు, తేన=ఆకారణముచేత, విజ్ఞాపయతి=విన్నవించుచున్నటువంటి, మయి=నాయందు తే=నీయొక్క, క్షమా=ఓర్పు, కార్యా=చేయతగినదియై (యున్నది.)

తా. ఓ సర్వేశ్వరా! విశ్వమందలి సర్వభూతములకు నీ వొకఁడవే రక్షకుఁడవును, ఆధారుఁడవును, ప్రభుఁడవును అయ్యున్నావు.

కావుననే నేను నిన్ను వేడుకొనుచున్నాను. నీవు ఇట్టి దాసునియందలి తప్పుల నోర్పుతో మన్నించి యుద్ధరింపవలసినదే యున్నది. (నీవు తప్ప అన్యశరణ్యము లేదు. కావునను, "దాసుదోసములు దండముతో సరి" కావునను ఈ స్తవము గావించుచున్నట్టి నాయందు దయచూపక తప్ప దని భావము) ॥౪॥

యేనాఽష్టధా విభజ్య
  ప్రజాసు హితహేతునా తనుర్దత్తా।
కస్తాదృశం న యాయాత్
  త్వామిహ కరుణాపరం శరణం ।౫॥

అర్థ:—హితహేతునా = లోకోపకారమునందు కారణమైన, యేన=ఎవ్వానిచేత, ప్రజాసు=ప్రజలవిషయమున, అష్టధా = ఎనిమిది విధములుగా, విభజ్య=పంచి, తనుః = స్వశరీరము, దత్తా = దానము చేయబడెనో, తాదృశం=అట్టి వాఁడవైన, కరుణాపరం=కృపాళువైన, త్వాం=నిన్ను, ఇహ=ఈ లోకమున, కః=ఎవఁడు, శరణం=రక్షకునిగా, న యాయాత్=పొందఁడు.

తా. సర్వప్రాణుల హితమును గోరి తన దేహము నెవడు ఎనిమిది విధములుగా విభాగ మొనర్చి యర్పించెనో, ఇట్టి యద్భుత దయాళువైన నిన్నుగూర్చి ఎవ్వాడు ఈ లోకమున రక్షకుఁడ వని భజింపడు? బుద్ధిమంతు లందఱును నిను సేవింతు రని భావము.

వి. శివుని తనువు అష్టమూర్తు లనుట సుప్రసిద్ధము. అవి పృథివి, ఆప్, తేజస్, వాయు, ఆకాశ, సూర్య, చంద్ర, యజమానులు. ఇవి లేనినాడు విశ్వమే లేదని యర్థము. కావున లోకోపకారార్థమయియే పరమేశ్వరుఁ డిట్లు అష్టవిధములుగా స్వదేహమును విభాగ మొనర్చినాడు. ఈ విషయమున వేలకొలది ప్రమాణములు కలవు. శివుని దేహము నిర్మల మైనదికదా! పంచభూతాదులు దోషదూషితములు; ఇట్టి తనువును శివునకు జెప్పుట సంగతమా యని ప్రశ్న ముత్పన్నమగును. లోకోపకారార్థమై తదనుగుణమైన కార్యమును నిర్వహించుటకుమాత్రమే ఆ శరీరములయొక్క ఉపయోగమని తెలియవలెను. దీనివలన శివునకు కష్టసుఖములు, లాభనష్టములుఁ లేవని యర్థము. ఈ యష్టతనువులే ఆకృతులే వన్నచో అపుడు జగత్తే లేదనుకొనవలెను. జగత్తును మిథ్య యనుకొన్నచో ఈమిథ్యాశరీరముతో శివునకు బాధ లేనేలేదు. పరశివబ్రహ్మమునకును, జగత్తునకును సంబంధము లేదందుమా? సంబంధములేని జీవులు బ్రహ్మమును

గూర్చి యాలోచింప నక్కఱయే లేదు. దీనివలన బ్రహ్మమునకు గుణము నంగీకరింపని నిర్విశేషవాదుల దేవుఁడు శూన్య మనియును, అదియు నొకవిధముగ నాస్తికమత మనియును తెలియవలెను. శివబ్రహ్మమునందు అవినాభావముగ నున్న శక్తివలననే యీ పంచభూతాదుల సృష్టి యగుచున్న దనియును, శివోపాసనవలన లోకవాసన లడఁగి ముక్తిలభించు ననియును గాఢముగ గ్రహింపవలెను ॥౫॥

ప్రణతజనదక్షిణేన
క్షణమేకం కాలకామవామేన।
త్రినయన సమగ్రదర్శిన్
దాసజనం చక్షుషా పశ్య ॥౬॥

అర్థః—సమగ్రదర్శిన్=సర్వజ్ఞుడా! త్రినయన=ఓ ముక్కంటీ! ప్రణతజనదక్షిణేన=శరణాగతు లగువారియందు ఉదార మైనట్టియు, కాలకామవామేన = యమునియందు కాముని యందును విరుద్ధమైనట్టియు, చక్షుషా=నేత్రముచే, దాసజనం=భృత్యు (భక్తు)లను, ఏకం క్షణం=ఒక క్షణకాలము, పశ్య=చూడుము.

తా. ఓ సర్వజ్ఞా! త్ర్యంబకా! శరణాగతులైన భక్తుల సంరక్షించుచున్నదియు, యమధర్మరాజును- మన్మథునిగూడ నిగ్రహించినట్టిదియు నగు నేత్రముతో నన్నొక నిమునమాత్రము అవలోకింపుము.

వి. యమమన్మథుల దౌర్జన్యము నణచినట్లు నా యపరాధరూపము లైన పాపములనుగూడ భస్మీపటలము గావించి నన్నుద్ధరించుటకు ఒక నిముసము మాత్రమే చాలును. కావున నన్ను అనుగ్రహదృష్టితో చూడు మని భావము ॥౬॥

పాతాలం దివమథవా
గచ్ఛామి పలాయ్య యది దిగంతం వా।
తత్రాపి త్రాతా మే
మృత్యోర్నాన్య స్త్వయైవ వినా ॥౭॥

అర్థః—పాతాలం=పాతాళమునుగాని, దివం=స్వర్గమునుగాని, అథవా=లేక, పలాయ్య=పరుగెత్తుకొని, దిగంతం వా=దిక్కుల అంత్యమునకుగాని, యది గచ్ఛామి = చేరుచో, తత్రాపి = అచ్చోటను, మృత్యోః=మరణమునుండి, త్రాతా=రక్షకుఁడు, త్వయా వినా=నీవుగాక, మే=నాకు, అన్యః=ఇతరుఁడు, నైవ=లేనే లేడు.

తా. నేను మరణబాధకు భీతిల్లి ఈ లోకమును వీడి, పాతాళ మునకో, స్వర్గమునకో జేరుకొనియెదను. లేదా దిక్కులను దాటి పరుగెత్తెద ననుకొందును, అచ్చోటనైనను మృత్యుభయమునుండి రక్షింప వలయు నన్నచో నీవు దప్ప వేరొక రక్షకుఁడు కానిపించుటయే లేదు కదా! (నాబోటి అనాథుండుగాని, నీబోటి మహాప్రభుండుగాని లేడని భావము) ॥౭॥

కాలవ్యాధో ధావతి
భగవన్నాసన్నమేవ హంతుం మాం।
క్రందామి త్వామీశం
పాశచ్ఛేదాయ తేనార్తః ॥౮॥

అర్థః—భగవన్ = ఓ ప్రభూ! ఆసన్నం = నీ సమీపస్థుఁడనైనట్టి, మామేవ = నన్నే, హంతుం = పరిమార్చుటకు, కాలవ్యాధః = యముఁడను వేటకాడు, ధావతి = వెంట పరుగిడుచున్నాడు, తేన = అందుచేత, ఆర్తః = పీడితుఁడనైన నేను, ఈశం = ప్రభుఁడవైనట్టి, త్వాం = నిన్ను, పాశచ్ఛేదాయ = కాలపాశము త్రెంపుకొనుటకు, క్రందామి = ఆక్రోశించుచున్నాను.

తా. ఓ సర్వేశ్వరా! సంసారబాధకు తాళజాలకయు, వేఱొక యుపాయము లేకయు నిను శరణము బొంది, నీ సన్నిధికి జేర ప్రయత్నించుచుండగనే కాలుఁడను వేటకాడు తన పాశముతో నన్నుఁ జిక్కఁబట్టి తుదముట్టింపఁ బూనినాడు. ఆ పాశబాధ యసహ్యముగా నున్నది. కావున విశ్వేశ్వరుఁడ వైన నిన్నుగూర్చి మొరపెట్టికొనుచున్నాను. కరుణించి యా బంధమును త్రెంచివేయుము.

వి. "నీ భక్తి కలదుగాని, నా పూర్వజన్మవాసనవలన నది యంత దృఢమైనది కానందున నీ యొద్దికి జేరినను సంసారభావము పూర్తిగ నశించుట లేదు. కావుననే యమునిబాధ కలుఁగుచున్నది. మఱల మఱల జననమరణ పాశములో దగుల్కొనుచున్నాను. నీవే కరుణించి యా బంధము తుంచినచో నాకు శాశ్వతానందము కలుగును" అని భక్తుఁడు పశ్చాత్తాపపూర్వకముగా పరమేశ్వరుని మొరపెట్టుకొనుచున్నాడు ॥౮॥

ఆసన్నమరణమశరణ- మున్మార్గభ్రమణఖిన్నమవసన్నం।
త్రాయస్వ శివ సమాశ్రిత- మంధమధస్తాత్పతంతం మాం ॥౯॥

అర్థ:—శివ=శుభకరా! ఆసన్నమరణం=సమీపించిన మృత్యువు గలిగినట్టియు, అవసన్నం = మృతప్రాయుఁడుగా నున్నట్టియు, ఉన్మార్గ భ్రమణఖిన్నం=మార్గముదప్పిన తిరుగుడుచేత ఆయాసము గలిగినట్టియు, అంధం = వివేకహీనుఁడును, అధస్తాత్ = నీచస్థలమున, పతంతం=పడు చున్నట్టియు, అశరణం = దిక్కులేనట్టియు, ఆశ్రితం=నిన్ను మొరపెట్టు చున్నట్టియు, మాం=నన్ను, త్రాయస్వ=రక్షింపుము.

తా. ఓ కల్యాణ నిలయా! నా మృత్యువు సమీపించినది. కావు ననే జీర్ణత నంది మూఁడుకాళ్లముద్దనై చావసిద్ధముగా నున్నాను. త్రోవ దప్పి తిరిగితిని; కావున మిక్కిలి డస్సియున్నాను. వివేకహీనుఁడను;కావున పతితుఁడ నైనాను. ఏ దిక్కును లేనివాఁడ నగుటవలన నీ చెంత జేరి నాడను. ఇట్టి నన్ను రక్షింపుము స్వామీ!

వి. ఒకానొక విపద్గ్రస్తుని స్థితిని కవి యిందు చెప్పినను దీనులయెడ మిక్కిలి కరుణఁగలిగి తన్మయుఁడై యిట్టి చక్కని భావచిత్రమును వ్రాసినా డనవచ్చును. ఎట్టి గర్వపూరితుఁడైనను ఒక్కొకప్పుడు ఇట్టి దుఃస్థితిని అనుభవించుచు అంత్యమున అనన్య గతికుఁడై పరమేశ్వరుని శరణము బొందిరయే తీయనని భావము. ॥౯॥

పరిలులితకమలదళగత- జలలవచల మేతదాయు రపయాతి।
త్వద్భక్తి శ్చ న సులభా- పునరితి మత్త్వా ప్రసీద విభో ॥౧౦॥

అర్థ:—విభో=ప్రభూ! పరి...చలం - పరిలులిత = చంచల మైన, కమలదళగత= తామరాకుపైని, జలలవచలం = జలబిందువువలె మిక్కిలి చంచలమైన, ఏతత్ =ఈ, ఆయుః=ఆయుష్యము, అపయాతి= పోవుచున్నది, పునః = మరల, త్వద్భక్తిః = నీ భక్తి, నచ సులభా = సుకరము కాదుకదా! ఇతి మత్త్వా=ఇట్లు తెలిసి, ప్రసీద=ప్రసన్నుడవు కమ్ము.

తా. ఓ సర్వవ్యాపకా! కదలుచున్న తామరాకుపైని జలబిందువు వలె ఈ జీవితము (ఆయుర్దాయము) వెడలి పోవుచునే యున్నది. ఈ ప్రాణము పోయినమీఁదట మరల నీ భక్తి పుట్టుటకే వీలు కాదయ్యెను.

కావున ఈ సమస్య నాలోచించి నీవే ప్రసన్నుడవై సైరించి యుద్ధరింప వలెను. మరిరొుక యుపాయము లేదని భావము. ॥౧౦॥

వి. భావుకుడైన భక్తుడు ఈ చంచలమైన ప్రాణము లిపుడే పోవుచున్నట్లును, పూర్వవయస్సులో తాను శివభజన చేయనందునను, ప్రాణనిష్క్రమణానంతరము భక్తి గల్గుటకు వీలేలేదు కావునను, సకరుణముగ ప్రార్థించుచున్నాడు ॥౧౦॥

ప్రాణై ర్వియోజ్య జంతుం, త్యజతి రిపు ర్జగతి పాపశీలోఽపి।
మృత మపి న విముంచతి య- స్త్రాయస్వ తతోఽరిషడ్వర్గాత్॥ ౧౧॥

అర్థః—జగతి=లోకమున, పాపశీలోఽపి = పాపాచారము కల వాడైనను, రిపుః=శత్రువు, జంతుం=ప్రాణిని, ప్రాణైః=ప్రాణముల చేత, వియోజ్య=ఎడబాపి, త్యజతి=వీడుచున్నాడు. యః=ఎవడు, మృత మపి=చచ్చినవానినిగూడ, నవిముంచతి=విడువడో? తతః=అట్టి, అరిష డ్వర్గాత్ = కామక్రోధాది శత్రుసమూహామువలన, త్రాయస్వ= రక్షింపుము.

తా. పరమేశ్వరా! ప్రపంచమున నెట్టి క్రూరశత్రువైనను తన వైరిని జంపిన పిమ్మట శాంతినందును. కాని తరువాత వాని సుద్దికి బోడు. కామ క్రోధ లోభ మోహ మదమత్సరము లనెడు నా యార్గురు వైరు గుంపన్ననో నా దేహమునుగూర్చి పగబూని దీనిని తుదముట్టించి యూరకుండక పునర్జన్మమునగూడ పీడింప నమకట్టియున్నది. కావున ననుగ్రహించి వీని బాధనుండి విముక్తి గావింపుము.

వి. ఈ దేహమందలి బాధకు నీయరిషడ్వర్గమే కారణము. కామ క్రోధ లోభాదులు ఉన్నందుననే వాని భోగేచ్ఛ పూర్తిగాక యా వాసనాబలమువలన పునర్జన్మము కలుగును. వీని పోకడ కవకాశ మిచ్చినందుననే ఈ దేహము జీర్ణమై బాధ నున్నదనియును, ఇంతటితో వీని బాధనుండి తొలగించి శాశ్వతకైవల్యము ననుగ్రహింపు మనియు వివేకము ॥౧౧॥

గాయంతం చ రుదంతం, శాంతం క్రుద్ధం క్షణం హసంతం చ।
రక్ష విభో మామార్తం, గృహీత మాశాపిశాచికయా॥ ౧౨॥

అర్థః—విభో=సర్వజ్ఞా! ఆశాపిశాచికయా=ఆశ యనెడి పిశాచి చేత, గృహీతం=ఆకర్షింపబడినట్టియు, క్షణం=నిముసమున, గాయంతం= పాడుచున్నట్టియు, చ=మరియు, (నిముసమున) రుదంతం=ఏడ్చుచున్న

ట్టియు, శాంతం=చల్లబడినట్టియు, క్రుద్ధం = కోపమునందినట్టియు, హసంతం=నవ్వుచున్నట్టియు,చ=మరియు, ఆర్తం=దుఃఖితుడనైనట్టియు, మాం=నన్ను, రక్ష=పాలింపుము.

తా. సర్వమయా! నేను ఆశాపిశాచమునకు వశుడనై క్షణమున నవ్వుచు నేడ్చుచును, క్షణమునపాడుచు, పడుచును, మరొక నిముస మున శాంతుడనగుచు క్రోధావిష్టుడ నగుచును, సంతసింపుచు దుఃఖించు చును, ఎందును నిలుకడ లేక నిజము తెలియక ఉన్మత్తునివలె నున్నాను. వీని కన్నిటికిని కారణమైన నా యాశను విధ్వంసపరచి "నిరాశా పరమం సుఖం" అనునట్లు పరంధామము ననుగ్రహింపుము. ‖౧౨‖

భవమరుమార్గభ్రమణ- శ్రాంతస్య శివ ప్రసీద దీనస్య।
త్వయి మానసే ప్రసన్నే, శామ్యతి తీవ్రా హి మే తృష్ణా‖ ౧౩‖

అర్థ:—శివ=ఓ శంకరా! భవమరుమార్గశ్రాంతస్య = సంసార మనెడు ఇసుకత్రోవలో దిరుగుటవలన డస్సినట్టియు, దీనస్య=బడుగునై నట్టియు, మే=నాకు, ప్రసీద=ప్రీత్యుక్తుడవు కమ్ము. హి=ఎందువలన, త్వయి=నీవు, మానసే=నామనస్సున, ప్రసన్నే=ప్రసన్నుడ వగుచుండగా మే=నాయొక్క తీవ్రా=ప్రబలమైనట్టి, తృష్ణా=ఆశ, శామ్యతి=శమించు చున్నది.

తా. సంసార మొక ఇసుకత్రోవవంటిది. ఇం దెంత సంచరించినను సుఖము లేకపోగా మిక్కిలి బాధ నందవలసియుండును. నేనును ఈ నీరసమార్గమున తిరిగి తిరిగి మిక్కిలి డస్సియున్నాను. ప్రభూ! ఈ దీనుని కరుణింపుము. నీవు దయతో నా మనమున ఇంచుక ప్రసన్నుడవై కను పడినచో చాలును. నా దురాశ లన్నియు అడుగంటును. ఆశయే లేన ప్పుడు ఈ యమంగళమైన సంసారబాధ లేదుకదా!

యస్మిన్నిపతితమేవ, గ్రసతే రాగోరగో మహాభోగః।
దేహి విభో భవకూపే, త్రియంబకాలంబనం పతతః‖ ౧౪‖

అర్థ:—త్రియంబక = త్రినయనా! విభో = సర్వాంతర్యామీ! యస్మిన్=ఏ, భవకూపే=సంసార మనెడు బావిలో, నిపతితమేవ= పడి మునిగియే యున్నట్టి, మాం=నన్ను, మహాభోగః=అత్యధికమగు సుఖ

దుఃఖానుభవ మనెడు పడగ గలిగినట్టి, రాగోరగః = విషయాభిలాష యనెడు సర్పము, గ్రసతే=కరచుచున్నది, పతతః=పడుచున్నవానికి, కరాలంబనం=చేయూతను, దేహి=ఒసంగుము.

తా. సర్వేశ్వరా ! సంసార మనెడు బావిలో పడినవానిని సుఖదుఃఖము లను పడగగల, విషయాభిలాష యనెడు సర్పము కరచియే తీరుచున్నది కదా! ఇది యొరుల విషయము కాదు స్వామీ ! స్వానుభవమే ! నేనే యందు పడియున్నాను, పడబోవుచున్నాను. ఆ కూపమునుండి వెలుపలికి వచ్చుటకు నీ హస్తము నూతగా నీయుము. ఉద్ధరింపుము. సంసారబాధను తొలగించి విముక్తి ననుగ్రహింపుము॥౧౮॥

యేనైకమేవ సర్వం, ద్వైతేన త్వాం మహేశ పశ్యామి ।
సద్దృష్టిప్రతిబంధం, ఛింధి మమాజ్ఞానతిమిరం తత్॥ ౧౯॥

అర్థ:—మహేశ= సర్వేశ్వరా! యేన=ఏ బంధముచేత, సర్వం= సకల స్వరూపుడ వైనట్టియు, ఏకమేవ=ఒకడవే యైనట్టియు, త్వాం= నిన్ను, ద్వైతేన = ద్వంద్వబుద్ధితో, పశ్యామి = చూచుచున్నాను, తత్ =ఆ, సద్దృష్టిప్రతిబంధం=సరియైన తెలివికి అడ్డుగానున్నట్టియు, మమ=నాయొక్క, అజ్ఞానతిమిరం = అజ్ఞాన మనెడు చీకటిని, ఛింధి= ఛేదింపుము.

తా. దేవదేవా! నాకు అజ్ఞానాంధతమస్సు మిక్కిలిగా నుండుట వలన నీవు ఒకడవేయై, సర్వస్వరూపుడవై, సర్వాధికుడవై యుండుటను గ్రహింపజాలకున్నాను. పైగా నీవంటివాడు మఱొకడును ఉండు ననియు భ్రమించుచున్నాను. సమ్యక్ జ్ఞానమునకు ప్రతిబంధకమైనట్టి ఇట్టి యవివేకమును దయతో పరిహరింపుము- ప్రభూ!

వి. ఈ మలయరాజస్తవమందలి ప్రతిశ్లోకమునను ఒక్కొక ప్రయోజనమును గూర్చి శివుని యాచించుట గాననగును. ఇందును అజ్ఞానాపహారార్థమై ప్రార్థింప బడినది. ౧౦వ శ్లోకమున శివుని ప్రసాదమును, ౧౧న అరిషడ్వర్గములనుండి రక్షింపుమని యును, ౧౨,౧౩ లలో ఆశాధ్వంసము కొరకును, ౧౮ న రాగవినాశము కొఱకును ప్రార్థింపబడినది. ఇట్లే ఆయా శ్లోకములలో ప్రత్యేకమైన ప్రయోజనమును గమనింప వలెను ॥౧౯॥

భగవన్ త్రిభువనభయకృ- త్కృతాంత కృష్ణాహిదంష్ట్రియా దష్టః।
తృష్ణాభిధానయా య- స్త్వమేవ తం నిర్విషీకురుషే॥ ౧౬॥

అర్థ:—భగవన్ = పరాత్పరా! యః = ఎవ్వాడు, త్రిభు... ష్ట్రియా - త్రిభువన = ముల్లోకములకు, భయకృత్ = భీతిని గల్గించునట్టి, కృతాంత = యము డనెడు, కృష్ణాహి = కాలసర్పముయొక్క, దంష్ట్రియా = కోర యనెడు, తృష్ణాభిధానయా = ఆశచేత, దష్టః = కరవబడినాడో, తం = వానిని, త్వమేవ = నీవే, నిర్విషీకురుషే = విషరహితునిగా జేయుచున్నావు.

తా. త్రిలోకభయంకరుడైన యము డనెడు నల్ల త్రాచుయొక్క కోర లనెడు ఆశచేత నెవడు కరవబడినాడో అట్టి వానిని విష మెక్కకుండ కాపాడు సామర్థ్యము గలవాడవు నీ వొకడవే ప్రభూ! దురాశా సర్పదష్టుడయిన నన్ను నీ కటాక్షామృతముతో సంజీవింపుము. ॥౧౬॥

మోహమహావ్యాధిమిమం, దేవ చికిత్సస్వ దుశ్చికిత్సం మే।
భిషజం భైషజ్యం చ, త్వాం హి మహంతః ప్రశసంతి॥౧౭॥

అర్థ:—దేవ=ఈశ్వరా! దుశ్చికిత్సం=చికిత్సచేయ నలవిగానట్టి, మే=నా యొక్క, ఇమం=ఈ, మోహమహావ్యాధిం=మోహ మనెడు పెద్దరోగమును, చికిత్సస్వ=చికిత్సచేయుము, హి=ఎందువలన, మహాంతః=పెద్దలు, త్వాం=నిన్ను, భిషజం = వైద్యునిగాను, చ = మరియు, భైషజ్యం=ఔషధముగాను, ప్రశసంతి=చెప్పుచున్నారు.

తా. పరమేశ్వరా! మోహ మనెడు మహారోగము నన్నాక్రమించినది. ఇది యౌషధాదులచేత బోనాడుటకు నా కసాధ్యమై యున్నది. మహాత్ములందరును నిన్ను వైద్యునిగాను, ఔషధము గాను పొగడుచున్నారు. నీవు తప్ప ఇతరులు ఈ వ్యాధిని మాన్పజాలరు. కావున అనన్యశరణ్యుడ నగు నన్ను కాపాడుము.

వి. శివుడు భవరోగవైద్యు డనియును, దేవతలలో గూడ మొదటి వైద్యు డనియును, వేదాగమములలో ప్రమాణములు కలవు. "ప్రథమో దైవ్యో భిషక్" (రుద్రము) "భిషక్తమం త్వా భిషజాం శృణోమి" (అథర్వ) "సంసార భేషజం వైద్యం" (శివధర్మ) ॥౧౭॥

తం దేవ నరకహుతవహ - బహుళజ్వాలాకలాపసంతాపం ।
త్వద్దృష్టిర్ వృష్టిరివ, ప్రశమయతి శివ ప్రసీద విభో ॥౧౭॥

అర్థ:—భో=ఓ, విభో దేవ శివ=సర్వవ్యాపకుడ వగు శివదేవా! తం=ఆ, నరకహుత......తాపం - నరక=నరకమనెడు, హుతవహ= అగ్నియొక్క, బహుళజ్వాలా = అధికములైన మంటలయొక్క, కలాప=సమూహామునుండి పుట్టునట్టి, సంతాపం=మహాతాపమును, త్వద్‌దృష్టిః=నీ కటాక్షము, వృష్టి రివ=వర్షమువలె, ప్రశమయతి= చల్లార్పుచున్నది.

తా. మహేశ్వరా! సర్వనియామకా! అత్యధికమైన అగ్నిజ్వాలలను వర్షము చల్లార్చివేయునట్లు నీ కృపాకటాక్షము మహానరకబాధను అరక్షణములో పరిహరింపగలదు. నన్ననుగ్రహింపుము స్వామీ!॥౧౭॥

దేవ మహాకారుణిక, ప్రసీద కరుణార్ద్రయా దృశా పశ్య ।
శామ్యతి యయా మనో మే, దుస్సహదుఃఖానలజ్వలితం ॥౧౮॥

అర్థ:—మహాకారుణిక = సమధికదయాశీలుడ వగు, దేవ=ఓ యీశ్వరా! ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము, కరుణార్ద్రయా=జాలిచేత దడిసిన, దృశా = దృష్టితో, పశ్య = చూడుము, యయా =ఏ చల్లని చూపుతో, మే = నాయొక్క, దుస్సహదుఃఖానలజ్వలితం = సహింప శక్యముగాని దుఃఖ మనెడు అగ్నిచేత గాల్పబడినదైన, మనః=మనస్సు, శామ్యతి = శాంతించుచున్నదో.

తా. ఓ దయామయా! పరమేశ్వరా! నేను సహింప నలవిగాని దుఃఖాగ్నిచే సంతప్తుడనై యున్నాను. నీవు కరుణామృత వీక్షణము కలవాడ వని ప్రసిద్ధుడవుకదా. ప్రసన్నుడవై అట్టి చల్లనిచూపులతో నను జూడుము. దానివలననే నా సంసారతాపము సంపూర్ణముగా శమింపగలదు.

వి. పూర్వశ్లోకములలో తన దురాశాపాశమును, మోహాధిక్యమును, నరకబాధను జెప్పి; యందు సంపూర్ణ దుఃఖాగ్ని సంతాపమును వెల్లడించి; తన సామర్థ్యముతో సద్గతి యగుట కల్ల యని యెరింగి శివుని దయాదృష్టినే యాచించుచు శరణాగతిని ప్రకటించినాడు. శివుడు పరమకారుణికు డనుటకును, పరమసాత్త్వికుడనుటకును "యా తే రుద్ర శివా తనూః" ఇత్యాది శ్రుతులు ప్రమాణములు ॥౧౮॥

శివశివ భగవన్ భగవన్, అంధమనాథం చ రక్షరక్ష విభో!
తవ పాదపీఠలగ్నం, హరతి హఠాదేవ మృత్యుర్మాం ॥౨౦॥

అర్థ:—శివ శివ = ఓహర హరా! భగవన్ భగవన్ = ఈశ్వరా పరమేశ్వరా! తవ=నీయొక్క, పాదపీఠలగ్నం = చరణములనెడు పీట నాశ్రయించి యున్నట్టి, మాం = నన్ను, మృత్యుః = మృత్యువు, హఠాత్ = బలాత్కారముగా, హరతి = అపహరించుచున్నది. (ఈ) అంధం = అజ్ఞానియైనట్టియు, అనాథం = దిక్కులేనట్టియు, (నన్ను) విభో = సర్వవ్యాపీ, రక్షరక్ష = కాపాడు కాపాడు.

తా. సర్వేశ్వరా! మంగళమూర్తి! నేను జ్ఞానహీనుడను, నిర్గతికుడను, కడతేర నపేక్షించి నీ చరణయుగళము నాశ్రయించి ఇదిగో ఉన్నాడను. మృత్యువు నను బలాత్కారముగా గొంపోవుచున్నది. రక్షింపుము రక్షింపుము. మృత్యుబాధను తొలగించి అమృతము (మోక్షము)ను అనుగ్రహింపుము. ॥౨౦॥

అతికృపణమార్తమశరణ- మాక్రందంతం వశీకృతం పాశైః।
ఆక్రాంతమంతకభటై ర్మా- మాం శరణాగతం త్యాక్షీః ॥౨౧॥

అర్థ:—అతికృపణం = కేవలదీనుడును, ఆర్తం = దుఃఖితుడును, అశరణం=ఆశ్రయహీనుడును, ఆక్రందంతం = ఏడ్చుచున్నట్టివాడును, పాశైః=బంధనములచేత, వశీకృతం=కట్టుబడినవాడును, అంతకభటైః= యమభటులచేత, ఆక్రాంతం=పట్టుబడినవాడును, శరణాగతం = నిను శరణముగా బొందినవాడును, అగు-మాం = నన్ను, మా త్యాక్షీః = విడనాడకుము.

తా. మహాప్రభో! నేను అతిదరిద్రుడను, దుఃఖితుడను, గతిలేనివాడను, రోదించుచున్నాను. సంసారబద్ధుడను అయ్యున్నాను. యమభటులుకూడా గ్రసించినందువలన విలపించుచు నిను నమ్మి ఆశ్రయించినాను. ఇట్టి వానిని పరిత్యజింపక రక్షింపుము ॥౨౧॥

శరణాగతానశరణాన్, మరణభయార్తిద్రుతాన్ ద్రుతం దయయా।
రక్షామ్యహమితి మయ్యపి, కురు ప్రతిజ్ఞాం విభో సఫలాం ॥౨౨॥

అర్థ:—విభో = ప్రభూ, అహం = నేను, శరణాగతాన్ =శరణము

బొందినవారిని, మరణభయాభిదుతాన్=మృత్యుభీతిచే బాధితులైన వారిని, (మరియు) అశరణాన్ = అనాథులను, దయయా = కృపతో, దుతం=శీఘ్రముగా, రక్షామి=కాపాడుచున్నాను." ఇతి = ఇట్టి, సఫలాం=అమోఘమైన, ప్రతిజ్ఞాం=ప్రతినను, మయ్యపి=నాయందును, కురు=చేయుము.

తా. ఈశ్వరా! "ఆశ్రయించినవారిని, మరణభీతులను, అనాథులను తప్పక రక్షించువాడ వని" కదా నీకు ప్రఖ్యాతి! అట్లగుచో పై యన్నివిధములైన గుణములు గల నాయందు గూడ నీ ప్రతిజ్ఞను సార్థకపరచుము. (నిన్నే నమ్మియున్నాను కావున తప్పక కాపాడు మని భావము)

వి. మరణభీతుడైన మార్కండేయుని, విషభీతులైన ఇంద్రోపేంద్రాదులను, అనాథులైన మునిబాలాదులను, శివుడు రక్షించుట ప్రసిద్ధము. ఇందుకు "అనన్యాశ్చింతయంతో మాం" అను గీతయును, "భక్తరక్షాకరః శివః" అను ఆగమవచనములును ప్రమాణములు ‖౨౨‖

పరమాత్మన్ పరమేశ్వర, వేత్థ మమాంతస్థమేవ దేవ త్వం ।
యది తవ చరణాంబుజయోః, స్వప్నేఽప్యహమన్యథా చేతాః ‖౨౩‖

అర్థః—పరమాత్మన్ = ఓ పరబ్రహ్మమా, పరమేశ్వర=మహేశ్వరా? దేవ=ప్రభూ, త్వమేవ=నీవే, మమ=నాయొక్క, అంతఃస్థం = లోనున్నదానిని, వేత్థ= తెలియుచున్నావు, స్వప్నేపి=నిద్రయందైనను, అహం=నేను, తవ=నీయొక్క, చరణాంబుజయోః = పాదకమలముల విషయమున, అన్యథాచేతాః=వేరువిధమైన మనస్సుకలవాడను, యది= అగుచో.

తా. సర్వాంతర్యామి వైన ప్రభూ! నాలో నెట్టికోర్కెగలదో నీకు తెలిసియే యున్నది. స్వప్నమునందు సైతము ఇతరమును భుజింపను. నిన్నే సదా స్మరించుచున్నాను కదా! నన్నేల కాపాడవు?‖౨౩‖

సర్వేశ! సర్వశక్తే!, సర్వగ! సర్వజ్ఞ! శర్వ! సర్వాత్మన్! ।
త్యక్తస్య దేవ భవతా, భవితా నాన్యో మమ త్రాతా ‖౨౪‖

అర్థః—సర్వేశ=ఓ విశ్వేశ్వర, సర్వశక్తే=నిఖిలసమర్థా, సర్వగ= సర్వవ్యాపకా, సర్వజ్ఞ = సర్వవేత్తా, శర్వ = సకల దుఃఖనివారకా,

సర్వాత్మన్ = సకలాధారా, దేవ = మహేశా, భవతా = ఇట్టివాడవగు నీచేత, త్యక్తస్య = విడువబడినట్టి, మమ = నాకు, అన్యః = ఇతరుడు, త్రాతా = రక్షకుడు, న భవితా = కాజాలడు.

తా. ఓమహాప్రభూ! ఓసకలచరాచరములకు గురుడవైనవాడా! ఓ నిఖిలశక్తిసమేతా! ఓ సర్వవ్యాపకా! ఓ సర్వజ్ఞా! ఓ సమస్త దుఃఖధ్వంసకా! ఓ సర్వాధారా! ఇట్టి సర్వసామర్థ్యములు సంపూర్ణముగ గల్గిన నీవే నను విడనాడుచో మరియొకడు సంరక్షింప గలడా? తప్పక నీవే కాపాడవలయును. (అన్యక్షుద్ర దేవుల నాశ్రయింప నని భావము.)

వి. ఈ మల్లాణ కవీంద్రుడు శివాగమ శాస్త్రమును బాగుగా ఎరిగిన వాడని ఇదివరలో సూచింపనైనది. ఈ శ్లోకమును ఆతని యాగమ వైదుష్యమునకు సాక్ష్యము. శివుడు షడ్విధైశ్వర్య సంపన్నుడనుట విఖ్యాతము. "సర్వజ్ఞత్వము, నిత్యతృప్తిత్వము, అనాదిబోధిత్వము, సర్వతంత్రస్వతంత్రత్వము, అక్షయశక్తిత్వము, అనంతశక్తిత్వము" అనునవియే ఆ యాఱువిధములైన ఐశ్వర్యములు – "సర్వజ్ఞతాతృప్తి రనాదిబోధః, స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః। అనంతశక్తిశ్చ విభోర్విధిజ్ఞాః షడాహురంగాని మహేశ్వరస్య" ఇత్యాది ఆగమ ప్రమాణములు కలవు ॥౨౮॥

కమపరమధునా యాచే, కం చ క్రిందామి మందపుణ్యోఽహం।
కమశరణః శరణంవా, వ్రజామి దేవ! త్వయా త్యక్తః ॥౨౯॥

అర్థః—దేవ = ప్రభూ! మందపుణ్యః = స్వల్పపుణ్యము గల్గినట్టియు: అశరణః = అనాథుఁడనైనట్టియు, అహం=నేను, త్వయా=నీచేత, త్యక్తః, విడువబాడినవాడనై, అపరం=అన్యుడైనట్టి, కం=ఎవనిని, యాచే=ప్రార్థింతును? చ=మరియు, కం=ఎవనిని, క్రిందామి=మొరపెట్టుకొందును? వా=లేక, కం=ఎవనిని, శరణం=రక్షకునిగా, వ్రజామి =పొందగలను?

తా. స్వామీ! నేను మందభాగ్యుడను. ఎటులో నిను నమ్మికొను స్వల్పభాగ్యము లభించినది. నీవే పరిత్యజింతువా ఇక నను కరుణించువారెవరు? ఎవరిని వేడికొందును? ఎవరియొద్ద మొరపెట్ట గలను? ఎవరి నాశ్రయింతును? దిక్కేది. అనన్యశరణ్యుడ నగు నన్ను నీ వుద్ధరింపవలెను ॥ ౨౯॥

దీనేషు దయా కార్యే-త్యార్యేషు కృతా త్వయైవ మర్యాదా।
ఆర్యత్వం త్వయ్యేవహి, దైన్యం మయ్యేవ పర్యాప్తం ॥౨౬॥

అర్థ:—దీనేషు=దీనులయందు, దయా=కరుణ, కార్యా=చేయ తగినది, ఇతి=ఇట్లు, త్వయైవ=నీచేతనే, ఆర్యేషు=పెద్దలలో, మర్యాదా= నియమము, కృతా=చేయుబడినది. త్వయ్యేవహి=నీయందే, ఆర్యత్వం= పెద్దతనము, పర్యాప్తం = పూర్తిగానున్నది. దైన్యం=దీనత్వము, మయ్యేవ=నాయందే, (పూర్తిగా వ్యాపించినది).

తా. దీనానాథా! దీనులను దయతో కడతేర్చవలెనని నీవే మహాత్ములకు నియమము నేర్పరచినావుకదా! మహాత్మత్వమూ నీ యందు నిండియున్నది. ఇక దైన్యమునకా నేనును పెద్దకొడుకును. మఱి నన్నేల రక్షింపవు? (నీ బోటి దాతయు, నాబోటి దరిద్రుడును లేడు. కావున మన యన్యోన్యము సర్వథా తగి యున్నదని భావము) ॥౨౬॥

కిం త్యజసి మామనాథం, నాథ కథం తే దయా న మయి దీనే।
పాపినమపి శరణాగత - మశరణ ముజ్ఝంతి మహాంతః ॥౨౭॥

అర్థ:—నాథ = ఈశ్వరా! అనాథం = నిరాశ్రియుడనైన, మాం = నన్ను, కిం = ఎందులకు, త్యజసి=విడుచుచున్నావు? దీనే = దీనుడనైన, మయి = నాయందు, తే = నీయొక్క, దయా = కృప, కథం = ఎట్లు, న = లేదు? మహాన్తః=పెద్దలు, పాపినమపి =దుష్టాత్ము నైనను, శరణాగతం = శరణుజొచ్చిన వానిని, అశరణం = అనాథుని, నోజ్ఝంతి = విడువరు.

తా. ప్రభూ! మహాత్ములు శరణుజొచ్చిన దుష్టులను, అనాథు లను విడువరు కదా! దిక్కులేనివాడనగు నన్ను నీవేల పరిత్యజించు చున్నావు? దీనుడనగు నాపై నీకేల కృపగల్గదు? (నను రక్షింపనిచో నీ గొప్పతనమునకు లోపము గల్గునని ధ్వని)॥ ౨౭॥

త్రాతరి సర్వగతే త్వయి, శివనామని నామ పరమకారుణికే।
దేవ దిశః కథ మేతాః, సంజాతా స్త్రాణశూన్యా మే ॥౨౮॥

అర్థ:—దేవ = స్వామీ! సర్వగతే = సర్వవ్యాపకుడవై నట్టియు, శివనామని = శుభకరుడను నామము గలినట్టియు, పరమకా

రుణికే = దయాఘనుడవై నట్టియు, త్వయి = నీవు, త్రాతరి నాస = రక్షకుడవై ప్రకాశించుచుండగా, ఏతాః = ఈ, దిశః = దిక్కులు, కథం = ఎట్లు, మే = నాకు, త్రాణశూన్యాః= పోషణశూన్యములు, సంజాతాః = ఐనవి?

తా. మహేశ్వరా! సర్వాంతర్యామివియు, శంకరుడను (శుభము చేయువాడను) నామము గలవాడవును,కృపాసాగరుడవును అగు నీవే సర్వ మును రక్షించుచున్నావనుట తథ్యము. సత్య మిటులున్నను, నేను ఏదిక్కు కేగి, యెవని వేడినను సర్వము రక్షణాశూన్యముగా పరిణమించుచున్నదే! దీనికి హేతువేమి ? (ఈ జగత్తు నీ యంశమే యగు నెడల నాకేల రక్ష కము కాదు ?)

వి. "నీవే జగద్వ్యాపివైన యెడల నన్నేల రక్షించ వనుట" వలన మల్హణ కవిని అద్వైత మతీయునిగా భావింపవలదు. సర్వగతత్వ, శివనామత్వ, పరమకారుణి కత్వాది గుణములను మొదలే పేర్కొనినాడు కావున శివాద్వైత వాదియనియే ఎరుగవలయును. తనకు రక్షణ లేనందులకు తన పూర్వార్జిత కర్మపుద్గలమే కార ణము ॥౨౭॥

ఉభయ మసంభావ్య మిదం, సుఖమిహ దుఃఖం త్వదాశ్రితేఽన్యత్ర।
కశ్శ్రద్దధాతి తుహినం, దహనే దహనం చ శీతాంశౌ ॥౨౮॥

అర్థ:—ఇహ= ఈలోకమునందు, త్వదాశ్రితే=నిన్నాశ్రయిం చినవానియందు, దుఃఖం=దుఃఖమును, అన్యత్ర=నిన్నాశ్రయింపని వానియందు, సుఖం=సుఖమును, ఇదం=ఈ, ఉభయం = రెండును, అసంభావ్యం=నమ్మదగనిది. దహనే=అగ్నియందు, తుహినం=చంద్రుని చ=మఱియు, శీతాంశౌ=చంద్రునియందు, దహనం = అగ్నిశక్తిని, కః=ఎవ్వడు, శ్రద్ధధాతి=విశ్వసించు చున్నాడు ?

తా. మహాప్రభో! నీభక్తునకు దుఃఖములా ! నిన్నాశ్రయింపని ఇతరులకు సుఖములా! ఇది యెట్లు విశ్వసింప నగును? సూర్యుని యందు శైత్యమును, చంద్రునియందు ఉష్ణత్వమును కలదని చెప్పినచో నెవడేని నమ్మునా? (నన్ను రక్షింప లేవన్నచో లోకము నమ్మదని యును, నీభక్తోద్ధార బిరుదమునకు హాని గలుగుననియును భావము) ॥౨౮॥

క్రిందంతమేవ దేవ, త్వమపి యదీశాన సంశ్రితం త్యజసి।
తదశరణం శరణాగత - వత్సలతా హంత నిహతైవ ॥౩౦॥

అర్థ:— ఈశాన=ఓ యీశ్వరా! దేవ=చిన్మయా! త్వం=నీవు క్రిందంతం = విలాసించుచున్నటువంటి, అశరణం = అనాథుడైనట్టి, సంశ్రితమపి=అశ్రితుండైనట్టి వానినిగూడ, యది=ఒకవేళ, త్యజసి= విడుచుచో, తర్హి=అపుడు, శరణాగతవత్సలతా=శరణుజొచ్చినవానిని గాపాడుట యనునది, నిహతైవ=నష్టమైనటులే! హంత=అయ్యో!

తా. ప్రభూ! రోదించుచు నిను స్మరించుచు నిన్నే ఆశ్రయించి యున్నాడను. కేవల దీనుండను. వేరొకరు దిక్కు లేరు. ఇట్టి అనన్య భక్తుడ నగు నను త్యజింతువా? అయ్యో 'నీశరణాగతరక్షక' బిరుదము నశించిపోవు చున్నది కదా! ॥౩౦॥

అభ్యర్థితః ప్రసీదసి, భగవన్నిత్యపి మమైవ కువికల్పః।
జగదర్థ మర్థిత స్త్వం, కుర్వన్ బహుధా తనుం కేన ॥౩౧॥

అర్థ:— భగవన్=సర్వైశ్వర్య సంపన్నా! త్వం=నీవు, అభ్యర్థితః=ప్రార్థింపబడినవాడవై, ప్రసీదసి = ప్రసన్నుడ వగుచున్నావు. ఇత్యపి=ఇట్లనికూడ, ఏషః=ఈ, మమైవ=నాయదియేయైన, కువికల్పః= దురూహ, జగదర్థం=జగత్తుకొఱకు, తనుం=దేహమును, బహుధా= అనేకవిధములుగా, కుర్వన్=చేయువాడవై, కేన=ఎవ్వనిచేత, అభ్యర్థితః=వేడబడిన వాడవైతివి?

తా. సర్వవిధముల నైశ్వర్యములుగల ప్రభూ! నిను ప్రార్థించిన భక్తునకే ప్రత్యక్షుడవై వరముల నిత్తువేమోయని నేనే దుస్తర్కము చేయుచున్నాను. అట్లు కాదనియు గూడా నెఱుగుదును. ఏలయనగా నీవే యనేక విధములైన లీలాదేహములను ధరించియు, సృష్టించియు జగత్తునకు హితమును అనుగ్రహించినావు కదా! అట్లు చేయుటకు నిన్నెవరు ప్రార్థించిరి? (కావున నా సుకృతము లేకున్నను సహజముగా శివంకరుడవగు నీవు నన్నుద్ధరింతు వనియే నిశ్చయము) ॥౩౧॥

సుచిరం మయా న సేవిత - మితి శివ న త్రాయసే న తద్ఘటతే ।
కిం సద్య ఏవ పీతం, నామృత మజరామరం కురుతే ॥౩౨॥

అర్థ:—శివ=ఓ శంకరా ? మయా=నాచేత, సుచిరం=దీర్ఘకాలము, నసేవితం=సేవించుటకాలేదు, ఇతి=అని, నత్రాయసే=రక్షించుటలేద నినచో, తత్=అది, నఘటతే=పొందుటలేదు. సద్యఏవ=అపుడే, పీతం=త్రావబడిన, అమృతం=అమృతము, నాజరామరంకురుతే=చావు పుట్టు కలు లేకుండ చేయుటలేదా, కిం=ఏమి ?

తా. మంగళమూర్తీ ! నిను చాలకాలమునుండి ఉపాసించ లేదని యెంచి; నను రక్షింపజాలనన్నచో అది సయుక్తికముగా లేదు. అమృతమును దీర్ఘకాలము దనుక సేవించకున్నను? ఎపుడు తీసుకున్నచో నపుడే జరామరణములను లేకుండ చేయుట లేదా! అట్లే అమృత సదృశమైన నీ నామస్మరణమును ఎపుడొనర్చిననేమి ? జన్మ మరణాది పునరావృత్తి రహితమైన మోక్షము లభించియే తీరును. ॥౩౨॥

పరితుష్టే కిల భగవన్, స్వాత్మని తుష్టిం దదాసి లోకానాం ।
తుష్టేఽపి త్వయి దుఃఖం, న శ్రుతపూర్వం కదాచిదపి ॥౩౩॥

అర్థ:—భగవన్=మహాదేవ! స్వాత్మని=నీయొక్క చిదాత్మ, పరితుష్టే=సంతుష్టమగుచో, లోకానాం=జనులకు, తుష్టిం=సంతోషమును, దదాసికిల=ఇచ్చుచున్నావు కదా ! త్వయి=నీవు, తుష్టేఽపి=సంతోషము పొందినను, దుఃఖం=(ఈ) కష్టము, కదాచిదపి = ఎవుడైనను న శ్రుతపూర్వం=వినఁబడలేదు.

తా. పరమేశ్వరా! నీవు స్తోత్రాదులచేత సంతుష్టుడవై భక్తులకును ఇష్టార్థములనొసంగి సంతోషము గల్గింతువనుట సర్వశాస్త్ర ప్రసిద్ధము. నీవు సంతోషము బొందిన తర్వాతగూడ భక్తులకు బాధ లుండుననుటను నేను కని విని యెరుగను. (నేను ఇంతగా ఈ స్తోత్ర మొనర్చిన తదుపరి నీవు తప్పించుకొనవలదనియును, నాదుఃఖ విధ్వంస నము గావించియే తీరవలెనని భావము) ॥33॥

త్వయి నిఖిలదుఃఖహంతరి, హృదయగతే దుఃఖితా న యుక్తా మే ।
ఉదితే భగవతి భాస్వతి, తిమిరమవష్టం క్వవా దృష్టం ॥౩౪॥

అర్థః—నిఖిల దుఃఖహంతరి = సమస్త దుఃఖములను సంహరించెడు, త్వయి = నీవు, హృదయగతేఽపి = చిత్తములో నుండగా, మే = నాయొక్క, దుఃఖితా= దుఃఖజీవిత్వము, నయుక్తా = యోగ్యమైనది కాదు. భగవతి = మహాత్ముడైనట్టి. భాస్వతి = సూర్యుడు, ఉదితే = ఆవిర్భవించినవాడగుచుండగా, తిమిరం = అంధకారము, అనష్టం = నాశము కానట్టిదిగా, క్వవా = ఎచ్చోట, దృష్టం=చూడబడెను?

తా. కల్యాణధామా ! నిఖిల దుఃఖములను నిముసములో నివారింపగల నిను నిరంతరము నెమ్మదిలో నమ్మియున్నాను. నా చిత్తమంతయు నీవే నీవుగా నిండియున్నది. ఐనను నా సంసారబాధ లడుగంటలేదు. ఇది మిక్కిలి అయుక్తము. సహస్రాంశుండగు సూర్యుడుదయమందిన తర్వాత అంధతమస ముండునా! ఇది యాశ్చర్యకరము గాదా ! నీవు నాలో నుండుటయు, నాకీ లోకబాధలును సమంజసములే కావు. సూర్యుడును అంధకారమును ఒకచోట నుండనట్లు, నీవును దుఃఖములును ఒకే దేహమున నుండజాలవు కదా!॥౩౪॥

క్షణమపి యత్ర మహాంతో, వసంతి తత్రాపదోఽపి హస్యంతే।
వససి సదా మమ హృదయే, దుఃఖిత్వం కిమిద మాశ్చర్యం ॥౩౫॥

అర్థః—యత్ర = ఎచ్చోట, మహాంతః = పెద్దలు, క్షణమపి = ఇంచుక సేపైనను- వసంతి = నిలుచుచున్నారో, తత్ర = అచ్చోట, ఆపదోపి = విపత్తులుగూడ, హస్యంతే = నాశము పొందుచున్నవి. మమ = నాయొక్క, హృదయే = మానసమున, సదా = ఎల్లప్పుడు, వససి=నివసించుచున్నావు, ఇదం=ఈ, దుఃఖిత్వం=సంకట జన్మత్వము, కిం = ఏల? ఆశ్చర్యం = ఆశ్చర్యముగా నున్నది.

తా. మహానుభావులు క్షణకాల ముండినను అచ్చోటి పాపములు పటాపంచలై పోవుచుండును. ఇది జగత్ప్రసిద్ధమైన విషయము. జగదీశ్వరుడవగు నిన్ను నా హృదయమున ఒకనిముసమును విడువక భజించుచున్నాను. ఐనను నా దుఃఖములు బాయుట లేదు. దీనికి కారణము దెలియక ఆశ్చర్యముగా నున్నది ॥౩౫॥

దారయతి దారుణమిదం, దుఃఖం దహతీవదేవ మే హృదయం ।
విఫలీభవతి బహుఫలా, య త్తత్సంకల్ప కల్పలతా ॥౩౬॥

అర్థః—దేవ=భగవన్, ఇదం=ఈ, దారుణం=భయంకర మైన, దుఃఖం=బాధ, మే=నాయొక్క, హృదయం=స్వాంతమును, దారయతి=చీల్చివై చుచున్నది, దహతీవ = కాల్చివై చుచున్న దా యేమి? యత్=ఎందువలన, బహుఫలా=అనేకములగు ఫలములుగల, సంకల్ప కల్పలతా = మనోరథమనియెడు కల్పవృక్షము, విఫలీభవతి=నిష్ఫల మగు చున్న దో?

తా. స్వామీ! కోటానుకోట్ల ఫలముల నిచ్చెడు కల్పవృక్షమే నిష్ఫల మగుచుండగా నిక చెప్పునది లేదు. సకలేష్టార్థముల ననుగ్రహించు మహాదాతవగు నిను నా మనమున నిడుకొని యెన్నియో కోరుకొను చున్నాను. కాని ఒకటియైనను ఫలించుటలేదు. కావున ఈ దుఃఖ దావాగ్ని భయంకరముగా ననుఁ జీల్చి కాల్చి వైచు చున్నది. ఇక నిశ్శేషమై పోవ నున్నాను, (ఆదుకొని త్వరగా సంసార బాధనుండి రక్షింపుమని భావము) ॥౩౬॥

యస్యేచ్ఛయైవ గచ్ఛతి, జగదఖిలం సంభవం చ నాశం చ ।
తత్రి త్వయ్యపి శంభో, సతి దుఃఖం హా హతోస్మి తతః ॥౩౭॥

అర్థ:—శంభో=సుఖనిలయా! యస్య = ఎవనియొక్క, ఇచ్ఛయైవ=తలంపుచేత నే, అఖిలం=చరాచరాత్మకమైన, జగత్=ప్రపంచము, సంభవం=పుట్టుకను, చ=మఱియు, నాశంచ=వినాశమునుగూడ, గచ్ఛతి=పొందుచున్నదో, తత్రి=అట్టి, త్వయి=నీవు, సత్యపి=ప్రకాశించుచున్నను, దుఃఖం=దుఃఖమా! హా=అయ్యో, తతః=అట్టివార్త నుండి, హతః=ప్రాణము వీడినవాడనై, అస్మి=ఉన్నాను.

తా. శంకరా! నీయొక్క ఇచ్ఛామాత్రముననే ఈ సకల జగత్తు సృష్టి స్థితి లయములను పొందుచున్నది కదా! ఇట్టి లోకాధిపుడవగు నీవు నాలో సదా స్మరింపబడుచు ఉన్నను నా దుఃఖములు బాయకున్న వే! అయ్యో! ఇట్టివార్త వినుటకే మహాద్భుతముగా నున్నది. (బాధనేయుట [illegible])

వి. ఈ జగము ఈశ్వరుని ఇచ్ఛవలన పుట్టుచు గిట్టుచున్న దనుటనే శివాద్వైతశాస్త్ర మంగీకరించుచున్నది. ఇదియే ప్రమాణ బద్ధమై యుక్తియుక్తమై ప్రకాశించుచున్నది. ఇట్లుననిచో ఈశ్వరుడు జగద్రూపముగా కేవలమ్ము పరిణామము బొందుచున్నాడని భావింపవలెను. అచేతనములు మాత్రమే పరిణామము నొందును. పరబ్రహ్మమగు నీశ్వరునకును నట్టి నిత్యపరిణామము నంగీకరించుచో శివుడును ఘటపటాదులవలె నరిగితరిగి జీర్ణించి ఈ పాటికి పేరూరు లేకుండువాడు. అప్పుడు నిత్యుడు సత్యుడు అని చెప్పుటకే వీలులేదు. ఈ జగత్తు సమస్తముకూడ ఈశ్వరమయమే యనుచో పుణ్యాపాపములు తప్పొప్పులు ఉండకూడదు. లేక బ్రహ్మమున కొకరూపము జగత్కారణముగను, మరియొకటి కేవల నిత్యనిరంజన సత్యముగను ఉన్నదని చెప్పుచో ఒకే బ్రహ్మమునందు నిత్యత్వము అనిత్యత్వము అను పరస్పర విరుద్ధ ధర్మములను అంగీకరింపవలసి వచ్చును. ఇది యసమంజసము కావున నంగీకార్యము కాదు. ఇంక కొందరు ప్రకృతియే మహదాద్యాకారములతో జగద్రూపముగ బరిణమించుచున్నదని వాదింతురు. ప్రకృతి జడమైనది కదా! చేతనసహాకారము లేనిదే ప్రకృతిలో సంచలనమే కలుగదు. కావున నదియు అనుభవవిరుద్ధము. గోవులో చేతనరూపములగు ఆత్మాదు లున్నపుడే పాలనిచ్చుచున్నది. కాని; ప్రాణిపోయినను ప్రకృతి రూపమగు గోవున్నదికదా యని మందమతి యెవడైనను పాలను పిదికినచో దొరకునా? ప్రకృతితోబాటు పురుషుడే పరిణమించుచున్నాడనుచో ప్రకృతివాదుల పురుషునకు కర్తృత్వమే లేదు కావున నట్లు జెప్పజనదు. జగత్తుకూడ బ్రహ్మమువలె కేవల నిత్యమందుమా! "యతోవా ఇమాని భూతాని జాయంతే" (ఎవ్వనిచే జనించు జగము) మున్నగు శ్రుతులు వ్యర్థమగును. అనేక ఈశ్వరులను, కర్తలను జగత్కారణముగా జెప్పవలసి యుండును.

ఈ యధిక ప్రసంగమును మరింత ప్రపంచించుటకన్న "పరమశివబ్రహ్మము యొక్క ఇచ్ఛాశక్తివలన సర్వము సాగుచుండు" నను ఒకే నిరుపద్రవమైన మహావాక్యమును నమ్మి పెద్దల యనుభవమార్గమున సంచరించినచో నెట్టి కష్టములును కలుగ జాలవు ॥౩౭॥

తవ చరణశరణగమనా - దుద్భగ్నా నాపదస్సపది యచ్చ ।
ఆత్మా తేన మమాయం, భగవన్ నింద్యశ్చ వంద్యశ్చ ॥౩౮॥

అర్థః—భగవన్ = మహేశ్వరా! చ = మరియు, యత్ = ఎందువలన, తవ=నీ యొక్క, చరణశరణగమనాత్=పాదమును శరణు జొచ్చుటవలన, సపది = తత్క్షణమున, మమ= నాయొక్క, ఆపదః= విపత్తులు, నోద్భగ్నాః = నష్టము పొందలేదో, తేన = ఆకారణము చేత, అయం = ఈ, ఆత్మా = జీవుడు, నింద్యశ్చ = తెగడదగినవాడును, వంద్యశ్చ = పొగడ దగినవాడును, (అయ్యున్నాడు.)

తా. పరమేశ్వరా? నీ పాదముల నాశ్రయించి మొరపెట్టుకొన్నను నా సంసారపీడలు పాయలేదు. కావున వీ డెంత పాపిష్ఠియోయని నిందింపక మానరు. ఎటులైననేమి; శివపాదమును భజించె గదాయని నను కొందరు వందింతురు గూడను. నిను శరణము బొందుటవలన నాకు తెగడ్త పొగడ్తలు రెండును గలుగ నున్నవి ॥౩౮॥

చింతామణిమపి లబ్ధ్వా, కష్టమభవ్యో దరిద్ర ఏవాస్మి ।
శివమపి శరణం గత్వా, మరణభయా ద్యన్న ముక్తోఽస్మి ॥౩౯॥

అర్థ:—అభవ్యః = నిర్భాగ్యుడ నగు నేను, చింతామణిం = చింతామణిని, లబ్ధ్వాఽపి = పొందియును, దరిద్రఏవ = దరిద్రుడనయియే, అస్మి = ఉన్నాను. యత్ = ఎందువలన, శివం = శంకరుని, శరణం = శరణము, గత్వాపి = పొందియును, ముక్తః = ముక్తుడను, నాస్మి = కాలేదో.

తా. అనంతకల్యాణగుణభరితు డగు శివుని భజించినను నాకు మరణభీతి తప్పలేదు. ఇది మిక్కిలి యాశ్చర్యకరము. మరియు నా పురాకృతమును గూడ నిందుమూలమున దెలియవచ్చును. ఇష్టార్థముల నిచ్చు చింతామణిని పొందికూడ దరిద్రుడుగానే యున్నానే! నా దౌర్భాగ్యము నే మనవచ్చును? ॥౩౯॥

త్రిభువన మప్యుద్ధర్తుం, త్వద్భక్తా శ్శక్తతాం గతా స్సర్వే ।
అహమిహ పున రవసన్నః, పాప స్స్వయమేవ సంసారే ॥౪౦॥

అర్థ:—సర్వే = సమస్తులైన, త్వద్భక్తాః = నీ భక్తులు, త్రిభువనమపి = ముల్లోకములనుగూడ, ఉద్ధర్తుం = పెకల్చుటకును, పావన మొనర్చుటకును, శక్తతాం = సామర్థ్యమును, గతాః = పొందినవారైరి, పునః = మరియు, ఇహ = ఈ, సంసారే = ప్రపంచమున, అహం = నేను, స్వయమేవ = సొంతముగనే, పాపః = పాపినై, అవసన్నః = నష్టపడినవాడను (ఐతిని).

తా. ప్రభూ! నీ ప్రాచీనభక్తు లెల్లరును, ముల్లోకముల భక్షించుటకును సమర్థులైనట్లు ప్రసిద్ధము. నీదు భక్తుడనే యగు నే నొక్కడను మాత్రమే ఈ సంసారకూపమున బడి పాపినై దుఃఖము ననుభవించుచున్నాను. (ఇది యేటి న్యాయము?)

వి. ఈ శ్లోకమునగల "ఉద్ధర్తుం" అను శబ్దరూపమునకు "పెరకివైచుట, పావన మొనర్చుట" అను రెండు అర్థములును కలవు. ఇది వ్యంగ్యముగా ప్రయోగింప బడినది. సానంద దధీచి శ్వేతాది శివభక్తులు తమ యలౌకిక శక్తివలన నుల్లోకముల పావన మొనర్చినదియు, బాణరావణాదులు త్రిభువనముల నుల్లోల కల్లోలము గావించి నదియు పురాణప్రసిద్ధము. పాపాత్ములుగూడ శివభక్తితత్పరులై కైలాసము జేరి యుండగా తానొక్కడు మాత్రము సంసారమున బడుటకు హేతువెద్దియని మిక్కిలి ప్రౌఢముగా గంభీరముగా భక్తుడు పల్కినాడు ॥౪౦॥

వ్యగ్రస్సమగ్రశక్తే, దాసజనానుగ్రహః క్వాసౌ
భవతో యతో న మాంప్రతి, సంప్రతి కరుణాయతే చేతః ॥౪౧॥

అర్థ:—సమగ్రశక్తే = అనంతశక్తి సంపన్నా! వ్యగ్రః = ఆతురత గల్గినట్టి, అసౌ = ఈ, దాసజనానుగ్రహః = భక్తజన రక్షణప్రీతి క్వ = ఎచ్చోటబోయినది? యతః = ఎందువలన, భవతః=నీయొక్క, చేతః = చిత్తము, సంప్రతి = ఇపుడు, మాంప్రతి = ననుగూర్చి, నకరుణాయతె = దయగలదగుట లేదో?

తా. అగాధ శక్తిసంపన్నుడవగు నో మహేశా! నీవు కరుణాసాగరుడవనియును, స్వయముగ బ్రేరితుడవై భక్తుల ననుగ్రహింతువనియును, సకల వేదశాస్త్ర పురాణములు జెప్పుచున్నవి. ఇది తథ్యమగునేని నన్నేల కాపాడుట లేదు? నీ జాలిగల గుండె యిపుడు మారిపోయినదా! ॥౪౧॥

శ్వేతహితాయ కృతాంతం, కృతవానసి భస్మసాద్యయా సహసా
సా తవ భగవన్ కరుణా, నిష్కరుణా మయి కథం జాతా ॥౪౨॥

అర్థ:—భగవన్ = పరమేశ్వర, శ్వేతహితాయ = శ్వేతునకు హితమొనర్చుటకై, యయా = దేనిచేత, కృతాంతం = యముని, భస్మసాత్ = బూడిదపాలు, కృతవాన్ = చేసినవాడవు, అసి = అయ్యున్నావో! తవ = నీయొక్క, సా = ఆ, కరుణా=దయ, మయి= నాయందు, నిష్కరుణా = నిర్దయగా, కథం=ఎట్లు, జాతా=అయ్యెను?

తా. శంకరా! శ్వేతునకు హితము జేయబూని యే దయతో యమబాధను దొలగించితివో, ఆ దయయే నాయందేల జూపవు? దానిని నిర్దయగా నా కొరకే మార్చితివా?

వి. మల్హణస్తోత్రపు ౧౧వ శ్లోక విశేషమును చూడవలెను. ॥౪౨॥

పాపాః పాపఘ్నానాం, కృపణాః కరుణార్ద్రచేతసాం మహతాం ।
తరుణాః కరుణాక్షేత్రం, భవాదృశాం మాదృశా ఏవ ॥౪౩॥

అర్థః—పాపాః = పాపాత్ములును, కృపణాః = దీనులును, తరుణాః = అల్పులును, అగు, మాదృశా ఏవ = నాబోంటులే, పాపఘ్నానాం = పాపమును బోగొట్టువారును, కరుణార్ద్రచేతసాం = దయతో గరిగెడు గుండెగలవారును, మహతాం = మహాత్ములును అగు, భవాదృశాం = తమబోంట్లకు, కరుణాక్షేత్రం=దయాపాత్రము.

. తా. ప్రభూ! పాప విధ్వంసకులును, దయామయులును, ఘనులును అగు తమబోటివారు; పాపాత్ములును, అజ్ఞులును, దీనులును అగు నావంటివారి పైననే దయజూపుట పరమోపయుక్త మని మనవి చేయుచున్నాను. ॥౪౩॥

దీనం దయార్ద్రహృదయా - స్త్రాయంతే త్వాదృశా ఉపేత్య విభో ।
త్వంతు మయి యాచమానే, న త్రాతా చిత్రమేతదహో ॥౪౪॥

అర్థః—విభో = సర్వవ్యాపకా, దయార్ద్ర హృదయాపి= కృపచేత కరగిన మనస్సు గలిగినట్టి, త్వాదృశాః = నీబోంట్లు, దీనం = అనాథుని, ఉపేత్య = పొంది, త్రాయంతే = రక్షించుచున్నారు. తు= అయితే, త్వం = నీవు, మయి = నేను, యాచమానే=ప్రార్థించుచున్నను, నత్రాతా = రక్షకుడ వగుటలేదు, అహో = ఆహో, ఏతత్ = ఇది, చిత్రం = విచిత్రము.

తా. సర్వేశ్వరా! జాలిగలవారైన నీవంటి మహాత్ములు సొంతముగనే దీనులుండుచోటు జేరి వారిని రక్షించుచుండుట లోకవిదితము. కాని నీవు మాత్రము నీ సన్నిధిజేరి మొరపెట్టుకొనుచున్నను కాపాడుట లేదు. ఇది విచారింపగా కడుంగడు -చోద్యముగా నున్నది. (స్వయముగ దానము చేయువారు, యాచకులు ఎదురుగా వచ్చినను పెట్టకుండుటయా?) ॥౪౪॥

నైషా కృపా కృపావన్, పరమేశ! విశేషవృత్తితా యేయం ।
దీనేషు దయావంత - స్సంత స్సామ్యేన వర్తంతే ॥౪౫॥

అర్థః—కృపావన్ = కృపగల్గినట్టి, పరమేశ = ఓ మహేశ్వరా,

యా=ఏ, విశేషవృత్తితా = కొందరియందుమాత్రి ముండినట్టి, ఇయ మేషా=ఈఈ, కృపా = దయ, న = కాదు. దయావంతః =కృపగల, సంతః = పెద్దలు, దీనేషు = బీదల విషయమున, సామ్యేన = సమ ముగా, వర్తంతే = నడచుకొనుచున్నారు.

తా. కరుణార్ణవా! కొందరయందుమాత్రిమే దయగల్గి యుద్ధ రించినచో నది దయయే కాదు. మహానుభావులు సర్వదీనులనుగూడ ఒకే దృష్టితో జూడవలసియుండును. అనేక పూర్వభక్తులను నీవు రక్షించినావనుట నిజమే కాని నను గాపాడనిచో సహజకారుణికుడ వను నీ బిరుదము నిలువజాలదు. ॥౭౭॥

తవ దాసభావ మపున - ర్దాస్యాయైవం వదంతి యది సంతః
లోభహతకస్య దాస్యం, తదిహ మమాద్యాపి నాథ కథం ॥౭౮॥

అర్థః—నాథ = ప్రభూ, తవ = నీయొక్క, దాసభావం = కింకరత్వము, అపునర్దాస్యాయ = మరల దాసత్వము రాకుండుటకై, ఏవం = ఇట్లు, సంతః = సత్పురుషులు, వదంతి యది = నుడువుచో, లోభహతకస్య = పాడులోభము గలట్టి, మమ = నాకు, తత్ = ఆ, దాస్యం = దాసత్వము. ఇహ = ఇక్కడ, అద్యాపి = నేటికిని, కథం= ఎట్లు? (సంభవించును?)

తా. ఈశ్వరా! నీ కైంకర్య మొనర్చి ధన్యులైన వారిని నీవు సారూప్యముక్తి నొసగి యుద్ధరింతు వనియును, వారికి మరల నెన్నడును దాసత్వము జేయు పని అనగా పునర్జన్మ కలుగదనియును వేదాంత వేత్తలు వచించు చున్నారు. కాని నాకు నీ దాస్యమునందే చెడ్డ ఇష్టము కలదు. ఇట్టి దుర్గతిలోనున్నను నీ దాస్యము నెపు డనుగ్రహింతువో తెలియకున్నది. (దాసులకు సారూప్యము నిచ్చు మహోదారుడ వగు నీవు సామీప్య ముక్తినైనా అనుగ్రహించి నీ సేవలో నుంచు కొమ్మని భావము.) ॥౭౮॥

అద్య శ్వోవా మరణం, త్రాణం త్వత్తో నమేఽస్తి గతిరన్యా।
భ్రామ్యతి తామ్యతి తృట్యతి, ముహ్యతి శుష్యతి చ మమ చేతః॥౭౯॥

అర్థః—అద్య = నేడు, వా = అథవా, శ్వః = రేపు, మరణం =

మృత్యువు, (కానున్నది) త్రాణం = రక్షణము, త్వత్తః = నీయొద్దినుండియే! మే = నాకు, అన్యా = వేరైన, గతిః = దిక్కు, నాస్తి = లేదు. మమ = నాయొక్క, చేతః=హృదయము, భ్రామ్యతి = తిరుగుచున్నది, తామ్యతి = అలసిపోవుచున్నది. తృట్యతి = తెగుచున్నది, ముహ్యతి = మూఢమగుచున్నది. చ=మరియు, శుష్యతి=శుష్కించుచున్నది.

తా. దేవదేవా! నా మృత్యువు నేడో రేపో కానున్నది. నీవు దప్ప మరియొక దిక్కులేదు. ఇది ముమ్మాటికి నిక్కువము. ఇక నా చిత్తము చంచలతనందుచు, పొగలుచు, వగచుచు, మూర్ఛిలుచు, తుత్తునకలగుచు, శోషించుచున్నది. స్వామీ! రక్షింపుము రక్షింపుము.

వి. ఈ స్తోత్రమును మిక్కిలి యనన్యమనస్కుడై కవి విరచించినట్లున్నది. ఇంతకంటెను కరుణాక్రందన ముండనేరదు. ఇట సర్వము శివార్పితముగ నెంచి దేహమును చచ్చుగా భావించినాడు. ॥౪౭॥

ధరణితలే న కళేవర - మేతన్మే లుఠతి కాష్ఠవద్ యావత్।
తావ త్ప్రసీద సీదతి, నహి తే శరణాగతో జగత్ ॥౪౮॥

అర్థ:—యావత్ = ఎంతలో, మే=నాయొక్క, ఏతత్=ఈ, కళేవరం = బొంది, కాష్ఠవత్ = కట్టెవలె, ధరణితలే = భూమిపై, నలుఠతి = పొరలదో, తావత్ = అంతలో, ప్రసీద = ప్రసన్నుడవు కమ్ము, హి = అదియోగ్యము, జగతి = జగమున, తే = నీయొక్క శరణాగతః=శరణము జొచ్చినవాడు, నసీదతి=నాశము నొందుటలేదు.

తా. మహాదేవా ! ఈ నా శరీరము ఇకమీద త్వరగా కట్టెవలె భూమిపై పడి పొరలాడనున్నది. నీకు దయగలదేని ఈ యపస్మారము రాకపూర్వమే నాకు ప్రసన్నుడవుకమ్ము. నిను శరణముబొందిన వానికి నాశము లేదని వినుటవలన నింతగా ఆశించుచున్నాను ॥౪౮॥

ఆవిశతి వివశమేత, చ్చేతో యావన్న మోహపాతాళం।
తావత్ ప్రసీద సీదతి, న హి తే శరణాగతో జగతి ॥౪౯॥

అర్థ:—ఏతత్ = ఈ, చేతః = మనస్సు, వివశం = వశము తప్పినదై, యావత్ = ఎంతలో, మోహపాతాళం = మూఢత్వ మనెడు

గుంటలో, నావిశతి = చేరుకొనుటలేదో, తావత్ = అంతలో, ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము, జగతి = ఇహమున, తే = నీయొక్క, శరణాగతః = శరణుబొందినవాడు, నహిసీదతి = నష్టుడగుట లేదు.

తా. స్వామీ! ఇకమీద నాయీ చేతనము వశముగాక అజ్ఞానగర్తమున బడిపోవనున్నది. జాగుసేయక ప్రత్యక్షము కమ్ము, నిను బొందిన వానికి దుర్గతి లేదని కదా పెద్దలు చెప్పిరి. ॥౪౯॥

ఆక్రంద ఇందుమౌళే, గళతి గళాదేవ దేవ యావన్మే।
తావత్ ప్రసీద సీదతి, న హి తే శరణాగతో జగతి ॥౫౦॥

అర్థ:—ఇందుమౌళే = చంద్రచూడా! దేవ = ఈశ్వరా! యావత్ = ఎంతలో, మే = నాయొక్క, గళాత్ = కంఠమునుండి, ఆక్రందః = విలాపధ్వని, గళతి = జారిపోవుచున్నదో, తావత్ = అంతలో, ప్రసీద = కనుపడుము, జగతి = లోకమున, తే = నీ, శరణాగతః = శరణుబొందిన వాడు, న సీదతి = నష్టపడుట లేదు.

తా. రాజముకుటా! నా కంఠమునుండి నిను బిలుచుశక్తిగూడ నశింపనున్నది. తడయక కనుపడుము. నిను గొలిచిన వారికి కొరతలేదని కదా ప్రసిద్ధి.

వి. ఈ శ్లోకము కొన్ని ప్రతులలో లేదు. ఆక్రందశబ్ద ప్రయోగము గూడ ననుమానము గలిగించుచున్నది. ప్రక్షిప్తమగునేమో! ॥౫౦॥

ధనినో ధనేన ధన్యా - స్సేవంతే త్వాం గుణైశ్చ గుణినోఽపి
ఏతత్తు భక్తిమాత్రం, సర్వస్వం మే గృహాణ విభో ॥౫౧॥

అర్థ:—విభో = నాథా! త్వాం = నిన్ను, ధన్యాః = ధన్యులైనట్టి, ధనినః = శ్రీమంతులు, ధనేన = ధనముచేతను, చ = మరియు, గుణినః = గుణవంతులు, గుణైరపి = సుగుణములచేతను, సేవంతే = సేవించుచున్నారు. మే = నాకు, ఏతత్ = ఈ, భక్తిమాత్రం = భక్తియొకటియే, సర్వస్వం = సకలధనము. గృహాణ = స్వీకరింపుము.

తా. ఈశ్వరా! ఘనులైన ధనవంతులు ధనమును వెచ్చించి రాజోపచారములచేతను, పుణ్యులైన గుణవంతులు సుజ్ఞానమువలనను

శౌచశాంతి శమదమాదులచేతను నిను సేవించి మెప్పించుచున్నారు. నే నన్ననో ధనము గలవాడను, గుణముగలవాడను కూడ కాను నీ పదభక్తి మాత్రమే నాయొద్ద కలదు. ఇదియే నా సకలధనము. దీనినే స్వీకరించి సంతుష్టుడవు కమ్ము. ॥౫౧॥

పాపాత్మకోఽయ మితి మయి, విజుగుప్సాం మాకృథా జగన్నాథ ।
జగతి న తదస్తి పాపం, హరతి న య త్తేంఽఘ్రిసంస్మరణం ॥౫౨॥

అర్థ:—జగన్నాథ=జగదీశా! అయం = వీడు, పాపాత్మకః = పాపిష్ఠుడు, ఇతి = ఇట్లని, మయి = నాయందు, విజుగుప్సాం=హేయతను, మాకృథాః = చేయకుము. తే=నీయొక్క, అంఘ్రిసంస్మరణం = చరణస్తుతి, యత్ = దేనిని, నహరతి = హరింపజేయదో, తత్ =అట్టి, పాపం = కిల్బిషము, జగతి=పృథ్వియందు, నాస్తి = లేదు.

తా. లోకేశ్వరా! నేను పాపాత్ముడ నని తిరస్కరింపవలదు. నీ చరణస్తవన మొనర్పవలయునే కాని, అది పోగొట్టజాలని పాప మొకటి యీ జగమున కలదా! (సర్వదోషములు సర్వేశ్వరస్మరణతో నశించియే తీరవలె నని భావము) ॥౫౨॥

హుతవహనిచయో హిమతాం, తుహినం దహనత్వమేతు కదాచిదపి ।
నతు తవ చరణస్మరణం, మోఘమమోఘస్మృతేర్భవతి ॥౫౩॥

అర్థ:—కదాచిత్ =ఒకవేళ, హుతవహనిచయః = అగ్నిసమూహము, హిమతాం = శీతలత్వమును, తుహినం = హిమము, దహనత్వం = అగ్నిత్వమును, ఏతు = పొందుగాక! తు=అయితే, అమోఘస్మృతేః = సఫలమైన స్తోత్రముగల, తవ = నీయొక్క, చరణస్మరణం = పదధ్యానము, మోఘం = నిష్ఫల మైనట్టిది, న = కాదు.

తా. ప్రభూ! పూర్వసుకృతము లేనివాడ నగు నా స్తవము వ్యర్థ మందు వేమో? అగ్నిరాశి యొకవేళ చల్లనగు గాక, హిమమే యగ్ని యగుగాక! స్మరించు భక్తులకు అత్యవశ్యముగా ఫలముల నను గ్రహించు నీయొక్క పాదస్మరణము మాత్రము ఎన్నటికిని నిష్ఫలము కాదు. (ఎట్టి పాపాత్ము డైనను నామస్మరణముతో కడతేరు నని భావము.)

వి. కలియుగమునందు నామస్మరణమే ముక్తిదాయక మని ఇప్పుడిప్పుడు కొందరు గ్రహించి ప్రచారము సేయుచున్నారు. ఇట్టి తత్త్వమును వేల వత్సరములకు పూర్వమే ఈ కవి గట్టిగా చాటినాడు. ||౨౩||

దివమధిరోహతు ధరణీ, తారానికరోఽపి లుఠతు భూమితలే,
నతు తవ చరణస్మరణం, మోఘమమోఘ స్మృతేర్భవతి ||౨౪||

అర్థ:—ధరణీ = భూమి, దివం = ఆకాశమును, అధిరోహతు = ఎక్కుగాక, తారానికరోఽపి = నక్షత్రరాశికూడ, భూమితలే = భూమిపై, లుఠతు = పొరలుగాక! అమోఘస్మృతేః = సఫలమైన స్మరణ గల, తవ=నీ, చరణస్మరణం తు = పదస్తుతి మాత్రము, మోఘం = నిష్ఫలమైనది, న = కాదు.

తా. ఒకవేళ కాలవశమున భూమి యాకాశముగా మారినను, చుక్కలు భూమిపై రాలినను; అగుగాక ! నీ చరణకీర్తనము మాత్ర మెన్నటికిని నిస్సారము కానేరదు. నీవు స్తుతి నంది ప్రత్యుపకార మొనర్చుట ప్రసిద్ధము గదా స్వామి ! ||౨౪||

ముఖకమల మభిముఖం కురు, దేహి వచో జలదనాదఘనఘోషం।
యత్తు సదాభయదానం, భీతేషూచ్చై స్సముచ్చరసి ||౨౫||

అర్థ:—ముఖకమలం = ముఖపద్మమును, అభిముఖం=సమ్ముఖముగా, కురు = చేయుము, జలదనాద ఘనఘోషం = మేఘధ్వనివలె గంభీరమైన రవముగల, వచః = వాక్కును, దేహి = ఈయుము, భీతేషు = భయగ్రస్తులైనవారి విషయములో, అభయదానం = అభయదానమును గురించి, సదా=ఎల్లప్పుడు, యత్ =దేనిని, ఉచ్చైః= పెద్దగా, ఉచ్చరసి = పల్కుచున్నావో !

తా. మహేశ్వరా ! భయగ్రస్తులైన వారినిగూర్చి సదా ఎట్టి అభయవాక్యమును "భయపడకుము, రక్షింతును" అను నట్టిదానిని గట్టిగా బల్కుచుందువో, అట్టి మేఘధ్వనివలె గంభీరమైన వాక్కు నొక్కపరి పలుకుము. నీ సుందరవదనారవిందమును నా వంక ద్రిప్పి దర్శనభాగ్యము నను గ్రహింపుము. ||౨౫||

విజ్ఞాపయామి కింవా, నాథ బహు త్వాం కృతాంతభయభీతః।
నాజ్ఞాతం తే కించి- న్మద్భక్తేరాత్మశక్తేశ్చ ॥౩౯॥

అర్థ:—నాథ=ప్రభూ! కృతాంతభయభీతః = యమబాధోపహతుడనైన (నేను) త్వాం=నినుగూర్చి, బహు=ఎక్కువగా, కింవా = ఏమని, విజ్ఞాపయామి = విన్నవింతును? తే=నీకు, మద్భక్తేః=నాభక్తియొక్కయు, చ = మరియు, ఆత్మశక్తేః = నీశక్తియొక్కయు (స్వరూపము) కించిత్ = కొంచెముగూడ, అజ్ఞాతం = తెలియనిదిగా, న = లేదు.

తా. స్వామీ! నిను గూర్చి నాలో నెట్టి భక్తికలదో, నను రక్షించుటకు నీలో నెట్టి శక్తికలదో, వీని స్వరూపమును నీకు నివేదింపవలసిన పనిలేదు. సర్వము నెరిగియే యున్నాడవుకదా! ఒకవైపు మృత్యువు నా వెన్నంటి పీడించుచున్నది. భయగ్రస్తుడనైన నేను ఎక్కువగా నెట్లు విన్నవింతును?

వి. ఈ పైన వచ్చిన శ్లోకముల నన్నింటిని జూడగా మలయరాజు నిక్కవముగా మరణబాధ ననుభవించినాఁడా యన్నట్లు తోచును. ౧౫వ వత్సరము వంటి అల్పాయువున మరణము సన్నిహిత మగుట వలననే, ఇట్టి కరుణాక్రందన స్తోత్రముతో శివుని ప్రసన్నుని గావించికొని, దీర్ఘాయుష్యమును పొంది మలయరాజు జీవించి యుండవచ్చును. ॥౩౯॥

ఇతి తరుణకరుణ ముచ్చైః, కృపణ స్యాక్రందితం మమాకర్ణ్య।
నాథ తథా కురు కృపయా, కృపణేషు యథోచితం త్వత్తః॥ ౪౦॥

అర్థ:—నాథ = స్వామీ, కృపణస్య = దీనుడనైనట్టి, మమ= నాయొక్క, ఇతి = ఇవ్విధమైన, ఉచ్చైః = పెద్దదైన, ఆక్రందితం = రోదనపురొదను, తరుణకరుణం = నూత్నమైన దయతో కూడినట్లుగా, ఆకర్ణ్య = విని, త్వత్తః = నీనుండి, కృపణేషు = దీనులయెడ, యథా = ఎట్లు, ఉచితం = యోగ్యమో, తథా=అట్లు, కృపయా = దయతో, కురు = చేయుము.

తా. ప్రభో! నా యీ ఘోరదైన్య విలాపమును క్రొంగ్రొత్త దయతోగూడినవాడవై (అధికదయగలవాడవై) ఆలకించి, నిక్కముగా నేను ఎట్టి దైన్యమున గ్గి యున్నాడనో గమనింపగోరుచున్నాడను.

తర్వాత ఇట్టి దీనునకు ఎట్టి యనుగ్రహ ముచితమైనదో నిర్ణయించి కృపతో నుద్ధరింపుము. ॥౫౭॥

జగతి తవశక్తి రతులా, సకలజగద్ఘస్మరా యయా సపది।
కాలోఽపి లీలయైవం, నయనానలశలభతాం నీతః ॥౫౮॥

అర్థ:—జగతి = లోకమున, తవ=నీయొక్క, శక్తిః = సామర్థ్యము, అతులా=అసమానమైన, సకలజగద్ఘస్మరా = నిఖిలలోకముల భక్షించునట్టిది. యయా=దేనిచేత, సపది=తత్ క్షణమున, లీలయా = ఆటతో, కాలోఽపి=యముడును, ఏవం=ఇట్లు, నయనానలశలభతాం= నేత్రాగ్నిలో కీటత్వమును, నీతః = పొందింపబడెనో.

తా. మహారుద్రా! నీ రౌద్రశక్తి సామాన్యమైనది కాదు. అది సమస్తలోకములనుగూడ గిట్టింప సమర్థమై యున్నది. ఇదియే నిక్కము గానిచో సమస్త లోకములను శిక్షించు సామర్థ్యము గల యమ ధర్మరాజును బహు సులభముగా నీ కంటిమంటతో మిడుతను వలె భస్మీకరింతువా!

వి. పరమ శివభక్తుడైన మార్కండేయుని యముడు బలాత్కారముగా గొంపోవు నపుడు శివుడు లింగగర్భావిర్భూతుడై మార్కండేయుని గాపాడి; కాలుని గాల్చివైచె నని పురాణ ప్రసిద్ధి కలదు. కాముని బరిమార్చినపుడు కామారి యనియు, కాలుని గర్వ మడంచినందున కాలారి యనియు శివునకు సార్థక నామము లేర్పడెను.॥౫౮॥

కులిశం కుసుమతి దహన- స్తుహినతి వారాంనిధి ర్ధ్రువం స్థలతి।
శత్రు ర్మిత్రతి విషమ- ప్యమృతతి శివేతి ప్రలపతో భక్త్యా ॥౫౯॥

అర్థ:—భక్త్యా = భక్తితోడ, శివేతి = శివ శివయని, ప్రలపతః = విలపించు వానికి, కులిశం= వజ్రము, కుసుమతి=పుష్పము వలె నగును, దహనః = అగ్ని, తుహినతి = మంచువలె నగును, వారాంనిధిః = సముద్రము, ధ్రువం = స్థిరముగా, స్థలతి = నేలవలె నగును, శత్రుః = వైరి, మిత్రతి = మిత్రుడువలె నగును, విషమపి = విషము కూడ, అమృతతి = అమృతమువలె నగును.

తా. మహేశ్వరా! అనన్య భక్తితో శివశివ యని నిను ధ్యానింప వలయునే కాని, అట్టి భక్తునకు భయము గలదా! పడుగువచ్చి పడి

నను పువ్వువలె నుండగలదు. మంటలు సైతము మంచుగడ్డవలె చల్ల బడి పోగలవు. సముద్ర మెదురైనను గట్టి పడి భూమిగా మారగలదు. శత్రువు మిత్రునివలె నుండగలడు. ఎక్కువగా చెప్పనవసరము లేదు. విషముకూడ అమృతము కాగలదు.

వి. ప్రాచీనులైన శివభక్తుల చరిత్రలలో నిట్టి సంఘటనలు కనుపడుచున్నవి. ఉపమన్యు మార్కండేయాదులు తప మొనర్చు నపుడు వారిపై పిడుగులు పడినను దహింపలేదు. అర్జునుడు శివభక్తుడు కావున నతనిపేరు వినగానే పిడుగు స్తంభించును. శ్రీపతిపండితారాధ్యుడు అగ్ని నరచేతిలో బెట్టుకొని పట్టు బట్టలో కట్టి వైచెను. అగస్త్యుడు సముద్రమును అచమన మొనర్చెను. శివభక్తి వలననే రాముడు కుంభకర్ణ వంటి శత్రుపక్షీయమిత్రుని సంపాదించెను. బసవేశ్వరుడు విషపాన మొనర్చి చల్లగా బ్రతికెను. ఈ సంగతుల నానా పురాణాదులలో గాన నగును. ॥౫౯॥

ఆర్త మనాథ మశరణం, దుస్తరభవభంగసాగరే మగ్నం।
ఉద్ధర రక్ష విలోకయ, పరిపాలయ మాం జగన్నాథ ॥౬౦॥

అర్థః—జగన్నాథ = లోకేశ్వరా! దుస్తర భవభంగ సాగరే= దాటనలవి గాని సంసారదుఃఖ మనెడు సముద్రమున, మగ్నం = పడి యున్నట్టియు, ఆర్తం = విపన్నుడ నైనట్టియు, అనాథం = అనాథుడ నైనట్టియు, అశరణం = దిక్కులేనట్టియు, మాం = నన్ను, ఉద్ధర = పైకెత్తుము, రక్ష = సంరక్షింపుము, విలోకయ = చూడుము, పరి పాలయ = పోషింపుము.

తా. జగదీశ్వరా! నేను అగాధమైన సంసారసముద్రమున బడి యున్నాను. పైకెత్తుము. విపన్నుడనైనాను; దానినుండి కాపాడుము. అనాథుడనై యున్నాను; కృపతో జూడుము. గతిలేనివాడనైనాను; పరిపోషింపుము. సర్వథా సర్వవిధముల నీవే నాపాలి దైవమవు ॥౬౦॥

యద్యనుచితం దయాళో, నాథ మయాక్రందితం కృతాంతభయాత్।
ఏతత్ క్షమస్వ భగవ- న్నార్తతయా కింను న క్రియతే ॥౬౧॥

అర్థః—దయాళో = కృపాళూ! నాథ = సామీ, భగవన్ = సర్వేశ్వరా! కృతాంతభయాత్ = యముని భీతివలన, మయా = నాచేత, యది = ఒకవేళ, అనుచితం = అయోగ్యముగా, ఆక్రం దితం = రోదనముచేయబడినదో, ఏతత్ = దీనిని, క్షమస్వ = క్షమిం

వుము, ఆర్తతయా = దుఃఖితుడగుటచేత, కింను = ఏమి, నక్రియతే= చేయబడదు?

తా. మహేశ్వరా! నేను యముని భయమువలన స్మృతి దప్పియున్నాను. అనుచితముగా నేమేని బల్కితినేమో! అట్టి దానిని కృపతో సైరింపుము. దుఃఖమున బడియున్నవాడు పల్కనిది కలదా!

వి. కొన్ని పుస్తకములలో మొదటిచరణమున "యదిద మనుచితం దయాళో" యని ౧౩ మాత్రల పాఠము కనుపడుచున్నది. అర్థముకూడ సమన్వయముగ లేదు. ౧౨ మాత్రలే యుండవలెను కావున మేమిచ్చిన పాఠమే సరియైనది. ఒకవేళ కవి యనుభయ గ్రస్తుడై చెప్పినాడు కావున తప్పుండవచ్చు నని సరిపెట్టుటకును వీలుగానున్నది. ॥౨౧॥

స్వల్పాభోగా భోగా, భంగీ ప్రియసంగమే గళత్యాయుః ।
చల మఖిల మిత్యవేక్ష్య, వ్రజతు జన శ్శంకరం శరణం ॥౨౨॥

అర్థః—భోగాః = సుఖములు, స్వల్పాభోగాః = అల్పమైన పూర్ణత్వము గలవి, ప్రియసంగమే=ప్రియమైన రతియందుకూడ, భంగీ= క్షణికమైన, ఆయుః = ఆయుష్యము, గళతి=జారుచున్నది, అఖిలం= సమస్తము, చలం = చంచలమైనది, ఇతి = ఇట్లు, అవేక్ష్య = కనుగొని, జనః = సజ్జనుడు, శంకరం = కల్యాణకరుడైన, శివుని, శరణం= శరణమును, వ్రజతు = పొందుగాక !

తా. సుఖము లెల్లను అల్పావకాశములు గలవిగా నున్నవి అత్యపేక్షతో సంపాదించుకొనిన సంగమాదులును క్షణికములే! ఆయుష్యమా, ప్రతిక్షణము గతించి పోవుచున్నది. ఇటు లేది విచారించినను సర్వము నశ్వరముగా దోచుచున్నది. వివేకవంతు లీ రహస్యము నరసి పరమకల్యాణధాముడైన శివుని శరణు జొచ్చెదరుగాక ! ॥౨౨॥

ఆర్తేన మలయనామ్నా, విజ్ఞప్తోఽసౌ మయా జగన్నాథ ।
శర్వ స్సర్వార్తిహర స్తేన స్యాత్ సర్వలోకానాం ॥౨౩॥

అర్థః—జగన్నాథ = జగదీశా, ఆర్తేన=పీడితుడైన, మలయనామ్నా = మలయరాజను పేరుగల, మయా = నాచేత, అసౌ = ఈ ప్రయోజనము, విజ్ఞప్తః = ప్రార్థింపబడినది, తేన = అందుచేత,

సర్వలోకానాం = సమస్తజనులయొక్క, సర్వార్తిహరః = నిఖిల దుఃఖములను హరించువాడై, శర్వః = శర్వుడను సార్థకనామము గల వాడవు, స్యాత్ = కావలెను.

తా. మిక్కిలి దుఃఖపీడితుడనై మలయరాజను పేరు గల నేను శివుని ప్రార్థించిన దేమనగా:— శర్వుడు అనగా సమస్త దుఃఖము లను హరించువాడు అను నర్థము కలదు; కావున ఆ పరమశివుడు సర్వ లోకముల సర్వదుఃఖములను హరించువాడై శర్వుడను సార్థకనామధారి కావలెను. (తనను రక్షింపని దే సర్వరక్షణము సంభవింపదు కావున శర్వశబ్దమును నిల్పుకొనవలె నన్నను తన్ను గాపాడవలె నని ధ్వని)॥౬౩॥

శశభృదివ శీతలత్వం, శివదేవ శివస్వభావ ఏవ త్వం।
అభ్యర్థతాం ప్రయాతః, కష్టం మన్మందపుణ్యతయా ॥౬౪॥

అర్థ:—శివదేవ=శంకరా! శీతలత్వం = శీతలత్వమును గూర్చి, శశభృదివ = చంద్రునివలె, శివస్వభావ ఏవ = మంగళకరస్వభావము గలవాడవేయగు, త్వం = నీవు, మన్మందపుణ్యతయా = నాయొక్క మందభాగ్యతచేత, అభ్యర్థతాం = యాచనీయత్వమును, ప్రయాతః = పొందినవాడవైతివి. కష్టం = కష్టము గదా!

తా. చంద్రుని గూర్చి శీతలత్వము ననుగ్రహింపు మని వేడ నక్కరలేదు. అది యాతని స్వభావసిద్ధమైన గుణమే! అటులే పరమే శ్వరా! నీవు స్వభావసిద్ధముగనే శివంకరుడవై యున్నావు. ఐనను నేను మందభాగ్యుడనగుటవలన (అనగా నా కింకను శుభము లందనందున) నాచేత వేడబడితివి గదా! అయ్యో కష్టము కదా! (నీవు నిత్యకల్యాణ ప్రదుడవైనను నన్నొక్కని వదలినచో శివత్వమునకు మాత్రము లోపము రాదా యని జిజ్ఞాస) ॥౬౪॥

యా కుపిత కృతాంతముఖ - త్రస్తానాం జగతి భవతి గతిరేకా।
తాం భక్తవత్సల విభో, నమామి శంభో భవద్భక్తిం. ॥౬౫॥

అర్థ:—శంభో = సుఖనిలయా, భక్తవత్సల = కింకరప్రియా, జగతి = ప్రపంచమున, యా = ఎద్ది, కుపితకృతాంతముఖత్రస్తానాం= క్రుద్ధుడైనట్టి యముని ముఖము వలన భయమును నొందిన

వారికి, ఏకా = ముఖ్యమైన, గతిః = ఆధారమో, విభో = సర్వ వ్యాపకా, తాం = అట్టి, భవద్భక్తిం = నీభక్తిని, నమామి = నమస్కరించుచున్నాను.

తా. సర్వాంతర్యామీ! శంభో! కాలుని యమలోకనములో మరణబాధ ననుభవించుచున్న యార్తులకు ఎద్ది ముఖ్యమైన ఆశ్రయమై వెలుంగుచున్నదో, అట్టి నీయొక్క పరమ పావనమైన భక్తికి జోహారు లాచరించుచున్నాను.

వి. భగవద్భక్తియే పరమతారకమని కవి ఘోషించినాడు. ॥౬౫॥

విద్యా యౌవనమాయుః, ప్రియస్య సంగో విభూతిరారోగ్యం ।
యుగపదపి సులభమేత - న్నపునరుదారా భవద్భక్తిః ॥౬౬॥

అర్థ:—విద్యా=చదువు, యౌవనం = యువత్వము, ఆయుః= ఆయుష్యము, ప్రియస్య = ఇష్టకరమైన వస్తువుయొక్క, సంగః = సహవాసము, విభూతిః=ఐశ్వర్యము, ఆరోగ్యం = ఆరోగ్యము, ఏతత్= ఇది యంతయు, యుగపదపి = ఒకేమారు, సులభం = సుఖముగా దొరకునదిగా నున్నది, పునః = మరియు, ఉదారా = గొప్పదైన, భవద్భక్తిః = నీయొక్క భక్తిమాత్రము, న (సులభా) = సులభమైనదికాదు.

తా. వేదవేదాంగాది విద్యలు, తారుణ్యము, దీర్ఘాయుస్సు, ప్రియకాంత, ఐశ్వర్యము, ఆరోగ్యము మొదలైన నీ సర్వవిషయములును ఒకేసారి కావలయునన్నను దొరకగలవు. కాని నీయపూర్వమైన భక్తిభావము మాత్రము అందరకు సులభముగ పుట్టుటలేదు. (అది యున్నచో సర్వము సులభమని భావము.) ॥౬౬॥

తేన త్వామేవ విభో, యాచే తాం దుర్లభాం భవద్భక్తిం ।
విఫలా దాతరి న త్వయి, వాంఛావల్లీవ కల్పతరౌ ॥౬౭॥

అర్థ:—విభో = శంభో, తేన = ఆ కారణముచేత, తాం = అట్టి, దుర్లభాం = అలభ్యమైనట్టి, భవద్భక్తిం = నీయొక్క భక్తిని యాచే=యాచించుచున్నాను, దాతరి = మహోదారుడవగు, త్వయి=

నీయందు, వాంఛా = అభీష్టము, కల్పతరౌ = కల్పవృక్షమునందు, వల్లీవ = తీగవలె, విఫలా = నిష్ఫలమైనది, న = కాదు.

తా. పరంధామా! నీ భక్తియే సర్వాధారమై యున్నది. కావున అట్టి యలభ్యమైన నీయొక్క భక్తినే అనుగ్రహింపుమని వేడుకొనుచున్నాను. మహాదాతవగు నీ యందు నా మనోరథము తప్పక సఫలము కాగలదనియే నమ్మినాను. కల్పవృక్షము నాశ్రయించినట్టి తీగకు పండ్లకొదువ యుండునా! ॥౬౭॥

త్వన్నామ యథా సులభం, భగవన్ భూతేశ మాదృశస్యైవం।
మచ్చేతః ప్రార్థయతే, తామేతాం దుర్లభాం భవద్భక్తిం ॥౬౮॥

అర్థ:—భగవన్ = పరమేశా! భూతేశ=లోకేశ్వరా! మాదృశస్య = నాబోటివానికి, త్వన్నామ = నీపేరు, యథా=ఎట్లు, సులభం= సులభమో! (తథా=అట్లు), మచ్చేతః = నామానసము, తాం=ఆ ప్రసిద్ధమైన, ఏతాం = ఈ, దుర్లభాం = కష్టముతో పొందదగిన, భవద్భక్తిం = నీయొక్క భక్తిని, ప్రార్థయతే = ప్రార్థించుచున్నది.

తా. సర్వభూతపతీ! నాబోటి యల్పునకు ఎటులో నీ నామము సులభమైనది. (నీ యనుగ్రహము వలననే కావచ్చును.) అట్లే నా కలభ్యమై యున్న నీభక్తినిగూడ ప్రసాదించి యుద్ధరింపుమని నాచిత్త మెదురుచూచుచున్నది. ఇదియె నాయాచన. ॥౬౮॥

జాతస్య దేవభవనే, తిర్యగ్యోనౌ మనుష్యయోనౌ వా।
సా మే సదైవ భూయాత్, త్వయి భక్తిరచంచలా భగవన్ ॥౬౯॥

అర్థ:—భగవన్=దేవదేవా! దేవభవనే = దేవతలయింటగాని, వా=అథవా, తిర్యగ్యోనౌ = జంతుజాతిలోగాని, మనుష్యయోనౌ = మనుష్యజాతిలోగాని, జాతస్య = పుట్టినట్టి, మమ = నాకు, త్వయి = నీయందు, సా=ఆ, అచంచలా=నిశ్చలమైనట్టి, భక్తిః=భక్తి, సదైవ = ఎల్లప్పుడును, భూయాత్ =ఉండు గాక!

తా. మహేశా! నను ముక్తుని గావించినను సరియే, లేదా దేవలోకమున, అథవా మానవులలో లేక జంతువులలో బుట్టించినను

నరియే కాని; నీయందు మాత్రము నిరంతరముగా ఆ దృఢమైన భక్తిని ఉండునట్లు అనుగ్రహింప వేడుచున్నాను.

వి. నక్క కుక్క పిల్లి గుడ్లగూబలు సైతము శివభక్తివలనను, శైవుల సంపర్కము వలనను శివలోకము జేరి ముక్తి బొందినట్లు అనేక ప్రాచీన ప్రమాణములు గలవు. ॥౭౯॥

షడ్వర్గవిపినకృంతన- సన్నిశితకుఠారధారా యా
సా మే సదైవ భూయాత్, త్వయి భక్తిరచంచలా భగవన్ ॥౮౦॥

అర్థ:—భగవన్ = దేవా! యా = ఏభక్తి, షడ్వర్గ...ధారా, షడ్వర్గ = కామక్రోధాదులనెడు, విపిన = అడవిని, కృంతన = ఛేదించుటలో, సన్నిశిత = మిక్కిలి పదునుగల, కుఠార = గొడ్డలియొక్క, ధారా = మొనయో, త్వయి = నీయందు, మే = నాకు, సా = ఆ, అచంచలా = నిశ్చలమైన, భక్తిః = భక్తి, సదైవ = ఎల్లపుడును, భూయాత్ = ఉండుగాక!

తా. స్వామీ! కామక్రోధ లోభ మోహ మదమత్సరములనెడు కాననమును భేదించుటయందు ఏ భక్తి పదునుగల గొడ్డలివంటిదో, అట్టి నిశ్చలమైన నీ భక్తి నాకు సదా కల్గునట్లు అనుగ్రహింపుము. ॥౮౦॥

యా పరమజ్ఞానాంకుర- సంవర్ధనవిమలబహుళజలధారా ।
సా మే సదైవ భూయాత్, త్వయి భక్తిరచంచలా భగవన్ ॥౮౧॥

అర్థ:—యా=ఏభక్తి, పరమ.....ధారా, పరమ = అత్యధికమైన, జ్ఞాన = సుజ్ఞానమనెడు, అంకుర = మొలకను, సంవర్ధన = పెంచుటయందు, విమల = నిర్మలమైన, బహుళ = పూర్ణమైన, జలధారా=ఉదకధారయో, సా=ఆ, అచంచలా = నిశ్చలమైనట్టి, భక్తిః= భక్తి, భగవన్=ఈశ్వరా, త్వయి = నీయందు, మే=నాకు, సదైవ = ఎల్లకాలమును, భూయాత్ = ఉండుగాక!

తా. ఏభక్తి నిశ్చయజ్ఞాన మను అంకురమును పోషించుటలో నిర్మలమైనట్టియు, సమర్థమైనట్టియు, ఉదకమువలె నున్నదో, స్థిరమైన ఆ భక్తి నీపై నాకు సదా కలిగియుండుగాక. ॥౮౧॥

శైవజననయనశశిమణి- నిష్యందనవిమలకౌముదీ యా,
సా మే సదైవ భూయాత్, త్వయి భక్తిరచంచలా భగవన్ ॥౭౨॥

అర్థః— యా = ఏ భక్తి, శైవ...కౌముదీ, శైవజన = శివభక్తులయొక్క, నయన = నేత్రము లనెడు, శశిమణి = చంద్రకాంత శిలలయొక్క, నిష్యంద = స్రవణమునకు, విమల = ధవళమైన, కౌముదీ = వెన్నెలయో, సా = అట్టి, అచంచలా = నిశ్చల మైనట్టి, భక్తిః = భక్తి, భగవన్ = ఈశానా, త్వయి = నీయందు, మే=నాకు సదైవ = అనవరతముగాను, భూయాత్ = ఉండుగాక!

తా. పరమేశా ! ఏ భక్తి ధవళమైన వెన్నెలవలె శివభక్తుల నేత్రము లనెడు చంద్రకాంతశిలలనుండి ఆనందబిందువుల స్రవింప జేయుటలో సమర్థమైనదో, అట్టి శాశ్వతమైన నీ భక్తి నాకు సర్వదా లభించుగాక !

వి. మొదలు తన దైన్యమును, తరువాత మరణభయమును శివునకు దెల్పి వేడికొన్నను; స్తోత్రాంత్యమున ఐదుశ్లోకములలో మిక్కిలి దృఢముగా అనన్యమైన శివభక్తినే ప్రార్థించినాడు. దైన్యమునుండి భక్తిలోకి బుద్ధి మారుట సాత్త్వికలక్షణము. అనన్యమైన భక్తి యున్నచో ఎట్టి ఘోరబాధలనైనను ఎదిరించి శివధామమును అవశ్యముగా భక్తుడు చేరుకొనగలడు. దీనివలన స్తోత్రపాఠము జేయువారు ముఖ్యముగా భక్తి నలవరచుకొనవలె నని యొక గుణపాఠము నేర్పబడినది ॥౭౨॥

ఇతి రచయతి స్మ భగవత, ఇందుకలాశేఖరస్య మలయాఖ్యః
భక్త్యై భక్తిస్తోత్రం, భవే భవే భక్తిమే వాప్తుం ॥౭౩॥

అర్థః—ఇతి = ఇట్లు, మలయాఖ్యః = మలయరాజను పేరుగల శివభక్తుడు, భవేభవే = ప్రతిజన్మమునందును, భక్తిమేవ = శివభక్తినే, ఆప్తుం = పొందుటకు, భగవతః = పరమేశ్వరుడైనట్టి, ఇందుకలాశేఖరస్య = చంద్రచూడుడైన శివునియొక్క, భక్తిస్తోత్రం = భక్తిప్రతిపాదకమైన స్తవమును, రచయతిస్మ = విరచించెను.

తా. ఈ ప్రకారముగా మలయరాజు సర్వజన్మములందును శివభక్తినే పొందవలెనని సర్వదేవతాసార్వభౌముండును, షడుణైశ్వర్య

సంపన్నుండును, చంద్రికళాధరుండును అగు పరశివునియొక్క సాత్త్విక భక్తి ప్రతిపాదక మగు నీ స్తవమును విరచించెను.

వి. ప్రథమశ్లోకమున "శివుడు వాక్కులకగోచరుడు కావున ఎట్లు వర్ణించుట" యని సందేహమును గలిగించిన ఈ మలయరాజశివాచార్యుడు; శివుడు తన యెదుట ప్రత్యక్షమై నిలిచినాడా యన్నంత స్ఫూర్తి గలిగినట్టియు, సరససాత్త్విక భక్తితోఁగూడినట్టియు, ఈ సరళమైన శివస్తవమును సమర్థముగా విరచించి, భక్తుల నుద్ధరించుటకై పరమేశ్వరుడు సాకారత్వము పొందు ననియును, సగుణోపాసనయే సాధ్య మనియును గంభీరముగా చాటినాడు. ॥౭౩॥

ఇది శివపంచస్తవీ భక్తరంజనీ వ్యాఖ్యానమున
మలయరాజస్తవము సమాప్తము.

---

ఓం.

# ౪. ఆంధ్ర మలయరాజస్తవము

## శ్రీ బండారు తమ్మయ్యగారు

క. శ్రీమన్మంగళ వితరణ,ధామా! శివ! సోమ! క్షణవిదారితకామా!
భీమా! యుమాసమాశ్రిత,నామా! మోక్షార్థిసేవన పరంధామా.

గీ. మరణభయమున మును నిను మలయరాజు
డెబ్బదియురెండు నార్యల నిబ్బరముగ
సంస్తవము చేసి యుష్మత్ప్రసాదగరిమ
మృత్యువు జయించి యాయుస్సమృద్ధిఁ గాంచె.

మ. శివపంచస్తవగుచ్ఛమం దొకటియై చెన్నొందు నా మేటి సం
స్తవ మాంధ్రీకరణం బొనర్చి తవ పాదద్వంద్వముం బూన్చితిన్
భవనాశంబుగ నందిగోత్రజుఁడ నే బండారు వంశోద్భవుం
డవు నా లింగన జ్యేష్ఠసూనుఁడను తమ్మాభిఖ్యసంకేతుఁడన్.

మ. మరణం బొందుచు జన్మముం బొరయు నా మర్యాద లోకానకున్
బరిపాటిం జను నీదు నాజ్ఞ మృతి యన్నన్ జన్మ మన్న న్నొకే
కరణి న్నే గణియింతు నెప్డు నను నీ గర్భంబునం జేర్చుచున్
గరుణన్ రెంటిని నాకుఁ బోనడపుమా కైవల్యసంధాయకా!

గీ. సతతమును భక్తితోడ నీ కృతిని జదువు, భక్తజనములను మరణభయవిముక్తి
మలయరాజును బలె మన్చి మహితకృపను, నాయురారోగ్యవిభవులఁ జేయు దేవ!

ఉ. ఏని గ్రహింపఁగా మదికి నేని యసాధ్య మటంచు నెంతు ర
వ్వాని నొకించు కేనియును వాక్కుల వర్ణనసేయ నౌనె? య
ట్లైనను నేను బూనితి నహా! యెపు డందులకో యగమ్యా! యెం
దైన మనోరథంబు చొర నట్టి ప్రదేశము లుండ నేర్చునే? ౧

మ. సకలేశా! కరుణాకరం బయి జరాజన్మప్రణాశాది రూ
పక సంసారమహార్ణవప్లవముగా భాసిల్లు జ్ఞానక్రియా
త్మక శక్తిద్వయమైన తావకపదద్వంద్వంబె దిక్కంచుఁ ద
ప్పక విశ్వాసముతో [illegible] మనోవాక్కాయకర్మంబులన్. ౨

ఉ. సర్వ మెఱుంగువాఁడ వని సర్వజగంబులయందు నంతటం
బర్వి వెలుంగు మేటి శ్రుతిమంతుఁడ వంచును నిన్ను సజ్జనుల్
సర్వవిధంబులన్ స్తుతులు సల్పుచునుందురు గాన నేమియున్
నేర్వని నాదు పేదనుతి నీవు వినంగనగున్ మహేశ్వరా! ౩

చ. శరణము రక్షకంబు గతి సంశ్రయ మౌచును నెల్లప్రాణులన్
నిరతముఁ బ్రోచు నేత వని నిన్ను వచింతురు, భూతనాథ! నీ
పరమకృపారసంబునకుఁ బాత్రము సేయుచుఁ గొంత నీ క్షమన్
గరుణను నాయెడం బఱపఁ గార్య మటంచును విన్నవించెదన్. ౪

ఉ. జనుల హితంబు గూర్చుటకు సాధనమై యెవఁ డష్టమూర్తియై
తనువుల నెన్మిదింటిఁ బరదత్తము చేసెనొ? యా కృపాపరున్
నినుఁ బ్రభుఁ గాక తక్కొరుని నెమ్మది నమ్ముచు మోసపోయి యే
జనుఁడు వరించు నద్యతనజన్మమునన్ శరణంబు నొందఁగన్. ౫

ఉ. దక్షిణభావతత్పరత దాసులఁ జూచుచు నిగ్రహత్వ సం
ధుక్షణవామభావమున దుష్టుల మన్మథునిం గృతాంతునిన్
వీక్షణ సేయునట్టి గుణవిశ్రుత! దేవ! యొకింత సేపు నీ
దక్షిణవామనేత్రముల దాసజను న్ననుఁ గానవే దయన్. ౬

శా. పాతాళంబున కేఁగినన్ ద్రుతగతిన్ స్వర్గంబునుం జొచ్చినన్
భీతిన్ దూలుచు నా దిగంతములకున్ వేవేగఁ బర్వెత్తినన్
జేత్రోదైన్యము డించి మిత్తివలనం జేడ్పాటుఁ దప్పించు నా
త్రాతల్ వేఱొక లేరనన్యగతికున్ రక్షింపు మృత్యుంజయా! ౭

ఉ. సాధన మేమి లేమిఁ దవసన్నిధిఁ జేరెదు నన్నుఁ గాలుఁ డన్
వ్యాధుఁడు వెంటనంటి తన పాశముచేతను నీడ్చుచుండె నా
బాధల కేడ్చుచున్న నను, బాశము నాశ మొనర్చి, యో జగ
న్నాథ! భయంబు వాపి శరణంబు నొసంగుచుఁ బ్రోవవే వెసన్. ౮

చ. మరణము చేరువై మఱియు మార్గముఁ దప్పి చరించు ఖిన్ను నే
శరణము లేక యాంధ్యవివశం బఱి నేలను వ్రాలు నన్ను స
త్వరముగ లేవనెత్తి దయ వర్ధిలగా నభయం బొసంగు మో
పరశివ! నీదు పాదములపైఁ బడి వేడుచునుంటి దీనతన్. ౯

చ. చలనము నొంది గాలికిని జాలఁగఁ దూలెడు తామరాకుపై
జలకణమున్ బలెన్ మిగులఁ జంచలమై నశియించు నాయు వా
తల మఱి యెట్లు నే మరలఁ దావకభక్తిని జెంద నేర్తు? ని
శ్చలముగ నాదు ప్రాణములఁ జప్పున నిప్పుడె నిల్పుమా ప్రభో! ౧౦

ఉ. ఎంతటి పాపశీలయుతుఁ డేనియు శత్రుఁడు తాను బ్రాణము
న్నంతముఁ జేసినంత విడనాడును నింద్రియశత్రుషట్క మా
వంతయు నట్లుగాక మఱి ప్రాణిని జచ్చినఁ గూడ వీడకే
వంతలఁ బెట్టు నిట్టి యరివర్గము నాది వధింపు మీశ్వరా! ౧౧

చ. పకపక నవ్వి యొక్కపుడు పాటలు పాడి మఱొక్కమాఱు వే
ఱొకపరి యేడ్చి నెమ్మదిగ నుండి మఱొక్కపు డాగ్రహించుచున్
వికటముగాను నాశ యను వీఱిఁడి దయ్యము సోఁకుచేత నేఁ
దికమక లొందుచుంటిఁ గడ తేర్పుము వేగమ దాని దేవరా! ౧౨

చ. భవమరుభూమిఁ ద్రిమ్మరుటఁ బాటిలు తృష్ణను బాధితుండనై
యవయుచు నుంటి నయ్య! యది యాఱదు నీదు మనఃప్రసాదమున్
దవిలినఁ గాని; కావునను దాని నొకింత యనుగ్రహించి యా
నొవులును మాన్పి దీనుని ననున్ గరుణింపుము దేవ! మ్రొక్కెదన్.

చ. భవ మను పాడునూతఁ బడి వావిరి నేఁ దపియింపఁ జూచి ప్రా
భవమున లేచి రాగ మను పన్నగ మిట్టె గ్రసింపఁ బూనె నో
శివ! భవనాశ! యార్తిహర! శీఘ్రమె నా కవలంబ మిచ్చి యం
ధువు వెలిఁ జేర్చుచున్ గరుణతో ననుఁ బ్రోచి సముద్ధరింపవే. ౧౪

ఉ. వేనిని నద్వితీయుఁ డని వేమఱు వేదము లెల్లఁ జెప్పనో
యా నిను ద్వైతభావమున నక్కట! చూచెద నద్విలోకన
జ్ఞానము శూన్యమైన కతనన్ శివ! దీనికి హేతువైన య
జ్ఞానతమంబుఁ బోనడఁచి సత్త్వము నాకు ననుగ్రహింపవే. ౧౫

చ. వెఱపును గొల్పి లోకముల వేఁచెడు కాలభుజంగదంష్ట్రినాఁ
బరఁగిన తృష్ణచేత బహుభంగుల దష్టములైన ప్రాణులన్
బురహర! నీవుగాక విషముక్తులఁ జేయ నెవండు చాలు, న
త్వరముగ నా విషం బుడిపి ప్రాణముల న్నిలుపంగదే ప్రభో! ౧౬

ఉ. వారణ సేయవే శివ! యవారితమైన మదీయ మోహ మన్
దారుణఘోరరోగము, సనాతనవైద్యుఁడు వైద్య మీవె య
వ్వారిగ రెండు నాదు వని వర్ణన సేయరె నిన్నుఁ గోవిదుల్
తారక మీవుగాక మఱి తక్కొరుఁ డెవ్వఁడు ప్రాణికోటికిన్? ౧౭

చ. హర! హరియింపు నీదు కరుణామృతపూరితవృష్టితోడ దు
ర్భరనరకాగ్నికీలపరివారసముద్గతమైన తాపమున్
వరద! భవత్ప్రసన్నత వినా గతి వేఱొకఁ గానవచ్చునే
మఱి మఱి యెందుఁ జూచినను మాదృశతీవ్రతరార్తకోటికిన్? ౧౮

ఉ. కారుణికాగ్రగణ్య! ననుఁ గన్గొని నీ కరుణార్ద్రదృష్టి ను
ర్వారభవోగ్రదుఃఖమహితవాహశిఖాపరితప్తమై మహా
ఘోరతరార్తిఁ గ్రాగి కడుఁ గుంగెడు నా హృదయంబు వేగఁ జ
ల్లారఁగఁ జేయవే యభవ! యార్తశరణ్య! దయాపయోనిధీ! ౧౯

చ. తవచరణాబ్జపీఠసవిధంబున వ్రాలు ననాథు నంఘునిన్
శివ శివ! దేవదేవ! నను శీఘ్రమ కావుము కావుమా ప్రభో!
కవయుచు మీఁదిమీఁదికిని గ్రుక్కొన మృత్యువు నన్ గ్రసింపఁగా
దివురుచు వచ్చుచున్న దదె తేకువ దానిని బాఱఁద్రోలుమా. ౨౦

చ. అతికృపణున్ భయార్తుని ననన్యశరణ్యునిఁ గాలకింకర
ప్రతతికృతప్రహారపరిబాధితుఁ బాశవశీకృతున్ ననున్
గతియును రక్షకంబు నయి గావవె వేగ పరిత్యజింపకో
పతితజనావనా! పరమపావన! సేవకలోకరక్షణా! ౨౧

చ. శరణము నేన నేన యని స్వాంతమునందున నమ్మి నమ్మి నా
శరణము వేఁడి వేఁడి మమసన్నిధిఁ జేరు ననన్యచిత్తులన్
మరణభయార్తి నా మఱువు మచ్చికఁ జొచ్చెడు వారిఁ బ్రోవ నే
వరదుఁడ నేన యన్ ప్రతిన భంగమొనర్పకు దేవ! నా దెసన్. ౨౨

మ. ధరయం దంతట నిండి నిండి సకలాంతర్యామి వైనట్టి యో
పరమాత్మా! శివ! నీ వెఱుంగ వెటు మద్భావంబు నిన్గాక యే
పరమున్ స్వప్నమునందు నైనను దలంపం బోవ దంచున్ మతే
ల! రహిం జూడక నన్నుఁ బ్రోవ నిటు లాలస్యంబు గావింపఁగన్.

ఉ. సర్వ మెఱుంగుచున్ సకలశక్తిసమేతుఁడవై జగంబులన్
సర్వము నిండు శర్వ! శివ! సర్వగ! నీవ ననుం ద్యజించినన్
సర్వము శూన్య మైనటులె నా కిఁకఁ ద్వాదృశదీనపాలనా
ధూర్వహుఁ డెందుఁ గల్గు ననుఁ ద్రోయఁగ దీనుని నీకు న్యాయమే?

చ. ఎవనిని వేఁడువాఁడ నిపు డేనికడన్ విలపింతు నీవు న
న్నవన మొనర్పవే యని యనన్యశరణ్యుఁడఁ బుణ్యహీనుఁడన్
ఎవని సమాశ్రయింపఁగను నేగతి నేఁగెదఁ గన్నతండ్రి! వీ
వ వల దటంచుఁ ద్రోయ మఱి వాటిలునే గతి యొందుచోటులన్.

ఉ. కార్యము దీనులందును బ్రకామముమై దయఁ జూపి ప్రోవఁగా
నార్యుల కంచు నీవు మరియాద నొనర్చితి వార్యులందు నిన్
వర్యునిఁ గా గణింతురు విపర్యయ మొందదె దేవ! దీనతా
ధుర్యుని నన్నుఁ గావకయ త్రోసిన నీ మరియాద యంతయున్.

చ. బడుగగు నా పయిన్ దయను బాయు కతంబున నాథనాథ నే
నడిగెదఁ జెప్పవే వినెద నందువె నే బహుపాపి నంచు హా
యడుగుల మీఁద వ్రాలిన భయార్తునిఁ దాము మహాత్ము లెప్పుడున్
విడువగ నెంతురే శరణు వేఁడినవానిని నెట్టి పాపినేన్! ౨౬

చ. కరుణకు నాకరం బగుచుఁ గ్రాలుచు సర్వగతుండవై శుభం
కర శివనామధేయమును గల్గి సమస్తము నీవ ప్రోవ నే
కరణిని బ్రాపు నాకు మఱి కల్గెడు దిక్కులయందు నీ కృపన్
బఱుపక పాయఁ ద్రోసినను బాపవినాశన! దీనరక్షణా! ౨౭

మ. నిను సేవించిన దుఃఖ మొందుట యెటో నిన్గాక వేఱొక్క వా
నిని సేవించిన సౌఖ్య మబ్బుట యటే నిక్కంబు కాఁబోవు రెం
డును నే పట్టున నమ్మనే మదిని మూఢుండైనఁ దా నగ్ని చం
ద్రునియందున్ హిమ మగ్నియందు దయ మొందుం జూడుమంచాడినన్.

చ. గతి మఱి నీవె యంచు మది గట్టిగ నమ్మి భవత్పదంబులన్
నతుఁడయి యేడ్చు దీనుని ననాథునిఁ గావక మిన్నకున్నచో
నతులిత మైన నీదు శరణాగతవత్సలతాయశంబు దా
హతమయి పోద్దె దేవ! నను సాద్మృతి నీయవె [illegible] ౩౦

చ. అనయము వేడివేడి కడుఁ బ్రార్థన సేయక నీ ప్రసాదమున్
గనుట యశక్య మన్న నది కల్లయగా మది నే గణించెదన్
తనువులు పెక్కు దాల్చి బహుధా జగదర్థము నీవు తోఁచు టె
వ్వని నుతిపైని జేసితి? స్వభావమె నీకెపు డిట్టి కార్యముల్. ౩౧

చ. చిరతరసేవనంబులను జేయకయే యొక యింతమాత్రనే
కరుణను జూపి కావ వనఁ గాదనియే యది నే వచింతు స
త్వరముగ గుర్క్క యొక్కటియు పాన మొనర్చినయంతనే జరా
మరణ విహీనతన్ గొలుప మానునె తా నమృతంబు కొంతయేన్.

ఉ. తుష్టిని గూర్చి లోకములఁ దోరముగాఁ గృపఁ బ్రోతు వాత్మసం
తుష్టుఁడ వైనచో నని బుధుల్ వచియింతురు దేవ! నీవు సం
తుష్టిని జెందుపట్టునను దుఃఖము నెక్కొనియుంట మెచ్చుటన్
దృష్టము గాదు పూర్వము మఱెప్డు వినంబడ లే దొకింతయున్. ౩౩

ఉ. వంతల నెల్లఁ బాపు భగవంతుఁడ వీవు నిరంతరంబు నా
స్వాంతమునందు నుండఁగను బాపురె! దుఃఖము నన్నుఁ జేరి యా
వంతయు నుండ నౌనె యుదయాద్రిపయిన్ భగవంతుఁడైన భా
స్వంతుఁడు తోఁచుచుండఁగను బాయక చీఁకటి నిల్వ నొప్పునే.

చ. ఎచట మహాత్ము లొక్క క్షణమేని వసింతురొ యన్ని యాపదల్
అచట నశించు నంచు బుధు లాడుచునుందురు గాని దేవ! నీ
వచలత నిల్చి నా హృదయమందునె యుండఁగ నేమి చిత్రమో
ప్రచలన మొందకే ప్రబలి క్రమ్మెడు నాపయి దుఃఖ మెంతయున్.

ఉ. దారుణదుఃఖవేదనను దగ్ధము నైనదివోలె నెంతయున్
దారితమైన నా హృదయధామమునన్ విఫలత్వ మొందుచున్
కోరిక పేరి కల్పలత క్రుంగె సమూలముగాను నీ కృపా
సారముచేత దానిని వెసన్ మొలకెత్తఁగఁ జేయవే ప్రభూ! ౩౬

చ. ఎలమి సమస్తలోకములు నెవ్వని యిచ్ఛయె కారణంబుగాఁ
జెలఁగుచుఁ దాము వర్తిలునొ సృష్టియు రక్షణ నాశ మొంది యా
యలఘుతరప్రభావుని సమక్షమునందునె దుఃఖ మిట్లు న
న్నలమి గ్రసించు, హా హతుఁడ నైతిని గర్మము నోర్వ శక్యమే!

చ. శరణము నాకు నీ చరణసారసమే యని నమ్మియుండినన్
హరణము నొందదయ్యెఁ గట! యార్తి మదీయము తత్క్షణంబ నన్
బరమనికృష్టుఁడంచు నిఁక భావనసేయుదు రైన నేమి నీ
చరణము నెప్పుడున్ విడువఁజాలను నింద్యుఁడ వంద్యుఁడైననన్.

ఉ. కామిత మొందనైతిఁ గట! కష్టుఁడ కించనుఁడైతి నేను జిం
తామణి నొందియున్ శుభనిధానము సేవకకల్ప మార్తర
క్షామణియౌ సదాశివుని సన్నిధిఁ జేరియుఁ గాంచనైతి నన్
బ్రామిన మృత్యుభీతిని నివారణ సేయఁగ మందభాగ్యుఁడన్. ౩౯

చ. అనుపమశక్తియుక్తు లయి యార్యులు నీ పదభక్తు లెల్లరున్
మనుపగ ముజ్జగంబుల సమర్థతఁ జూపిరి పాపియౌ నకిం
చనుఁడను నేనొ సంసృతిని జాలిని దూలుచు బేలనౌచుఁ గ్ర
క్కున పడుచుంటి నక్కట! యకాలపుమృత్యువు నోటి యందునన్.

చ. పరమకృపానుభావమున భక్తులఁ బ్రోవ సమగ్రశక్తి త
త్పరతలు నీకుఁ గాక మఱి తక్కొరుఁ డేనికిఁ గల్గు దేవ! నీ
కరుణను నా పయిం బఱపగా నిటు వ్యగ్రత చూప వేల? నీ
వరవుఁడ నన్ను బ్రోవునెడ భావ్యమె యిట్టు లుపేక్ష సేయఁగన్.

ఉ. శ్వేతుని ప్రాణరక్షకయి చేసితి భస్మముగాఁ గృతాంతు నా
డాతనియందుఁ జూపిన దయారస మిప్పుడు వట్టిపోయె నే
భీతిని జేరి నీ శరణు వేడిన దీనునిఁ గావకుండఁగా
నే తఱినైన నుంటివె? యదేలొకొ నిర్దయఁ జూప నాదెసన్. ౪౨

ఉ. పాపుల, భీతమానసుల, బాలుర, దీనుల, మాదృశావళిన్
బాపవినాశదక్షు లగు త్వాదృశసత్కరుణార్ద్రమానసుల్
తాపములన్ హరింపుచు సదా కృపఁ జూపుచు నేలుచుండ నా
పాప మదేమొ! నీవు ననుఁ బాలన సేయక యున్నకుండఁగన్. ౪౩

చ. కనుగొను మాత్రి దీనులను గారుణికోత్తములౌ భవాదృశుల్
మనను కరంగి జాలిని వెలార్చుచుఁ బ్రోతు; రదేమి కర్మమో
నినుఁ బలుమారు వేడినను నీకు ననుం దయఁజూచి యేలఁగా
మనము జనింపకున్నయది మాన్యతమా! యది నీపరీక్షకా! ౪౪

చ. ఎపుడో విశేషవృత్తిమెయి నెవ్వనినో దయఁజూచి ప్రోచి యె
ల్లపుడును నట్టివారలను నన్యుల నారయకున్న దానికిన్
గృప యను పేరు చెల్లునొకొ కీర్తితులైన మహాత్ము లెవ్వఁడున్
గృపణులపైఁ గృపం బఱపి యెల్లర నోమెద రొక్కరీతిగన్. ౪౫

ఉ. దాస్యము నీయెడ న్నెఱపఁ దప్పు మఱొక్కెడ నెక్కడం బున
ర్దాస్యము లేదటంచు బుధరాజి వచించుట నిక్కమేని నీ
దాస్యమునందు లోభమును దత్పరతం గల నాకు దీనతా
దాస్య మ దేల? యిప్పటికిఁ దప్పకయుండఁగ నిట్టు లీశ్వరా? ౪౬

ఉ. ఈ దినమందొ రేపొ నను మృత్యువు దాఁ గబళింప నున్నచో
నేది మఱొక్క దిక్కు నను నీవ గ్రహింపుచుఁ గావకున్నచో
ఛేదన మొంది నా మనము చింతను గుంగి భ్రమించి శోష దాఁ
బాదుకొనంగఁ దెల్విఁ జెడఁ బాయుచు మూర్ఛ మునుంగు నిత్తఱిన్.

ఉ. దారువువోలె నా తనువు ధారుణిపైఁ బడి వ్రాలునంతలోఁ
గారుణికాగ్రగణ్య! ననుఁ గావఁగ వేగ నను గ్రహింపవే
వారని భక్తి నీ చరణవారిజమున్ శరణంబు నొందు నె
వ్వారికినైన నాశము నివారితమౌఁ గద యెట్టిపట్టునన్. ౪౮

ఉ. తీఱని విక్లబత్వమునఁ దెళ్ళుచు మోహరసాతలంబునన్
గూరకమున్న నా మనము గోడును మాన్పి సముద్ధరింపవే
వారని భక్తి నీ చరణవారిజమున్ శరణంబు నొందు నె
వ్వారికినైన నాపద నివారితమౌఁ గద యెట్టిపట్టునన్. ౪౯

ఉ. ఘోరున నాగళంబున సముద్గతమౌచును రోదనంబు వె
ల్వారకమున్న దేవ! కృప వర్ధిలఁగా ను నాదరింపవే
వారని భక్తి నీ చరణవారిజమున్ శరణంబు నొందు నె
వ్వారికినైన దుఃఖము నివారితమౌఁ గద యెట్టిపట్టునన్. ౫౦

చ. ధనములు గల్గి వర్ధిలెడు ధన్యులు గొల్వ ధనార్పణంబులన్,
గొనములు గల్గు నుత్తములు గొల్తురు నిన్ను గుణార్పణంబునన్,
ధనగుణహీనుఁడన్ గల పదార్థము నాకొక భక్తిమాత్రమే,
యనయము నీకు దానినె సమర్పణ చేసెదఁ గావుమా ప్రభో. ౫౧

ఉ. వీఁడొక పాపశీలుఁ డని వెక్కసమొందు తలంపు నోడ నక్
వీడకు దేవ! నీ చరణనీరజ మెప్పుడు సంస్మరించుచున్
బాడుచు నీదు నామములు వర్తిలుచుండెడు నట్టి వారలన్
వీడుచు నెల్ల పాపములు వేగ నశింపక నిల్వ నేర్చునే. ౫౨

చ. అనలసమూహ మొక్కపుడ యైన హిమత్వము నొందవచ్చుఁ, దా
ననలతఁ జెందవచ్చును నొకప్పుడయేని హిమంబు, గాని యెం
దును బ్రతి లేక నీచరణతోయజసంస్మృతి యెల్ల వేళలన్
మునిజనసేవ్య! వేమఱు నమోఘఫలంబుల నీయకుండునే. ౫౩

చ. కనుఁగొన ధారుణీతల మొకానొకవేళ నభంబు నెక్కి ని
ల్చిన నిలుఁగాక, తారకలు చిత్రముగా భువి వ్రాలుఁగాక, యెం
దును బ్రతి లేక నీచరణతోయజ సంస్మృతి యెల్లకాలమున్
మునిజనవంద్య! వేమఱు నమోఘఫలంబుల నీయకుండునే. ౫౪

మ. కనుగొమ్మా! నను నీ ముఖాబ్జ మిటు వంకం ద్రిప్పి గంభీరమే
ఘనినాదంబునఁ బల్కుమా! శివ! భయగ్రస్తుల్ నినున్ భీతి డా
సిన వే దగ్గఱఁ జేర్చి వారిని భయోత్సేకంబుఁ బోకార్చుచున్
గనవే బిగ్గఱగాను నీ యభయవాగ్దానంబు గావింపుచున్. ౫౫

చ. యమునిభయమ్ముచేతఁ గడునార్తుఁడ నేనిఁక నింతకన్న నే
మి మఱియు విన్నవింపఁగల? మృత్యువు నోర్చిన దేవ! నీదు శ
క్తిమహిమ నీపదంబులనె దిక్కని నమ్ముచు నే ననన్యచి
త్తమున భజించు భక్తిగతితత్త్వము సర్వము నీవెఱుంగవే. ౫౬

చ. తరుణుఁడ నార్తుఁడన్ బహువిధంబుల నేఁ బలవింతు నిట్లు సో
త్కరుణముగాను, దాని విని ధర్మమదెట్టులొ యిట్టిపట్ల నా
వెరవునఁ జేయు మయ్య కృప వేవురు దీనులఁ బ్రోచియున్న నీ
వెఱుగవె నేఁడు చేయఁదగు కృత్యము నాదెస నార్తరక్షణా. ౫౭

చ. జగతిని నీదు శక్తికిని సాటి మరొక్కటి యెందు నున్నదే
జగముల నిట్టి కాల్పఁగను జాలెడు నట్టిది నీదు కిన్కఁ దాఁ
దెగి పడఁజేయు టబ్బురమె తీవ్రతరంబుగఁ గాలు లీలమై!
సెగ కనుమంట [illegible] జేయుచున్. ౫౮

మ. *"పవి పుష్పంబగు, నగ్ని మంచగు, నకూపారంబు భూమిస్థలం
బవు, శత్రుం డతిమిత్రుఁడౌ, విషము దివ్యాహారమౌ, నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివే త్యాభాషణోల్లాసికిన్
శివ! నీ నామమె సర్వవశ్యకరమౌ నిత్యంబు భక్తాళికిన్." ౫౯

చ. శరణము లేక యెచ్చటను జాలిని దూలు ననాథు నార్తు దు
స్తరభవభంగసాగరవిశంకటవీచినిమగ్ను నన్ను ను
ద్ధరణము చేసి ప్రోవుమ! యుదారతమైఁ గృపఁజూచి యేలుమా
హరహర! యెవ్వరింక నను నారయు త్రాతలు నీవు గానిచోన్. ౬౦

చ. అదరుచు నిప్పు డిచ్చటఁ గృతాంతభయంబునఁ గానిరీతి నే
నెదొ విలపించియున్న నది యెల్లను నీవు క్షమింపుమా ప్రభో!
యెది యుచితంబొ చెడ్డ దెదొ యెందును నార్తు డెఱుంగఁజాలునే!
యుదితకృపానుభావమున నోర్వుమ నా యపరాధ మంతయున్. ౬౧

చ. స్థిరములు గావు భోగములు శీఘ్రగతి న్నశియించు నెప్పుడేన్
సరగున భంగ మొందుఁ బ్రియసంగమసౌఖ్యము లాయు వెప్పుడున్
గరము స్రవించునట్టిది జగంబున నన్నియుఁ జంచలంబులే
శరణము నొందుఁ డెల్లరును శంకరు నిట్టు లెఱింగి మానవుల్. ౬౨

ఉ. ఆర్తిని దూలునట్టి మలయాహ్వయుఁ డిట్టు వచించు సర్వలో
కార్తిహరుండవౌ కతన సార్థకమయ్యెను శర్వశబ్ద మో
యార్తశరణ్య! నీకు నని యట్టులు కావున వాని సర్వదుః
ఖార్తి హరించి సత్వరమ యాదృతి నేలుమ! ప్రోవుమా ప్రభో! ౬౩

---

* కులిశం కుసుమతి...…"అను దీని మూలశ్లోకమును ధూర్జటిమహాకవి యే విధమున మనోహరముగ ననువదించి, తన శ్రీకాళహస్తీశ్వరశతకమునఁ జేర్చికొని నాఁడు. ఆ భక్తాగ్రేసరు నందలి భక్తిగౌరవములచే నేను దీనికి మఱొక యాంధ్రీకరణ మొనర్పక యాపద్య మట్లే యిందు గ్రహించి "శ్రీకాళహస్తీశ్వరా" యను పద్య మకుటమునకు మాఱుగా "నిత్యంబు భక్తాళికిన్" అని మాత్రము కూర్చితిని. "తస్మై దేయం తస్మాద్గ్రాహ్యం" అను సూక్తిచొప్పున శివభక్తుల కిది యొప్పునని నా మనవి. విజ్ఞులు క్షమింతురు గాక – బం. త.

చ. శశికిని శైత్యమంబ లెను జర్గు శివత్వము నీకు నైజమై
శశిశకలావతంస! సహజంబ, శివంకరుఁడైన నీవు మా
దృశులను బ్రోవు టద్గకయు యిద్ది యెఱింగియు నాదు కర్మదు
ర్వశతను నిన్ను నీకరణిఁ బ్రార్థనచేసితి మందభాగ్యుఁడన్. ౬౪

చ. కనలు కృతాంతునాననము గాంచి భయంపడు ప్రాణికోటి కే
దనయము నొక్కటే గతియనై యభయంబు నొసంగి ప్రోచు నా
ప్రణుతభవత్ప్రసిద్ధపదభక్తికి నేను నమస్కరించెదన్
మునినుత! భక్తవత్సల! యమోఘఫలప్రద! మోక్షదాయకా!

ఉ. ఆయువు విద్య యౌవన మనామయ మిష్టఫలంబు భూతియున్
వేయును నిట్టిభాగ్యములు వేగమ చేకుఱు నేక కాలమం
దేయది లభ్యమైన నది యీశ్వర! నీపదభక్తి లోకమం
దేయెడ దుర్లభంబగుటయే కనిపించెడు నేమిచిత్రమో! ౬౬

ఉ. కావున నట్టి నీదు పదకంజసముత్సుక గాఢ భక్తియే
వావిరిఁ గూర్ప నాకు నినుఁ బ్రార్థనచేసెద నెల్లవేళలన్
దేవ! మహాప్రదాతవగు నీయెడఁ జేసిన వేఁడికోలు దా
నీవిని గూర్పకున్నె సురవృక్షమునందలి తీవె కైవడిన్. ౬౭

ఉ. పొంద నశక్యమయ్యు, మముబోంట్లకు నీ పదపద్మభక్తియే
కందువచే సుసాధ్యమయి కైవసమయ్యెడునో? యెఱుంగ నా
డెందము నిన్ను నెప్పుడు కడింది విధంబుల వేఁడు నో జగ
ద్వందిత! దేవదేవ! కృప దానిని నాకు ననుగ్రహింపవే. ౬౮

చ. పరువడి దేవ మర్త్యపశు పక్షిమృగాదుల నెందుఁ బుట్టినన్
మఱువక నీదు శక్తిమహిమంబుల, నీ చరణాబ్జయుగ్మమున్
శరణము నొంది నిన్నెపుడు శ్రద్ధను గొల్చు సదార్తభక్తి సు
స్థిరముగ నా మనంబున వసించెడుఁ గావుత మెల్లవేళలన్. ౬౯

చ. సరగునఁ గూల్చు నేది యరిషట్కము వేరి మహోగ్రకాననం
బురుతర విస్ఫులింగ భయదోత్కటసార కుఠారధారమై
పరఁగుచు నట్టి నీ చరణపంకజయుగ్మసమిద్ధభక్తి సు
స్థిరముగ నా మనంబున వసించెడుఁ గావుత మెల్లవేళలన్. ౭౦

చ. పరమఫలప్రదం బగుచు భాసిలు జ్ఞానము పేరి యుత్తమాం
కురమున కేది జీవనము గూర్చుచు నోమెను వర్షధారగా
వఱలుచు నట్టి నీచరణవారిజయుగ్మనవిూద్యభక్తి సు
స్థిరముగ నా మనంబున వసించెడుఁ గావుత మెల్లవేళలన్. ౭౧

చ. నిరతము నేది శైవజననేత్రములన్ శశికాంతసంతతుల్
కరము స్రవింపఁ జేసెడునొ కాంతతరోజ్జ్వల కౌముదీప్రభన్
వఱలుచు నట్టి నీచరణవారిజయుగ్మనిబద్ధభక్తి సు
స్థిరముగ నామనంబున వసించెడుఁ గావుత మెల్లవేళలన్. ౭౨

మ. ప్రతిజన్మంబునఁ జందశేఖర కృపాపాత్రైక సద్భక్తి సం
గతి సిద్ధింపఁగ దీనిఁ గూర్చె మలయాఖ్యన్ దాల్చు భక్తుండు సు
స్కృతభాషాస్తుతిగాఁ దిలింగవిషయశ్రీయంబు నర్థించి, చే
సితి నాంధ్రమ్ము పఠింప నిద్ది శుభముల్ చేకూర్చు నశ్రాంతమున్.

క. * యుగరస వసుశశి సంఖ్యలఁ, దగు శకసమ, నీకు నంకితముగా దీనిన్
నగజాధిప! రచియించితి, జగమం దీ కృతికిఁ గూర్పు శాశ్వతపదవిన్.

ఆంధ్రమలయరాజ స్తవము సమాప్తము.

---

(* శాలివాహనశకము ౧౮౬౪ క్రీ. శ 1942)

# శివపంచస్తవి

## ౪. అనామయస్తవము

తృష్ణాతంత్రే మనసి తమసా దుర్దినే బంధవర్తీ
మాదృగ్జంతుః కథ మధికరోతైశ్వరం జ్యోతిరగ్ర్యం
వాచ స్త్వేతా భగవతి హరే సన్నికృష్టాత్మరూపాః
స్తుత్యాత్మానం స్వయమివ ముఖా దస్య మే నిష్పతంతి ॥౧॥

అర్థ:—బంధవర్తీ=అవిద్యాపాశముతోఁగూడినట్టి, మాదృక్=నావంటి, జంతుః = ప్రాణి, తృష్ణాతంత్రే = దురాశచే నాక్రమింపబడి నట్టియు, తమసా = తమోగుణముచేత, దుర్దినే = అలముకొనబడి నట్టియు, మనసి = చిత్తమున, అగ్ర్యం = సర్వాధిక మైనట్టియు, ఐశ్వరం = ఈశ్వర సంబంధమైనట్టియు, జ్యోతిః=పరంజ్యోతిని, కథం = ఎట్లు, అధికరోతి = కనుచున్నది? తు = అయితే, ఏతాః = ఈ, వాచః = వాక్కులు, భగవతి=సర్వైశ్వర్య సంపన్నుండగు, హరే = పరమేశ్వరునియందు, సన్నికృష్టాత్మరూపా ఇవ = సంబద్ధములైనవా యన్నట్లు, స్తుత్యాత్మానం=స్తుతింపదగిన పరమాత్మవగు నినుఁగూర్చి, అస్య = ఈ, మే = నాయొక్క, ముఖాత్ = మొగమునుండి, స్వయం = స్వయముగా, నిష్పతంతి = బైలువెడలుచున్నవి.

తా. శ్రీ పరమేశ్వరుని దగు సర్వోన్నతమైన మహాప్రకాశ మును అవిద్యాంధకారముతోఁ గూడినట్టి నావంటివాని దురాశా భూయిష్ఠమైనట్టియు, తామసాక్రాంత మైనట్టియు మనస్సు ఎట్లు తెలిసికొనగలదు? ఐనను సర్వాంతర్యామియు సర్వకర్తయు నగు పరమేశ్వరుని గూర్చి ఈ స్తోత్రరూపమైన వాక్కులు శివునితో సంబంధించి యున్నవియా అనునట్లు నా ముఖమునుండి తమంతట తామే వెలువడుచున్నవి. (నా ప్రయత్నమువలనఁ గాని, పాండిత్యమువలనఁ గాని ఇవి రచితములు కాలేదని భావము)

వి. ఈ యనామయ స్తవమును విరచించిన దండి యను మహాకవి సంస్కృత వాఙ్మయములో సుప్రసిద్ధుడు. ఈతని కవిత్వమందలి పదలాలిత్యము "దండినః పదలాలిత్యం" అని పేరు వడసినది. భారతదేశమందలి వాయవ్యదిశనుగల ఆనందపురమున నీ కవి పూర్వపురుషులు నివసించుచుండిరి. వీరిది కౌశిక బ్రాహ్మణ కుటుంబము. నారాయణస్వామికి దామోదరుఁడను పుత్త్రుడుండెను. ఈతడే కిరాతార్జునీయాది మహాకావ్యముల విరచించిన భారవి కవి. ఈతనికి మనోరథను డను పుత్త్రుడు గల్గెను. మనోరథునకు వీరదత్తు డను కుమారుఁడుండెను. ఈతడు గౌరి యను నాతీరత్నమును వివాహమాడెను. వీరిరువురకు జన్మించినవాడే మన దండి మహాకవి. ఈ దండికవిప్రోక్తములగు దశకుమారచరిత్రము, కావ్యాదర్శము, ఛందోవిచితి, అవంతిసుందరి, కథాసారము అను నైదు గ్రంథములు నేటికి లభించి యున్నవి. కథాసారములో దండియే తన వంశపరిచయము గావించినాడు. ఈతని ముతుపతాత యగు భారవికవి శా. శ. ౪౯౭ (క్రీ. శ. 575) లో నున్నట్లు శిలా శాసనాది ప్రమాణములవలన దెలిసినది కావున దండికవి శా. శ. ౫౬౨ (క్రీ. శ. 640) లో నున్నట్లు పరిశోధకు లూహించుచున్నారు. ఈతనికి బాల్యమున తలిదండ్రులు చేసిన నామకరణము వేరే యుండుననియును, చేతిలో నెల్లపు డీత డొక దండమును బట్టుకొని యుండుటచే దండి యను పేరు వచ్చిన దనియును ఒకరు వ్రాసిరి. ఇందు కాధారము గనుపించుటలేదు.

"సర్వశాస్త్ర విశారదుడును; సర్వకవి శ్రేష్ఠుడును అగు ఈ దండికి కాలవశమున కుష్ఠరోగము సంభవించెను. ఔషధోపచారములవలన నది శాంతింపదయ్యెను. సూర్యనారాయణోపాసనను గూడ గావించెను. దానను ఆ వ్యాధి నివారణము కాదయ్యె. చిట్టచివరకు శివభక్తికి శరణాగతుఁడై మహాభక్తితో భవరోగవైద్యుడును, దేవాదిదేవుడును, భక్తవత్సలుడును, ప్రపంచకారణుడును, పరమేశ్వరుడును అగు శివపరబ్రహ్మమునుగూర్చి "తృష్ణాతంత్రే" అను శ్లోకము మొదలు ముప్పదొకటివరకు గల యీ యనామయ స్తవమును విరచించి తన కవిత్వముతోబాటు జన్మముగూడ ధన్యము గావించుకొనెను. పార్వతీపతి యగు పరశివు డీ స్తవమునకు ప్రసన్నుడై దండిని రోగముక్తునిజేసి పరమపదవి ననుగ్రహించెను" ఇట్లని ప్రాచీన గాథ కలదు.

ఈ స్తోత్రమందలి శ్లోకములు మందాక్రాంతములు. కాళిదాస మహాకవియొక్క మేఘసందేశము ఈ వృత్తములతోడనే విరచితమైనది. "మ, భ, న, త, త, గ, గ" ములును; నాల్గవ పదవయక్షరముల తరువాత యతియును ప్రతిచరణమున నుండవలెను. ఇదియే మందాక్రాంతము ॥౧॥

వేధా విష్ణు ర్వరుణధనదౌ వాసవో జీవితేశ
శ్చంద్రాదిత్యౌ వసవ ఇతి యా దేవతా భిన్నకక్ష్యాః ।
మన్యే తాసా మపి న భజతే భారతీ తే స్వరూపం
స్థూలే త్వంశే స్పృశతి సదృశం తత్పునర్మాదృశోఽపి ॥౨॥

అర్థ:—వేధాః=బ్రహ్మ, విష్ణుః=నారాయణుడును, వరుణధనదౌ= వరుణ కుబేరులు, వాసవః = ఇంద్రుడు, జీవితేశః = యముడు, చంద్రాదిత్యౌ = సూర్యచంద్రులు, వసవః = అష్టవసువులు, ఇతి = ఈ ప్రకారముగా, భిన్నకక్ష్యాః = వివిధవర్గములు గల, యాః = ఏ, దేవతాః = దేవతలు (గలరో) తాసాం = వారియొక్క, భారత్యపి = వాక్కు కూడా, తే = నీ యొక్క, స్వరూపం = స్వరూపమును, నభజతే = పొందుటలేదు (అని) మన్యే=భావించుచున్నాను. స్థూలే= పెద్దదైనట్టి, అంశేతు = స్వరూపమునందు మాత్రము, సదృశం = యోగ్యముగా, స్పృశతి = ముట్టుచున్నది, పునః = మరి, మాదృశోఽపి = నావంటివాడును, తత్ = దానిని (స్పృశతి = ముట్టుచున్నాడు.)

తా. దేవతలలో బ్రహ్మవిష్ణువులనియు, ఇంద్రాది అష్ట దిక్పాలకులనియు, అనలాది అష్ట వసువులును, గరుడగంధర్వ సిద్ధసాధ్య కిన్నరకింపురుషాదులనియును అనేక వర్గములు కలవు. వీరియొక్క వాక్కులుసైతము పరమేశ్వరా! నీ యచింత్యమైన పరమ స్వరూపమును దెలిసి నుతింపజాలవని నేను భావించుచున్నాను. వారును నీ యొక్క పార్వతీపతిత్వము, చంద్రమౌళిత్వము, గంగాధరత్వము మున్నగు స్థూలస్వరూపమునే భజించుచున్నారు. దేవతలకే గోచరము గాని నీ సూక్ష్మస్వరూపమును నేను మాత్రము నిరూపింపగలనా? నేనును వారివలె నీ స్థూలరూపమునే కొనియాడి సంతోషించుచున్నాను.॥౨॥

తస్య స్థాణోః స్తుతిరతిభరా భక్తిరుచ్చైర్ముఖీ చేద్
గ్రామ్యః స్తోతా భవతి పురుషః కశ్చిదారణ్యకో వా।
నో చేద్భక్తిస్త్వయిచ యదివా బ్రహ్మవిద్యాస్వధీతే
నానుధ్యేయస్తవ పశురసావాత్మకర్మానభిజ్ఞః ॥౩॥

అర్థ:—భక్తిః=అనన్యప్రేమ, త్వయి = నీయందు, ఉచ్చైర్ముఖీచేత్ = ఉన్నతమైనదిగా నున్నచో, తస్య=ఆ,స్థాణోః = శివుని యొక్క, స్తుతిః = స్తుతము, అతిభరా=అత్యంతశ్రేష్ఠమైనది (కాగలదు).

గ్రామ్యః = పల్లెలోఁ బుట్టినవాఁడుగాని, ఆరణ్యకోవా = అరణ్యనివాసి గాని, పురుషః = మానవుఁడు, స్తోతా=స్తోత్రము చేయువాఁడు, భవతి= అగుచున్నాఁడు, చ = మరియు, త్వయి=నీయందు, భక్తిః = భక్తి, నోచేత్ = లేనియెడల, బ్రహ్మవిద్యాస్తు = వేదాంత శాస్త్రములను గూఁడ, అధీతే యదివా=అభ్యసించుచున్నవాఁడైనను, అసౌ=ఈతఁడు, ఆత్మకర్మానభిజ్ఞః = తన కర్తవ్యమును దెలియనివాఁడై, తవ = నీచేత, నానుధ్యేయః = అనుగ్రహింపఁ దగని వాఁడుగా (నున్నాఁడు.)

తా. పరమేశ్వరా! నీయందు అనన్యమైనట్టియు స్థిరమైనట్టియు భక్తిగల్గి యుండవలయునే కాని; పల్లెటూరిలో, అడవిలోఁ బుట్టిన మూర్ఖుఁడు సైతము అత్యుత్కృష్టమైన స్తోత్రమును విరచింపగలఁడు. భక్తిహీనుఁడైనవాఁడు సర్వశాస్త్రవిశారదుఁడైనను తనయొక్క శుభాశుభములఁ దెలియనివాఁడై; మాయావశమున జిక్కి పశు వనఁ బడుచున్నాఁడు, ఇట్టివాఁడు నీయనుగ్రహమునకు పాత్రుఁడు కాఁడు. ॥౫॥

> విశ్వం ప్రాదుర్భవతి లభతే త్వా మధిష్ఠాపకం చే-
> న్న హ్యుత్పత్తిర్యది జనయితా నాస్తి చైతన్యయుక్తః।
> క్షిత్యాదీనాం భవతి చ కలావత్తయా జన్మవత్తా
> సిద్ధ్యత్యేవం సతి భగవతస్సర్వలోకాధిపత్యం ॥౬॥

అర్థః—విశ్వః = ఈ ప్రపంచము, త్వాం = నిన్ను, అధిష్ఠాపకం = సృష్టికర్తనుగా, లభతేచేత్ = పొందుచోఁ, ప్రాదుర్భవతి= పుట్టుచున్నది, చైతన్యయుక్తః=చైతన్యముతోఁ గూఁడినట్టి, జనయితా= జనకుఁడు, నాస్తియది = లేనియెడల, ఉత్పత్తిర్హి = పుట్టుకయే, న= లేదు. క్షిత్యాదీనాం=పృథివ్యాదుల, జన్మవత్తా = జన్మమును కార్యభావము, కలావత్తయా = అవయవాదిభాగములు గల్గియుండుటచేత, భవతి = అగుచున్నది, ఏవంసతి = ఇవ్విధముగ, భగవతః=సర్వైశ్వర్యసంపన్నుఁడవైన నీకు, సర్వలోకాధిపత్యం = నిఖిలభువనసార్వభౌమత్వము, సిద్ధ్యతి=సిద్ధించుచున్నది.

తా. బుద్ధిమంతుఁడైన శిల్పియొక్క ఆధారమువలన రథ విమానాదులు గన్పడునట్లు ఈ విశ్వము నీ యిచ్ఛాధీనమై పుట్టుచున్నది.

పుట్టించువానికి చైతన్యమే లేని యెడల ఘటపటాదుల యుత్పత్తియే కాజాలదు. పృథివ్యాదిపంచభూతములలో ప్రత్యేకముగ నవయవము లున్నవి. కావుననే జన్మరూపమైన కార్యమై యుండవలెను. ఇట్లు విచారించి చూడగా పరమేశ్వరుడ వగు నీవే సర్వలోకాధిపతి వని సర్వ ప్రమాణయుక్తులతో సిద్ధించుచున్నది.

వి. దండికవీంద్రుడు పండితాఖండలుడు కావున నీ శ్లోకమున తర్కశాస్త్ర పద్ధతి ననుసరించి పరమేశ్వరుని సర్వకర్తృత్వమును గంభీరముగా ప్రతిపాదించి నాడు. ఇది చాల గొప్ప విషయము కావున నిటవిస్తరింప వీలులేదు. ఈ ప్రపంచమున గల ఘటపట విమాన రథాదులలో నే కార్యమును జూచినను దానిని నిర్మించిన శిల్పి యొక్క ఇచ్ఛాప్రవృత్తియే కారణ మని తెలియకపోదు. ఘటాదులకు స్వయముగ పుట్టవలెనని గాని; పని జేయవలె నని గాని ఇష్టము లేనేలేదు. శిల్పియే తన యిష్టము ననుసరించి సృష్టించుకొనుచున్నాడు. అట్లే ఈ పంచభూతముల సృష్టి యని గూడ తెలియవలెను. దేని ననుభవించుటకై ఈ జగము తనకు తానే పుట్టినది? జగదీశ్వరుని ఇష్టము ననుసరించియే ఈ జగల్లీలావిలాసము కనుపడుచున్నది కావున సర్వాధ్యక్షుడు పరమేశ్వరు డొక్కరు డనియే సిద్ధాంతమగుచున్నది. తనకు తానే జగము పుట్టుచున్న దను ప్రకృతివాదులకు ఘటపటాదులు గూడ తమకు దామే యేల పుట్టుట లేదని ప్రశ్న వైచిన చాలును. ॥౮॥

భోగ్యామాహుః ప్రకృతి మృషయ శ్చేతనాశక్తిశూన్యాం
భోక్తా నైనాం పరిణమయితుం బంధవర్తీ సమర్థః।
భోగోఽప్యస్మిన్ భవతి మిథునే పుష్కలస్తోత్రహేతో
నీలగ్రీవ త్వమసి భువనస్థాపనాసూత్రధారః ॥౯॥

అర్థః—ఋషయః = కపిలాది ఋషులు, భోగ్యాం = భోగింప దగిన, ప్రకృతిం = ప్రకృతిని, చేతనాశక్తిశూన్యాం = చైతన్యము లేని దానినిగా, ఆహుః = చెప్పుచున్నారు. బంధవర్తీ = అవిద్యాపాశముతోఁ గూడినట్టి, భోక్తా = అనుభవించు పురుషుడు, ఏనాం = ఈ ప్రకృతిని, పరిణమయితుం=జగద్రూపముగఁ బరిణమింప జేయుటకు సమర్థః = శక్తుడు, న = కాడు, భోగోఽపి = సుఖదుఃఖానుభవమైనను, అస్మిన్ = ఈ, మిథునే = ప్రకృతి పురుషులందు, (అస్వతంత్రముగా నున్నది.) పుష్కలస్తోత్రహేతో = శ్రేష్ఠమైన స్తోత్రము లకు కారణమైనట్టి, నీలగ్రీవ = ఓ నీలకంఠా! త్వం = నీవు, భువన

స్థాపనాసూత్రధారః = విశ్వ నిర్మాణమున సూత్రధారుడవై, అసి= ఉన్నావు.

తా. కొందరు కపిలాది ఋషులు చైతన్యమే లేనట్టి జడ ప్రకృతిని భోగింపదగినదానినిగా జెప్పుచున్నారు. పోనీ, వారు జెప్పిన పురుషుడైనను అనుభవింప సమర్థుడనుకొందమన్నను అవిద్యాదిమాయాపాశముతో గూడుకొని యున్నాఁడని వారి శాస్త్రముననే చెప్పబడియున్నది. ఈ ప్రకృతి పురుషు లిరువురకును భోగానుభవము స్వాయముగఁ గల్గుటలేదు. అది ప్రేరకుడగు మరియొకని సంఘటనవలన జరుగుచున్నది. కావున నీ చరాచరాత్మకమైన సమస్తజగత్తునకును పరమేశ్వరా! నీవే సర్వథా కారణుఁడవై యున్నావు.

వి. కపిలుని సాంఖ్యశాస్త్రము ఇట ఖండింపబడినది. ఆ శాస్త్రమున ప్రకృతియే ప్రధానమైనది. ఈశ్వరునితో పనిలేదు. ఒక విధముగ ఇది నాస్తికశాస్త్రము. ప్రకృతి తానే జగద్రూపమున పరిణమించి హావభావములతో పురుషునికి మాయాపాశము వైచి సుఖము ననుభవించు నని యా శాస్త్రము చెప్పుచుండును. జడమైన ప్రకృతికిని, నిర్లేపుఁడైన పురుషునకును సుఖానుభవ మెట్లు కలుగుచున్నదని వీరి నడిగిన చో ప్రత్యుత్తరము లేదు. కావుననే సర్వకర్తయగు పరమేశ్వరుడున్నాడని సిద్ధాంతమగుచున్నది. ॥౫॥

చారూద్రేకే రజసి జగతాం జన్మ సత్త్వే ప్రకృష్టే
యాత్రాం భూయస్తమసి బహుళే బిభ్రతీం సంహృతించ।
బ్రహ్మాద్యేతత్ ప్రకృతిగహనం స్తంబపర్యంతమాసీత్
క్రీడావస్తు త్రినయన మనోవృత్తిమాత్రానుగం తే ॥౬॥

అర్థ:—త్రినయన=ఓత్ర్యంబకా! రజసి=రజోగుణము, చారూద్రేకే = సరియైన ఆధిక్యము కలిగియుండగా, జగతాం=లోకములయొక్క, జన్మ = ఉత్పత్తిని, భూయః=మరల, సత్త్వే=సత్త్వగుణము, ప్రకృష్టే=అధికమగుచుండగా, బిభ్రతీం=పోషించునట్టి, యాత్రాం = స్థితిని, తమసి = తమోగుణము, బహుళే = ఎక్కువగుచుండగా, చ= మరియు, సంహృతిం = సంహారమును, (చేయుచున్నట్టి నీయొక్క) ప్రకృతిగహనం = ప్రకృతిలో గంభీరమైనట్టి, బ్రహ్మాది స్తంబ

పర్యంతం = బ్రహ్మ మొదలు జడమైన చెట్టువరకును గల, ఏతత్ = ఈ (జగత్తు) తే=నీయొక్క, మనోమాత్రానుగం=మనమున దలచినంతనే వచ్చునట్టి, క్రీడావస్తు = ఆటవస్తువుగా, ఆసీత్ = ఉండెను.

తా. ఓ భాలాక్షా! రజోగుణాధిక్యమువలన నయ్యెడు సృష్టియు, సత్త్వగుణపూర్ణతవలన గలుగు స్థితియు, తమోగుణోల్బణమున నగు సంహారమును నీ యధీనములై యున్నవి. ప్రకృతిలో మిక్కిలి దుర్బోధముగా నున్నట్టి ఈ జడచేతనాత్మకమైన జగత్తు నీకొక ఆట పనిముట్టు (లక్క బొమ్మ) వలె నున్నది. నీవు ఇచ్ఛించినంతనే ఈవిశ్వము ఉద్భవిల్లుటయు ఊడ్చుకపోవుటయు జరుగుచున్నది స్వామీ!

వి. మహిమ్న స్తవమండలి ౩౧ వ శ్లోకమును జూడనగును. ॥౭॥

కృత్తిశ్చిత్రా నివసనపదే కల్పితా పౌండరీకీ
వాసాగారం పితృవనమహీ వాహనం కశ్చిదుక్షా।
ఏవం ప్రాయః ప్రళయహృదయో యద్యపి స్వార్థమేషాం
త్వాం ప్రత్యేకం భణతి భగవన్నీశ ఇత్యేష శబ్దః ॥౮॥

అర్థ—భగవన్ = మహేశా! చిత్రా = విచిత్రవర్ణములు గల, పౌండరీకీ = బెబ్బులిదగు, కృత్తిః = చర్మము, నివసనపదే = వస్త్రముండెడుచోట, కల్పితా = కల్పింపబడెను. పితృవనమహీ = శ్మశానభూమి, వాసాగారం = నివాస భవనముగాను, కశ్చిత్ = ఒకానొక (ముదుసలి), ఉక్షా = ఎద్దు, వాహనం = వాహనముగాను, (కల్పింపబడెను). ఏవం ప్రాయోపి = ఇట్టివాఁడవైనను, ఏషాం = ఈ జగములకు, యది ప్రళయ హృదయః = లయకరుడ వగుచో, ఏకం = ఒకఁడవైన, త్వాం ప్రతి=నినుగూర్చి, ఈశ ఇతి= "ఈశ్వరుడవు" అను, ఏషః = ఈ, శబ్దః = శబ్దము, స్వార్థం = స్వకీయార్థమును, భణతి = చెప్పుచున్నది.

తా. ఓ మహాదేవా! వ్యాఘ్రచర్మము నుత్తరీయముగాను, శ్మశానమును వాసముగాను, ఎద్దును వాహనముగాను చేసికొని యున్నాఁడవు. ఇట్టి యమాయకత్వము గలవాఁడ వైనను జగత్ప్రళయమునం

దును అభిలాష కలిగియున్నావుకదా! ఇందువలననే ఈశుడవు (సర్వకర్తవు) అను శబ్దము నిన్నుఁ జెప్పుచున్నదై సార్థకమై యున్నది.

వి. పరమేశ్వరుడు భృగ్వాది మహర్షులయొక్క హృదయ భావమును దెలియుటకై భిక్షుక వేషముతో దేవదారువనమునకు వచ్చెను. ఋషులు నిజమెరుగక శివుని చేష్టలను సహింపజాలక అథర్వణ మంత్రములతో నొక వ్యాఘ్రమును బుట్టించి శివునిపైకి బంపగా దానిని ధ్వంసము గావించి యా వ్యాఘ్రచర్మమును శివుడు ధరించెనని పురాణకథ కలదు. (శివ. శత) బ్రహ్మను చంప నుద్దేశించి యొక రాక్షసుడు గజదేహముతో రాగా దానిని సంహరించి గజచర్మమును గూడ ధరించెను. (పద్మ. స్వ. ౩౮) ॥౭॥

కృత్వాకల్పం కి మియమశివై రస్థిముఖ్యైః పదార్థైః

కస్మాదన్యైః స్తనకలశయోర్భారనమ్రా భవానీ।

పాణౌ ఖండః పరశు రిదమప్యక్షసూత్రం కి మస్యే

త్యాచక్షాణో హర కృతధియా మస్తు హాస్యైకవేద్యః ॥౮॥

అర్థః—హర = రుద్రా! అశివైః = అమంగళములైనట్టియు, అన్యైః = ఇతరములైనట్టియు, అస్థిముఖ్యైః = ఎముకలు మొదలు గాగల, పదార్థైః = వస్తువులచేత, ఆకల్పం = అలంకారమును కృత్వా=చేసి, కిం=ఏమిప్రయోజనము? అస్య = ఈ రుద్రునకు, స్తనకలశయోః = ఘనస్తనముల, భారనమ్రా = భారముచే వంగినట్టి, భవానీ = పార్వతి, కస్మాత్ =ఎందుకు? అపి=మరియు పాణౌ=కరమున, ఖండపరశుః = గండ్రగొడ్డలియు, ఇదం = ఈ; అక్షసూత్రం = జపమాలయు, కిం = ఏకారణము? ఇతి = ఇట్లు, ఆచక్షాణః = చెప్పువాడు, కృతధియాం = వివేకులకు, హాస్యైకవేద్యః=హాస్యముతోడనే తెలియదగినవాడు, అస్తు = అగుగాక!

తా. "అమంగళకరములును, ముట్టగూడనివియును అగు ఎముకలు మొదలైన వస్తువులతో నలంకరించుకొన్నవానికి ఆ సుందరాంగియైన గౌరీదేవితో నేమి ప్రయోజనము? కరమున గండ్రగొడ్డలిని ధరించి మరి జపమాలనుగూడ ఏల చేపట్టవలయును?" అని ఓ హరా! నిను గూర్చి యాక్షేపించువాడు పెద్దల యపహాస్యమునకు గురి కాగలడే కాని నీ మహిమకు కొరతయుండునా? ॥౮॥

యత్కాపాలవ్రతమపి మహద్దృష్ట మేకాంత ఘోరం
ము_క్తేరధ్వా స పునరమరప్రాపిణః కిం నజాతః।
దాక్షాయణ్యాం ప్రణయ ఇవ యావ _త్తతో యోగమార్యా
సాప్యాధ _త్తే మిథునచరితం వృద్ధిమూలం ప్రజానాం॥ ౯॥

అర్థ:—అమర = శాశ్వతా! మహాత్ =గొప్పదైనట్టి, ఏకాంత ఘోరం = అతిభయంకరమైనట్టి, యత్ =ఏ, కాపాలవ్రతం=కాపాలిక వ్రతము, దృష్టం = కనుపడుచున్నదో, పునః = మరియు, సః=అది, ము_క్తేః=ము_క్తిని, ప్రాపిణః = పొందించునట్టి, అధ్వా=మార్గము, నజాతః=కాలేదా! కిం = ఏమి? దాక్షాయణ్యాం = గౌరీ దేవియందు, ప్రణయఇవ = ప్రేమవలె, యావత్ = ఎంతలో (కనుపడునో) తావత్ = అంతలో, సా = ఆ, ఆర్యాపి = పార్వతియైనను, తతః = ఆ భావనవలన, ప్రజానాం=సంతతియొక్క, వృద్ధిమూలం = వృద్ధికి కారణమైనట్టి, మిథునచరితం = దంపతుల ధర్మమైనట్టి, యోగం = సంగమమును, ఆధ _త్తే = స్వీకరించుచున్నది.

తా. ఓ నిత్యసత్యా! ఆ సుప్రసిద్ధమైనట్టియు, భయంకరమైన ట్టియు, కాపాలికవ్రతముకూడ శాశ్వతమైన ము_క్తిమార్గమును పొం దింపలేదా? కామవిధ్వంసకుడ వైనట్టి నీవు భావనామాత్రమున ఎంత వరకు ప్రేమింతువో అంతవరకు ఆ గౌరీ దేవియును దాంపత్యధర్మమును పొంది ప్రజావృద్ధికరమైన సాంగత్యము చేయుచున్నది.

వి. ఇందు పరమేశ్వరుని యొక్క సృష్టితత్వము గౌరీచరిత్రవలనను, ము_క్తి ప్రదత్వము కాపాలవ్రతమువలనను చెప్పబడినది. అదిశైవులలో కాపాలవ్రత మను నదికూడ ఒక మతము. దీని నవలంబించువారు కాపాలికులు. వీరు కంథ కర్పరము (తలపుర్రె) కంకాలము (వెన్నెముక, డొక్క) గజచర్మము మున్నగువానిని ధరించి భయంకరముగా నుందురు. వీరి యాత్మయు శివమయము కావున నీవ్రతమును ము_క్తి ప్రదమే యగుచున్నది. ఇది శివుని చరిత్ర, వేషానుకరణము. గజచర్మ వ్యాఘ్ర చర్మ ముల కథ వెనుక వ్రాయబడినది. బ్రహ్మదేవు డొకప్పుడు తానే సృష్టికర్తననియును, శివునిగూడ నేనే పుట్టించితిననియును గర్వాధిక్యము నొందుటగాంచి రుద్రుడు తన గోటిమొనతో బ్రహ్మయొక్క ఐదవ శిరమును గిల్లి యా కపాలమును ఎడమచేత ధరించెను. ఇది పురాణము... (శివ విద్యో ౧౫ పద్య, స్క ౧౪) వామనాది

తారమున త్రివిక్రమత్వము బొంది లోకముల నాక్రమించి బాధింపుచుండ శివుఁ డా విక్రముని జీల్చి కంకాళమును ధరించెననియును పురాణకథ కలదు. ||౯||

కశ్చిన్మర్త్యః పరికృశతను ర్నీలకంఠ త్వయా చేద్
దృష్ట స్స్నిగ్ధస్స పునరమరస్త్రీభుజగ్రాహ్యకంఠః।
అప్యారూఢస్సురపరివృతం స్థానమాఖండలీయం
త్వం చేత్క్రుద్ధస్స పతతి నిరాలంబనధ్వాంతజాలే. ||౧౦||

అర్థ:—నీలకంఠ = శ్రీకంఠా! పరికృశతనుః = కృశమైన దేహముగల, కశ్చిత్ = ఒకానొక, మర్త్యః = మనుష్యుడు, త్వయా = నీచేత, దృష్టశ్చేత్ = చూడఁబడుచో, పునః = మరియు, సః = వాడు, స్నిగ్ధః = సుందరుఁడై, అమరస్త్రీ భుజగ్రాహ్యకంఠః = దేవతా స్త్రీలయొక్క కరములచేత ఆలింగింపఁదగిన కంఠము గలవాడు (అగుచున్నాడు) అపి = మరియు, సురపరివృతం = దేవతలతో చుట్టుకొనబడినట్టి, ఆఖండలీయం = ఇంద్రుని సంబంధమైనట్టి, స్థానం = పదమును, ఆరూఢః = ఎక్కినవాఁడు, (అగుచున్నాడు) త్వం = నీవు, క్రుద్ధశ్చేత్ = కోపము నొందినవాఁడ వగుచో, సః = వాడు, నిరాలంబన ధ్వాంతజాలే = ఆధారములేని అంధకార సమూహమున, పతతి = పడుచున్నాడు.

తా. శ్రీకంఠా! కృశుఁడును, మలినదేహుఁడును అగు ఒకానొక అనామధేయుఁడు కూడ నీ కృపాదృష్టి కలిగినచో సుందరమైన దేహము కలవాఁడై దేవతాస్త్రీల ప్రేమకును పాత్రుఁడై సౌఖ్యము ననుభవింపగలఁడు. మరియు సకలదేవతల చక్రవర్తియైనట్టి ఇంద్రుని యొక్క సింహాసనమును గూడ నాక్రమింపగలఁడు. కాని నీ దయదప్పినవాఁడే స్వర్గమునుండి జారి శూన్యమును, అంధకార బంధురమును, ఆధార రహితమును అగు స్థానమున బడగలఁడు. ||౧౦||

శశ్వద్బాలం శరవణభవం షణ్ముఖం ద్వాదశాక్షం
తేజో యత్తే కనకనళినీపద్మపత్రావదాతం।
విస్మార్యంతే సురయువతిభి స్తేన నేంద్రావరోధం
దైత్యేంద్రాణా మమరజయినాం బంధనాగారవాసాః ||౧౧||

అర్థ:—శరవణభవం = రెల్లువనమునఁ బుట్టినట్టియు, షణ్ముఖం, ఆరు ముఖములు గలట్టియు, ద్వాదశాక్షం = పండ్రెండు కనులు గలట్టియు, శశ్వత్ = సదా, బాలం = కుమారుడను పేరు గలట్టియు, కనకనళినీ పద్మ పత్రావదాతం = బంగారు కమలపుతీగయొక్క ఆకువలె తెల్లనై నట్టియు, యత్ = ఏ, తే = నీయొక్క, తేజః = తేజస్సు (శేతస్సు), కలదో! తేన = ఆ తేజముచేత, సేంద్రావరోధం=ఇంద్రుని యంతఃపుర స్త్రీల సహితముగా, సురయువతిభిః = దేవతాస్త్రీలచేత, అమరజయినాం = దేవతల జయించినట్టి, దైత్యేంద్రాణాం = తారకాది రాక్షసాధిపతులయొక్క, బంధనాగార వాసాః = కారాగృహ వసతులు, విస్మార్యంతే = మరపింప బడుచున్నవి.

తా. ఓ యసురశాసకా! నీ తేజస్సుచేత రెల్లునఁబుట్టిన వాడును, ఆరు మొగముల వాడును; పదిరెండు కనులుగలవాడును, బంగారు కమలపాకులవలె కాంతి గలవాడును అగు కుమారస్వామి; తారకాది రాక్షసులచే కారాగృహములలో బంధింపబడిన దేవతలను ముక్తులగావించి; ఇంద్రునిపత్ని యగు శచీదేవి మున్నగు దేవతరుణీమణుల యొక్క దుఃఖములను దొలగించినాడు.

వి. పై శ్లోకమున శివుని నిగ్రహానుగ్రహములును, ఇందు శేశస్సామర్థ్యమును నిరూపింపబడినవి. తారకాసుర సంహారకథను మహిమ్న స్తవపు ౧౨ శ్లోకముక్రింద చూడవలెను॥ ౧౧॥

వేగాకృష్టగ్రహరవిశశి వ్యశ్నువానం దిగంతా-
న్యక్కుర్వాణం ప్రళయపయసా మూర్మిభంగావలేపం।
ముక్తాగౌరం హర తవజటాబంధనస్పర్శి సద్యో
జజ్ఞే చూడాకుసుమసదృశం వారి భాగీరథీయం॥ ౧౨॥

అర్థ:—హర = శివా! వేగాకృష్టగ్రహరవిశశి = వేగముతో లాగబడిన నక్షత్రములు, సూర్యచంద్రులు గల్గినట్టియు, దిగంతాన్ = దిక్కుల చివరలను, వ్యశ్నువానం=వ్యాపించుచున్నట్టియు, ప్రళయపయసాం=ప్రళయకాలపు సముద్ర జలములయొక్క, ఊర్మి భంగావలేపం= తరంగముల విక్షేపవేష్టలయొక్క గర్వమును, న్యక్కుర్వాణం= తిరస్క-

రించు చున్నట్టియు, ముక్తాగౌరం = ముత్యములవలె తెల్లనైనట్టియు, భాగీరథీయం = గంగా సంబంధమైనట్టియు, వారి = జలము, తవ = నీయొక్క, జటాబంధనస్పర్శి = జడలముడిని తాకినట్టిదై, సద్యః = తత్కాలమున, చూడాకుసుమసదృశం = జుట్టులోని పువ్వుకు సమానమైనదిగా, జజ్ఞే = ఆయెను.

తా. శంకరా! ప్రళయకాలమున సప్త సముద్రము లేకమై జగము లెల్లెడలను వ్యాపించునప్పటి దానికంటె గొప్పగా దశ దిశలలో ప్రవహించుచున్నట్టియు, తన వేగమువలన సూర్యచంద్రులను నక్షత్రములను ఆకర్షించుచున్నట్టియు, ముత్యములవలె ధవళమైనట్టియు ఆ మహా గంగాజలము నీ జడలు సోకినంతనే ఒక చిన్న పువ్వమువలె శాంతముగ నుండెను.

వి. శివుడు గంగాధరుడైన కథ మల్హణ స్తవము ౧౭ వ శ్లోకమున వచ్చినది. దీనిని పద్మ (ఉ. ౨౧.) మహాభారత (వన. ౧౦౭) రామాయణ (భా. ౧-౪౨) భాగవతము (౯-౯) వాయు (౧-౪౭) బ్రహ్మ (౭౭) విష్ణు(౪-౪) పురాణాదులలో గాంచనగును॥ ౧౨॥

కల్మాషస్తే మరకతశిలాభంగకాంతి ర్న కంఠే
నవ్యాచష్టే భువన విషయాం త్వత్ప్రసాదప్రవృత్తిం।
వారాంగర్భస్సహి విషమయే మందరక్షోభజన్మా
నైవం బద్ధో యది న భవతి స్థావరం జంగమం వా ॥౧౩॥

అర్థ:—తే = నీయొక్క, కంఠే = గళమునందుగల, మరకత శిలాభంగకాంతిః = మరకత రత్నఖండమువలె కాంతి కల్గియున్నట్టి, కల్మాషః = మచ్చ, భువనవిషయాం = ప్రపంచసంబంధమైన, త్వత్ప్రసాద ప్రవృత్తిం = నీ యొక్క యనుగ్రహ వర్తనమును, నవ్యాచష్టేన = చెప్పుటలేదని కాదు, హి = ఎందుకనగా, మందర క్షోభ జన్మా = మందరాద్రియొక్క ఘర్షణవలనఁ బుట్టినట్టి, సః = ఆ విషము, ఏవం = ఇట్లు, యది నబద్ధః = కట్టబడినది కానిచో, వారాంగర్భః = సముద్రము, విషమయః = విషపూరితమై (యుండెడిది) స్థావరం = అచరము, వా = అథవా, జంగము = చరము, నభవతి = ఉండదు.

తా. పరమేశ్వరా! నీ కంఠమందు మరకతరత్నమువలె నల్ల పచ్చగా నున్న ఆ విషపు మచ్చవలననే సర్వలోకములపై నీకున్న కృపను తెలిసికొనవచ్చును. మందరాచలముయొక్క రాపిడివలన పుట్టిన ఆ భయంకర విషమునే నీవు కంఠమున దాల్పనిచో సప్త సముద్రములును విషపూరితములై ఈ చరాచరాత్మకమైన బ్రహ్మాండభాండమే నిలిచియుండెడిదికాదు.

వి. ఈ శ్లోకము మహిమ్నమందలి "అకాండ బ్రహ్మాండ" (౧౪) అను శ్లోకమునకు కొంత అనుకరణముగా నున్నది. దాని క్రిందనే శివుడు విషము ధరించిన పురాణ గాథ వ్రాయబడినది॥ ౧౩॥

సంధాయాస్త్రం ధనుషి నియమోన్మాది సమ్మోహనాఖ్యం
పార్శ్వే తిష్ఠ గిరిశ దదృశే పంచబాణో ముహూర్తం
తస్మాదూర్ధ్వం దహనపరిధౌ రోషదృష్టిప్రసూతే
రక్తాశోకే స్తబకిత ఇవ భ్రాంతధూమద్విరేఫః ॥౧౪॥

అర్థ:—గిరిశ = ఓ కైలాస నిలయా! పంచబాణః = కాముడు, నియమోన్మాది = సంయమమును జెనుపునట్టి, సమ్మోహనాఖ్యం = సమ్మోహము (మోహింపజేసెడిది) అను పేరుగల, అస్త్రం = బాణమును, ధనుషి = పూవింటిలో, సంధాయ = ఎక్కుపెట్టి, పార్శ్వే = ప్రక్కన, తిష్ఠ = నిలుచున్నవాడై, ముహూర్తం = క్షణకాలము, దదృశే = చూడబడెను. తస్మాదూర్ధ్వం = ఆ తరువాత, రోషదృష్టి ప్రసూతే = క్రోధదృష్టినుండి వెలువడిన, దహనపరిధౌ = అగ్నిమండలమున, స్తబకితే = గుత్తులు విడిచిన, రక్తాశోకే = ఎఱ్ఱటి యశోకమున, భ్రాంత ధూమద్విరేఫ ఇవ = సుడివడుచున్న నల్లతుమ్మెదవలె, (ఆయెను)

తా. కైలాసనాథా! యతుల మనస్సునకు వికారము బుట్టించునట్టి సమ్మోహన బాణమును తన పుష్పధనుస్సులో నెక్కుబెట్టి మన్మథుడు ఒక క్షణకాలము నీ ప్రక్కన నిలుచుండెనే కాని తదుపరి నీ యగ్ని నేత్రమునుండి వెలువడిన జ్వాలలో పడి ఎఱ్ఱ యశోక మంజరిలోఁ జిక్కిన నల్లతుమ్మెదవలె దిక్కు దెలియక మాడిపోయెను.

వి. మహిమ్నమున ౧౫ వ శ్లోక విశేషములు చూడవలెను॥ ౧౪॥

లంకానాథం లవణజలధిస్థూలవేలోర్మిదీర్ఘైః
కైలాసం తే నిలయనగిరిం బాహుభిః కంపయంతం
ఆక్రోశద్భిః క్షరితరుధిరై రాననై రాప్లుతాక్షై
రాపాతాళా దనయ దలసారబ్ధ మంగుష్ఠకర్మ ॥౧౪॥

అర్థ:— లవణజలధిస్థూలవేలోర్మిదీర్ఘైః = లవణ సముద్రము యొక్క పెద్దదియైన తీరమందలి తరంగముల వలె పొడవైనట్టి, బాహుభిః=భుజములచేత, తే=నీయొక్క, నిలయనగిరిం=వాసాద్రియైన కైలాసం = కైలాసమును, కంపయంతం = కదలించుచున్నట్టి, లంకానాథం = రావణాసురుని, అలసారబ్ధం=మందోద్యోగము గల, అంగుష్ఠకర్మ = పెద్దవ్రేలి క్రియ, ఆక్రోశద్భిః = ఆక్రందించుచున్నట్టి, క్షరితరుధిరైః=కారుచున్న రక్తము గలట్టియు, ఆప్లుతాక్షైః = నిండిన కన్నులు గలట్టియు, ఆననైః = ముఖములతో గూడ, ఆపాతాళాత్= పాతాళము పర్యంతము, అనయత్ = పొందించెను.

తా. సముద్ర తరంగములవలె మహాదీర్ఘములైన తన యిరువది భుజములతో రావణుడు కైలాసమును బెకలింపగా, నీ పాదాంగుష్ఠము నించుక కదలించి యణచిపట్టినంతమాత్రమున ఏడ్చుచు; కనుల వెంట రక్తమును జలమును గార్చుచు పాతాళమున బడి శాసితుడయ్యెను.

వి. మహిమ్నము ౧౧-౧౨ శ్లోకముల చూడుడు॥ ౧౪॥

ఐశ్వర్యం తే వ్యవృణుత పదం నైకమూర్ధావశేషః
పాదద్వంద్వే దశముఖశిరఃపుండరీకోపహారః।
తేనైవాసా వధిగతవరో రాక్షసశ్రీవిధేయా-
శ్చక్రే దేవాసురపరిషదో లోకపాలైః కళత్రైః ॥౧౫॥

అర్థ:— తే = నీయొక్క, పాదద్వంద్వే = చరణయుగళము నందు, ఏకమూర్ధావశేషః = ఒక శిరస్సె మిగిలినట్టి, దశముఖశిరః

పుండరీకోపహారః = రావణుని ముఖకమలము లనెడు బలి,ఐశ్వర్యం = లోకేశ్వరత్వ సంబంధమైన, పదం = స్థానమును, న వ్యవృణుత = వివరింపలేదా! అసౌ = ఈ రావణుడు, తేనైవ = అట్టి పూజచేతనే, అధిగతవరః = పొందబడిన వరము గలవాడై, లోకపాలైక శత్రుః = ఇంద్రాద్యష్టదిక్పాలకులకు ముఖ్యశత్రువై, దేవాసుర పరిషదః = దేవతలయొక్కయు, రాక్షసులయొక్కయు సభలను, రాక్షస శ్రీవిధేయాః = రాక్షసుల సంపత్తుకు వశమైన వానినిగా, చక్రే = చేసెను.

తా. పరమేశ్వరా! రావణు నంతవాడు తన ఒక శిరమును మాత్రము వదలి తొమ్మిది తలలను కత్తిరించి నీ పాదసన్నిధిని సమర్పించి భక్తితోఁ బూజించినాడు కదా! ఇదియే నీ సర్వలోకేశ్వరత్వమును ఘోషించుటలేదా! ఇట్టి పూజవలననే రావణుడు నీ నుండి వరమును పొంది సమస్త దేవదానవ సమూహములకు చక్రవర్తియై తన రాక్షసులకును ఆధిక్యమును సంపాదింపలేదా! ॥౧౬॥

భక్తిర్బాణాసురమపి భవత్పాదపద్మం స్పృశంతం
స్థానం చంద్రాభరణ! గమయామాస లోకస్య మూర్ధ్ని।
న హ్యస్యాసీద్ భ్రుకుటి నయనాదుగ్రదంష్ట్రాకరాళం
ద్రష్టుం కశ్చిద్వదన మసకృద్దేవదైత్యేశ్వరేషు ॥౧౭॥

అర్థః—చంద్రాభరణ=ఓ ఇందుభూషా, భవత్పాదపద్మం = నీ చరణకమలమును, స్పృశంతం = ముట్టుచున్నట్టి, బాణాసుర మపి = బాణాసురునికూడ, భక్తిః = నీ యందలి భక్తి, లోకస్య = జగత్తుయొక్క, మూర్ధ్ని=శిరమునందు, గమయామాస=చేర్చెను, అస్య = ఈ బాణుని యొక్క, అసకృత్=పునఃపునః, భ్రుకుటినయనం=ఎగసిన బొమలును కనులును గలిగినట్టియు, ఉగ్రదంష్ట్రాకరాళం = భీకరమైన కోరలచే పెద్దదైనట్టియు, వదనం = ముఖమును, దేవదైత్యేశ్వరేషు = దేవదానవరాజులలో, కశ్చిత్ = ఒకడును, ద్రష్టుం = చూచుటకు, నహ్యాసీత్ = లేకపోయెను.

తా. ఓ చంద్రాభరణా! బాణాసురుడును నీ పాదములను అనన్య

భక్తితో గొలిచిన కారణముననే సర్వలోకాధిపతియై వన్నెకెక్కి నాడు. తేపతేపకును కనుబొమల నెక్కించి తెరచియున్న నేత్రములు గలట్టియు, కోరలచే భీకరమై యున్నతమైనట్టియు ఈతని ముఖమును ఎదురుగా నిలిచి అవలోకించుటకు సైతము దేవదానవులలో నొక్క డును సమర్థుడుగా లేకుండెను. (ఇది యంతయు శివభక్తి మహిమ యని భావము.)

వి. మహిమ్నము ౧౩ వ శ్లోకమున నీ కథ కలదు॥ ౧౪॥

పాదన్యాసా న్నమతి వసుధా దిగ్గజస్కంధలగ్నా
బాహూత్క్షేపా ద్గ్రహగణయుతం ఘూర్ణతే మేఘవృందం।
ఉత్సార్యంతే తృణ మివ దిశో హుంకృతే నాతిమాత్రం
హింసావస్థం భవతి భువనం త్వయ్యుపక్రాంతనృత్తే ॥౧౫॥

అర్థః—త్వయి=నీవు, ఉపక్రాంతనృత్తే=ఆరంభించిన తాండవము గలవాడ వగుచుండగా, పాదన్యాసాత్=చరణములు ఎత్తివేయుటవలన, వసుధా = పృథ్వి, దిగ్గజస్కంధలగ్నా = దిగ్గజముల మూపులపై ఒత్తిడి గలిగించినదై, నమతి = క్రిందికి వంగుచున్నది. బాహూత్ క్షేపాత్ = భుజములను పైకి ద్రిప్పుటవలన, గ్రహగణయుతం = సూర్యాది నవగ్రహములతో గూడినట్టి, మేఘవృందం = మేఘమండ లము, ఘూర్ణతే = తిరుగుచున్నది. హుంకృతేన = హుంకారము చేత, దిశః = దిక్కులు, తృణ మివ = గరికపోచవలె, అతిమాత్రం = ఎక్కువగా, ఉత్సార్యంతే = చల్లబడుచున్నవి, భువనం = విశ్వము, హింసావస్థం = పీడలో మునిగినదిగా, భవతి = అగుచున్నది.

తా. ఓ పరంధామా! నీవు తాండవము నారంభించునపుడు చరణములను ఎత్తి మరల క్రిందికి వేయుటవలన ఈ పృథ్వియే దిగ్గజ ములపై బడి, క్రిందికి జారుచున్నది. బాహువులను పైకి ద్రిప్పుట వలన చంద్రసూర్య నక్షత్రములతో గూడిన మేఘమండలమే తిరిగి పోవు చున్నది. హుంకారము చేసిన మాత్రమున దశదిశలు గరికపోచలవలె నెక్కువగా ఇటునటు పడిపోవుచున్నవి. స్వామీ! ఈ సకలభువనమే హింసలో బడినదై వణకుచున్నది.

వి. అతిబలు డను రాక్షసుని వలన లోకోపద్రవము కలుగకుండుటకై శివుడీ తాండవమును చేయుచుండును. మహిమ్నము ౧౬ వ శ్లో. చూ.॥ ౧౮॥

నోర్ధ్వం గమ్య స్సరసిజభువో నాప్యధ శ్చక్రపాణే-
రాసీ దంత స్తవ హుతవహ స్తంభమూర్త్యా స్థితస్య।
భూయస్తాభ్యాముపరి బహునా విస్మయేన స్తువద్భ్యాం
కంఠేకాలం కపిలనయనం రూపమావిర్బభూవ ॥౧౮॥

అర్థ:—హుతవహ స్తంభమూర్త్యా= అగ్ని స్తంభాకారముతో, స్థితస్య = ఉన్నట్టి, తవ = నీయొక్క అంతః = చివర భాగము, సర సిజభువః = బ్రహ్మకు, ఊర్ధ్వం = పైకి, గమ్యః = పొందదగినది, నాసీత్ = కాకయుండెను, అధః = క్రిందికి, హరేః = విష్ణువునకును, (పొంద దగినదిగా లేకుండెను) ఉపరి = తరువాత, బహునా = అధిక మైన, విస్మయేన = ఆశ్చర్యముచేత, భూయః = మరల, స్తువద్భ్యాం = స్తోత్రము చేయుచున్నట్టి, తాభ్యాం = ఆ హరివిరించులకు, కంఠే కాలం = కంఠమున నలుపు గలదియు, కపిలనయనం=అగ్ని నేత్రము గలదియు నగు, రూపం= శివాకారము, ఆవిర్బభూవ=ప్రత్యక్షమయ్యెను

తా. ఓ సర్వాంతర్యామీ! నీవు మహాజ్యోతిర్లింగాకారమున బ్రహ్మండముల నతిక్రమించి (వ్యాపించి) యున్నపుడు - విష్ణువు అధోలోకమునకును, బ్రహ్మ ఊర్ధ్వలోకమునకును దీర్ఘకాలము ప్రయాణించి నీ యాద్యంతములను కనుగొనజాలరైరి. వారే మరల చకితులై వినయాధిక్యముతో నిన్ను స్తోత్రింపగా నీలకంఠమును, ఫాల నేత్రమును గలిగినట్టి నీ దివ్యరూపము ఆ బ్రహ్మ విష్ణువులకు ప్రత్యక్ష మయ్యెనుగదా!

వి. మహిమ్నము ౧౦ వ శ్లోకమును చూడుడు॥ ౧౮॥

శ్లాఘ్యాం దృష్టిం దుహితరి గిరేర్న్యస్య చాపోర్ధ్వకోట్యాం
కృత్వా బాహుం త్రిపురవిజయానంతరం తే స్థితస్య।
మందారాణాం మధుసురభయో వృష్టయః పేతు రార్ద్రాః
స్వర్గోద్యానభ్రమరవనితాద త్తదీర్ఘానుయాత్రాః ॥౨౦॥

అర్థ:—త్రిపుర విజయానంతరం = త్రిపురములను జయించిన తదుపరి, చాపోర్ధ్వకోట్యాం = ధనుస్సుయొక్క మీది కొమ్మున, బాహుం కృత్వా = చేయివైచి, గిరేర్దుహితరి = పార్వతియందు, శ్లాఘ్యాం = ప్రశస్తమైన, దృష్టిం = అవలోకనమును, న్యస్య = వేసి, స్థితస్య = నిలుచున్నట్టి, తే = నీపై, మధుసురభయః = మకరంద గంధము గల, ఆర్ద్రాః=చల్లనైనట్టి, స్వర్గ...యాతాః- స్వర్గ = స్వర్గపు ఉద్యాన = తోటయందు గల, భ్రమర వనితా = ఆడు తుమ్మెదల చేత, దత్త = ఈయబడిన, దీర్ఘ = పొడవైన, అనుయాతాః = అను సరణము గల, మందారాణాం = కల్పతరుపుష్పములయొక్క, వృష్టయః=వర్షములు, పేతుః = కురిసెను.

తా. ఓ త్రిపురాంతకా! త్రిపురములను గాల్చి త్రిపురాసురులను జయించివచ్చిన పిదప పినాకధనుస్సుమీద నొకహస్తమును వేసి పార్వతీ దేవిమీద మనోహరమైన కటాక్షములను బరపుచు నిలుచున్నపుడు (దేవతలు నీ కృప సంపాదింప నెంచి) మకరందపు సుగంధములచే శీతల ముగా నున్నట్టియు, స్వర్గోద్యానమున గల ఆడుతుమ్మెదలగుంపుచే అనుసరింపబడుచున్నట్టియు, మందారపుష్పముల జడివానను నీ పై గురి పించి సన్మానించిరి.

వి. మహిమ్నము ౧౮ శ్లోకమును చూడవలెను. ॥౨౦॥

ఉద్ధృత్యైకం నయనమరుణస్నిగ్ధతారాప్రకాశం
పూర్ణే సద్యః పరమసులభే పుష్కరాణాం సహస్రే
చక్రం భేజే దహనజటిలం దక్షిణం తస్య హస్తం
బాలస్యైవద్యుతివలయితం మండలం భాస్కరస్య ॥౨౧॥

అర్థ:—పరం = మిక్కిలి, అసులభే= సులభముగానట్టి, పుష్క రాణాం = పద్మములయొక్క, సహస్రే = సహస్రము, అరుణస్నిగ్ధ తారా ప్రకాశం = అరుణునివలె మనోహరమైన గ్రుడ్డుయొక్క కాంతి గలిగినట్టి, ఏకం = ఒకటియైన, నయనం = నేత్రమును ఉద్ధృత్య = పెకలించి, పూర్ణే = సంపూర్ణముకాగా ఆ విష్ణువుయొక్క

దక్షిణం = కుడిదైన, హస్తం = కరమును, ద్యుతివలయితం = చుట్టుకాంతితోగూడిన, బాలస్య = తగుణుడైనట్టి, భాస్కరస్య = సూర్యునియొక్క, మండల మివ = మండలమువలె, దహనజటిలం=అగ్ని శిఖలతోగూడిన, చక్రం = సుదర్శన చక్రము, భేజే = పొందెను.

తా. మహేశా! మహావిష్ణువు నిను సహస్రకమలములతో నర్చింపం బూని; మాటి మాటికిని ఒకటి తగ్గుచుండగా; కమలమువలె నెట్టినైన దియును, కాంతుల నీనునదియు అగు తననేత్రమునే పెఱికి వేయింటిని పూర్తిచేసినవాడాయెను తత్ క్షణమే నీ యనుగ్రహమువలన నా విష్ణుమూర్తియొక్క దక్షిణ హస్తమునందు బాలార్క బింబమువలె నున్నట్టియు, తేజోమయమైనట్టియు, సుదర్శన చక్రము వచ్చి చేరెను.

వి. మహిమ్నము ౧౯ శ్లోకమున విశేషములు గలవు॥ ౨౧॥

విష్ణశ్చక్రే కరతలగతే విష్టపానాం త్రయాణాం
దత్త్వాశ్వాసం దనుజశిరసాం ఛేదదీక్షాం బబంధ।
ప్రత్యాసన్నం తదపి నయనం పుండరీకానుకారి
శ్లాఘ్యా భక్తి స్త్రినయన భవత్యర్పితా కిం నసూతే॥ ౨౨॥

అర్థః—విష్ణుః = నారాయణుడు, చక్రే= సుదర్శనచక్రము, కరతలగతే = చేజిక్కఁగా, త్రయాణాం = మూఁడైన, లోకానాం = లోకములకు, ఆశ్వాసం = అభయమును, దత్త్వా = ఇచ్చి, దనుజశిరసాం = రక్కసుల తలలయొక్క, ఛేదదీక్షాం = ఖండనవ్రతమును, బబంధ = కట్టెను (స్వీకరించెను.) తత్ = ఆ, పుండరీకానుకారి = తెల్లకలువవలె నున్న, నయనమపి = నేత్రముకూడ, ప్రత్యాసన్నం = సంప్రాప్తమయ్యెను. త్రినయన = త్ర్యంబకా! భవతి = నీయందు, అర్పితా = ఇడబడిన, శ్లాఘ్యా = ప్రశస్తమైన, భక్తిః = భక్తి, కిం = దేనిని, న సూతే = కలిగింపదు?

తా. ఆ మహావిష్ణువు సుదర్శనచక్రము లభింపగనే దేవతలకు భయమువలదని సమాధానము చెప్పి, రక్కసుల తలల గత్తిరించు పనికి బూనెను. శివపాదములో నర్పించిన ఆ నేత్రముకూడ మరల

తన ముఖమున నతుకుకొనెను. ఫాలాక్షా! నీయందు అనన్యభక్తి నిడినచో సమకూడని కోర్కెలు గలవా! (సర్వము సాధ్యమని భావము) ॥౨౨॥

సవ్యే శూలం త్రిశిఖమపరే దోష్ణి భిక్షాకపాలం
సోమో ముగ్ధః శిరసి భుజగః కశ్చిదంసోత్తరీయం।
కోఽయం వేషస్త్రినయన కుతో దృష్ట ఇత్యద్రికన్యా
ప్రాయేణ త్వాం హసతి భగవన్ ప్రేమనిర్యంత్రితాత్మా॥

అర్థః—త్రినయన భగవన్ = ఓ ముక్కంటివేలుపా! సవ్యే దోష్ణి = కుడిచేతియందు, త్రిశిఖం = మూడుకొనలు గల, శూలం = శూలమును, అపరే = రెండవ చేతియందు, భిక్షాకపాలం = బిచ్చపు పుర్రెయును, శిరసి = తలలో, ముగ్ధః = ముద్దైన, సోమః = చందమామయు, కశ్చిత్ = ఏదియో, భుజగః = పాము, అంసోత్తరీయం = పై బట్టగాను, (కలిగిన) అయం = ఈ, వేషః = వేసము, కః = ఎట్టిది? కుతః = ఎచ్చోట, దృష్టః = చూడబడెను? ఇతి = ఇట్లు, అద్రికన్యా = పార్వతి, ప్రేమనిర్యంత్రితాత్మా = ప్రేమచేత అపుకొనిన చిత్తము గలదై, ప్రాయేణ = బహుళః, త్వాం = నినుగూర్చి, హసతి = నవ్వుచున్నది.

తా. ఓ ముక్కంటీ! "కుడిచేతిని త్రిశూలమును, ఎడమచేతియందు కపాలమును, తలలో నందమైన చందమామను, ఉత్తరీయముగా పామును ధరించినావే! ఇది యెట్టి వేసము? ఎక్కడ చూచి వేసికొంటిరి?" ఇట్లు నిను గూర్చి పార్వతీదేవి పైకి హాస్యమాడుచున్నను అంతస్సున ప్రేమ ముట్టిపడుచుండ నానందము ననుభవించుచున్నది. (పైకి జూచుట కివి వికారముగ నున్నను లోకోత్తరములు కావున పార్వతి సంతసించిన దని భావము) ॥౨౩॥

ఆర్ద్రాం నాగాజిన మవయవగ్రంథిమద్ బిభ్రదంసే
[illegible]

పశ్యన్ గౌరీం భయచలకరాలంబితస్కందహస్తాం
మన్యే ప్రీత్యా ద్రుత ఇతి భవాన్ వజ్రదేహోఽపి జాతః॥

అర్థ:— భవాన్ = నీవు, అవయవగ్రంథిమత్ = అవయవముల ముడులుగలట్టియు, ఆర్ద్రం = క్రొత్తదైన, నాగాజినం = గజచర్మమును, అంసే = భుజమున, బిభ్రత్ = ధరించుచున్న వాడవై, ఘనరుచి = మేఘవర్ణము కలదైన, రూపం= ఆకారమును, ప్రాప్తః= పొందినవాడవై, మహాభైరవం = అతిభయంకరాకృతిని, దర్శయన్= చూపుచున్న వాడవై, గౌరీం =పార్వతిని, భయచలకరాలంబితస్కందహస్తాం = భయమువలన కదలుచున్న చేతితో అవలంబింపబడిన కుమారస్వామి హస్తము కలదానినిగా, పశ్యన్ = చూచుచు, వజ్రదేహోఽపి = కఠోరశరీరుడవైనను, ప్రీత్యా = స్నేహముతో, ద్రుతః=కరగినవాడవు జాతః=ఐతివి. (ఇట్లు) మన్యే=భావించుచున్నాను.

తా. స్వామీ! నీవు (గజాసురసంహారము గావించినపుడు) క్రొత్తగా నున్న రక్తసిక్తమైనట్టియు, అవయవపుముడులు గలిగినట్టియు, ఆ గజచర్మమును మూపున దాల్చి మేఘాకృతితో మహాభయంకరుడవుగా గన్పించుచున్నపుడు; భీతిజెంది వణకి తన చేతితో స్కందుని హస్తము బట్టుకొనినట్టి పార్వతిని జూచి కఠినదేహుడవైనప్పటికిని ఆమె విషయమున జాలిజెంది యాదరించియుందు వని నేను భావించుచున్నాను.

వి. ఈ స్తవము ౭ వ శ్లోకమున గజాసురకథ కలదు ॥౨౮॥

మంత్రాభ్యాసో నియమవిధయ స్తీర్థయాత్రానురోధో
గ్రామే భిక్షాచరణమటజే బీజవృత్తి ర్వనే వా।
ఇత్యాయాసే మహతి రమతా మప్రమేయ ప్రగల్భః
స్మృత్వైవాహం తవ చరణయో ర్నిర్వృతిం సాధయామి ॥

అర్థ:—అప్రమేయ = అగోచరా! మంత్రాభ్యాసః = వేదాధ్యయనము, నియమవిధయః= నియమములు విధులును, తీర్థయాత్రానురోధః = తీర్థయాత్రల ననుసరించుట, గ్రామే = పల్లెలందు, భిక్షా

చరణం = బిచ్చమెత్తుటయు, ఉటజే = పర్ణశాలలో, వా = అథవా, బీజవృత్తిః = గింజలతో జీవించుటయు, ఇతి = ఇట్లు, మహతి = గొప్పదైన, ఆయాసే = కష్టమునందు, ప్రగల్భ, = తెలివిగలవాడు, రమతాం = క్రీడించుగాక! అహం = నేను, తవ = నీయొక్క, చరణయోః = పాదములను, స్మృత్వైవ = స్మరించియే, నిర్వృతిం = ముక్తిని, సాధయామి = పొందుచున్నాను.

తా. ఓ యమేయ స్వరూపా! ప్రతిభాసంపన్నులును సమర్థులును అగువారు వేదాధ్యయన బ్రహ్మచర్యమునుగాని, అతిథిసత్కారాది నియమములను, తీర్థయాత్రాది పర్యటన (గార్హస్థ్య) మునుగాని, పల్లెలు దిరిగి భిక్షమెత్తుట, అడవిలో గుడిసిలో గాని నివసించి ధాన్యము నేరు కొని (సన్న్యాసవానప్రస్థముగైకొని) గాని ఇట్టి మిక్కిలి కష్టప్రదమగు ధర్మమును పరిపాలింతురుగాక! నే నన్ననో మందమతిని; సోమరిని. నీ చరణముల నాశ్రయించి మాత్రమే ముక్తిని పొంద నిచ్ఛగించు చున్నాను. (బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మపాలనము కన్నను శివభక్తి వలన సులభముగ నిత్యసుఖము నందవచ్చునని భావము.) ॥౨౧॥

ఆస్తాం తావత్ స్నపనముపరి క్షీరధారాప్రవాహైః
స్నేహాభ్యంగో భవనకరణం గంధధూపార్పణం వా।
యస్తే కైశ్చిత్కిరతి కుసుమైరుద్దిశన్ పాదపీఠం
భూయో నైష భ్రమతి జననీగర్భకారాగృహేషు॥ ౨౮॥

అర్థ:—ఉపరి = నీపై, క్షీరధారాప్రవాహైః = పాలధారల గుంపుచేత, స్నపనం=అభిషేకము, స్నేహాభ్యంగః = తైలస్నానము, గంధధూపార్పణం = గంధధూపముల నర్పించుట, వా = అథవా, భవనకరణం = ఆలయమును నిర్మించుటయు, ఆస్తాంతావత్ =అట్లుండు గాక! యః = ఎవ్వాడు, తే=నీ యొక్క, పాదపీఠం = చరణవేదికను, ఉద్దిశన్ = ఉద్దేశించినవాడై, కైశ్చిత్ = కొన్నిదైన, కుసుమైః = పూలచేత, కిరతి = చల్లుచున్నాడో, ఏష = ఈతడు, జననీగర్భకారా గృహేషు = తల్లిగర్భమనెడు బంధికానల్లో, భూయః = మరల, న భ్రమతి = తిరుగడు.

తా. మహేశా! నీకు ఆలయమును గట్టించుట, క్షీరకుంభాభిషేకములఁ జేయుట, తైలస్నానము జేయించుట, గంధముల నలఁది ధూపము వేయుట మున్నగు మహోపచారము లట్లుండుగాక! నీచరణ యుగ్మముపై భక్తితో నేకొలది పూల నర్పించినవాడును మరల మరల మాతృగర్భగోళమును జొచ్చి బాధ ననుభవింపకుంటచే ముక్తుడగు చున్నాడు.

వి. శివాలయనిర్మాణమును, శాస్త్రోక్తముగ షోడశోపచారపూజయును, గొప్పవే కాని కష్టకరములు, ఏ యడవిపూలనో తెచ్చి శివునిపై చల్లినను ముక్తికర మనుట విశేషము. ‖౨౬‖

ముక్తాహారం మునిభిరనిశం మౌనిభి ర్ధ్యాయమానం
ముక్తాగౌరం శిరసి జటిలే జాహ్నవీముద్వహంతం ।
నానాకారం నవశశికలాశేఖరం నాగహారం
నారీమిశ్రం ధృతనరశిరోమాల మీశం నమామి ‖౨౭‖

అర్థ:—ముక్తాహారం = నిరాహారముగా, అనిశం = నిరంతరము, మునిభిః = యతీశ్వరులచేతను, మౌనిభిః = వాచంయములచేతను? ధ్యాయమానం = ధ్యానింపబడుచున్నవాడును, ముక్తాగౌరం= ముత్యములవలె తెల్లనైనవాడును, జటిలే = జడలుగల, శిరసి = తలయందు, జాహ్నవీం = గంగను, ఉద్వహంతం= పైకి దాల్చినవాడును, నానాకారం = వివిధరూపుడును, నవశశికలాశేఖరం = బాలచంద్రుని తల ధరించినవాడును, నాగహారం = సర్పభూషణుడును, నారీమిశ్రం = గౌరీమిలితుడును, ధృతనరశిరోమాలం = ధరింపబడిన ముండమాలలు గలవాడును, అగు, ఈశం = పరమేశ్వరుని, నమామి = మ్రొక్కుచున్నాను.

తా. నిరాహారవ్రతము గల తపస్వులచేతను, వాక్కుల మానిన యతీశ్వరులచేతను సదా ధ్యానింపబడువాడును, ముత్తెమువంటి మైచాయగలవాడును, తలలోని జడలో గంగను దాల్చినవాడును, బహురూపుడును, చంద్రశేఖరుండును, ముండమాలాధరుండును, సర్పహారుండును, అర్ధనారీశ్వరుండును అగు పరమేశ్వరుని ప్రణమిల్లుచున్నాను.

తిర్యగ్యోనౌ త్రిదశనిలయే మానుషే రాక్షసే వా
యక్షావాసే విషధరపురే దేవ విద్యాధరే వా ।
యస్మిన్ కస్మిన్ సుకృతినిలయే జన్మనిశ్శ్రేయసే వా
భూయాద్యుష్మచ్చరణకమలధ్యాయినీ చిత్తవృత్తిః॥ ౨౮॥

అర్థ:—దేవ = ఈశ్వరా! తిర్యగ్యోనౌ = జంతుగర్భమున, త్రిదశనిలయే = దేవతాగృహమున, మానుషే= మానవమున, వా= అథవా, రాక్షసే = అసురమున, యక్షావాసే = యక్షగృహమున, విషధరపురే = నాగలోకమున, వా = లేక, విద్యాధరే = విద్యాధర లోకమున, యస్మిన్ కస్మిన్ = ఏదియో యొక, సుకృతి నిలయే = పుణ్యక్షేత్రమునందు, వా = లేక, నిశ్శ్రేయసే = ముక్తికొరకు, జన్మ = జననము, భూయాత్ = అగుగాక, చిత్తవృత్తిః = నాయొక్క మనఃపరివృత్తి మాత్రము, యుష్మచ్చరణకమలధ్యాయినీ = నీయొక్క పాదపద్మముల ధ్యానించునట్టిది (అగుగాక !)

తా. మహేశ్వరా! నా జన్మ పశుపక్షిజాతిలో గాని, దేవ దానవ మానవ లోకములలో గాని, యక్ష విద్యాధరులలో గాని, పాతాళమున గాని, అథవా ముక్తికొరకే కాని ఎక్కడనైనను పవిత్ర స్థలమున అగుగాక! నా కదియొక ముఖ్యమైన విషయము కాదు, ఎక్కడ నెట్టి రూపముతో బుట్టినను సరియె కాని నా హృదయము మాత్రము నిరంతరము నీ పాదపద్మముల ధ్యానించు నట్టిదిగా నుండ వలెను. ఇదియే నా ముఖ్యాభిలాష. ౨౮॥

వందే రుద్రం వరదమమలం దండినం ముండధారం
దివ్యజ్ఞానం త్రిపురదహనం శంకరం శూలపాణిం ।
తేజోరాశిం త్రిభువనగురుం తీర్థమౌళిం త్రినేత్రం
కైలాసస్థం ధనపతిసఖం పార్వతీనాథ మీశం ॥ ౨౯॥

అర్థ:—రుద్రం = ఏడ్పించువాడును, వరదం = ఇష్టార్థముల నిచ్చువాడును, అమలం = నిర్మలుడును, దండినం = కంకాళదండము గలవాడును, ముండధారం = శిరముల దాల్చువాడును, దివ్యజ్ఞానం =

ప్రత్యక్షజ్ఞానస్వరూపుండును, త్రిపురదహనం = ముప్పురముల గాల్చిన వాడును, శంకరం = సుఖకరుండును, శూలపాణిం=చేత శూలము గల వాడును తేజోరాశిం = చిన్మయుడును, త్రిభువనగురుం = త్రిలోక గురుండును, తీర్థమౌళిం = తలలో గంగను కలవాడును, త్రినేత్రం = ముక్కంటియును, కైలాసస్థం = కైలాస నివాసుఁడును, ధనపతిసఖం = కుబేరమిత్రుడును, పార్వతీనాథం = గౌరీవల్లభుండును అగు, ఈశం = ఈశ్వరుని, వందే = నమస్కరించుచున్నాను.

తా. ప్రళయకాలమున సర్వమును హరించుటవలన లౌకికులకు రోదనము గలుగ జేయువాడును, వరప్రదుడును, విష్ణుకంకాళధరుండును ముండమాలదాలుపును, సుజ్ఞానుండును, ముప్పురముల గాల్చినవాడును, సుఖకరుండును; శూలము కేల గలవాడును; చిన్మయుడును; సమస్తలోక చక్రవర్తియును; గంగాధరుండును; ఫాలాక్షుండును; కైలాసనిలయుండును, కుబేర మిత్రుండును, పార్వతీప్రియుండును అగు పరమేశ్వరుని మ్రొక్కుచున్నాను,

వి. ఈ దండికవి తన రెండవశ్లోకమున సూచించినట్లు పరమేశ్వరుని స్థూల రూపమే ఇచ్చట వర్ణింపబడినది. భక్తులయనుగ్రహార్థమై శివుడు సాకారుడనుట శాస్త్ర ప్రసిద్ధము. ఈ శ్లోకమందలి "దండినం" అను విశేషణము చమత్కారద్యోతకముగా నున్నది. ఇట్టిది క్రొత్తగా ఈ కవిచేతనే ప్రయోగింప బడినట్లున్నది. తన పేరు దండి కావున అట్టి నామము శివునకు గూడ పొందించెను. విష్ణువు మత్స్యావతారమున తమోఽసురుని సంహరించిన పిదప సముద్రమును ఉల్లోలకల్లోలము గావించి జగమును పీడించుచున్నందున శివుడు దానిని బరిమార్చి దాని శెన్నెముకను దండమువలె చేతిలో ధరించినందున దండి యయ్యెనని తాత్పర్యము. ఈతమోసురునకు శంఖాసురుడనియు సోమకాసురుఁడనియు, మారుపేరులు కలవు. ఇది పురాణగాథ. (పద్మ. స్మృ ౧. ఉ. ౬౦-౬౧) కుబేరుడు తన అన్నయైన రావణుని బాధకు తాళజాలక తపమొనర్చి శివుని మెప్పించి నవనిధుల కధిపతియగుటయు శివమిత్రత్వము సంపాదించుటయు పురాణ ప్రసిద్ధము ॥౨౯॥

యోగీ భోగీ విషభుగమృతశ్ఛత్రపాణిస్తపస్వీ
శాంతః క్రూర క్షమితవిషయః శైలకన్యాసహాయః।
భిక్షావృత్తి స్త్రిభువనపతిః శుద్ధిమా నస్థిమాలీ
శక్యో జ్ఞాతుం కథమివ శివ త్వం విరుద్ధస్వభావః ॥౩౦॥

అర్థ:—శివ = కల్యాణకరా! త్వం = నీవు, భోగీ = భోగము గలవాడవైనను; యోగీ = తపస్వివి; విషభుక్ = విసము మెక్కినవాడవైనను; అమృతః = మరణరహితుడవు; శస్త్రపాణిః = శూలపినాకాదుల ధరించినవాడవు; తపస్వీ = యతీశ్వరుడవు; శాంతః = శాంతుడవు; క్రూరః = రుద్రుడవు; శమితవిషయః = జయింపబడిన విషయాభిలాషుడవు, శైలకన్యాసహాయః = పార్వతీపతివి; త్రిభువనగురుః = త్రిలోకపతివి; భిక్షావృత్తిః=బిచ్చముతో బ్రదుకువాడవు; అస్థిమాలీ= ఎముకల దండల ధరించినవాడవును; శుద్ధిమాన్ = పవిత్రుడవు; (ఇట్లు) విరుద్ధస్వభావః=పరస్పరవిరుద్ధము లగు గుణములతో గూడినట్టివాడవై; కథమివ = ఎట్లు; జ్ఞాతుం = తెలిసికొనుటకు; శక్యః = సాధ్యుడవు!

తా. ఓ పరమేశ్వరా! నీవు లోకసృష్టి మున్నగు క్రీడలు గలవాడ వని భోగివనుకొనెదనా తద్విరుద్ధముగ చిత్తవృత్తుల నిరోధించి ప్రాణాయామాదులతో యోగివై యున్నావు. విషమును దిన్నను మరణము లేకున్నావు. పినాకత్రిశూలాదులు ధరించినను సన్న్యాసివిగా నున్నావు. పార్వతిని పెండ్లియాడినను ఇంద్రియముల జయించి శాంతుడవైనావు. ముల్లోకములకు గురుండవై భిక్షమెత్తుకొనుచున్నావు; ఎముకలు కపాలము లున్నను; అగ్నిగంగాది పావనవస్తువులు గలవాడవు; ఇట్లు పరస్పరముగ విరుద్ధమైన గుణములు గలవాడవగుటచే నీస్వరూప మిట్టిదే యని నిర్ణయించుట కలవి గాకున్నది స్వామీ ॥౩౦॥

ఉపదిశతి యదుచ్చై ర్జ్యోతిరామ్నాయ విద్యా
పరమపరమదూరం దూరమాద్యంత శూన్యం।
త్రిపురజయిని తస్మిన్ దేవదేవేశ తే మే
భగవతి పరివర్తోన్మాదినీ భక్తిరస్తు ॥౩౧॥

అర్థ:—దేవ = ప్రభూ! దేవేశ = మహాదేవా! ఆమ్నాయవిద్యా = వేదవిద్య, ఉచ్చైః = ఉన్నతమైన, యత్ = ఏ, జ్యోతిః = ప్రకాశమును, పరం = సర్వాతీతమైనట్టి, అపరం = అసమానమైనట్టి అదూరం = ఉపాసకులకు సమీపస్థమును, దూరం = భక్తిరహిత

లకు దవ్వైనదియును, ఆద్యంతశూన్యం = కొన మొదలు లేనిదిగాను, ఉపదిశతి= చెప్పుచున్నదో, భగవతి= పరమపూజ్యమైనట్టియు, త్రిపుర జయిని = త్రిపురముల గెలిచినదైనట్టి, తే = నీ యొక్క, తస్మిన్ = ఆ జ్యోతియందు; మే = నా యొక్క; భక్తిః = భక్తి; అపరివర్తోన్మాదినీ = పరిభ్రమణము చేయుటలో ఉద్రేకము గలది; అస్తు = అగుగాక!

తా. లోకోత్తరము లగు వేదవేదాంతములు యే ఉన్నతమైన జ్యోతిని పరముగాను, అపరముగాను, దూరాదూరముగాను; ఆద్యంత శూన్యమైన దానినిగాను చెప్పుచున్నవియో; ఓ మహాదేవా! అట్టి షడ్గుణైశ్వర్యములు గల్గినట్టియు; త్రిపురముల జయించి లోకగోచరమైనట్టియు నీ యొక్క పరంజ్యోతిస్వరూపమునందే నా భక్తి నిరంతరము సంచరించుచు మరియొక విషయము తెలియనిదై నిలుచుగాక!

వి. "ఋతం సత్యం పరం బ్రహ్మ" "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" "ఏకో రుద్రో నద్వితీయః" ఇత్యాది శ్రుతులవలన శివుడొక్కడే పరబ్రహ్మమని తెలుచుండుట వలన దండికవివాక్యము యథార్థమై యున్నది. స్తోత్రమును ముగింపనెంచి శిష్టాచార ప్రకారము వృత్తభేదము అవలంబింపబడినది. ఇది మాలినీవృత్తము. (న న మ య య గణములు) ‖౩౧‖

ఇతి విరచితమేతచ్చారు చంద్రార్ధమౌళే-
ర్లలితపదముదారం దండినా పండితేన।
స్తవనమవనకామేనాత్మనోఽనామయాఖ్యం
భవతి విగతరోగో జంతురేతజ్జపేన ‖౩౨‖

అర్థ:—చారు = మనోహరమైనట్టియు;లలితపదం = సుందరములైన శబ్దములు గలట్టియు; ఉదారం= గంభీరమైనట్టియు; చంద్రార్ధమౌళేః= అర్ధచంద్రుని తలదాల్చిన శివునియొక్క; అనామయాఖ్యం= అనామయ మను పేరు గల; ఏతత్ = ఈ; స్తవనం = స్తోత్రము; ఆత్మనః = తనయొక్క; అవనకామేన = రక్షణము నపేక్షించునట్టి; దండినా = దండి యను పేరుగల, పండితేన = విద్వాంసునిచేత; ఇతి= ఈ విధముగా; విరచితం = విరచింపబడెను; ఏతజ్జపేన = దీనియొక్క

పారాయణముచేత; జంతుః = ప్రాణి; విగతరోగః = నష్టమైన వ్యాధి గలవాడు; భవతి = అగుచున్నాడు.

తా. దండికవీంద్రుడు తన రక్షణము నపేక్షించి శివునిగూర్చిన ఈ యనామయస్తవమును విరచించినాడు. ఇది చక్కని పదగుంఫనము కలదై, మధురమై శ్రావ్యముగా నున్నది. దీని భక్తితో బఠించిన వారు ఆధివ్యాధి జరామరణ బాధలు తొలగి యానందమును పొంద గలరు.

వి. ఈ శ్లోకమువలన వ్యాధిగ్రస్తుడైన దండియే ఈ స్తవమును రచించినా డనియును, "లలితపదం" అనుటవలన "దండినః పదలాలిత్యం" అను మాటను స్వయముగ కవియే చెప్పినటులైనది. ఈ స్తోత్రరచనవలన ఆమయ (రోగ) ము నివారణమైనది కావున నిది యనామయస్తవమని ప్రఖ్యాతమయ్యెను. ఈయమోఘస్తవమును పారాయణముచేయువారు దండిపండితుని వలెనే వ్యాధినుండి విముక్తులగుదు రనుటలో సందేహమే లేదు. ॥౩౨॥

అధికపాఠము

[కొన్ని పుస్తకములలో నీ క్రింది మూడుశ్లోకములు గూడ కనుపించుచున్నవి. ఇవి యధిక పాఠములవలె నున్నవి. ఐనను ప్రచారములో నున్నవి కావున నీయబడు చున్నవి.]

భిన్నావస్థే జగతి బహునా దేశకాలప్రభేదాద్
ద్వాభ్యాం పాపాన్యధిగిరి హరన్ యోఽనవద్యః క్రమాభ్యాం।
ప్రేక్ష్యారూఢః సృజతి నియమాదస్య సర్వంహి యత్తత్
సర్వజ్ఞత్వం త్రిభువనసృజో యత్ర సూత్రం న కించిత్॥౩౩॥

అర్థః—జగతి = లోకము, దేశకాల ప్రభేదాత్ = దేశముయొక్కయు కాలముయొక్కయు భేదమువలన, బహునా = ఎక్కువగా, భిన్నావస్థే = వివిధములైన అవస్థలుగలది యగుచుండగా, అనవద్యః= అమోఘుడై నట్టి, యః=ఏపరమేశ్వరుడు, అధిగిరి=కైలాసమున (ఉండు వాడై) ద్వాభ్యాం=ఆ రెండువిధములైన, క్రమాభ్యాం= దేశకాలక్రమముల చేత, పాపాని=కల్మషములను, హరన్=నశింప చేయుచున్నాడో, అస్య = ఈ శివునియొక్క, యత్ =ఏ, సర్వం = సమస్తచేష్ట, (కలదో) తత్ = దానిని, ప్రేక్ష్య = చూచి, ఆరూఢః = అధిష్ఠించిన బ్రహ్మ

నియమాత్ = నియమము వలన, సృజతి=సృష్టించుచున్నాడు. హి = అయితే, యత్ర = ఏ బ్రహ్మయందు, కించిత్ = కొంచెమైనను, సూత్రం = అధికారము, న = లేదో-అట్టి, త్రిభువనసృజః = ముల్లోకములఁ బుట్టించు బ్రహ్మకైనను, సర్వజ్ఞత్వం = సర్వజ్ఞత్వము, (కుత్ర= ఎక్కడ ?)

తా. కైలాసవాసియు నిర్మలుడును నగు నే మహామహుని సంకేతమువలన నీ సకలచరాచరములు దేశకాలభేదముల వలన సృష్టిస్థితి సంహారము గలవియును, పంచభూతాత్మకములును అగుచున్నవియో, వీని క్రమమును కొంత యెఱిగి యా ప్రకారమే, తెలివి గల బ్రహ్మ ఈ లోకముల సృష్టి గావించుచున్నాడు. అంతియే కాని ఈ బ్రహ్మకు స్వయంసిద్ధమైన యధికారసూత్రము స్వాధీనముగా లేనందున సర్వజ్ఞత్వము సంభవింపజాలదు

వి. చతుర్ముఖ బ్రహ్మకు ఒక సృష్టి యధికారమే గలదు. అట్లే విష్ణువుకు రక్షణయందును, రుద్రునకు సంహారము నందును అధికారము గలదు. ఇవి ఒక్కొక పనులు మాత్రమే. "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" అను శ్రుతి ప్రకారము ఈ ముగ్గురకు మూల కారణుడైన శివుడే సర్వకర్తయై సర్వజ్ఞ బిరుదమునకు అర్హుడని తెలియవలెను. రుద్రశబ్దము సామాన్యముగ శివునకు చెల్లినను శివుని యొక యంశావతారమే రుద్రరూపముగా శాస్త్రమున నిరూపిత మైనది. ఈ శ్లోకమున అన్వయము సరిగా లేదు. గాంభీర్యము తక్కువ. "విశ్వం ప్రాదుర్భవతి" యను నాల్గవ శ్లోక మందలి భావమే ఇందు పునరుక్తమైన ట్లున్నది. ఈ కారణము వలన నిది దండికృతము కాదేమో యని సందేహము కల్గుచున్నది. ॥౩౩॥

వ్యాళాకల్పా విషమనయనా విద్రుమాతామ్రభాసా
జాయామిశ్రా జటిలశిరస శ్చంద్రరేఖావతంసాః ।
నిత్యానందా నియతలలితాః స్నిగ్ధకల్మాషకంఠా
దేవా రుద్రా ధృతపరశవ స్తే భవిష్యంతి భక్తాః ॥౩౪॥

అర్థః— తే = నీయొక్క, భక్తాః= భక్తులు, వ్యాళాకల్పాః = సర్పభూషణములును, విషమనయనాః= బేసికనులు గలవారును, విద్రుమాతామ్రభాసాః = పగడములవలె నెఱ్ఱని కాంతిగలవారును,

జాయామిశ్రాః = భార్యాకలితులును, జటిలశిరసః = జడలున్న తల గలవారును, చంద్రరేఖావతంసాః = చంద్రవంకయే సొమ్ముగా గల వారును, నిత్యానందాః = అక్షయానందము గలవారును, నియతలలితాః = శాశ్వతసుందరులును, స్నిగ్ధకల్మాషకంఠాః = మెరయుచున్న నల్లని మెడగలవారును, దేవాః = దేవులైన, రుద్రాః = ఏకాదశ రుద్రస్వరూపులును, ధృతపరశవః = ధరింపబడిన గొడ్డలిగలవారును, భవిష్యంతి = కాగలరు

తా. పరమేశ్వరా! నీయందు అనన్యభక్తిగలవారు అంత్యమున సాయుజ్యముక్తినే పొందుదురు. కావున నీవలెనే సర్వ చిహ్నములు గలవారై నీవే యగుచున్నారు. పునర్జన్మ లేదని భావము.

వి. ఈశ్లోకము బాగుగనే యున్నది కాని యతిస్థానములలో ఆంధ్రకవిత్వము నందువలె అక్షరమైత్రి యున్నందున దీని నాంధ్రపండితు డెవడైన రచించెనా యని తోచుచున్నది. ఇట్టి సులభశైలి దండికవిత్వమున గనుపింపదు. "భవిష్యంతి" కంటె "భవంతి" అనుటయే ప్రౌఢము ॥౩౪॥

స్తోత్రం సమ్యక్పరమవిదుషా దండినా వాచ్య వృత్తా
మందాక్రాంతాం త్రిభువనగురోః పార్వతీవల్లభస్య ।
కృత్వా స్తోత్రం యది సుభగమాప్నోతి నిత్యం హి పుణ్యం
తేన వ్యాధిం హరహర నృణాం స్తోత్రపాఠేన సత్యమ్॥ ॥౩౫॥

అర్థః—పరమవిదుషా = పెద్దపండితుడైన, దండినా = దండిచేత, సమ్యక్ = బాగుగా, వాచ్యవృత్తా = చదువ కమ్మనైన వృత్తము లగు, మందాక్రాంతా = మందాక్రాంతములనుగూర్చి, త్రిభువనగురోః = త్రిలోకప్రభు డగు, పార్వతీవల్లభస్య = పార్వతీశుని, స్తోత్రం = స్తవనము, (విరచింపఁబడెను) యదిహి = ఒకవేళ, స్తోత్రం = స్తవమును, కృత్వా = చేసి, నిత్యం = శాశ్వతమైనట్టియు, సుభగం = మంచి సంపత్తుగలట్టియు, పుణ్యం = పుణ్యమును, ఆప్నోతి = పొందుచున్నాడు, హర = ఓ శివా! తేన = ఆ, స్తోత్రపాఠేన = స్తవన పారాయణముచేత, నృణాం = నరులయొక్క, వ్యాధిం = రోగమును, సత్యం = నిశ్చయముగా, హర = నశింపజేయుము.

తా. చదువుట కింపైన యీ మందాక్రాంత పద్యములతో గొప్ప పండితుడైన దండిచే నీ శివస్తోత్రము విరచింపబడినది. దీని నొకవేళ పఠించినను శాశ్వతమైన పుణ్యమును పొందగలరు. ఓ పరమేశా! ఏతత్పారాయణము చేయువారి వ్యాధిని తప్పక హరింపుము.

వి. ఈ శ్లోకము వికటముగా నున్నది. అంతయు దురన్వయముగాను, పేలవముగను, స్తోత్రశబ్దముల పునరుక్తులతోడను గూడి యున్నది. "ఇతి విరచిత" మను ౩౨ వ శ్లోకము తరువాత దీనిని రచింప నవసరము లేదు. ౩౦ వ శ్లోకముననే వృత్తమును మార్చి మరల నంత్యమున మందాక్రాంతము చెప్పబడినది. "గొప్ప పండితుడైన దండిచేత" అను మాటను కర్తయే వ్రాసికొని యుండడు. కావున నిది దండి కృతము కాదనియే భావింపవలెను. "వాచ్యవృత్తం మందాక్రాంతం" అని మార్చిన కొంత సామంజస్య మేర్పడగలదు ॥౩౪॥

ఇది శివపంచస్తవీ భక్తరంజనియందు అనామయస్తవ వ్యాఖ్యసమాప్తము.

# ఆంధ్రానామయస్తవము

## (పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు)

---

క. శ్రీమద్దండివిరచిత సు,నామయనుతిఁ దెనుఁగుసేతు నాత్మార్థంబై
ప్రేమించి శివపదమ్మును, ధీమంతులు దీనిఁ గొఱతఁ దీర్పుడు కరుణన్.

సీ. శ్రీమజ్జగద్గురుస్వామి రేణుకదేవుఁ, డెవని వంశాంభోధి కినయ విధుఁడు
దక్షశిక్షకుఁడు ఫాలాక్షజటోత్థుండు, వీరుఁ డెవ్వని గోత్రకారణుండు
చిత్కళాధామంబు చిదిరెమఠ మ్మని, యెవని యన్వయమున కవనిఁ బేరు
శ్రీనాగభూషణ శ్రీ శ్యామలాంబలు, జనకులై యెవ్వని గనిరి ప్రేమఁ

గీ. గాశికాక్షేత్ర పండిత కాండ మెవని, వేదవేదాంత ధర్మశాస్త్రాది గురువు
వివిధభాషేతిహాసాది విదుఁడెవండు, వీరభద్రాహ్వయుండె యీ వినుతికర్త.

---

శా. ఆశాపీడితుఁడున్ దమోవృతుఁడు బద్ధాత్ముండు సంసార దు
ష్పాశోపేతుఁడు నెట్లు మాదృశుఁడు గాంచం జాలు నైశద్యుతిన్!
శ్రీశర్వున్ భజనీయు నాత్మహితుఁగాఁ జింతించి యీ వాక్కులా
యాసం బేమియులేక వెల్వడెడు నా యాస్యంబునం దుండియున్. ౧

చ. వనజభవుండు, విష్ణు యమ వారుణ దిక్పతి వాసవాదులున్,
ధనదుఁడు, సూర్యచంద్ర వసు దైవతముల్ గలరెంద రెందఱో
కనుగొని నీదు సూక్ష్మతను గైతలచేత నుతింపఁ జాలిరే?
త్రినయన! స్థూలరూపమునె ధీరత నే స్తుతిసేయ నేర్చెదన్. ౨

చ. హరుపద దివ్యభక్తి యది యబ్బినఁ జాలును స్తోత్ర మీడ్యమై
పరఁగదె గ్రామ్యుఁ డాటవికమానవుఁ డున్ స్తుతి నల్లఁజాలడే!
మరి శ్రుతు లెల్ల నేర్చినను భక్తివిహీనుఁడు త్వత్కృపాప్తికిన్
గుఱియగునే,; పశూపముడు, కుంఠుఁ డనాత్మహితజ్ఞుఁ డెన్నఁగన్

చ. జగము జనించు నీదు ఘనసంశ్రయ మందినచో; ని కెట్లు జ
న్మ గలుగు కర్త చేతనయుతాత్ముఁడు గానిదె? పంచభూతముల్
తగ జనిఁ బొందెడిన్ స్వకలితావయవస్థితిచేత; నిట్లు నో
మృగధర! సర్వలోకపర మేశ్వరభావము నీకు సిద్ధమా. ౪

ఉ. చేతనలేని యప్రకృతిఁ జెప్పిరి భోగ్య మటంచు; భోక్తయున్
నేతయుఁ గాఁడు తత్ప్రకృతినిన్, నడిపింపఁగ నాత్మ పాశుఁ; డు
ద్భూత మగున్ రతుల్ ప్రకృతిపూరుషు లందున నీ మహాకృపన్;
చేతువు దీని నీవ శివ! చిత్రజగత్త్రయ సూత్రధారివై. ౫

మ. కలుగున్ సృష్టి, రజోతిరేకమునఁ ద్వత్కార్యమ్మె!, సత్త్వోన్నతిన్
మొలతెంచున్ స్థితి, సంహృతిక్రియ తమఃపుష్టిన్ మహేశా!, చలా
చలమా నీ ప్రకృతిస్థలోకములునున్ స్తంభాదవిధ్యంతముల్
చలనం బొందెడు నాటబొమ్మలయి, నీ సంకేతమాత్రంబునన్. ౬

మ. పులితోలే కడు చిత్రవస్త్రము, చితాభూభాగమే యిల్లు నీ
కిల, యానం బొక యెద్దు, కాని ప్రళయక్రీడాభివిష్టుండవై
కలుగం జేసెదు విశ్వకార్యముల, నో కైలాసవాసా! సుని
శ్చలమా నీదగు నీశశబ్దమె కదున్ జాటించు మాహాత్మ్యమున్. ౭

ఉ. ఏల యమంగళమ్ము లగు నీ యెముకల్ తమి సింగరించితో?
యేల యురున్ గురుస్తనసమేతను మేన ధరించి యుంచితో?
కేలను గండ్రగొడ్డలి యిఁకేల? నటంచును నక్షసూత్రమున్?
గేలిటు సేయు బాలిశుని ఖిన్నునిఁ జేయరె నవ్వి పండితుల్. ౮

చ. అమర! కపాలధారివ్రత మద్భుత మైనను ఘోరమైననున్
విమలత ముక్తిమార్గమున వేయదె? భక్తికి హేతు వౌట; నీ
మమత చెలంగుదాఁక ని నుమాసతి కూడుచు నాడుచున్ జగ
త్క్రమము ఘటించుకై ప్రజలఁ గాంచు సుఖక్రతు వాచరించెదన్. ౯

చ. హర! భవదీయదివ్యకృప నందినచోఁ గృశుఁడున్, కురూపియున్
సురవనితాగ్రహార్హనవసుందర దేవుఁడు కాఁడె?; ఎవ్వఁడే
నుతతరమైన నింద్రపద మొప్పగ నెక్కఁడె? దేవపూజ్యుఁడై;
మరి కుపితుండ వైనఁ బడి మ్రగ్గఁడె? తామసరూపమందునన్. ౧౦

చ. శరవణజాతమై విమలషణ్ముఖమై ద్విషడక్షియుక్తమై
పరఁగెఁ ద్వదీయ తేజమె కుమారసమాఖ్య దలిర్పఁ; దారకా
సురగృహబద్ధవాయుబలసూదనమోచకమై ప్రశస్తమై
సురవన తా[illegible] మహోన్నతిన్. ౧౧

శా. వేగాకృష్టభచంద్రసూర్యము, దిశావేధమ్ము, సంవర్తసిం
ధూగంభీరతరంగఘోషహార మస్తోకప్రభావమ్ము ము
క్తాగారమ్మగు గాంగశంబర; మహో కామాంతకా! త్వజ్జటా
భోగస్పర్శ ఘటించినంతనె శిఖాపుష్పప్రభం జెందదే! ౧౨

ఉ. నీలగళా! త్వదీయగళనీలమణిప్రభ చాటదే! కృపా
జాలము నీకు నెట్టిదియొ సర్వజగమ్ములఁ గూర్చి; యా విష
జ్వాలలు నీవు మ్రింగమిని స్థావరజంగమముల్ నశించి, కీ
లాలధిగర్భమెల్ల గరళమ్మయి పోయెడి మందరోద్ధతిన్. ౧౩

చ. మరుఁడు వికారిమోహనసమాఖ్యశరమ్మను నెక్కుబెట్టి, యో
గిరిశ! త్వదీయపార్శ్వమునఁ గించిదవస్థితుఁ డయ్యె; నంత నీ
గురుతరకోపదృష్టిభవఘోరకృశానువు నందుఁ జిక్కి యా
యరుణదళోకమంజరిగ తాళి విధంబున మాఁడె నక్కటా! ౧౪

చ. లవణసముద్రవీచిఘనలంబభుజమ్ములతోడ నెత్తి, నీ
మ వసతిపర్వతమ్మును విధూత మొనర్పఁగ రావణుండు; నీ
వవిచలితాంఘ్రిశాఖుఁడవ నైనఁ దుర్తిన్ రుధిరమ్ము గ్రక్క, యే
డ్చి విలపనంబు సేయుచుఁ బడెన్ బలిసద్మమునందు నాతఁడే! ౧౫

చ. దశముఖుఁ డేకశీర్షుఁ డయి త్వత్పదసన్నిధి శీర్షపద్మపూ
జ సలిపె నన్న, నీ దయిన సర్వపతిత్వము గోచరింపదే!
వెసఁ గొని దీననే వరము, విశ్వసురాసురులన్ పులస్త్యజుం
డసురగణైకదాస్యమున నక్కట వేయఁడె? లోకశత్రువై. ౧౬

ఉ. తావకపాదపద్మమును దద్దయు భక్తి స్పృశించు బాణునిన్
పావకనేత్ర! నిల్పవె యపారజగత్త్రియశీర్షమందు; దం
ష్ట్రావికరాళమా భ్రుకుటిచండతరమ్మగు వాని వక్త్రమున్
దేవసురారులం దొకఁడు తేలనె చూచుటకైన నప్పుడున్! ౧౭

మ. హర! నీ తాండవనృత్తమందుఁ జరణన్యాసమ్ముచే భూమి ది
క్కరులన్ వ్రాలు; భుజమ్ములెత్తఁగను మేఘంబుల్ గ్రహవ్రాతముల్
దిరుగున్; హుంకృతి గడ్డిపోచలక్రియన్ దిక్కుల్ కదున్ జారు ని
క్కరణిన్ లోకము లెల్ల పీడితములై కంపించు విశ్వేశ్వరా! ౧౮

మ. అనలస్తంభత నీవు దాల్చి నిలువ; న్నాదిన్ గనన్ బ్రహ్మ యే
గెను పైలోకము; గ్రిందికిన్ హరియు నేగెన్; దాని దర్శింప లే
కను నాశ్చర్యత నిన్నుఁ గూర్చి వినుతుల్ గావింపఁగా నప్పుడున్
ఘనపింగాక్షము నీలకంఠమును నై కన్పట్టె నీ రూపమున్. ౧౯

చ. పురములు మూఁడు గూల్చి; గిరిపుత్రికపైఁ గమనీయదృక్కులన్
బరపి; పినాకకోటిపయి బాహువు నుంచినయట్టి నీ పయిన్
సురవనషట్పదీజలదసుందరరాజికృతానుసారముల్
గురియవె? పారిజాతతరుకోమల పుష్పసుగంధవర్షముల్. ౨౦

మ. అరుణస్నిగ్ధము నాత్మనేత్రకమలం బర్పించి విష్ణుండు పు
ష్కరసాహస్రము పూర్తి సేయఁడె? మహాకష్టమ్ముతో; నంత బా
ల రవిన్ తత్పరిధిక్రియన్ దహనకీలవ్యాప్తమౌ చక్రమా
హరి సవ్యేతరబాహుఁ జేరె భవదీయాశీఃప్రభావమ్మునన్. ౨౧

మ. హరిహస్తమ్మునఁ జేరఁ జక్రము; త్రిలోకాశ్వాసనం బిచ్చి, యా
సురశీర్షములఁ గత్తరింతు నని దీక్షోత్సాహుఁడై పల్కఁ; బం
కరుహాకారము నేత్రమున్ మరల నక్కంసారి కబ్బెన్ గదా!
హర! నిన్ గొల్చు ననన్యభక్తున కసాధ్యంబైన దొం డున్నదే. ౨౨

చ. "ఒక చెయినిన్ త్రిశూలము, మఱొక్కట బిచ్చపు పుఱ్ఱె, చందమా
మ కలఁడు సుందరుండు తలఁ, బాము భుజమ్మున నుత్తరీయ, మీ
వికృతపు వేస మెక్కడిది? భిక్షుక!" యంచు గిరీంద్రపుత్రి ని
న్నకట! హసించెడిన్ మనమునన్ బిగఁబట్టుచుఁ బ్రేమకోశమున్.

చ. గజనవచర్మమున్ ముడులు గల్గినదానిని దాల్చి నీవు నా
సజలఘనాతిడంబరము సల్పి భయానకమూర్తిఁ జూప; గౌ
రి జడిసి స్కందుని న్నబల రీతి సమాశ్రయ మొందె; నామెఁ గాం
చి జరఠవజ్రదేహుఁడవ చేసితి వాదరమంచు నెంచెదన్. ౨౪

ఉ. వేదము లభ్యసించుట, వివేకముగా నియమంబుఁ బూని యా
త్రాదుల సేయుటల్, వనపదమ్మును జేరుట, భిక్షమెత్తుటల్
మోదముగా నొనర్చుత! ప్రబుద్ధుడు, ని య్యతికష్టకర్మముల్;
నీదగు పాదయుగ్మమునె నే స్మరియించి [illegible] తోడెదన్. ౨౫

ఉ. క్షీరఘటాభిషేకములు సేయుట; ధూపము లిచ్చి గంధ తై
లోరువిలేపనమ్ము, గుడు లోలి రచించుట లుండుగాక! నిన్
గోరి యెవండు పువ్వొకటిఁ గూర్చునొ త్వత్పదపీఠ సన్నిధిన్
జేరఁడు మాతృగర్భ మను చీకటికొంప ని కెన్నఁ డేనియున్. ౨౬

చ. మునిజన మానసేడితుని, ముత్తెపుదండనుగా సతమ్ము గం
గను దన జాటజూటమునఁ గట్టిన మేటి, నవేందుశేఖరున్
ఘనఫణిభూషణున్, విశదగాత్రుని, విశ్వేశుని, ముండమాలి, క
ర్తను, వనితాసమేతు, గిరిధాము, మహేశుని మ్రొక్కెదన్ శివున్.

ఉ. మానుషమందుఁ గాని, సురపాశవదానవ పక్షియోనులం
గాని, భుజంగయక్ష తనుకాండమునందున, సిద్ధజాతిలోఁ
గాని, మదీయజన్మ మగుగాత! మఱెక్కడ నైనఁ బుణ్యలో
కాన; మనమ్ము త్వచ్చరణకంజ సుభక్తియుతమ్ము గావలెన్. ౨౮

చ. వరదుని రుద్రునిన్ విమలు వందితు దండిని ముండధారు శం
కరునిఁ బురత్రియజ్వలను గాంతిసమూహుని శూలపాణి సుం
దరు భువనత్రియేశ్యు నగధాము శిరోధృతతీర్థుఁ గిన్నరే
శ్వరసఖుఁ బార్వతీరమణుఁ బావకనేత్రు భజింతు నీశునిన్. ౨౯

ఉ. యోగియు శస్త్రపాణియు;విషాదనుఁడు న్నమృతుండు; దాంతుఁడున్
భోగియు గ్రూరసత్త్వుఁడు; విముక్తరతుండును బార్వతీశుఁడున్;
రాగియు శాంతుఁడున్; భువనరాట్పతి యాచకుఁ; డస్థిశుద్ధుఁడున్
గాఁగలయట్టి నిన్ దెలియఁగా నగునే శివ! ద్విస్వభావునిన్. ౩౦

చ. పర మపరమ్మునై శుభము పావనమై శ్రుతిశీర్షసూక్తమై
మరి ఘనతేజమై విబుధమాన్య మనాది సమీపదూరమై
పరఁగెడు నెద్ది శుద్ధమయి భవ్యమునై భగవంత మట్టి నీ
పరశివరూపమం దమితభక్తి నసించుత నాకు నిత్యమున్. ౩౧

ఉ. దీనిని దండిపండితుఁడు తియ్యని పల్కులతోడఁ జక్కఁగాఁ
బూని రచించె; శంభుకృపఁ బూర్ణముగాఁ గొని యాత్మరక్షణం
బానుటకై యనామయసమాఖ్యనుతిన్ శివమున్, పఠించు నే
మానవుఁ డెద్ది, వాఁడు ననమానసుఖుండగు నష్టరాగుఁడై. ౩౨

## అధికపాఠము

చ. భువనము దేశకాలగతిఁ బొందఁగ భిన్నములౌ నవస్థలన్,
ఎవఁడు హరించుఁ బాపము నహీనుఁడు రెండు క్రియమ్ములన్, స్వయం
భువు సృజియించు దానిఁ గని ముజ్జగముల్ నియమానుసారమున్,
దవిలెనె? సర్వక్షేత్రపదధర్మము నాతనికిన్ మహేశ్వరా! ౩౩

చ. నిను భజియించు భక్తులు; వినేత్రులు సర్వకలాప్రులన్ జటా
ఘనశిరసుల్ ధృతేందువులు కాలగళుల్ వనితాసమేతులన్
తనుజితవిభ్రమాభులు సుదాత్తులు నాత్తకుఠారులన్ హరుల్
మునినుతు లిద్ధసౌఖ్యులు విముక్తరతుల్ శివు లౌదు రవ్యయుల్. ౩౪

చ. పరమబుధుండు దండి యిది బాగగు వృత్తములన్ రచించె సుం
దరముగ స్తోత్ర మీశ్వరపదద్వయ భక్తిని; నెవ్వఁడేని యీ
హరనుతిన్ బఠింపఁ బరమాదరతన్ సుఖ మబ్బు, పుణ్యముల్
పురిగొను; శంకరా! నరుల బ్రోవుము రోగము లూడ్చి నిత్యమున్. ౩౫

---

క. ఇది శరరిపువసుచంద్రులు, షాదలఁగ శకనృపతివర్షముల నాషాఢిన్
చిదిరెమఠ వీరభద్రుఁడు, ముదమున దెనుఁగించె దండిబుధకృతనుతినిన్.

(శా. శ. ౧౮౬౫ స్వభాను-ఆషాఢ పూర్ణిమ)

ఆంధ్ర - అనామయ స్తవము సమాప్తము.

---

# శివపంచస్తవి

## ౫. హాలాయుధస్తవము

విఘ్నం నిఘ్నః ద్విరదవదనః ప్రీతయే వో౽స్తు నిత్యం
వామే కుంఠత్ప్రకటితబృహద్దక్షిణే స్థూలదంతః ।
యః శ్రీకంఠం పితరముమయాశ్లిష్టవామార్ధదేహం
దృష్ట్వా నూనం స్వయమపి దధావర్ధనారీశ్వరత్వం॥ ౧॥

అర్థ:—వామే = వామభాగమునందు, కుంఠత్ = నిలిచిపోవుచున్నట్టియు, ప్రకటితబృహత్ = వెలువరింప బడిన గొప్పదనము గలిగినట్టిదై, దక్షిణే = దక్షిణభాగమునందు, స్థూలదంతః = లావగు దంతములు గలట్టియు, ద్విరదవదనః=గజముఖుడు, వః = మీయొక్క, విఘ్నం = అంతరాయమును, నిఘ్నః = పరిహరించువాడై, నిత్యం= సదా, ప్రీతయే = ఆనందముకొఱకు, అస్తు = అగుగాక! యః = ఎవ్వాడు, ఉమయా = పార్వతీదేవిచేత, శ్లిష్టవామార్ధదేహం = కూడి పట్టి ఎడమప్రక్కయందలి సగము శరీరముగలవాడును, పితరం = తండ్రియును, అగు- శ్రీకంఠం = శంకరుని, దృష్ట్వా = చూచి, స్వయమపి = తానును, అర్ధనారీశ్వరత్వం=అర్ధనారీశ్వరత్వమును, నూనం = నిశ్చయముగా, దధౌ = ధరించెనో.

తా. శ్రీ పార్వతీదేవిని తన ఎడమప్రక్కన వెలయించిన వాడును, శ్రీకంఠుడును అగు తన తండ్రియైన శంకరుని గాంచి తానును తండ్రివలె అర్ధనారీశ్వరత్వమును ధరింప దలచినాడా అనునట్లుగా ఎడమ ప్రక్కన దంతము లేనివాడై ఆడేనుగువలెను; కుడిప్రక్కన మిక్కిలి పొడవైన లావు దంతము గలవాడై మగ యేనుగువలె నున్నట్టి యా గజముఖుడు మీ యొక్క విఘ్నమును బోనాడుచు సదా ఆనందమును గలిగించువాడగు గాక!

వి. సంప్రదాయానుసారము ప్రారంభమున గణాధిపతిని కవి స్తుతించియున్నాడు. మహాశివభక్తుడైన హాలాయుధుడు మొదలు తన ఇష్టదైవమైన శివుని స్తుతింపక శివపుత్రుడగు గణపతి నేల నుతించె ననుచో బంధువుల గృహమునకు వెళ్ళినపుడు మొదలు ఇంటిముందరి యంగణమందు వారి బాలకులును, తదుపరి లోపల ముఖ్యబంధువులును గనుపడునట్లు శివస్తోత్రమునకు బూని కైలాస నివాసమును ధ్యానింపగనే మొదట శివునిముద్దుబిడ్డఁడగు వినాయకుడు చిత్తమున ప్రత్యక్ష మయ్యెను. అతడును తన తండ్రియొక్క అర్ధనారీశ్వరలీలనే యనుకరించుచున్నట్లు వర్ణింపబడినాడు. కావున ప్రకారాంతరముగ శివస్తుతియే ఇందు కలదు.

శివుడు అర్ధనారీశ్వరుడనియు, గణపతిజనకుడనియు చెప్పబడుటచేత ఈ హాలాయుధ కవి శక్తివిశిష్టాద్వైతవాది యనియును, సగుణోపాసకుడనియును ఎఱుంగునది.

క్రీ॥ శ॥ 760-80 లో దక్షిణదేశాధిపతియైన రాష్ట్రకూట కృష్ణరాజు ఆస్థానమున నీ హాలాయుధకవి విద్వాంసుడుగా నుండెను. ఇతని జన్మభూమి వంగదేశ ధాకామండలమందలి నవగ్రామము. దేశసంచార మొనర్చుచు కాలక్రమమున దక్షిణదేశము జేరుకొని కొంతకాలముండి తరువాత తన భూమిని జేరుకొనియే చరమదశను గడపెను. అభిధానరత్నమాలా, కవిరహస్యమ్, మృతసంజీవనీ యను సంస్కృత గ్రంథముల విరచించినాడు. ఈతఁడు మహాశివభక్తుడు, మహావిద్వాంసుడును. మొదటి గ్రంథమునకు హాలాయుధకోశ మనియే సాధారణముగ వ్యవహారము కలదు. ఈ శివస్తుతిగూడ హాలాయుధస్తవ మనియే ఈ కవినామముతోడనే ప్రసిద్ధమైనది. ఈతని కవితాశయ్య మనోహరమై గంభీరముగ నుండును. అ ధారాళమైన శైలినిజూడ శివభక్తి పొంగి పొరలిన ట్లుండును. శివభక్తి ప్రభావమువలన నీతనికి సదాశివుడు ప్రత్యక్ష మగుచుండెడివాడట ! నవగ్రామ మొక కైలాసమువలె నుండెను.

"ఒకనాడు ఈ మహాభక్తుడు సిరియాళుని కథను వినెనట! అందు శివుడు జంగమవేషముతో వచ్చి సిరియాళు భక్తిని పరీక్షించుటయు, మాంస మారగించుటయు వచ్చినదికదా! దీనిని విని హాలాయుధుడు ఉదగ్రుడై అభక్ష్యమును భుజించిన శివుని, శివభక్తుడైన పుత్రుని వధించిన సిరియాళునిగూడ వెలివేసితినని ప్రకటించెనట. ఇంతకు గినిసి పై బహిష్కృతుల భార్యలగు పార్వతియు, చెంగళవ్వయు మారువేషమున వచ్చి హాలాయుధుని వేడుకొనగా వారి బహిష్కారమును దీసివేసెనట! ఈతని యనుపమానమైన శివభక్తిని, శివాచారదీక్షను గని శివుడు మెచ్చి ప్రత్యక్షమై ఈతని యభీష్టప్రకారము నవగ్రామప్రజలతోబాటు కైలాసము ననుగ్రహించెను" అను కథ బసవపురాణాదులలో కలదు.

ఈ హాలాయుధస్తవము మిక్కిలి ప్రసిద్ధమై పారాయణములో నున్నది. ఇది మధ్యప్రాంతపు నీమాడ్ జిల్లా ఓంకార అమరేశ్వర మందిరమున శిలపై శా. శ. ౯౦౫లో చెక్కబడియున్నది. ఈ శిలాశాసన పాఠానుసారముగనే ఇట ముద్రింపబడినది. అనామయ స్తవమునందువోలె నీ స్తవమునందును మందాక్రాంతా వృత్తములే కలవు. విశేషములు పీఠికలో గాంచనగును ॥శి॥

శ్లాఘ్యః పుత్రః స భవతి కిల స్వస్య వప్తుస్సకాశాద్ ।
ధత్తే కైశ్చిత్ క్వచిదపి గుణైర్యస్సముత్కర్షలేఖాం
ఇత్థం వాంఛన్ పితురధికతాం పంచవక్త్రస్య నూనం
షష్ఠం బిభ్రద్వదనమపరం పాతు విశ్వం విశాఖః ॥౨॥

అర్థః—యః = ఎవడు, స్వస్య = తనయొక్క, వప్తుః సకాశాత్ = తండ్రినుండి, కైశ్చిత్ = కొన్నియైన, గుణైః = గుణములచేత, క్వచిదపి = దేనియందైనను, సముత్కర్ష లేఖాం = ఆధిక్య రేఖను, ధత్తే = ధరించుచున్నాడో, సః = ఆ, పుత్రః = తనయుడు, శ్లాఘ్యః = ప్రశస్తుండు, కిల= కదా! ఇత్థం = ఇట్లు, పంచవక్త్రస్య= ఐదు మొగములుగల, పితుః = తండ్రికి, అధికతాం = ఎక్కువతనమును, నూనం = నిశ్చయముగా, వాంఛన్ = అపేక్షించువాడై అపరం = వేరైనట్టియు, షష్ఠం = ఆరవదైనట్టియు, వదనం = ముఖమును, బిభ్రత్ = ధరించుచున్నవాడైన, విశాఖః= కుమారస్వామి, విశ్వం = ప్రపంచమును, పాతు = రక్షించుగాక!.

తా. తన జనకునికంటె దేనియందైనను, ఏ గుణములచేతనైనను ఏ పుత్రుడు విశేషతను బొందుచున్నాడో వానిని లోకము మెచ్చుట సుప్రసిద్ధము. ఇట్లని కానోపును- తన తండ్రియైన శివునకుగల యైదు ముఖములకంటె నెక్కువైన మరియొక యారవముఖమును కార్తికేయస్వామి ధరించెను. ఇట్టి షణ్ముఖుడు ఈ ప్రపంచమును పాలించుగాక!

వి. కవి ఈ స్తవమున లోకకల్యాణమును వాంఛించి కుమారస్వామి యాశిస్సును ప్రకటించినాడు. ॥౨॥

ఏకో దేవ స్స జయతి శివః కేవలజ్ఞానమూర్తి-
ర్దేవీ సాచ త్రిభువన మిదం యద్విభూతిప్రపంచః ।
యత్కూటస్థం మిథున మవినాభావసంబంధయోగా-
న్మిశ్రీభూతం తదఖిలజగజ్జన్మబీజం నమామి, ॥౩॥

అర్థః—కేవల జ్ఞానమూర్తిః = కేవలము చిదానంద స్వరూపుడైనట్టి, ఏకః = అద్వితీయుడైనట్టి, దేవః = భగవంతుడైనట్టి, సః = ఆ,

శివః = శివుఁడు, జయతి = సర్వోత్కృష్టుఁడై వెలుగుచున్నాఁడు, చ = మరియు, సా = ఆ గుణములు గలిగినట్టి, దేవీ = పార్వతీదేవియు (సర్వోత్కర్షముగా నున్నది), ఇదం = ఈ, త్రిభువనం = మూల్లోకములు, యద్విభూతిప్రపంచః = ఏ పార్వతీపరమేశ్వరుల ఐశ్వర్యము యొక్క విస్తారమో! యత్ =ఏ, మిథునం = యుగ్మము, కూటస్థం = నిత్యమై, అవినాభావసంబంధయోగాత్ = భిన్నముగాని సంబంధముండుటవలన, మిశ్రీభూతం = పరస్పరముగా కలిసినట్టి, అఖిలజగజ్జన్మబీజం = సమస్తలోకముల జన్మకు కారణమై యున్నదో, తత్ = ఆ శివశక్తిద్వంద్వమును, నమామి = నమస్కరించుచున్నాను.

తా. ఈ సమస్తమైనట్టియు, శుద్ధాశుద్ధమైనట్టియు త్రిలోకములు యే యనాదిదంపతుల మహత్తుయొక్క వికాసమో, ఎవరు ఎల్లపుడు ఎడబాయనివారై శాశ్వతమైన కలయిక గలిగి సమస్తలోకముల జన్మములకు సంయుక్తమైన కారణస్వరూపమై యున్నారో, అట్టి ఏకైక స్వరూపుడును, పరమేశ్వరుడును, చిన్మయుడును అగు శివుడును; ఇట్టిదే యగు శక్తియును సర్వోత్కృష్టతతో వెలయు గాక!

వి. ఇక్కడ శివుడు శక్తి యని రెండు వస్తువులుగా చెప్పబడినవి. కావున ఇది ద్వైతసిద్ధాంత మనుకొనరాదు. శక్తియే గుణము, శక్తిమంతుడే శివుడు. పూవును విడచి తావిగాని, తావిని విడచి పూవుగాని ఉండనట్లు శివునియందు శక్తి యవినాభావ సంబంధముతో నుండునని సిద్ధాంతము. ఇది వీరశైవుల శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము. కావుననే ఈ హాలాయుధకవి వీరశైవు డని పరంపరాకథనము ప్రచారమైనది ॥3॥

ఏకః స్రష్టా సకలజగతామాదిభూతస్స్వయంభూ-
స్త్రాతా తేషాం త్రిభువనగురుర్వాసుదేవః ప్రసిద్ధః।
యస్తౌ ద్వావప్యతులమహిమా సంహరత్యంతకాలే
కస్తస్యాన్యో భవతి సదృశః శ్రీమహాకాలమూర్తేః॥ ౪॥

అర్థః—ఆదిభూతః=మొదటఁబుట్టిన, స్వయంభూః=బ్రహ్మదేవుడు, ఏకః=ఒకడేయై, సకలజగతాం= సర్వలోకములకు, స్రష్టా = సృష్టికర్త, (అనియును) తేషాం=ఆ లోకములకు, వాసుదేవః =విష్ణువు, త్రాతా = రక్షకుడై, త్రిభువనగురుః = లోకపూజ్యుడు (అనియును) ప్రసిద్ధః =

విఖ్యాతుడు, అతులమహిమా = అసదృశమైన మహత్తు గలిగినట్టి, యః = ఏ పరమేశ్వరుడు, తౌ = ఆ, ద్వావపి = బ్రహ్మవిష్ణువులను గూడ, అంతకాలే = ప్రళయకాలమందు, సంహరతి = ఉపసంహరించుకొనుచున్నాడో, శ్రీమహాకాలమూర్తేః = సంపద్యుక్తుడై అఖండకాలస్వరూపుడైన, తస్య = ఆ మహేశ్వరునకు, అన్యః = ఇతరుడైన, కః = ఎవడు, సదృశః = సమానుఁడు?

తా. ఈ సమస్తలోకములను సృజించుటలో స్వయంభువైన బ్రహ్మయును, వీనిని కాపాడుటలో లోకోత్తరుడైన విష్ణువును కర్తలై ప్రసిద్ధులై యున్నారు. కాని ఇట్టి విష్ణు బ్రహ్మలను గూడ ప్రళయకాలమునందు నెవడు సంహరింపగలడో ఆ మహాస్వరూపుడైన రుద్రునకు మరియొకడు సాటిగలడా?

వక్తుం వాంఛా హర నిరవధేస్త్వన్మహిమ్నః స్వరూపం
చేతశ్చైతత్ కతిపయపదజ్ఞానమాత్రావసన్నం
జ్ఞాత్వా చేదం త్రినయన మయా త్వద్గుణస్తోత్రభక్త్యా
స్వాత్మన్యేవ స్వయమధికృతో ధృష్టతాపట్టబంధః ॥౫॥

అర్థః—హర = ప్రభూ! నిరవధేః = అపారమైనట్టి, త్వన్మహిమ్నః = నీ మహిమయొక్క, స్వరూపం = స్వరూపమును, వక్తుం= చెప్పుటకు, వాంఛా = ఇచ్ఛ (కలదు), ఏతత్ = ఈ, చేతశ్చ = మనస్సు, కతిపయపదజ్ఞానమాత్రావసన్నం = కొలది శబ్దముల తెలివి వలన చిక్కిపోయియున్నది, త్రినయన = సర్వదర్శకా, ఇదం= దీనిని, జ్ఞాత్వాచ = తెలిసియు, త్వద్గుణస్తోత్రభక్త్యా = నీ గుణముల పొగడ్తయందు గల భక్తిచే, ధృష్టతాపట్టబంధః = మాటలమారి దొరతనము, స్వాత్మన్యేవ = నాయందే, స్వయం = సొంతముగా, మయా = నాచేత, అధికృతః = ఆజ్ఞాపింపబడెను.

తా. ఓ సర్వశాసకా! అనంతమైన నీ మాహాత్మ్యమును గొనియాడ తలంపేమో కలిగినది. కాని నా యల్పబుద్ధికి కొలది శబ్దార్థములే తెలియును. ఇట్లని యెరిగియు నిను పొగడుటలో భక్తి ప్రాబ

ల్యము గలవాడ నగుటచే నాకు నేనే మాటలదొరనై దీనిని రచింప బూనినాడ స్వామీ! ॥౫॥

వాగీశ స్త్వం యుగపదఖిలజ్ఞానసంపత్తియుక్తః
కా తే తుష్టిః స్తుతిరచనయా మాదృశస్యాల్పశక్తేః।
ఏవం జ్ఞాత్వా హర విరమతః స్తోత్రహేతో ర్హఠాన్మే
భక్త్యావేశాత్ప్రసరతి ముఖాద్భారతీ కిం కరోమి ॥౬॥

అర్థః—హర=రుద్రా! త్వం = నీవు, వాగీశః = వాచస్పతివి, యుగపత్ = ఒకే కాలమున, అఖిలజ్ఞానసంపత్తియుక్తః = సమస్త పదార్థములయొక్క జ్ఞానభాండారము కలవాడవు, తే=ఇట్టి నీకు, అల్పశక్తేః = స్వల్పప్రజ్ఞ గల, మాదృశస్య = నాబోటివానియొక్క, స్తుతిరచనయా = స్తోత్రనిర్మాణముచేత, కా=ఎట్టి, తుష్టిః = సంతోషము, (కలుగును)? ఏవం = ఇట్లు, జ్ఞాత్వా = తలపోసి, స్తోత్రహేతోః = స్తుతికారణమునుండి, విరమతః = చాలించుకొనుచున్నట్టి, మే = నాయొక్క, ముఖాత్ = మొగమునుండి, భక్త్యావేశాత్ = భక్త్యుద్రేకము వలన, భారతీ = సరస్వతి, ప్రసరతి = పొరలుచున్నది. కిం = ఏమి, కరోమి = చేయుదును?

తా. పరమేశ్వరా! నీవు సమస్తవాక్కుల కధీశుడవు. సకల పదార్థముల నొకేమారు దెలియు మహాశక్తి కలిగియున్నాడవు. కావున నావంటి యల్పబుద్ధిగలవాని వాక్కులతో నీకేమి సంతోషము గలుగ గలదు? ఇట్లు గట్టిగా భావించియే స్తుతి ప్రయత్నమును విరమించు కొంటిని. ఐనను నీయందలి భక్త్యతిశయమువలన నా ముఖమునుండి తనకుదానే యీ సరస్వతి వెలువడుచున్నది. నేనేమి సేయుదును స్వామీ? ॥౬॥

యత్తే తత్త్వం నిరుపధిపరం వాఙ్మనఃపారభూతం
బ్రహ్మాదీనామపి హర గిర స్తత్ర భగ్నాః ప్రవేష్టుం।
అర్వాచీనం యదపరమిదం పార్వతీవల్లభం తే
రూపం భక్త్యా వరద తదహం వాగ్భి రభ్యర్చయామి ॥౭॥

అర్థః—హర. వరద=ప్రభూ, కరుణామయా! తే = నీయొక్క, నిరుపధి = ఉపాధిరహితమైనట్టియు, వాఙ్మనఃపారభూతం = వాఙ్మనస్సులయొక్క సీమకంటె అతీతమైనట్టియు, యత్ =ఏ, పరం=సర్వాధికమైన, తత్త్వం = తత్త్వము (కలదో), తత్ర=అందు, బ్రహ్మాదీనాం= బ్రహ్మాదులయొక్క, గిరోపి = వాక్కులుసైతము, ప్రవేష్టుం = ప్రవేశించుటకై, భగ్నాః = భంగపడినవి, తే = నీయొక్క, యత్ = ఏ, ఇదం = ఈ, అపరం = వేరైన, అర్వాచీనం = ఆధునికమైన, పార్వతీ వల్లభం = పార్వతీపతి యను, రూపం = స్వరూపము (కలదో) తత్= ఆ రూపమును, అహం = నేను, వాగ్భిః = వాక్కులచేత, అభ్యర్చయామి = పూజించుచున్నాను.

తా॥ భక్తవత్సలా! నీ తత్త్వము, వాఙ్మానసముల కతీతమైనది. అచింత్యమైనది. పరాత్పరమైనది. దీనిని వర్ణించుటలో బ్రహ్మాదుల వాక్కులును కుంఠితములైనవి. (నే నెంతటివాడను?) ఐతే నీ యా యప్రమేయరూపమునుగూర్చి చింతింపక ఇటీవల భక్తులచే నెరుగబడిన పార్వతీవల్లభాత్మక మగు వైదికపౌరాణికరూపమును నా వాక్కులతో పొగడి పూజించు కొనుచున్నాను.

వి. ఈ పైమూడు శ్లోకముల భావము మహిమ్న ఆనామయముల మొదటి శ్లోక భావములో పోల్చబడి విస్తరింప బడినట్లు తోచును. మందును ఇట్టి సామ్యము అట నట గాంచనగును ॥౩॥

> అన్యైః స్తోత్రం రచితమమృతస్యందిభి ర్వాగ్విలాసైః
> ఫల్గుప్రాయైః కిమిదమియతా త్యజ్యతే మద్వచోభిః।
> కింవా కైశ్చిత్కనకకమలై రర్పితం పాదపీఠం
> భక్త్యా శంభో న పునరపరః పూజయ త్యర్కపత్రైః॥౪॥

అర్థః—శంభో = సుఖసాగరా! అన్యైః = ఇతరులచేత, అమృతస్యందిభిః = అమృతమునొలుకు, వాగ్విలాసైః = తీపిపలుకుల చేత, స్తోత్రం = స్తవము, రచితం = రచింపబడినది. ఫల్గుప్రాయైః = నిష్ఫలములైన, మద్వచోభిః = నావాక్కులచేత, ఇదం = ఈ స్తోత్రము, ఇయతా = [illegible] త్యజ్యతే = [illegible],

కిం = ఏమి? వా=అథవా, కైశ్చిత్ = కొందరిచేత, కనకకమలైః = బంగారుకమలములచేత, అర్చితం = పూజింపబడిన, పాదపీఠం = పాదపీఠమును, అపరః = మరియొకడు, భక్త్యా = భక్తితో, అర్కపుష్పైః= జిల్లేడుపూలచేత, నపూజయతి కిం = పూజించుట లేదా ఏమి?

తా. పరమేశ్వరా! పలువురు పండితులు తేనియసోన లొలుకు జిగిబిగిపలుకులతో నిను గొనియాడి తనియ జేసియుందురు. నిస్సారములైన శబ్దములతో గూర్చిన ఈ నా స్తోత్రము నింతమాత్రమున త్రోసిపుచ్చెదవా! నీ దివ్యమైన పాదపీఠమును కలిమిగలవా రెందరో బంగారుపూల బూజించియుందురు. కాని మరియొక దీనుడు భక్తిగలవాడై జిల్లేడుపూలతోఁ బూజింపడా యేమి? (ఎట్టిదైనను భక్తుని కాన్కను శివుడు గ్రహింప వలయు నని భావము.) ॥౮॥

పథ్యాహారౌ హర జలముచాం యౌ చ యౌ పంకజానాం
మిత్రామిత్రౌ వరద హవిషాం దాహకగ్రాహకౌ యౌ।
యౌ గంధస్య ప్రజనవహనౌ తానహం తుష్టిహేతో
రష్టౌ వందే త్రిభువనగురో ర్మూర్తిభేదాం స్తవైతాన్॥ ౯॥

అర్థః—హర వరద = రుద్రా! కరుణాసముద్రా, యౌ = ఏవి, జలముచాం = మేఘములకు, పథ్యాహారౌ = మార్గమును, ఆహారమును ఐనవో (ఆకాశము, జలము) యౌ = ఏవి, పంకజానాం = కమలములకు, మిత్రామిత్రౌ = మిత్రమును, శత్రువును ఐనవో (సూర్యచంద్రులు), యౌ = ఏవి, హవిషాం = హవిస్సులకు, దాయకగ్రాహకౌ = వేల్చువాడును, గ్రహించువాడును ఐనవో (యజమానాగ్నులు), యౌ = ఏవి, గంధస్య = గంధమునకు, ప్రజనవహనౌ= జననియును, వాహకుడును ఐనవో, తాన్ = ఆ, త్రిభువనగురోః = త్రిజగద్గురుడవైన, తవ = నీయొక్క, ఏతాన్ = ఈ, అష్టౌ=ఎనిమిదియగు, మూర్తిభేదాన్ = మూర్తివిశేషములను, తుష్టిహేతోః = సంతోషమునకై, వందే = నమస్కరించుచున్నాను.

తా. మహేశా! మేఘములకు మార్గమైన ఆకాశమును, ఆహారమగు జలమును, కమలములకు మిత్రుడగు సూర్యుడును, శత్రు

డగు చంద్రుడును, హవిస్సులకు దాతయైన యజమానుడును, గృహీత యగు అగ్నియును, గంధమునకు జననియగు పృథ్వియు, వాహక (మోయువా)డగు వాయువును నీ యష్టమూర్తులే కదా స్వామీ! విశ్వగురుడ వగు నీ యీ యష్టమూర్తులను సంతుష్టికొఱకు నమస్కరించు కొనుచున్నాను.

వి. మహిమ్నము ౨౬ వ శ్లోకవిశేషములు చూడుడు. ॥౯॥

సంసారేఽస్మిన్ ధ్రువమసులభం మానుషం జన్మ లబ్ధ్వా
యుష్మానేకో భజతి సుకృతీ కశ్చిదన్యం చ దేవం।
ఆరూఢోఽపి స్మరహర గిరిం రోహణం భాగ్యయోగా-
దేకో రత్నం కలయతి మహత్ కాచ మన్యశ్చ ఫల్గు॥౧౦॥

అర్థః—స్మరహర = కామారీ, అస్మిన్ = ఈ, సంసారే = ప్రపంచమున, ధ్రువం = నిక్కముగా, అసులభం = దుర్లభమగు, మానుషం = మనుష్యసంబంధ మగు, జన్మ = జన్మమును, లబ్ధ్వా = పొంది, ఏకః = ఒకానొక, సుకృతీ = పుణ్యాత్ముడు, యుష్మాన్ = మిమ్ము, భజతి = పొందుచున్నాడు, చ = మరియు, కశ్చిత్ = ఒకడు, అన్యం = వేఱగు, దేవం = దైవమును పొందుచున్నాడు, రోహణం = రోహణ మను పేరుగల (రత్నఖనియైన) గిరిం = పర్వత మును, ఆరూఢోఽపి = ఎక్కినవాడైనను, ఏకః = ఒకడు, భాగ్య యోగాత్ = పుణ్యసంబంధమువలన, మహత్ = గొప్పదగు, రత్నం= రత్నమును, కలయతి=పట్టుచున్నాడు, అన్యశ్చ = మఱియొక డన్ననో, ఫల్గు = నిస్సారమైన, కాచం = గాజును, పొందుచున్నాడు.

తా. భగవన్! ఈ మాయామేయ మగు ప్రపంచమున మిక్కిలి దుర్లభమైనది మానవజన్మమే! అట్టిదానిని పొందియును మహా పుణ్యాత్ముడు మాత్రమే నిను గొలుచును ధన్యుడగుచున్నాడు. దౌర్భా గ్యుడు క్షుద్రదైవముల వెంటనంటి ఇంకను బంధమునం దగుల్కొనియే యున్నాడు. రత్నముల పుట్టయగు రోహణాద్రి నెక్కినవారిలో నదృష్ట శాలికే రత్నములు లభించుచున్నవి గాని తక్కుంగలవారికి ముక్కే గాజులు మాత్రమే, [illegible]

వి. లోకమున శివభక్తులు తక్కువగా నున్నారు కదా! ఇదియేల యనువారి కిందు చక్కని సమాధానము కలదు. ధర్మాత్ములును, పుణ్యాత్ములును కొలదిగానే యుందురు. పూర్వ సుకృతపరిపాకవశమునగాని యిట్టి సుబుద్ధి పుట్టదు. ॥౧౦॥

యే త్వామర్హన్ సుగత ఇతివా భక్తియోగా ద్భజంతే
తేభ్య శ్శంభో ఫలమభిమతం త్వం దదాసీతి యుక్తం ।
అధ్వక్లాంతైః స్వరుచిరుచిరం నామ కించిద్గృహీత్వా
శీతం పీతం జలమిహ జనైః కిం న తృప్తిం కరోతి॥౧౧॥

అర్థ:—యే = ఎవ్వారు, త్వాం = నిన్ను, అర్హన్ = జినుడు, వా = లేక, సుగతః = బుద్ధుడు, ఇతి = ఇట్లు, భక్తియోగాత్ = భక్త్యతిశయమువలన, భజంతే = పూజించుచున్నారో, శంభో! = శంకరా! తేభ్యః = వారికి, త్వం = నీవు, అభిమతం = ఇష్టమైన, ఫలం = అర్థమును, దదాసి = ఇచ్చుచున్నావు. ఇతి = ఇది, యుక్తం = యోగ్యము. అధ్వక్లాంతైః = మార్గాయాసము నందినట్టి, జనైః = జనులచేత, స్వరుచిరుచిరం = తమరుచికి బాగైన; కించిన్నామ = దేనినైనను, గృహీత్వా = స్వీకరించి, పీతం = త్రావబడిన, శీతం = చల్లనైన, జలం = నీరు, ఇహ = ఇట, తృప్తిం = తనివిని, నకరోతి కిం = చేయుటలేదా ఏమి?

తా. కొందరు నిన్ను జినునిగా బుద్ధునిగా భక్తితో గొలుచుచున్నారు. శంకరుడ వగు నీవు వారికిని ఇష్టార్థముల ననుగ్రహించుచున్నావు. ఇది నీ ఘనతకు దగియే యున్నది. త్రోవనడిచి యాయాసము నందిన వారు దొరకిన దేదో నోట గరచుకొని నీరు త్రావి తృప్తి గనుట లేదా! అందరకును భోజనము దొరకుచున్నదా!

వి. ఇందలి భావము మిక్కిలి యున్నతము. క్షుద్రులను గొలిచినను, అవైదిక మార్గము బట్టినను భక్తిగలవారి నందరను శివు డనుగ్రహించు నని సిద్ధాంతము ॥౧౧॥

ఆదిత్యాదిగ్రహపరికరో యాతి చాయాతి నిత్యం
కాలశ్చాయం దివసరజనీపక్షమాసర్తుచిహ్నః ।
ఏతత్సర్వం నను న ఘటతే ప్రేరకత్వం వినా తే
కార్యే చాస్మిన్నపునరపరస్యాస్తి సామర్థ్య మేతత్ ॥౧౨॥

అర్థ:—ఆదిత్యాది గ్రహపరికరః = సూర్యాది గ్రహసమూహము, నిత్యం = సదా, యాతి = వెడలుచున్నది, చ = మరియు, ఆయాతి = వచ్చుచున్నది, అయం = ఈ, కాలశ్చ = కాలముగూడ, దివసరజనీపక్షమాసర్తుచిహ్నః = అహస్సు, రాత్రి, పక్షము, మాసము, ఋతువు అను విభాగములు గలదై గతించుచున్నది. తే = నీయొక్క, ప్రేరకత్వం వినా = ప్రేరణలేకయే, ఏతత్సర్వం = ఇదియంతయు, నఘటతే నను = సంఘటింపదు కదా! అస్మిన్ = ఈ, కార్యేచ = పనియందన్ననో, పునః = మరి, అపరస్య = ఇతరునకు, ఏతత్ = ఈ, సామర్థ్యం = ప్రభుత్వము, నాస్తి = లేదు.

తా. మహేశా! ఈ సూర్యాది తారానికరము సదా వచ్చుచు పోవుచు నున్నది. పగలు, రేయి, నెల, పక్షము, ఋతువులు గల కాలమును అటులే పరుగిడుచు మరల జేరుచున్నది. సర్వనియామకుడ వగు నీయాజ్ఞ లేకయే ఇది యంతయు జరుగుట అసంభవము. ఈ యద్భుతమైన కార్యము నొనర్చుటకు నీవు దప్ప మఱియొకడు శక్తుడా! ముమ్మాటికిని నీవే సర్వకర్తవు.

వి. ప్రకృతి యందలి సమస్తజీవులు అన్నియు తమకు తామే ఈశ్వరులగుచో అందరకును స్వేచ్ఛయుండును. ఒకరి నొకరు అనుసరింప జాలరు. వర్షము వచ్చినను విత్తనములు మొలకెత్తక యుండవలసినదే! కావున ఒకదాని ననుసరించి మరియొకదానిని సంచాలన మొనర్చు సర్వకర్త యొకడు కలడనియే నమ్మవలెను. మహిమ్నము ౭ వ శ్లోకవిశేషముల జూడవలెను. ॥౧౨॥

తస్యాగారే గిరిశ రమతే ధేనువత్ కామధేనుః
క్రీడావాటే విటపిసదృశః కల్పతే కల్పవృక్షః ।
లాక్షారక్షామణిరివ కరే తస్య చింతామణిస్స్యాద్
యస్మిన్ సిద్ధస్సకృదపి కృపాదృష్టిపాతప్రసాదః ॥౧౩॥

అర్థ:—గిరిశ = కైలాసవాసా, యస్మిన్ = ఎవనియందు, సకృదపి = ఒకపర్యాయమైనను, కృపాదృష్టిపాతప్రసాదః = నీ కృపాదృష్టిపాత మను అనుగ్రహము, సిద్ధః = సంసిద్ధమగునో, తస్య = వానియొక్క, అగారే = మందిరమునస, కామధేనుః = కామధేనువు, ధేను

వత్ = గోవువలె, రమతే = ఆడుచున్నది, క్రీడావాటే = ఉద్యానమున, కల్పవృక్షః = కల్పవృక్షము, విటపిసదృశః=చెట్టువలె, కల్పతే= చేయుచున్నది, తస్య = వాని, కరే = హస్తమున, చింతామణిః = చింతామణి, లాక్షారత్నామణిరివ = లక్క-రత్నపూసవలె, స్యాద్ = అగును.

తా. కైలాసనిలయా! నీ కరుణాదృష్టి యొకపరి భక్తుని యందు ప్రసరింపవలయునే కాని వానికి లభింపని దెద్ది? వాని యింటి ముందర ఆవుదూడవలె కామధేను వాడుకొనగలదు. వాని యుద్యానమున కల్పవృక్షముగూడ సాధారణవృక్షమువలె ప్రవేశింప గలదు. వాని కరమున చింతామణియే లక్క-పూసతో గూడిన కంకణమువలె సులభముగ జేరగలదు. నీ యనుగ్రహమాహాత్మ్యమును జెప్పవలయునా స్వామీ! ॥౧౩॥

మౌళౌ లోలత్రిదశతటినీతోయశీతేఽమృతాంశుం
కంఠే క్రూరం కబలితవిషశ్యామలే వ్యాలరాజం
జ్యోత్స్నాగౌరే వపుషి విశదం బిభ్రతో భస్మరాగం
జ్ఞాతా సమ్యక్ త్రినయన మయా యోగభూషా తవైవ॥౧౪॥

అర్థః—త్రినయన = త్ర్యంబకా! లోలత్రిదశతటినీతోయశీతే=చంచలమైన దేవగంగాజలముతో చల్లనైనట్టి, మౌళౌ=తలలో, అమృతాంశుం = చంద్రుని, కబలితవిషశ్యామలే = తిన్న విషముతో నల్లనైనట్టి, కంఠే = గళమున, క్రూరం = భయంకరమైన, వ్యాలరాజం = పెనుబామును, జ్యోత్స్నాగౌరే = వెన్నెలవలె తెల్లనైనట్టి, వపుషి = దేహమున, విశదం = శుభ్రమైన, భస్మరాగం = బూదిపూతను, బిభ్రతః = ధరించుచున్నట్టి, తవ = నీయొక్క, యోగభూషా = యోగాలంకారము, మయా = నాచేత, జ్ఞాతైవ = తెలియబడియే యున్నది.

తా. త్రినేత్రా! (నీచరిత్ర) యద్భుతముగా నున్నది. చలి బెట్టినచో అగ్నిని జేరుట లోకప్రసిద్ధము) నీవన్ననో గంగోదకముతో చల్లగా నున్నట్టి తలలో మరియును చల్లనైన చంద్రుని ధరించినాడవు.

విసముతో కమిలిపోవుచున్న కుత్తుకకు (అమృతరేఖలు వేయక) మని యొక భయానకమైన పెనుబామును జుట్టికొన్నావు. వెన్నెల కాంతుల నీను సుందరమైన మేన (కస్తూరి చందనము లలదక) బూది పూసి కొంటివి. ఆలోచింపగా ఈ యసహజలక్షణములు యోగీశ్వరుని యలంకారముల వలె గోచరించుచున్నవి. (ఇవి యలంకారములు కాసే కావనియు లోకకల్యాణార్థమనియు భావము) ॥౧౮॥

ధత్తే శోభాం ఘుసృణతిలకస్పర్ధి చక్షుర్లలాటే
మౌలౌ లగ్నా త్రిదశతటినీ మాలతీమాలికేవ,
క్ష్వేడం క్రీడామృగమదమయీ పత్రిలేఖేవ కంఠే
శ్లాఘ్యశ్శంభో స్ఫురతి సహజః కోఽపి భూషావిధిస్తే ॥౧౯॥

అర్థః—శంభో = సాంబా! లలాటే = నుదుట, ఘుసృణతిలక స్పర్ధి = కుంకుమ బొట్టువంటి, చక్షుః = అగ్గికన్ను, శోభాం = సొగ సును, ధత్తే = కూర్చుచున్నది, మౌలౌ = తలయందు, త్రిదశతటినీ= అమరగంగ, మాలతీమాలికేవ = మాలతిదండవలె, లగ్నా = హత్తు కొన్నది, కంఠే = గళమునందు, క్ష్వేడం = గరళము, క్రీడామృగ మదమయీ = కస్తూరితో నొనర్చిన, పత్రిలేఖేవ = మకరికాపత్రము వలె, (అందము నీనుచున్నది) తే = నీయొక్క, సహజః = స్వాభావిక మైన, భూషావిధిః = ఆభరణపద్ధతి, కోఽపి = ఎట్టిదిగానున్నను, శ్లాఘ్యః = పొగడదగినదిగా, స్ఫురతి = తోచుచున్నది.

తా. ఈశ్వరా! ఫాలభాగమున నున్న యగ్ని నేత్రము కుంకుమ బొట్టు చందమునను, జడలోని దేవగంగ పొగడపూదండ వలెను కంఠమందలి విషరేఖ కస్తురితో వ్రాసిన పత్రిరేఖల కరణిని యెం తయో అందము నీనుచున్నవి. స్వామీ! ఎటులైనను, నీ యీ సహజ మైన ఆభరణభంగిమము విలక్షణమై సర్వలోకస్తోత్రపాత్రముగా మాత్రము గాన్పించుచున్నది. ॥౧౯॥

దగ్ధం యేన త్రిభువనమిదం దేవ దుర్వారధామ్నా
దగ్ధస్సోఽపి త్రినయన భవద్దృష్టిపాతేన కామః।

యుక్తం చైతద్భవతి పురుషో యః పరస్యోపతాపీ
తస్యావశ్యం పతతి శిరసి క్రోధదండః ప్రభూణాం ॥౧౯॥

అర్థః—త్రినయన = విరూపాక్షా! దేవ = భగవన్, ఇదం = ఈ, త్రిభువనం = ముల్లోకము, దుర్వారధామ్నా = అవక్రపరాక్రమము గల, యేన = ఎవ్వనిచే, దగ్ధం = సంతాపింపబడెనో. సః = ఆ, కామోఽపి = మన్మథుడును, భవద్దృష్టిపాతేన = నీదృష్టి యోగము చేత, దగ్ధః = దహింపబడెను. ఏతత్ = ఇది, యుక్తంచ = యోగ్యము కూడను. యః = ఏ, పురుషః = నరుడు, పరస్య = ఇతరునకు, ఉపతాపీ = పీడ గల్గించువాడు, భవతి = అగుచున్నాడో, తస్య = వానియొక్క, శిరసి = తలమీద, ప్రభూణాం = ప్రభువుల, క్రోధదండః = కోప మను కఱ్ఱ, అవశ్యం = తప్పక, పతతి = పడుచున్నది.

తా. తన తీక్ష్ణమైన తేజస్సుతో నీ త్రిలోకములను సంతాపపఱచుచున్నట్టి యా మన్మథుడే నీ యగ్గికంటిమంటతో బూడిదమై నశించినాఁడు. ఇది బాగుగనే జరిగినది. పరుల నన్యాయ్యముగ పీడించుచున్న బంటుతలమీద దొరలయొక్క కోపమనెడు చేతికఱ్ఱ యవశ్యముగాఁ బడియే తీరునుగదా! సర్వదర్శకా! పాపులకు నీవు విధించు ప్రాయశ్చిత్తము సరియైనదే కదా! ॥౧౯॥

కస్య క్షేమో భవతి బలినా స్పర్ధమానస్య సార్థం
యస్త్వత్కోపాత్త్రినయన భవచ్చక్షుషా వంచితోఽభూత్।
ప్రేమ్ణా దష్టేఽధరకిసలయే దృష్టవాన్యః స కామీ
లీలానృత్యచ్చతురవనితాభ్రూలతావీక్షణాని ॥౨౦॥

అర్థః—త్రినయన = కామారీ, బలినాసార్థం = బలముగలవానితో, స్పర్ధమానస్య = పోరాడుచున్నట్టి, కస్య = ఎవనికి, క్షేమః = శుభము, భవతి = అగుచున్నది? యః = ఏ కాముడు, త్వత్కోపాత్ = నీ క్రోధమువలన, భవచ్చక్షుషా = నీ నేత్రముతో, వంచితః = మోసపోయినవాడు, అభూత్ = అయెనో, యః = ఎవడు, ప్రేమ్ణా =

ప్రేమచేత, దష్టే = కాటువేయబడిన, అధరకిసలయే = పెదవిచిగురు టాకులో, కామీ = కామముగలవాడో, సః = వాడు, లీ.....ని; లీలా = విలాసముచేత, నృత్యత్ = ఆడుచున్నట్టి, చతుర = జాణ యైన, వనితా = మగువయొక్క, భ్రూలితా = కనుబొమతీవల, వీక్షణాని = కటాక్షములను, దృష్టవాన్ = చూచినవాడు, (అగుచున్నాడు.)

తా. స్వామీ! నీ కోపవశమున నీ యగ్ని నేత్రమునకు గుఱియై మడిసెను కాని, అది యెవరి తప్పు? బలవంతునితో (నిర్నిమిత్తముగ) పోరు సల్పినవాని కెవనికైన సేమము కలిగెనా! ప్రేమచేత పెదవి నొక్కి చూడదలచువార లాపె సొగసు కనుబొమ ముడి దెబ్బలను సైచుకొనగలిగి యుండవలదా! ॥౧౭॥

యే దారిద్ర్యోపహతవపుషో యే చ దౌర్భాగ్యదగ్ధా
యేవా శత్రువ్యసనవికలా యేచ మౌర్ఖ్యోపతప్తాః।
యేవా కైశ్చిత్ త్రినయన దృఢం పీడితా దుఃఖశోకై-
స్తేషా మేక స్త్వమసి శరణం తర్షితానా మివాంభః ॥౧౮॥

అర్థః—యే = ఎవ్వారు, దారిద్ర్యోపహతవపుషః = దైన్యముచే పీడింపబడిన మేనుగలవారో, యేచ = ఎవ్వారు, దౌర్భాగ్యదగ్ధాః = దురదృష్టముచే సంతప్తులో, యేవా = ఎవరైతే, శత్రువ్యసనవికలాః = వైరుల చింతవలన చీలిపోవుచున్నారో, యేచ = ఎవ్వారు, మౌర్ఖ్యోపతప్తాః = అజ్ఞానములో బాధ నొందుచున్నారో, యేవా = ఎవ్వారు, కైశ్చిత్ = కొన్ని, దుఃఖశోకైః = కష్టరోదనములచే, దృఢం = గట్టిగా, పీడితాః = పీడింపబడియున్నారో, త్రినయన = విరూపాక్షా! తేషాం = వారికి, త్వం = నీవు, ఏక ఏవ = ఒకడవే, తర్షితానాం = దప్పిగొన్నవారికి, అంభః ఇవ = ఉదకమువలె, శరణం = దిక్కువు, అసి = అయియున్నావు.

తా. మహేశ్వరా! లోకమున దారిద్ర్య పీడితులును, దురదృష్ట బాధితులును, శత్రు [illegible]

సంతప్తులును కలరో వారి కెల్లరకును దప్పిగొన్నవారికి జలమువోలె నీ
వొక్కరుడవే అనన్య శరణ్యమై యున్నావు.

వి. దీనుడు, దౌర్భాగ్యుడు, చింతితుడు, అజ్ఞాని, దుఃఖితుడు, రోగిష్ఠి మున్నగు వారికి బాధ లుండుటయు, వారు దేవుని భజించుటయు, శివు డట్టివారిని కాపాడుటయు కలదు. శ్రీమంతుడు, భోగి మున్నగు వారిలో కొలదిగ మాత్రమే భగవద్భక్తు లుందురు. ॥౧౮॥

శ్లాఘ్యం జన్మ శ్రుతిపరిణతిః సత్క్రియాయాం ప్రవృత్తిః
ప్రౌఢిః శాస్త్రే లలితమధురా సంస్కృతా భారతీ చ ।
స్ఫీతా లక్ష్మీ ర్వపురపి దృఢం చంద్రలేఖాంకమౌళే
యుష్మత్సేవాపదవిరహితం సర్వమేతత్ఫలాలమ్ ॥౧౯॥

అర్థ:—చంద్రలేఖాంకమౌళే = చంద్రార్ధచూడా! శ్లాఘ్యం= ఉత్తమమైన, జన్మ = ఉత్పత్తియు, శ్రుతిపరిణతిః= వేదపరిచయమును, సత్క్రియాయాం = సుకార్యమునందు, ప్రవృత్తిః = ప్రవర్తనమును, శాస్త్రే = శాస్త్రమునందు, ప్రౌఢిః = గొప్పపాండిత్యమును, లలితమధురా = జిగిబిగిచే కమ్మనైనట్టియు, సంస్కృతా = సంస్కృతమగు, భారతీ చ = వాణియును, స్ఫీతా= సమృద్ధమైన, లక్ష్మీః=సంపత్తును, దృఢం = బలిష్ఠమైన, వపురపి = దేహమును, ఏతత్ = ఈ, సర్వం= సకలము, యుష్మత్సేవాపదవిరహితం =నీయొక్క కైంకర్యస్థానమునుండి విముఖమైన దగుచో, ఫలాలం = నిష్ఫలము.

తా. చంద్రశేఖరా! ఉత్తమవంశమున జన్మమును సత్కార్యములలో మనస్సును, శాస్త్రమున పాండిత్యమును, జిగిబిగి కమ్మనైన సంస్కృత వాణియును, వలసినంత ధనమును ఆరోగ్య దేహమును (ఇవి సామాన్యముగ లభింపవు.) అనునివి యెల్లను నీసేవకై వినియోగింప బడ వేని వ్యర్థములే కద! (నిను సేవించిననే సార్థకము లని భావము.) ॥౧౯॥

త్వత్పూజాయాం కుసుమహరణే ధావతః పాదయుగ్మం
యత్పాషాణప్రజపరికరోత్కీర్ణ రేఖాంకమాసీత్
యత్నస్యైవ త్వదనుచరతో రుద్రలోకం గతస్య
బ్రహ్మాదీనాం ముకుటకిరణ శ్రేణయః శోణయంతి ॥౨౦॥

అర్థ:—త్వత్పూజాయాం= నీయర్చనయందు, కుసుమహరణే= పూలనెత్తుటలో, ధావతః = పరుగెత్తుచున్నట్టి భక్తుని, యత్ = ఏ, పాదయుగ్మం = చరణద్వయము, పాషా...కం, పాషాణ = శిలల యొక్క, వ్రజ=సమూహముయొక్క, పరికర=సామగ్రిచేత, ఉత్కీర్ణ= ఒరయికవలన గలిగిన, రేఖా= గీతయొక్క, అంకం = గురుతుగలదిగా, ఆసీత్ = అయ్యెనో, యత్ =ఎందువలన, త్వదనుచరతః=నిను వెన్నంటి నడచునట్టి, రుద్రలోకం = శివలోకమును, గతస్య = పొందినట్టి, తస్య = వానియొక్క, (పాదయుగ్మమునే) బ్రహ్మాదీనాం = బ్రహ్మా దులయొక్క, ముకుటకిరణశ్రేణయః = శిరముల నున్న కిరీటసమూహ ములు, శోణయంతి = ఎఱ్ఱబార జేయుచున్నవి.

తా. పశుపతీ! నీ యర్చనార్థము పూలు గోయుటకై పరుగిడిన భక్తునియొక్క చరణములు దారిలోని గులకరాళ్ళ రాపిడివలన నెత్తు బడినంతనే నీ వనుగ్రహించి వానిని శివలోకమునకు జేర్చుచున్నావు. అట్టి మహాభక్తుని యా గాయము గల పాదములనే బ్రహ్మాదు లందరు నమస్కరింతురు. కావున వారికిరీటముల రాపిడివలన ఆభక్తునిపాదములు మరల మరల నెఱ్ఱపడుచున్నవిగదా! (శివార్చనార్థ మొకపరి పుష్పము లకై ప్రయత్నించిన వారిని సైతము శివు డనుగ్రహించు ననియును, విష్ణుబ్రహ్మాదుల గౌరవమునకు పాత్రు డగు ననియును భావము.)॥ ౨౦॥

యేషాం యుష్మత్ప్రతికృతిగృహం లింపతాం పాణయో యే
త్వద్భక్తానాం సలిలలులితైర్గోమయైః సంప్రలిప్తాః।
తేషా మీశ త్రిదశనగరీనాయకత్వం గతానాం
తే లిప్యంతే మృగమదరసైః ఖేచరీణాం కుచేషు ॥౨౧॥

అర్థ:—ఈశ=ప్రభూ! యుష్మత్ప్రతికృతిగృహం = నీ విగ్రహా లయమును, లింపతాం=అలుకుచున్నట్టి, యేషాం=యే, త్వద్భక్తానాం= నీ భక్తులయొక్క, యే పాణయః = ఏహస్తములు, సలిలలులితైః = జల మిశ్రితములైన, గోమయైః = గోమయములచేత, సంప్రలిప్తాః = లేపనముగలవి యగుచున్నవో, త్రిదశనగరీనాయకత్వం = స్వర్గాధి

పత్యమును, గతానాం=పొందినట్టి, తేషాం=వారియొక్క, తే=ఆ హస్తములు, ఖేచరీణాం=దేవతారమణులయొక్క, కుచేషు=ఉరోజములందు, మృగమదరసైః = కస్తూరి రసములచేత, లిప్యంతే = అలుకుచున్నవి.

తా. స్వామీ! నీ యాలయములందు జలమిశ్రితగోమయములు చల్లునపుడే భక్తులహస్తముల కీ పేడనీ రంటునో వారు తదనంతరము త్వరగా పరలోక మేగి స్వర్గాధిపత్యమును పొందినపుడు వారియొక్క ఆ హస్తములే దేవసుందరీమణులయొక్క వక్షఃస్థలమందు కస్తూరి పూతలఁ బూయగలవు॥౨౧॥

యస్తే కృత్వా స్నపనమమృతైః పంచభిశ్చంద్రమౌళే!
పశ్చాత్ కైశ్చిత్కుసుమనికరైర్మూర్ధ్ని బధ్నాతి మాలాం
తస్యావశ్యం సకలభువనైకాధిపత్యాభిషేకే
బధ్నంత్యన్యే శిరసి పరమైశ్వర్యసామ్రాజ్యపట్టం ॥౨౨॥

అర్థః—చంద్రమౌళే = చంద్రశేఖరా! యః = ఎవడు, తే= లింగమూర్తి వగు నీయొక్క, మూర్ధ్ని=శిరమున, పంచభిః = ఐదైన, అమృతైః = అమృతములచేత, స్నపనం = అభిషేకమును, కృత్వా= ఒనర్చి, పశ్చాత్ = పిదప, కైశ్చిత్ = ఏవియో యైన, కుసుమనికరైః = పూఁగుత్తులచేత, మాలాం = దండను, బధ్నాతి = కట్టుచున్నాడో, తస్య = వానియొక్క, సకలభువనైకాధిపత్యాభిషేకే = సర్వలోకముల ముఖ్యాధిపత్యపు అభిషేకమందు, శిరసి = శిరమున, అన్యే = ఇతరులు, అవశ్యం = తప్పక, పరమైశ్వర్యసామ్రాజ్యపట్టం = పరమేశ్వరునకు సంబంధించిన సార్వభౌమపట్టమును, బధ్నంతి = కట్టుచున్నారు.

తా. ఏ భక్తుడు ఒక పర్యాయమైనను లింగరూపుడ వగు నీ శిరమున పంచామృతములతో నభిషేకమొనర్చి, ఏవియో కొన్నిపూలతో గుచ్చిన దండను కట్టునో, వాడును శివలోకము జేరినపుడు అతనికి సర్వలోకములకు ముఖ్యాధిపత్యపు అభిషేకము జేయనెంచి, అక్కడి దేవతలు ఈ భక్తుని శిరమునందును పరమైశ్వర్యసార్వభౌమపట్టమును గట్టగలరు.

౨. శివభక్తుడు సాయుజ్యముక్తితో శివుడే యగు నని భావము. గోక్షీరదధి ఘృతమధుశర్కరలు పంచామృతములు. పట్టాభిషేక కాలమున రెండంగుళముల వెడల్పు గల బంగారురేకు పట్టిని తలలో గట్టుట యాచారమై యున్నది. ఇదియే పట్టము. ఆ యా అధికారము గలవారికి పట్టాలు ఒసంగబడుట నేడును కలదు. ॥౨౨॥

ఏతచ్చిత్రం క్వచిదపి మయా నైవ దృష్టం శ్రుతం వా
తద్విస్పష్టం కథయ కిమిదం నాథ కౌతూహలం మే।
యత్తే భక్త్యా హర చరణయోరర్పితం పుష్పమేకం
సద్యస్సూతే ఫలమభిమతం కోటిశః కామరూపం॥ ౨౩॥

అర్థ:—నాథ హర = ప్రభూ, శంభో, ఏతత్ = ఈ, చిత్రం= చిత్రము, క్వచిదపి = ఎచ్చోటను, మయా = నాచే, నైవ దృష్టం = చూడబడలేదు, వా = అథవా, నశ్రుతం = వినబడలేదు, ఇదం= ఇది, కిం = ఏమిటి, (అని) మే = నాకు, కౌతూహలం = కుతూహలము (కల్గినది), తత్ = దానిని, విస్పష్టం = స్పష్టముగా, కథయ= చెప్పుము, యత్ = ఎందువలన, భక్త్యా = భక్తితో, తవ = నీ యొక్క, చరణయోః = పాదములందు, అర్పితం = అర్పింపబడిన, ఏకం = ఒకటైన, పుష్పం = సుమము, సద్యః = శీఘ్రముగా, కామరూపం = యథేష్టమైన, ఫలం = ఫలమును, కోటిశః= కోట్లకొలదిగ, సూతే = పండుచున్నదో.

తా. మహేశ్వరా! నే నీ చిత్రము నెచ్చోటను చూడను లేదు, వినను లేదు. ఇది యేమియా యని నాకు కుతూహలముగా నున్నది. భక్తితో నీ పాదసన్నిధి నర్పించిన పుష్ప మొక్కటియే ఇష్టము ననుసరించి కోట్లకొలదిగ నపుడే ఫలించు నట! ఇది మహాద్భుతము కదా! దీని తత్త్వమును వివరింపుము ప్రభూ॥ ౨౩॥

యస్తే భక్త్యా వరద చరణద్వంద్వముద్దిశ్య దద్యా-
దేకం నీలోత్పలదలమపి త్వత్ప్రసాదేన నూనం।
తత్ప్రత్యంతం నిపతతి పునర్దృష్టి రాలోలతారై-
ర్దివ్యస్త్రీణాం కువలయదలశ్రేణిదీర్ఘైః కటాక్షైః॥౨౪॥

అర్థ:—వరద = ఇష్టప్రదాతా! యః = ఎవ్వఁడు, భక్త్యా = భక్తితో, తే = నీ యొక్క, చరణద్వంద్వం = పాదయుగ్మమును, ఉద్దిశ్య = గుఱించి, ఏకం = ఒకటైన, నీలోత్పలదలమపి = నీలికలువ ఱేకునైనను, దద్యాత్ = ఇచ్చుచున్నాఁడో, తత్ప్రత్యంతం = వాని యొక్క సమీపము చుట్టును, పునః = మరల, త్వత్ప్రసాదేన = నీ యనుగ్రహముచేత, దివ్యస్త్రీణాం = దేవతాస్త్రీలయొక్క, ఆలోల తారైః = చంచలములైన కనుపాపలు గల, కువలయశ్రేణిదీర్ఘైః = నల్లకలువలచాలువలె పొడవైన, కటాక్షైః = కొనచూడ్కులతో, దృష్టిః = దృష్టి, నూనం = నిశ్చయముగా, నిపతతి = పడుచున్నది.

తా. పరమేశా! ఎవ్వాఁడు భక్తిమై నీపాదముల నుద్దేశించి ఒక కలువరేకునైనను సమర్పించుచున్నాఁడో, అట్టివాని పాదసన్నిధిని శ్రీ శివుని కృపవలన సురసుందరీమణులయొక్క చంచలకనీనికలు గలట్టియు, కలువలవలె నల్లనైనట్టియు ఓరచూపులు గల దృష్టి మరల నవశ్యముగా వచ్చిపడుచున్నది.

వి. ఇవి యన్నియు శరీరత్యాగానంతరము కైలాసమున భక్తునకు జరుగు ఉపచారములని తెలియవలెను. నిష్కాములైనవారు కేవలసాయుజ్యమునే పడయవచ్చును.॥౩౮॥

కృత్వా మాలాం ఘనపరిమళోద్గారిధారాకదంబై-
ర్యస్తే కంఠాభరణపదవీం ప్రాపయే న్నీలకంఠ॥
దివ్యస్త్రీణాం విపులపులకై ర్బాహుభిః కంఠలగ్నై-
స్తస్యాఽపి త్వం వితరసి చిరం నిర్భరాశ్లేషసౌఖ్యం ॥౩౯॥

అర్థ:—నీలకంఠ = నీలగళా! యః= ఎవఁడు, ఘనపరిమళోద్గారి ధారాకదంబైః=ఎక్కువైన సువాసనలు వెదజల్లు ధారలు గల కదంబ కుసుమములచే, మాలాం = సరమును, కృత్వా = ఒనర్చి, తే = నీయొక్క, కంఠాభరణపదవీం = గళాలంకారముయొక్క స్థానమును, ప్రాపయేత్ =పొందించుచున్నాఁడో, తస్యాపి=వానికిని, కంఠలగ్నైః= కంఠమునందు చేర్చబడిన, విపులపులకైః = దట్టమైనరోమాంచములు గల, దివ్యస్త్రీణాం = సురస్త్రీలయొక్క, బాహుభిః = భుజములతోడ,

నిర్భరాశ్లేషసౌఖ్యం = గాఢాలింగనానందమును, చిరం = దీర్ఘముగా, త్వం = నీవు, వితరసి = ఇచ్చుచున్నావు.

తా. సాంద్రసుగంధములనీను కదంబపుష్పములతో దండనుగట్టి ఎవ్వాడు నీగళము నలంకరించునో; శివలోకమునందు వాని కంఠమునను సురసుందరీమణులు రోమాంచములుగల తమ బాహువులతో గాఢాలింగనముల నైతురు. పరమేశా! నీభక్తుడు నీమెడలోవేసిన పూలదండ కిది ప్రత్యామ్నాయముగా ననుగ్రహించినట్లున్నది. ॥౨౭॥

కృత్వా పూజాం తవ చరణయో రాదరాదష్టమూర్తే
యస్సాష్టాంగం ప్రణమతి మహీపృష్ఠపీఠే లుఠిత్వా।
ప్రత్యాసన్నం క్షితిపతిపదం ప్రీతిబద్ధానురాగా
తస్యోత్సంగే లుఠతి ధరణీ రేణుచక్రచ్ఛలేన॥ ౨౮॥

అర్థ:—అష్టమూర్తే = సర్వవ్యాపీ! తవ = నీ, చరణయోః = పాదములయొక్క, పూజాం = అర్చనను, కృత్వా = ఒనర్చి, ఆదరాత్ = శ్రద్ధవలన, మహీపృష్ఠపీఠే = పలకవంటి భూతలమున, లుఠిత్వా = పొరలి, యః = ఎవడు, సాష్టాంగం = అష్టాంగసహితముగ, ప్రణమతి = నమస్కరించుచున్నాడో, తస్య = వానికి, క్షితిపతిపదం = ధరాపాలకత్వము, ప్రత్యాసన్నం = దగ్గరజేరినదైనది. ఉత్సంగే = ఒడిలో, ధరణీ = భూమి, ప్రీతిబద్ధానురాగా = ప్రేమతో నిండిన సంబంధము గలదై, రేణుచక్రచ్ఛలేన = ధూళిసమూహపు మిషతో, లుఠతి = పొరలుచున్నది.

తా. సర్వా! ఎవడు నీ చరణముల భక్తితోఁ బూజించి భూతలమున సష్టాంగములతోఁ బొరలి సాగిలిమ్రొక్కుచున్నాడో వానికిని సరపతిత్వము స్వాధీన మగుచున్నది. మరియు నీ సమస్తధరామండలము ధూళివ్యాజముతో వాని తొడపై వచ్చి చేరి పొరలాడగలదు. ॥౨౮॥

త్వాముద్దిశ్య త్రినయన జనో యః ప్రదీపం దదాతి
జ్యోతిర్జ్వాలాదళితతిమిరం ద్యోతితాంతర్నికేతం।

తస్మై మాయారజని విలసద్గాఢమోహాంధకార-

చ్ఛేదప్రౌఢం త్వమపి దిశసి జ్ఞాన మాత్మప్రకాశం ॥౨౭॥

అర్థ:—త్రినయన = ముక్కంటీ! యః=ఏ, జనః = భక్తుడు, జ్యోతిర్జ్వాలాదలిత తిమిరం=తేజస్సుయొక్క వర్చస్సులచేతపోగొట్టబడిన చీకటి గలట్టియు, ద్యోతితాంతర్నికేతం = వెలిగింపబడిన ఇంటిలోని భాగము గలట్టియు, ప్రదీపం = పెద్దదీపమును, త్వాముద్దిశ్య = నిను గూర్చి, దదాతి = ఇచ్చుచున్నాడో, తస్మై = వానికి, త్వమపి = నీవును, మాయా...ప్రౌఢం; మాయారజని = మాయయనెడు రాత్రి యందు, విలసత్ = ఒప్పుచున్న, గాఢ=దట్టమైన, మోహాంధకార = మోహ మనెడు చీకటిని, ఛేద = భేదించుటలో, ప్రౌఢం = గొప్పదై నట్టి, ఆత్మప్రకాశం = ఆత్మను ప్రకాశింప జేయునట్టి, జ్ఞానం = జ్ఞాన మును, దిశసి = ఇచ్చుచున్నావు.

తా. మహేశా! ఎవ్వాడు భక్తితో తేజశ్శిఖలచే చీకట్లఁబోనాడు నట్టియు, ఆలయాంతర్భాగమును వెలుగజేయునట్టియు అఖండజ్యోతిని నీ సన్నిధి నర్పించుచున్నాడో; అట్టివానికి నీవును, మాయ యనెడు రాత్రిలో గాఢముగ నల్లుకొనిపోవుచున్న యజ్ఞాన మనెడు నంధకార మును నశింప సమర్థమైనట్టియు, ఆత్మను ప్రకాశింపజేయునట్టియు నిర్మల జ్ఞానము ననుగ్రహించుచున్నావు.

వి. విశ్వారాధ్యుని సంస్కృతటీకలో నీ శ్లోకము ౨౮ వదిగను 'చిత్రైర్మాలా' యను శ్లోకము ౨౭ వదిగను ముద్రితమైనవి. ॥౨౭॥

చిత్రైర్మాలారచితకుసుమై ర్ధూర్జటే పూజయిత్వా

యస్తౌతి త్వాం జయజయ మహాదేవ దేవేతి వాచా।

సోఽప్యారోహ న్హర తవ పురం మౌళిబద్ధాంజలీనాం

శక్రాదీనాం స్తుతివిషయతాం త్వత్ప్రసాదాత్ప్రయాతి॥౨౮॥

అర్థ:—హర = రుద్రా! ధూర్జటే = కపర్దీ! యః = ఎవడు, చిత్రైః = విచిత్రములగు, మాలారచితకుసుమైః = దండలుగా గట్ట బడిన పూలచేత, పూజయిత్వా = పూజించి, త్వాం = నిన్ను, మహా

దేవ = మహాప్రభో, దేవ = ఈశ్వరా, జయ జయ = జయింపుము, జయింపుము, ఇతి = ఇట్లు, వాచా = వాక్కుతో, స్తౌతి = స్తుతించుచున్నాడో; సోఽపి = ఆతడును, తవ = నీ యొక్క, పురం= కైలాసమును, ఆరోహన్ = ఎక్కినవాడై, త్వత్ప్రసాదాత్ = నీ యనుగ్రహమున, మౌళిబద్ధాంజలీనాం = శిరమున ఘటించిన యంజలి గల, శక్రాదీనాం = ఇంద్రాదులయొక్క, స్తుతివిషయతాం = స్తోత్రపాత్రత్వమును, ప్రయాతి = పొందుచున్నాడు.

తా. ఓ జడదారీ! ఏ భక్తుడు వన్నెవన్నెల పూలుగల దండలతో నిన్నిచ్చోట నర్చించి "మహాప్రభో! ఈశ్వరా! జయశీలుడవై వెలుంగుము" అను వాణితో ప్రశంసించుచున్నాడో, వాడును నీ లోకము నధిరోహించి నీ కృపవలన, మ్రొక్కులిడుచు వచ్చు ఇంద్రాదులయొక్క స్తోత్రముల నంది ప్రశంసింపబడు చున్నాడు. ॥౨౫॥

భస్మస్నానం వపుషి శిరసా స్వర్ధునీవారిభారం
శాంతాం మూర్తిం కలయసి కరే కార్ముకం యుక్త మేతత్।
అప్యన్యేషాం కతిపయపురస్వామినాం చిత్రభూతా
శ్చేష్టా దృష్టాస్త్రిభువనపతేః కిం మహేశస్య న స్యుః॥౨౬॥

అర్థః—వపుషి = దేహమున, భస్మస్నానం = భస్మలేపనమును, శిరసా = తలచే, స్వర్ధునీవారిభారం = ఆకాశగంగాజలభారమును, శాంతాం = సౌమ్యమైన, మూర్తిం = విగ్రహమును, కరే = హస్తమున, కార్ముకం = ధనుస్సును, కలయసి = కైకొనియున్నావు. ఏతత్ = ఇది, యుక్తం = ఉచితము, కతిపయపురస్వామినాం=కొన్ని నగరముల కధిపతులైన, అన్యేషామపి= ఇతరులకును, చిత్రభూతాః= విచిత్రములైన, చేష్టాః = క్రియలు, దృష్టాః = చూడబడినట్టివి. త్రిభువనపతేః = త్రిలోకాధీశ్వరుడైన, మహేశస్య = మహాదేవునకు, న స్యుః = ఉండవా, కిం = ఏమి?

తా. మహేశా! నీ స్నానమా! భస్మోద్ధూళనముతో నగుచున్నది. తలలో ... గంగాజలభార మెందులకో తెలియదు. ఆకాశ

మన్నచో మిక్కిలి శాంతమైనది. హస్తమున జూడ పినాకమును ధరించి యున్నావు. ఇదియు నుచితమే! కొన్నియూళ్లకు దొరలైన వారికే ఎన్నియో విచిత్రవేషము లుండగా ముల్లోకముల కొడయడవగు నీకేల యివి యుండగూడదు? ॥౨౯॥

త్వామారాధ్య త్రిదశపతయో భుంజతే రాజ్యలక్ష్మీం
భిక్షాభుక్ త్వం తదపిచ మహాదేవశబ్దైకవాచ్యః।
నైరాశ్యం వరద పరమైశ్వర్యకోటిప్రతిష్ఠం
తచ్చేదస్తి త్వయి కిమపరైః ఫల్గుభిః శ్రీవిలాసైః ॥౩౦॥

అర్థః—వరద = భక్తవత్సలా! త్రిదశపతయః = దేవాధీశ్వరులు, త్వాం = నిన్ను, ఆరాధ్య = అర్చించి, రాజ్యలక్ష్మీం = భూదేవియనెడు లక్ష్మిని, భుంజతే=అనుభవించుచున్నారు. త్వంచ = నీవన్ననో, భిక్షాభుక్ = భిక్షాశనము గలవాడవు, తదపి = ఐనను, మహాదేవశబ్దైకవాచ్యః = మహాదేవు డనెడు శబ్దముతో మాత్రమే (జెప్పదగినవాడవై యున్నావు). పరమైశ్వర్యకోటి ప్రతిష్ఠం = మహాదేవత్వపదవిలో స్థాపింపబడిన, తత్ = ఆ, నైరాశ్యం = నిరాశాత్వము (వైరాగ్యము), త్వయి = నీయందు, అస్తిచేత్ = ఉన్నయెడల, అపరైః = ఇతరములగు, ఫల్గుభిః = నిస్సారములైన, శ్రీవిలాసైః = లక్ష్మీభోగములతో, కిం = ఏమి ప్రయోజనము?

తా. దేవాధీశ్వరులైన ఇంద్రోపేంద్రాదులు నిను గొలిచియే రాజ్యాధిపత్యసౌఖ్యముల ననుభవించుచున్నారు. నీవన్ననో తిరిపెపు తిండిగలవాడవు. ఐనను సర్వలోకాధీశ్వరుడ వనియే నీకు విఖ్యాతమైన నామముకలదు. త్రిలోక సార్వభౌమత్వముకంటె నున్నతమైన వైరాగ్యాతిశయము నీ యందు ప్రకాశించుచుండగా నిస్సారములైన సంపద్విలాసములతో ప్రయోజన మింతయు లేదు.

వి. పరశివుని వేషమునుగూర్చి సందేహపడువారు ఈ భావమును హృదయంగమ మొనర్చికొనవలెను. సామాన్య లోకమునకు భయంకరములైనట్టియు, నిష్ప్రయోజనములైనట్టియు వస్తువులను స్వాధీనమున నిడుకొని; లౌకిక భోగముల నంటకయుండు మహానుభావుడే కదా మహేశ్వరుడు! ॥౩౦॥

అస్థిగ్రంథిః పితృవనభవం భస్మ భూషాంగరాగః
ప్రీతిః ప్రేతైస్తవ సహచరాః ఫేరవాః కోఽత్రదోషః॥
యస్మైశ్వర్యం పరమపదవీం ప్రాప్య విశ్రాంతముచ్చై -
స్తస్య గ్రావా కనకమథవా సర్వమేతత్సమానం. ॥౩౧॥

అర్థః—తవ = నీకు, అస్థిగ్రంథిః = ఎముకలకుప్ప, భూషా = అలంకారము, పితృవనభవం = శ్మశానమందలి, భస్మ= బూది, అంగ రాగః = దేహలేపనము, ప్రేతైః=భూతములతో, ప్రీతిః=స్నేహము, సహచరాః = సేవకులు, ఫేరవాః = నక్కలు, అత్ర = ఇందు, కోదోషః = ఏమిదోసము ? యస్య = ఎవనియొక్క, ఐశ్వర్యం = ఆధిపత్యము, పరమపదవీం = అతీతధామమును, ప్రాప్య=పొంది, ఉచ్చైః= ఉన్నతముగా, విశ్రాంతం = విరమించినదో, తస్య = వానికి, గ్రావా= శిలయు, అథవా = లేక, కనకం = బంగారమును, ఏతత్ = ఈ, సర్వం = సకలమును, సమానం = సమానము.

తా. స్వామీ ! నీకు ఎముకల దండలే సొమ్ములు. కాటి బూదియే గంధము. దయ్యములే నేస్తకాండ్రు. నక్కలే బంట్లు. ఇందు దోషమేమియు లేదు కదా ! ఎవ్వాని యాధిపత్యము పొంద వలసినంత మహాపరమైశ్వర్యమును చూరగొని సర్వాతిశాయియై విరాజిల్లుచున్నదో అట్టి మహానుభావునకు బంగారముగాని శిలగాని సర్వము సమానముగా నుండుటలో నాశ్చర్యమేమి ? ॥౩౧॥

ఆవాసస్తే పితృవనమహీ క్రీడనం యానముక్షా
భిక్షాపాత్రం హర నరశిరఃకర్పరం నైష దోషః ।
ఆరాతీయ త్రినయన భవత్యల్పసంస్థోహి లోకో
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః॥ ౩౨॥

అర్థః—హర = శంభో! త్రినయన = విరూపాక్షా! తే = నీ యొక్క, ఆవాసః = నివాసము, పితృవనమహీ = శ్మశానభూమి, క్రీడనం = ఆటయగు, యానం = వాహనము, ఉక్షా = ఎద్దు, భిక్షాపాత్రం = బిచ్చపుగిన్నె, నరశిరఃకర్పరం = కపాలపు పుర్రె,

ఏషః = ఇది, నదోషః = దోషముకాదు. హి = ఎందువలన ననగా, అల్పసంస్థః= కొంచెము నాశ్రయించిన, లోకః=జనము, ఆరాతీయః = పూజాయోగ్యము, భవతి = అగుచున్నది. నిస్త్రైగుణ్యే = త్రిగుణాతీతమైన, పథి = మార్గమున, విచరతాం = సంచరించువారికి, విధిః = నియమము, కః = ఏది, నిషేధః = త్యాజ్యము, కః = ఏద్ది ?

తా. త్ర్యంబకా! నీకు నివాసమా శ్మశానము. వాహనమా ఆడుటకు బనికివచ్చు ఎద్దు. భిక్షాపాత్రమా తలపుఱ్ఱె. ఇది దోసము కూడ కాదులే! లోకమునకు సంబంధించిన వస్తువుల నెంత స్వల్పముగా వాడినచో నంత మహామహుడుగా పూజ్యతను బడయుచున్నాడు గదా! ఇట్టి గుణాతీతపద్ధతిలో విహరించు మహానుభావునకు విధిగాని నిషేధముగాని యెక్కడిది? ॥౩౨॥

ప్రేతావాసః శయన మశనం భైక్ష మాశాశ్చ వాసః
ఖట్వాంగం చ ధ్వజముపహితం త్వస్థినేపథ్య మంగే।
యద్యప్యేవం తదపి భగవ న్నీశ్వరేత్యస్య నామ్నో
నిస్సామాన్య స్త్వమసి విషయో నాపరః కశ్చిదస్తి ॥౩౩॥

అర్థ :—భగవన్ = పరమేశా! ప్రేతావాసః = దయ్యములతావు, శయనం = పడక, భైక్షం=భిక్షాటనము, అశనం= ఆహారము, చ = మఱియు, ఆశాః = దిక్కులు, వాసః = వస్త్రములు, ఖట్వాంగంచ = మంచపుకోడే, ధ్వజం = టెక్కెముగా, ఉపహితం = ఉంచబడినది. అంగేతు = దేహముననో, అస్థి = ఎముకయే, నేపథ్యం = అలంకారము. ఏవం = ఇట్లు, యద్యపి = ఉన్నను, తదపి=అదియును, ఈశ్వరే త్యస్య = ఈశ్వరుడను ఈ, నామ్నః = నామధేయమునకు, నిస్సామాన్యః = అసాధారణమైన, విషయః = గోచరుడవు, త్వం = నీవు, అసి = అయిఉన్నావు. అపరః = ఇతరుడైన, కశ్చిత్ = ఎవ్వడు, నాస్తి = లేడు.

తా. పరమేశా! దయ్యములతావు నీకు శయనము. భిక్షాసంపాదితమే తిండి. దిక్కులే యంబరములు. మంచపుకోడే వద్దనున్న ధ్వజము.

ఏమకరమే అలంకారము. ఇదియంతయు ఇట్లున్నను విచారింపగా ఈశ్వర శబ్దవాచ్యుడవు నీ వొక్కరుడవు మాత్రమే నిశ్చయముగా గన్పట్టు చున్నాడవు. మరి వేరొకడు లేనే లేడు కదా!

వి. ప్రేతభూమి నివాసము, శివుని ప్రళయ కాలస్థాయిత్వమును, భిక్షావృత్తి సర్వత్యాగిత్వమును, దిగంబరత్వము సర్వవ్యాపకత్వమును, ఖట్వాంగము త్రివిక్రమ దమనత్వమును, అస్థ్యాదులు సర్వపవిత్రీకరణ సామర్థ్యమును సూచించుచున్నవి.॥33॥

దారూద్యానే ద్విజవరవధూవిప్లవో రేతసాగ్నౌ
హోమస్సంధ్యానటన మితి తే చేష్టితం నైవ దుష్టం।
మిథ్యాజ్ఞానోపహతమనసాం మార్గ ముల్లంఘ్య దూరం
యే నిష్క్రాంతాస్త్రినయన న తాం లోకవాదాః స్పృశంతి.

అర్థ:—త్రినయన = త్ర్యంబకా! దారూద్యానే = దేవదారు వనమున, ద్విజవరవధూవిప్లవః = విప్రశ్రేష్ఠుల భార్యలయొక్క విప్లవ మును, రేతసా = రేతస్సుచేత, అగ్నౌ = వహ్నిలో, హోమః = హోమమును, సంధ్యానటనం = సంధ్యాకాల తాండవనృత్యమును, ఇతి=అను నీ, తే = నీయొక్క, చేష్టితం = క్రియ, దుష్టం = దోష ముతోకూడినట్టిది, నైవ = కాలేదు. యే = ఎవరు, మిథ్యాజ్ఞానోప హతమనసాం = అజ్ఞానముచేత నష్టబుద్ధు లగువారి, మార్గం=పద్ధతిని, ఉల్లంఘ్య = దాటి, దూరం= దూరముగా, నిష్క్రాంతాః = వెళ్లిన వారైనారో, తాం = వారిని, లోకవాదాః = జనవాదములు, న స్పృశంతి = ముట్టుట లేదు.

తా. సాంబా! దారుకావనమున మునిపత్నులకు కామము గల్గించినదియు, షణ్ముఖోత్పత్తికాలమున అగ్నిలో రేతఃక్షేపణము గావించినదియు, సంధ్యాసమయమున వికటతాండవనృత్యము నొనర్చు టయు అను నీ చేష్టలన్నియు దోషప్రదములు కావనుట నిక్కమే. అసత్యముతో నిండిన బుద్ధిగలవారి పద్ధతిని మీాఱి; అనుపమాన చరిత్రి గల మహానుభావులను గూర్చి సామాన్యలోక మాడిపోసికొన్నను నబద్ధములే యగును కదా!

వి. ఋషుల గర్వమర్దనము దారుకావనవిహారమును, తారకాసుర సంహా

రార్థము అగ్నిద్వారా షణ్ముఖోత్పత్తియు, రాక్షసోపద్రవనివారణార్థము తాండవ నృత్యమును, శివుడు గావించె నను పౌరాణికరహస్యము నరయని మందమతులు మాత్రమే ఈ కథలను గూర్చి పిల్లదముల బల్కుచుందురని భావము॥ ౩౮॥

దేవాస్సర్వే దధతి వపుషా భూషణం హేమరత్నం
గుంజామాత్రం కనకమపి తే నాస్తి కర్ణే కరే వా।
మార్గాతీతం స్ఫురతి సహజం యస్య సౌందర్యమంగే
తస్యాహార్యే ష్వితరజనవన్నాదరః స్యాద్గుణేషు॥ ౩౯॥

అర్థః—సర్వే = ఎల్ల, దేవాః = దేవతలు, వపుషా = శరీరముతో, హేమరత్నం= స్వర్ణమణులను గల, భూషణం = సొమ్మును, దధతి = ధరించుచున్నారు, తే = నీ యొక్క, కర్ణే = చెవియందుగాని, కరే వా = చేతియందుగాని, గుంజామాత్రం = గురిగింజయెత్తు, కనకమపి = బంగారమైనను, నాస్తి= లేదు. యస్య= ఎవని, అంగే= దేహమున, మార్గాతీతం = నిస్సీమమైనట్టియు, సహజం = స్వాభావికమైనట్టియు, సౌందర్యం = సురూపత్వము, స్ఫురతి = ప్రకాశించుచున్నదో, తస్య = వానికి, ఆహార్యేషు = కాంతివర్ధనకరములైన, గుణేషు = గుణములందు, ఇతర జనవత్ =ఇతర జనమువలె, ఆదరః= ప్రీతి, నస్యాత్ = ఉండజాలదు.

తా. స్వామీ! దేవత లెల్ల తమ ఒడలినిండను స్వర్ణమణులతో నిర్మింపబడిన సొమ్ములచే నలంకరించుకొన్నారు. నీ చేతిలోగాని చెవిలోగాని గురిజెత్తు బంగార మగుపడదు. ఎవని దేహమునిండ నఖండమైన సహజసౌందర్యము వెలుంగుచున్నదో అట్టివాడు సామాన్యమనుష్యునివలె కృత్రిమములైన సొమ్ములలో భ్రాంతి నిడుకొనునా? (ఇది నీ యద్భుతమైన వైరాగ్యమునకు సాక్ష్యము.) ॥౩౯॥

త్వం బ్రహ్మాదిత్రిదశగురుభిః పూజితస్స్వార్థహేతో-
రిత్యామ్నాయో నఖలు భవతా ప్రార్థితః కశ్చిదన్యః।
ఇచ్ఛామాత్రాత్ స్వయ ముపనమంత్యగ్రతో యస్య భావా-
స్తస్యాపేక్షా భవతి కిము వా వేదీశ్వర స్వేతరేషు ॥౪౦॥

అర్థ:—బ్రహ్మాదిభిః దశగురుభిః = బ్రహ్మమున్నగు దేవాధిపతులచే, స్వార్థహేతోః = స్వప్రయోజనమువలన, త్వం = నీవు, పూజితః = అర్చింపబడినవాడవు, ఇతి=అని, ఆమ్నాయః = వేదము, (పలుకుచున్నది) భవతా = నీచేత, అన్యః = వేరైన, కశ్చిత్ = ఎవకును, నఖలు ప్రార్థితః = యాచింపబడలేదు కదా! యస్య = ఎవనికి, ఇచ్ఛామాత్రాత్ = తలచినంతనే, భావాః = పదార్థములు, స్వయం = సొంతముగ, అగ్రతః = ముందర, ఉపనమంతి = వాలుచున్నవో, తస్య = అట్టి, ఈశ్వరస్య=ప్రభువునకు, ఇతరేషు = అన్యములందు, అపేక్షా = ఆశ, కథమిహ = ఎట్లు, స్యాత్ =కల్గును?

తా. స్వామీ! దేవాధినాయకులైన బ్రహ్మాదులును నిన్నర్చించి,తమతమ వరముల నందికొన్నారని వేదమే బోధించుచున్నది. నీవు మాత్ర మెవ్వని వేడినట్లును కని విని యెరుంగము. నీవు తలంచినంతనే సమస్తపదార్థములును తమంత తామే వచ్చి నీ సన్నిధిని బడి మోకరిల్లును గదా! ఇట్టి మహాప్రభుడ వగు నీకు అన్యవస్తువులలో మమత ఎట్లు కల్గును? ॥౨౬॥

ఖండశ్చంద్రః శిరసి పరశుః ఖండమేవాయుధంతే
భిక్షాపాత్రం ద్రుహిణశిరసః ఖండమేకం కపాలం।
ఖండప్రాయ స్తవ పరికరో యద్యపీత్థం తథాపి
త్వం సర్వేషాం స్మృతిముపగతస్సర్వపూర్ణత్వహేతుః॥౨౭॥

అర్థ:—తే = నీయొక్క, శిరసి = తలలో, చంద్రః=చంద్రుడు, ఖండః = ఖండితుడు, ఆయుధం = అస్త్రమైన, పరశుః = గొడ్డలి, ఖండమేవ = తునుకయే, భిక్షాపాత్రం = భిక్షాపాత్రమైన, కపాలం = పుర్రెయు, ద్రుహిణశిరసః = బ్రహ్మతలయొక్క, ఏకం = ఒకటైన, ఖండం = తునుకయే! యద్యపి = ఒకవేళ ఇట్లు, తవ = నీయొక్క, పరికరః=సామగ్రి, ఖండప్రాయః = ముక్కలుగా నున్నది. తథాపి = ఐనను, త్వం = నీవు, సర్వేషాం = సకలుల, స్మృతిం = స్మరణను, ఉపగతః = పొందినవాడవై, సర్వసంపూర్ణ హేతుః = సకల పూర్ణమునకు కారణుడవుగా (వన్నబడుచున్నావు).

తా. పరమేశా! నీ తలలోని చంద్రుడును సగముగా నున్నాడు. ఆయుధమైన గండ్రగొడ్డలియు నొక ఖండము (తునక)గా నున్నది. భిక్షాపాత్రయగు కపాలమును బ్రహ్మయొక్క సగముతలయే! చూడగా నీ సమస్తసామగ్రియు ఖండఖండములుగా తుత్తునియలుగా నున్నది. ఐనను నిను బ్రహ్మాదు లెల్లరు దలచునపుడు అఖండస్వరూపుడవై సకలమునకు కారణభూతుడ వగుచున్నావు. ॥32॥

పృథ్వీపీఠే కృతపదమదః స్వచ్ఛమాకాశలింగం
తారాపుష్పైః శిరసి రచితాభ్యర్చనం చన్ద్రచూడ।
ఇత్థంభావా దవహితధియో యే భవంతం భజంతే
తే లీయంతే త్వయి జలనిధౌ నిమ్నగానామివౌఘాః. ॥౩౮॥

అర్థ:—చంద్రచూడ = చంద్రశేఖరా! పృథ్వీపీఠే = భూమి యనెడు పీటలో, కృతపదం = చేయబడిన స్థానము గల, అదః = ఈ, స్వచ్ఛం = నిర్మలమైన, ఆకాశలింగం=గగనమనెడు లింగము, శిరసి= తలయందు, తారాపుష్పైః = నక్షత్రములనెడు పూలచేత, రచితాభ్యర్చనం = చేయబడిన పూజ గలదట్లుగా, (ఉన్నది) ఇత్థంభావాత్ = ఈ ప్రకారముగా, యే = ఎవరు, అవహితధియః = ఏకాగ్రచిత్తులై భవంతం = నిన్ను, భజంతే = కొలుచుచున్నారో, తే = వారు, త్వయి = నీయందు, జలనిధౌ = సముద్రమున, నిమ్నగానాం = నదుల, ఓఘాః ఇవ = ప్రవాహములవలె, లీయంతే = లీనమగు చున్నారు.

వి. ఇందుశేఖరా! "ఈ పృథ్వియనెడు పీటలో నీ నిర్మలమైన యాకాశ మనెడు లింగము నిలచినదై చుక్కలనెడు పూలతో పూజింపబడుచున్నది" అని ఇవ్విధముగ నెవరు ఏకాగ్రచిత్తులై నిను దలంచుచున్నారో వారు సముద్రమున నదీజల ములవలె నీయందు సర్వాత్మనా లయమంది ముక్తులగుచున్నారు మహానుభావా! ॥3౮॥

వారాణస్యాం స్ఫురతి యదిదం దేవదేవావిముక్తం
శైవం జ్యోతి స్సకలభువనాలోచనాదర్శభూతం।
కృత్వా తస్మిన్ ప్రమహసి పదే క్షేత్రసన్న్యాసయోగం
త్వయ్యేకత్వం వ్రజతి పురుష స్త్వజసేవ ప్రబోధః ॥౩౯॥

అర్థః—దేవదేవ = మహేశా! వారాణస్యాం = కాశియందు, అవిముక్తం = శాశ్వతమైనట్టి, యదిదం = ఏ యీ, శైవం = శివసంబంధమైన, జ్యోతిః = ప్రకాశము, సకల భువనాలోచనాదర్శభూతం = సమస్తలోకముల యొక్క స్వవిచారమునకు దర్పణముగా నున్నదో, తస్మిన్ = ఆ, ప్రమహసి = మహత్తరమైనట్టి, పదే = స్థానమున, క్షేత్రసన్న్యాసయోగం = క్షేత్రసంన్యాసదీక్షను, కృత్వా = చేసి, పురుషః = నరుడు, త్వయి = నీ యందు, తేజసి = తేజస్సునందు, ప్రదీపఇవ = పెద్దదీపమువలె, ఏకత్వం = ఐక్యమును, వ్రజతి = పొందుచున్నాడు.

తా. పరమేశా! వారణాసీక్షేత్రమున నక్షయ్యమగు నే నీ మహాజ్యోతిర్లింగము విశ్వనాథాఖ్యతో వెలుంగుచున్నదో, అది సమస్తలోకములకు స్వరూపమును దెలిసికొనుటకు దర్పణభూతమై యున్నది కదా! ఆ దివ్యక్షేత్రమున మనఃపూర్వకముగ సన్న్యాసము స్వీకరించిన మనుజుడు అఖండజ్యోతి తేజస్సున గలిసినట్లు నీయందు సంపూర్ణముగ సాయుజ్యమును బొందుచున్నాడు. ॥౩౯॥

యత్ప్రత్యక్షం సకలభువనాశ్చర్యభూతం విభాతి
జ్యోతిర్లింగం కనకకపిశం శ్రీగిరౌ వ్యోమ్నిదివ్యం।
తత్పశ్యంతః శివ సుకృతినస్త్యక్తసంసారబంధా-
స్త్వత్కారుణ్యాచ్చిరగణపదప్రాప్తిభాజో భవంతి॥ ౪౦॥

అర్థః—శివ = శంభో, యత్ = ఏది, ప్రత్యక్షముగ, సకల భువనాశ్చర్యభూతం = సకలలోకములకు ఆశ్చర్యమును గలిగించునట్టియు, కనక కపిశం = బంగారమువలె పచ్చనైనట్టియు, దివ్యం = అలౌకికమైనట్టియు, జ్యోతిర్లింగం = జ్యోతిర్లింగము, శ్రీగిరౌ = శ్రీశైలమున, వ్యోమ్ని = ఆకాశమున, విభాతి = వెలుంగుచున్నదో, తత్ = దానిని, పశ్యంతః = చూచునట్టి, సుకృతినః = పుణ్యాత్ములు, త్యక్తసంసారబంధాః = విడువబడిన సంసారపాశముగలవారై, త్వత్కారుణ్యాత్ = నీ కృపవలన, చిరగణపదప్రాప్తిభాజః = శాశ్వతమైన ప్రమథులయొక్క స్థానమును పొందినవారు, భవంతి = అగుచున్నారు.

తా. శంకరా! ప్రత్యక్షముగ దర్శనము నొసంగునట్టియు, సమస్త లోకముల కాశ్చర్యమును గలిగించునట్టిదియు, పింగళ వర్ణము గలదియు- శ్రీశైల మను ఉన్నత స్థలమున వెలసినట్టియు, ఏ శ్రీ మల్లి కార్జున జ్యోతిర్లింగము కలదో దానిని దర్శించిన పుణ్యపురుషులు సంసార పాశమును బోగొట్టుకొని శివకృపకు పాత్రులై కైలాసమున ప్రమథత్వమునంది శాశ్వతముగ నివసింతురు.

వి. ఈ హాలాయుధుని కాలమున శ్రీకాశీ, శ్రీశైల క్షేత్రముల మాహాత్మ్యములు ప్రత్యక్షముగ నాశ్చర్యజనకములై యుండెననుట కీ రెండు ప్రత్యేక పద్యములే ప్రమాణములు. నేటికిని భావుకుల కిట్టి యద్భుతములు ప్రత్యక్షములే. మొన్న మొన్నటివరకును శ్రీశైల మందలి గోడలనిండ బంగారము పొదుపబడి యుండెను. శ్రీ మల్లికార్జున లింగమూర్తికిని ప్రాచీన కాలమున కనకకవచమో, కనక కాంతియో ఉండియుండును. ॥౪౦॥

వాచాధీశం హుతవహతనుం శక్తిపాణిం భవంతం
యే ధ్యాయంతి త్రినయన తమస్తేజసా నిర్దహంతం
గంగాస్రోతస్సదృశవిలసద్గద్యపద్యప్రవాహైః
సద్యస్తేషాం ప్రసరతి ముఖాద్భారతీ నాత్ర చిత్రం ॥౪౧॥

అర్థ:—త్రినయన = కామారీ! వాచాధీశం = వాగధీశ్వరుడవును, హుతవహతనుం = అగ్ని దేవుడవును, శక్తి పాణిం = హస్తమున శక్తిగలవాడవును, తేజసా = తేజస్సుచేత, తమః = అంధకారమును, నిర్దహంతం = నశింపజేయువాడవును, అగు భవంతం = నిన్ను, యే = ఎవరు, ధ్యాయంతి = ధ్యానించుచున్నారో; తేషాం = వారి యొక్క, ముఖాత్ = వదనము నుండి, సద్యః = తత్కాలమున గంగా...హైః గంగా = గంగయొక్క, స్రోతస్సదృశ = ప్రవాహమునకు సమానముగా, విలసత్ = ఒప్పుచున్న, గద్యపద్య = గద్య పద్యముల యొక్క, ప్రవాహైః = ధారలతోడ, భారతీ = సరస్వతి, ప్రసరతి = సాగుచున్నది. అత్ర = ఇందు, నచిత్రం = చిత్రము లేదు.

తా. మహేశా! సర్వవాచస్పతివియు, స్వాధీన శక్తుడవును, దివ్య తేజస్సుచే అజ్ఞానాంధకారమును హరించువాడవును, అగ్ని శరీరుడవును, అగు నిన్ను తలచు భక్తుల ముఖమునుండి తత్ క్షణమే

గంగాధారావేగమును బోలు గద్యపద్య రూపమైన సరస్వతి (కవిత్వము) తనంతతానే వెడలగలదు. ఇందాశ్చర్య మేమియు లేదు.

వి. శివోపాసకులైన మార్కండేయ మల్హణాదులకు బాల్యముననే సంస్కృత కవిత్వధార కల్గెను. శాస్త్రము లభ్యసింపకున్నను అనేక శివభక్తులకు వాగ్ధార స్వాధీనముగా నున్నట్లు నేటికిని కనుగొనవచ్చును. ఉపాసనాహీనులకు కవిత్వము స్వాధీనము కాదనియే కొందరి యభిప్రాయము. ||౪౧||

> భాస్వజ్జ్యోతిఃకిరణ మరుణం దక్షిణేఽక్ష్ణి స్థితం త్వాం
> యే వీక్షంతే పురుషముదితం ఖ్యాతమాదిత్యమూర్తిం।
> తే సర్వత్రాప్రతిహతదృశః సూర్యపర్యంతలోకం
> పశ్యంత్యగ్రే కరతలలుఠత్కందుకస్పష్టరూపం ||౪౨||

అర్థః—యే = ఎవరు, భాస్వజ్జ్యోతిఃకిరణం = ప్రకాశమానమైన జ్యోతియొక్క కిరణములు గలవాడవును, అరుణం = ఎఱ్ఱనైనవాడవును, ఖ్యాతం = శాస్త్రలోక ప్రసిద్ధుడవును, ఉదితం=నిత్యప్రేరకుడవును, దక్షిణే = కుడిదైన, అక్ష్ణి = నేత్రమున, స్థితం = నివసించుచున్నవాడవును, ఆదిత్యమూర్తిం=భాస్కరస్వరూపుడవును; పురుషం=బ్రహ్మస్వరూపుడవును; అగు, త్వాం = నిన్ను, వీక్షంతే = కనుగొనుచున్నారో, తే = వారు, సర్వత్ర = అన్నితావులలో, అప్రతిహతదృశః = నిరాతంకమైన దృష్టిగలవారై, కరతలలుఠత్కందుకస్పష్టరూపం = అరచేతినుండు బంతివలె స్పష్టమైన రూపముగల, సూర్యపర్యంతలోకం = సూర్యునివరకు గల లోకమును, అగ్రే = ఎదురుగా, పశ్యంతి = చూచుచున్నారు.

తా. మహేశా! నీవు దివ్యజ్యోతిఃస్వరూపుడవు, ఎఱ్ఱనివాడవు, దక్షిణనేత్రగత తారకస్వరూపుడవు, సాక్షాత్ ఆదిత్యుడవు, పరమపురుషుడవు, నిత్యప్రేరకుడవు, సర్వవిఖ్యాతుడవు. ఇట్టి నిన్ను గనుగొను ధన్యులగు యోగీశ్వరులకు దివ్యదృష్టిగలిగి సర్వమును దెలిసికొనువారై సూర్యునివరకునుగల లోకముల నన్నింటిని తమ యరచేతినున్న బంతివలె సమీపమున ప్రత్యక్షము చేసికొనగలరు.

వి. దక్షిణనేత్రము సూర్యస్థాన మనియు, సమస్తలోకప్రకాశకమైన సూర్యమండలప్రకాశ [illegible] కన్నుస్వామ్య మనియు శాస్త్రప్రసిద్ధి. ||౪౨||

యే ధ్యాయంతి స్వహృది విమలం చిత్త్వ మాత్మైకరూపం
విశ్వాదర్శం ప్రసరదభితో భూర్భువస్స్వస్త్రిలోకీం
ఇత్థం గత్వా గతిపరిచయా త్తే తవైవ ప్రసాదాత్
సర్వజ్ఞత్వం హర వికరణీం శీలయంతో లభంతే. ॥౪౩॥

అర్థః—హర = రుద్రా!, యే = ఎవరు, స్వహృది=తమలో, విమలం = నిర్మలమైనట్టియు, ఆత్మైకరూపం = శుద్ధాత్మయే రూపముగా గలిగినట్టియు, విశ్వాదర్శం = సర్వమునకు దర్పణమైనట్టియు, భూర్భువస్స్త్రిలోకీం = భూః భువః స్వః అను ముల్లోకములను, అభితః = ఎల్లవైపుల, ప్రసరత్ = అలము కొనునట్టియు, చిత్త్వం = కేవల చిన్మయమును, నిన్ను, ధ్యాయంతి=ధ్యానించు చున్నారో, తే=వారు, ఇత్థంగత్వా = ఇట్లువెళ్లి; గతి పరిచయాత్ = సంచార జ్ఞానమువలన, తవ=నీ యొక్క, ప్రసాదాదేవ = అనుగ్రహము వలననే, వికరణీం = నిదిధ్యాసవిద్యను, శీలయంతః = ఉపాసించుచున్నవారై, సర్వజ్ఞత్వం = పరమేశ్వరత్వమును, లభంతే = పొందుచున్నారు.

తా. మహేశా! నిర్మలమును, శుద్ధాత్మమును, విశ్వదర్శన దర్పణమును; "భూర్భువఃస్వః" అను స్వర్గ మర్త్య పాతాళలోకములను సర్వతోముఖముగ వ్యాపించి యున్నదియును, కేవల చిత్స్వరూపమును అగు నిన్ను తమ హృదయమున ధ్యానించు మహాత్ములు ఇట్టివిధముగ సన్మార్గము నవలంబించి, "శివోఽహం సోఽహం" అను తత్త్వమును నిదిధ్యాస మొనర్చుచు క్రమముగ నీ కృపకు పాత్రులై యంత్యమున నీవే యగుచున్నారు గదా.

వి. సర్వభూతముల హృదయమున పరమాత్మ కలదు. దీనిని సరిగా గుర్తెరిగి సదాచారపరులై యభ్యాస మొనర్చినవారు పరమేశ్వరత్వముఁ బొందగలరు. ॥౪౩॥

యే త్వాం శంభో హృదయభవనాంభోరుహాభ్యంతరస్థం
జ్ఞానజ్యోతి స్తదుపధివశాద్ వ్రీహిశూకాగ్రసూక్ష్మం
ఉద్వీక్షంతే దృఢతరలయం తేఽప్యుపాధిప్రణాశాత్
త్వయ్యేకత్వం నథసి కలశాకాశవ న్నిర్విశంతి. ॥౪౪॥

అర్థః—శంభో = శంకరా! యే = ఎవరు, హృదయభవనాం భోరుహాభ్యంతరస్థం = హృదయము యొక్క కుహరమనెడు కమలములో నెలకొనినట్టియు, తదుపధివశాత్ = దాని ఉపాధి నాశించుటవలన, వ్రీహిశూకాగ్రసూక్ష్మం = వరిముల్లు కొనవలె, సూక్ష్మమైనదియు, జ్ఞానజ్యోతిః = చిత్ప్రకాశమును (నిన్ను) దృఢతరలయం = దృఢమైన మనోమయమగునట్లు, ఉద్వీక్షంతే = ధ్యానించుచున్నారో, తేఽపి = వారును, ఉపాధి ప్రణాశాత్ = దేహాభిమానము పోవుటవలన, త్వయి = నీయందు, నభసి = ఆకాశమున, కలశాకాశవత్ = కలశమందలి యాకాశము వలె, ఏకత్వం = ఐక్యమును, నిర్విశంతి = అనుభవించుచున్నారు.

తా. శంభో! హృదయకుహరపద్మకర్ణికామధ్యమున వెలుగునట్టియు, ఉపాధివశమున వరిముల్లు మొనవలె మిక్కిలి సూక్ష్మమైనదియు, కేవల చిన్మయమును అగు నీ స్వరూపమును ఎవ్వారు చిత్తవృత్తినిరోధపూర్వకముగా ధ్యానించుచున్నారో వారును దేహేంద్రియాద్యభిమానరహితులై మహాకాశమునందు ఘటాకాశము బోలె నీయందు సర్వాత్మనా ఐక్యమును పొందుచున్నారు.

వి. "దహరం విపాప్మం పరవేశ్మభూతం యత్పుండరీకం" మున్నగునవి హృదయము అంభోరుహ మనుటకు ప్రమాణములు. ఉపాధి యనగా సాధనమున నుండక సాధ్యమున నుండునది. మనకు సర్వత్ర బయలుగా దోచునది మహాకాశము. ఈ యాకాశము ఘటములోను కలదు. కాని యిది మహాకాశముకంటె చిన్నది. ఐనను ఆకాశముయొక్క సాధన మాత్రగాగొనియే ఘటాకాశ మను సాధ్య(కార్య)ము ఏర్పడినది. ఘట మనునదియే ఇక్కడ ఉపాధి. ఘటము ధ్వంసమైనను, లేక ఘటత్వాభిమానము తొలగినను ఘటములోనిదిగా ఇంతవరకు దోచుచుండిన చిన్న యాకాశము మహాకాశములో గలిసి నామరూపము లే మాత్రము లేక ఏకాకారమైపోవుచున్నది. ఇటులే శివపరబ్రహ్మము సర్వత్ర వ్యాపించియున్నది. కావున దేహాయొక్క హృదయకుహరమునను నెలకొని యున్నది. ఐతే ఈ తత్త్వమును అభ్యాసవశమున దృఢపరచి దేహేంద్రియాదుల యభిమానమును, లేక భావమును తొలగించినచో ఈ జీవాత్మయే మహాశివాత్మలో ఐక్యము పొందుచున్నదని భావము. ॥౪౪॥

అర్చిర్విద్యుత్ప్రభృతిభిరలం మార్గవిశ్రామహేతో

ర్యే గచ్ఛంతి త్వయనపథా దేవయానేన కేచిత్

భుక్త్వా భోగా ననుపమరసాన్ స్వేచ్ఛయా బ్రహ్మలోకే
తే తస్యాంతే పునరపి శివ త్వన్మయత్వం భజంతే ॥౪౫॥

అర్థ:—త్రినయన = త్ర్యంబకా! యే = ఏ, కేచిత్ = కొందరు, మార్గవిశ్రమహేతోః = మార్గాయాస శాంతి వలన, అర్చిర్విద్యుత్ప్రభృతిభిః = అర్చిర్, విద్యుత్ మున్నగు పేరులుగల, పథా = మార్గము నుండియు, దేవయానేన = విమానమార్గమునుండియు, అలం = మెక్కువగా, గచ్ఛంతి = వెళ్ళుచున్నారో, తే = వారు, బ్రహ్మలోకే, = బ్రహ్మలోకమున, అనుపమరసాన్, అతులమైన రసములు గల, భోగాన్ = సుఖములను, స్వేచ్ఛయా = తమయిష్టముతో, భుక్త్వా = అనుభవించి, తస్యాంతే = తదనంతరమున, పునరపి = మరలను, శివ = ఓ శంకరా! త్వన్మయత్వం = భవన్మయత్వమును (శివత్వమును), భజంతే = పొందుచున్నారు.

తా. పరమేశ్వరా! నీ భక్తులలో కొందరు మిక్కిలి దవ్వున నున్న శివలోకమును జేరునపుడు మధ్యమధ్యమున మార్గాయాసము దీర్చుకొనుటకు, అర్చిర్మార్గముునను, విద్యున్మార్గమునను, సామాన్యమార్గమునను, దేవమార్గమునను ప్రయాణించి బ్రహ్మలోకమును జేరి, దివ్యములగు రసములుగల సౌఖ్యములను యథేచ్ఛముగా ననుభవించి, తరువాత శివలోకము జేరి నీ యనుగ్రహమువలన నీ రూపమునే పొందుచున్నారు.

వి. భక్తులయొక్క ఆచారసుకృతాదితారతమ్యమును బట్టి కొందు అర్చిర్, విద్యుత్, దేవయానము లను మార్గములద్వారా మొదట బ్రహ్మలోకమును, చివరకు శివలోకమును జేరెదరని భావము. ఈ యర్చిరాదిమార్గములు; ఛాందోగ్యోపనిషత్తు, శివసూత్రములు, భగవద్గీత, శాండిల్యసూత్రములు మున్నగు గ్రంథములలో వివరింపబడినవి. ॥౪౫॥

యత్రానందః స్ఫురతి పరమజ్యోతిరాలోకజన్మా
భుజ్యంతే చ స్వయముపనతా యత్ర దివ్యాశ్చ భోగాః।
యత్రావృత్తిర్న భవతి పునః పంచమాధ్వప్రసిద్ధం
తద్వైరాజ్యం పదమపి శివ ప్రాప్యతే త్వత్ప్రసాదాత్.॥౪౬॥

అర్థ:—శివ = ... (యత్ర) = దేనియందు, పరమ

జ్యోతిరాలోకజన్మా = దివ్యజ్యోతియొక్క దర్శనమువలనఁ బుట్టినట్టి, ఆనందః = ఆనందము, స్ఫురతి = ప్రకాశించుచున్నదో, యత్ర = దేనియందు, దివ్యాః = పరిశుద్ధములైన, భోగాశ్చ = సుఖములును, స్వయం = తామే, ఉపనతాః = వచ్చినవియై, భుజ్యంతే = అనుభవింపబడుచున్నవో, చ=మఱియు, యత్ర = దేనియందు, ఆవృత్తిః= తిరుగుడు, పునః = మరల, నభవతి = కాదో;పంచమాధ్వప్రసిద్ధం = ఐదవమార్గముగ ప్రసిద్ధమైన, తత్ = ఆ, వైరాజ్యం = వైరాజ్య నామముగల, పదమపి = స్థానముగూడ, త్వత్ప్రసాదాత్ = నీ యనుగ్రహమువలన, ప్రాప్యతే = పొందబడుచున్నది.

తా. శంభో! ఏ మూలవిరాట్టునందు పరంజ్యోతిర్దర్శనము వలన చిదానందము ఉత్పత్తిల్లుచున్నదో, దేనియందు సర్వదివ్య భోగములు స్వాధీనములై యనుభవింప బడుచున్నవో, దేనిని జేరినపిదప జనన మరణముల గమనాగమనము మరల లేనేలేదో, అట్టి ఐదవ అధ్వముగ విఖ్యాతమైన ఆ వైరాజపదముకూడ నీ కృపవలన భక్తులకు సంప్రాప్తమగుచున్నది.

వి. శివాగమశాస్త్రమున కలాధ్వ - భువనాధ్వ - వర్ణాధ్వ - మంత్రాధ్వ - పదాధ్వ - తత్త్వాధ్వము లని షడధ్వలు ప్రసిద్ధములు. ఇందు పదాధ్వ మైదవది. దీనిని మొదలు శివుడు భక్తుల కనుగ్రహించు ననియును, ఇదియే జగన్మూలస్థానమనియును, దీనియందు సరిగ నడచుకొన్నవారికి తత్త్వాధ్వము, అనగా శివసాయుజ్యము గలుగు ననియు, సంప్రదాయవిదుల మతము. పంచమాధ్వమనగా ఆకాశాధ్వమనియును, ఈ బయలే బ్రహ్మస్వరూపమనియును కొందరనవచ్చును. ఇక్కడ మూలమున "పంచమ వైరాజ్యపదం అని స్పష్టముగ పదాధ్వము పేర్కొనబడిన దని యెఱుగునది. ॥౪౬॥

త్వయ్యాత్మానం నిహితమఖిలై స్త్వద్గుణైః సంప్రయుక్తం,
స్వచ్ఛాదర్శే ముఖమివ చిరం చేతసా నిశ్చలేన
యేపశ్యంతి త్రినయన మనోవాంఛితార్థ ప్రసూతి-
స్తేషామావిర్భవతి సుధియామేవ ధర్మస్సమాధిః. ॥౪౭॥

అర్థః—త్రినయన = హరా, యే = ఎవ్వరు, త్వద్గుణైః = నీ గుణములచేత, సంప్రయుక్తం = [illegible] ... అఖిలైః = సమస్తములతో గూడ, త్వయి = నీయందు, నిహితం = స్థాపింపబడి

నట్టియు, ఆత్మానం = ఆ పరమాత్మను, స్వచ్ఛాదర్శే = నిర్మలమైన దర్పణమున, ముఖమివ = మొగమువలె, నిశ్చలేన = చంచలముగాని, చేతసా = హృదయముతో, చిరం = దీర్ఘకాలము, పశ్యంతి = చూచుచున్నారో, తేషాం = ఆ, సుధియాం = సుజ్ఞానులకు, మనోవాంఛితార్థప్రసూతిః = ఇష్టార్థప్రాప్తి, ఆవిర్భవత్యేవ=పుట్టుచునేయున్నది, ధర్మః = ఈ ధర్మము, సమాధిః = సమాధి యనంబడును.

తా. జగదీశా! సమస్తములైనట్టియు, నీ సర్వజ్ఞత్వాది ధర్మములచే యుక్తమైనట్టియు, ఆ పరమాత్మను అద్దమందున ముఖముబోలె నీయందు ఏకాగ్రచిత్తము గలవారై యెవరు దీర్ఘముగా గాంచుచున్నారో, వారికి అవశ్యముగా ఇష్టార్థములు ఫలింపగలవు. ఈ యాచారవిధియే సమాధి యని పేర్కొనబడుచున్నది.

వి. శివయోగమనగా లింగాంగసామరస్యము. అంగమును శుద్ధి జేసినచో లింగముగా మారును. సమాధి యని యిక్కడ జెప్పబడినది. ఇట్టిది శివయోగమనియే తెలియవలెను. సవికల్పిత నష్టమంది, నిర్వికల్పసమాధిసిద్ధిని బడసిన శివయోగికి శివునకు వలెనే సర్వము సాధ్యమగునని భావము. ॥౪౭॥

> జ్ఞానజ్యోతిః సకలజగతాం స్వప్రకాశస్వరూపం
> త్వా మాత్మానం పరిహితగుణస్పర్శ మీశాన మీడే।
> యత్రైకస్మి న్నవహితధియాం యోగదృష్టిస్థితానాం
> స్వచ్ఛాదర్శే ప్రతిఫలితవద్ విశ్వ మేతచ్చకాస్తి ॥౪౮॥

అర్థ:—యత్ర = ఏ, ఏకస్మిన్ = ఒకటియైన దానియందు, అవహితధియాం = ఏకాగ్రచిత్తము గల, యోగదృష్టిస్థితానాం = యోగదృష్టియందు నెలకొనిన వారికి, ఏతత్=ఈ, విశ్వం = ప్రపంచము; స్వచ్ఛాదర్శే = నిర్మలమైన యద్దమున, ప్రతిఫలితవత్ = ప్రతిబింబమునవలె, చకాస్తి = ప్రకాశించుచున్నదో, జ్ఞానజ్యోతిః = జ్ఞానదీపమైనట్టియు, సకలజగతాం = సర్వలోకములలో, స్వప్రకాశస్వరూపం = స్వయముగా వెలుగునట్టియు, పరిహితగుణస్పర్శం = విడువబడిన హేయగుణములు గలట్టియు, ఈశానం = కర్తయై

నట్టియు, ఆత్మానం = పరమాత్మ మగునట్టియు, త్వాం = నిన్ను, ఈడే = కొనియాడుచున్నాను.

తా. స్థితప్రజ్ఞులైన యోగీశ్వరులు ఒకటియే యైన ఏ పరశివ వస్తువునందు నిర్మలదర్పణమున నీడవలె ఈ సమస్త చరాచరమును గాంచుచున్నారో, అట్టి కేవల జ్ఞానమూర్తియును, సమస్తలోకము లలో ఇతర సాపేక్షలేక స్వయంప్రకాశకమును, క్షణభంగాది హేయ గుణస్పర్శ లేనిదియును, సర్వప్రభువును, పరమాత్మమును అగు నిన్నే కొనియాడుచున్నాను స్వామీ! ॥౪౮॥

భూతం భూతస్మరణవిషయం భావి నాన్యత్ర కాలే
సూక్ష్మం మధ్యం క్షణమిహ తయో ర్వర్తమానం వదంతి।
తస్మిన్ సౌఖ్యం కియ దమతయో యేన మత్తా మనుష్యా
యుష్మత్సేవాం భవ భవభయధ్వంసినీం నాద్రియంతే॥౪౯॥

అర్థః-భవ= శంభో! భూతం=భూత కాలము, భూతస్మరణవిషయం= గడచిన జ్ఞాపకము మాత్రమునకు గురియైనదిగా నున్నది, భావి = ముందు కానున్నది, అన్యత్రకాలే = వేరు కాలమున, న = లేదు, తయోః = వాని యొక్క, మధ్యం= నడుమనున్నట్టి, సూక్ష్మం = అల్పమైనదానిని, వర్తమానం = వర్తమానముగా, వదంతి = చెప్పు చున్నారు, తస్మిన్ = దానియందు- సౌఖ్యం = భోగము, కియత్ = ఎంత? యేన = దేనిచేత, మత్తాః = మైక మొందినట్టి, అమతయః = మతిలేని, మనుష్యాః = మానవులు, భవభయధ్వంసినీం = జననబాధను నశింపజేయునట్టియు, యుష్మత్సేవాం = నీ దాస్యమును, నాద్రి యంతే = ఆదరించుట లేదో.

తా. మహాదేవా! గడచినది జ్ఞాపకమందు మాత్రమే కలదు. రానున్నది ఇపుడు చేజిక్కదు కదా! ఇట్లు ఈ యతీతానాగత సుఖ ములు రెండును ప్రస్తుతలాభకారులు కావు. ఇక మిగిలినది వర్త మానకాల మందలి సౌఖ్య మొక్కటియే! ఇది యైనను సూక్ష్మమైనది కావున క్షణకాలమున నశించుచున్నదని పెద్దలు హెచ్చరించియే

యున్నారు. మరి ఈ తత్త్వము నరయని కొందరు కై పెక్కినవారి వలె జన్మజరానివారకమును, శాశ్వతసౌఖ్యకరమును అగు నీ కింకరత్వ మును అపేక్షించుట లేదు. వారు బుద్ధిహీనులు కదా! ॥౪౯॥

జ్ఞానం న స్యాత్ క్వచిదపి కిల జ్ఞేయసంబంధశూన్యం
జ్ఞేయం సత్తామపి న లభతే జ్ఞానబాహ్యం కదాచిత్।
ఇత్యన్యోన్యగ్రథిత ముభయో ర్వ్యాపకం యత్స్వరూపం
తత్తే ప్రాహుః ప్రకృతిపురుష స్యార్ధనారీశ్వరత్వం ॥౫౦॥

అర్థ:—జ్ఞానం = జ్ఞానము, క్వచిదపి = ఎక్కడను, జ్ఞేయ సంబంధశూన్యం= తెలియుదగిన వస్తువును ఆశ్రయింపక, నస్యాత్కిల= ఉండదుకదా, జ్ఞేయం = ఆ వస్తువు, జ్ఞానబాహ్యం = జ్ఞానమునకు వేరై, కదాచిత్ =ఎప్పటికి, సత్తామపి=అస్తిత్వమునైనను, న లభతే= పొందదు, ఇతి = ఇట్లు, అన్యోన్యగ్రథితం = పరస్పరముగ గలిసి యున్నట్టి, ఉభయోః = ఆ జ్ఞానజ్ఞేయములలో, వ్యాపకం = వ్యాపించి యున్నట్టి, యత్ = ఏ, స్వరూపం = స్వరూపము కలదో, తత్ = దానిని, ప్రకృతిపురుషస్య = ప్రకృతియును పురుషుడవును ఐన, తే = నీయొక్క, అర్ధనారీశ్వరత్వం = అర్ధనారీశ్వరత్వమునుగా, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా. జ్ఞానమును విడిచి జ్ఞేయముగాని, జ్ఞేయమును విడిచి జ్ఞానముగాని ప్రపంచమం దెక్కడను ఉండజాలదు. ఈ రెంటికిని ఇట్టి యన్యోన్యసంబంధము నిత్యసిద్ధముగ నగుపడుచున్నది. ఈ జ్ఞాన జ్ఞేయములు రెంటియందును నీ ప్రకృతిపురుషులు అను రూపమే వ్యాపించియున్నది. నీ యర్ధనారీశ్వరరూప మీ తత్త్వమునే చాటు చున్నదని పెద్దలు వచించుచున్నారు స్వామీ!

వి. ఈ ప్రపంచమందలి సమస్త వస్తువులును జ్ఞానజ్ఞేయసంబంధము గలిగియే యున్నవి. దానినే విషయవిషయిసంబంధ మందురు. శబ్దము సాధారణ దృష్టికి ఒకటిగ గన్పట్టినను, శబ్దము అర్థముతో గూడియున్నదని విచారించిన వారి కందరకు తెలియును. శబ్దమను సాధనము ద్వారా అర్థమను సాధ్యమును తెలియుచున్నాము. ఘటము అను శబ్దమును వినగానే దాని సంస్కారవ్యవహారము గలవారికి మట్టితో

చేయబడిన కుండ యనియు,అది ఇంతలావుగ వట్రముగ నుండుననియు, దాని కంఠము చిన్నదిగా నుండుననియు, నీరు మున్నగు పదార్థముల నింపుట కుపకరించు ననియు, అర్థము కాగలదు. ఇక్కడ శబ్దమే జ్ఞానము, అర్థమే జ్ఞేయము. ఇది పరస్పరముగ ఎల్లపుడు కలిసియే యుండును. అట్లే శివుడును ప్రకృతి యను శక్తితో కూడి యున్నాడని భావము. శక్తిలేనివాడు శివుడే కాడు. శివునితో నుండనిది శక్తియు కాదు. ఇద్దియే పరబ్రహ్మ మను పరమేశ్వరునిలక్షణ మని తెలియవలెను. దీనివలన నీ హలాయుధకవి శక్తివిశిష్టసిద్ధాంతవాది యని తెలియుచున్నది. ॥౫౦॥

యత్ప్రత్యక్షం న భవతి నృణా మింద్రియాణామశక్తే
ర్యత్సంబంధగ్రహణవిరహా న్నానుమేయంచ కించిత్।
శబ్దాదీనా మపి న విషయం యత్పరోక్షస్వరూపం
జ్ఞానజ్యోతిర్యదిహ పరమం స త్త్వ మధ్యాత్మమూర్తిః ॥౫౧॥

అర్థ:— యత్ = ఏవస్తువు, నృణాం = నరులయొక్క, ఇంద్రియాణాం = ఇంద్రియములకు, అశక్తేః = సామర్థ్యము లేనందున, ప్రత్యక్షం = ఇంద్రియగోచరము, నభవతి = కాదో, యత్ = ఎయ్యది, సంబంధగ్రహణవిరహాత్ = వ్యాప్తిని గ్రహింపజాల నందున, కించిచ్చ = కొంచెముగా నైనను, నానుమేయం = ఊహింప దగినదిగా లేదో, యత్ = ఏ, పరోక్షస్వరూపం = అగోచరవస్తువు, శబ్దాదీనామపి = శబ్దాది ప్రమాణములకును, నవిషయం = గోచరము కానట్టిదో, ఇహ = ఇట, యత్ = ఎయ్యది, పరమం = మిక్కిలి (కేవలమగు), జ్ఞానజ్యోతిః = జ్ఞానరూప మగు వెలుగో, అధ్యాత్మమూర్తిః = అధ్యాత్మవిగ్రహుండ వగు, త్వం = నీవు, సత్ =ఆ సచ్చిదానంద స్వరూపుడవే!

తా. ఏ పరతత్త్వము మానవులయొక్క దుర్బలములగు నేత్రాది ఇంద్రియములకు గోచరము కాదో, ఎయ్యది వ్యాప్యవ్యాపక సంబంధముకలది కానందున అనుమానప్రమాణము వలనను దెలియబడదో, ఎయ్యది పరోక్షస్వరూప మైనందున వేదాది శబ్దప్రమాణముల వలనను కనుగొనబడదో, ఎద్ది కేవలజ్ఞానమై పర మనబడుచున్నదో, ఓ అధ్యాత్మమూర్తీ! నీవే ఆ తత్త్వము, సత్త్వము ఆయియున్నావు.

వి. లోకమందలి ఒక వస్తువును కనుగొనవలయు నన్నచో ప్రత్యక్ష, అనుమాన, శబ్దము లను మూడు ప్రమాణములు కలవు. పరమేశ్వరుని ఈ కనులతో చూచుటకుగాని, మనసుతో నూహించుటకుగాని, పెద్దల మాటలవలన దెలియుటకుగాని సాధ్యము కానందున ఇవి వ్యర్థమయ్యెను. అయితే శివుకు లౌకికప్రమాణములకు గోచరము కానపుడు లేడేమో యని భ్రమజెందవలదు. ఆ పరశివుడు అధ్యాత్మరూపుడు కావున, వానిని జ్ఞానులు, భక్తులు, యోగీశ్వరులు తమ యధ్యాత్మసామర్థ్యముతో తప్పక ప్రత్యక్ష మొనర్చుకొందు రని భావము. ॥౫౧॥

త్వామాత్మానం వరద పరమానందబోధస్వరూపం

యే బుధ్యంతే విగలితజగద్భేదమాయాప్రపంచం।

రాగత్యాగాత్ స్తిమితమనసో దేవ జీవంత ఏవ

భిత్త్వా మాయానిబిడనిగడగ్రంథయ స్తే విముక్తాః ॥౫౨॥

అర్థ-— వరద = కరుణామయా!, పరమానందబోధ స్వరూపం = సర్వోత్కృష్టమైన యానందము నిచ్చు జ్ఞానమే రూపముగా గలిగినట్టి, ఆత్మానం = పరమాత్మస్వరూపుడవైనట్టి, త్వాం = నిన్ను విగళితజగద్భేదమాయాప్రపంచం = నష్టమైన జగత్తునందలి భిన్నమైన మాయయొక్క విస్తారముగలవానినిగా, యే = ఎవ్వారు, బుధ్యంతే= తెలియుచున్నారో, దేవ=ఈశ్వరా! తే=వారు, రాగత్యాగాత్ =విషయాసక్తి వీడుటవలన, స్తిమితమనసః=శాంతచిత్తులై, భిత్త్వామాయా నిబిడ నిగడగ్రంథయః = త్రెంచబడిన మాయ యనెడు గట్టిదైన గొలుసుముడులు గలవారై, జీవంతఏవ = బ్రదుకుచునే, విముక్తాః = ముక్తినొందినవార లగుచున్నారు.

తా. కేవల పరమానందమును గలిగించి సుజ్ఞానదమైనట్టియు, పరమాత్మస్వరూపమైనట్టియు, నిన్ను జగత్తునందలి హేయమాయా విస్తారమును నశింపజేయు వానినిగా దలంచుచు నే యోగీశ్వరులు ఉపాసించుచున్నారో, ఆ మహానుభావులును విషయాభిలాషను వీడి, నిర్మలహృదయులై గాఢమైన మాయాపాశమును త్రెంచివేసి జీవిత కాలముననే ముక్తులగుచున్నారు శంభో! ॥౫౨॥

శ్లాఘ్యం య త్తత్ కృపణమనసాం సర్వలోకాధిపత్యం

యా మృగ్యంతే తరలమతిభిః సిద్ధయ శ్చాణిమాద్యాః।

ఏతత్సర్వం మదనదమన త్వత్పదప్రాప్తి భాజాం
తత్త్వజ్ఞానామృతరసజుషాం యోగినా మన్తరాయః ॥౫౩॥

అర్థ:—మదనదమన = కామశాసకా! కృపణమనసాం = విషయాసక్తులకు, యత్ = ఏ, సర్వలోకాధిపత్యం = విశ్వపాల కత్వము, శ్లాఘ్యం = ప్రశస్తమైనదో, తరలమతిభిః = చంచల మనస్కులచేత, యాః= ఏ, అణిమాద్యాః= అణిమ మొదలగు, సిద్ధయః= అష్టసిద్ధులు, మృగ్యంతే = అన్వేషణ మొనర్పబడుచున్నవో, తత్ = ఆ, ఏతత్ = ఈ, సర్వం = సకలమును, త్వత్పదప్రాప్తి భాజాం = నీ చరణముయొక్క స్థానమును బొందినట్టి, తత్త్వజ్ఞానామృతరసజుషాం= సిద్ధాంత మను జ్ఞానామృతమును గ్రోలునట్టి, యోగినాం = శివయోగు లకు, అంతరాయః = విఘ్నము కదా!

తా. మహేశా! కొందరు విషయాసక్తులై సకల భువనముల నేల కుతూహలపడుచుందురు. మరికొందరు చలచిత్తులును, అణిమ, మహిమ యను నష్టసిద్ధుల గోరుచు తపించుచుందురు. కాని కేవలము నీ చరణసన్నిధిని కైంకర్య మపేక్షించునట్టియు, పరతత్త్వ రసామృత మును చవిజూచుచున్నట్టియు శివయోగుల కీ యణిమాదులెల్లను విఘ్నకారకములు కదా!

వి. కేవల శివజ్ఞానాభిలాషులు సర్వవాసనాత్యాగ మొనర్చి పరతత్త్వసన్నిధి యందు మాత్రమే చిత్తము నిడవలెను. కాని లోకకల్యాణార్థమై, దుష్టశిక్షణార్థమై, భూ కాధిపత్యము వహించుట గాని యోగీశ్వరులై అణిమాదిసిద్ధుల సాధించుట గాని యుక్తియుక్తమే యని తెలియవలెను॥ ౫౩॥

ఆశా వాస శ్శయనమవని ర్బ్రహ్మచర్యం చ దీర్ఘం
మౌనం దండగ్రహణమశనం భిక్షయా భస్మ శౌచం।
వైరాగ్యంచ త్రినయన భవత్తత్త్వబోధాద్విహీనం
మూలాదేవ ధ్రువమలవణం సర్వమేతద్విభాతి॥ ౫౪॥

అర్థ:—త్రినయన = త్ర్యంబకా! ఆశాః = దిక్కులు, వాసః = వస్త్రములుగాను, అవనిః = భూమి, శయనం = పడకగాను, చ = మరియు, దీర్ఘం = దీర్ఘమైన, బ్రహ్మచర్యం = జితేంద్రియ

త్వమును, మౌనం = మునిత్వమును, దండగ్రహణం = సన్న్యాస మును, భిక్షయా = భిక్షముచే, అశనం = ఆహారమును, భస్మ = భస్మమును, శౌచం = ఆచారమును, వైరాగ్యంచ= అనాసక్తియును, భవత్తత్త్వబోధాద్విహీనం = నీ వనెడు పరతత్త్వజ్ఞానము లేమిచో, ఏతత్ = ఈ, సర్వం = ఎల్లయు, మూలాదేవ = మొదటినుండియే, అలవణం = రసరుచిలేనిదిగా, భాతి = కనుపడుచున్నది, ధ్రువం = నిశ్చయము.

తా. మహేశా! దిగంబరుడైనను, నేల పరుండినను, నైష్ఠిక బ్రహ్మచారియైనను, మౌనము వహించినను, సన్న్యాసియైనను, భిక్ష మెత్తినను, బూది పులుముకొనినను, సర్వత్యాగియైనను నీ సచ్చిదా నంద స్వరూపముయొక్క జ్ఞానము లేనిచో ఉప్పులేని రసరుచివలె మొదటికే మోసము గలిగి వ్యర్థజీవు లగుచున్నారు ॥౫౪॥

స్థిత్వా కాలం చిరతరమపి బ్రహ్మశక్రాదిలోకే
కర్మచ్ఛేదాత్ పునరపి తతః స్యా దవశ్యం నిపాతః ।
ఏకం నిత్యం పద ముపగతం క్లేశకర్మోర్మిపాకం
శైవం జ్యోతి ర్యదిహ సులభం జ్ఞానయోగేన పుంసాం॥౫౫॥

అర్థ:—బ్రహ్మశక్రాదిలోకే = సత్యస్వర్గలోకముల, చిరత రం = మిక్కిలి దీర్ఘమైన, కాలం = సమయము (దనుక), స్థిత్వాపి = నివసించినను, పునరపి = మఱియు, కర్మచ్ఛేదాత్ = సుకృతనాశము వలన, తతః = అచ్చోనుండి, నిపాతః =పతనము, అవశ్యం = తప్పక, స్యాత్ = అగును, ఇహ = ఇట, పుంసాం = మానవులకు, జ్ఞాన యోగేన=జ్ఞానయోగముతో, శైవం=శివసంబంధమైనట్టి, యత్ =ఏ, జ్యోతిః = ప్రదీపము, సులభం = సుకరమో, అది, ఏకం = అద్వి తీయమై, నిత్యం = శాశ్వతమైనట్టియు, అపగతక్లేశకర్మోర్మిపాకం = రహితమైన క్లేశము, కర్మము, ఊర్ములు, విపాకములు గలదిగా, విరా జిల్లుచున్నది.

తా. ఏ పుణ్యవశమున నైనను సత్యలోకము, స్వర్గలోకము మున్నగు

వానిలో నివసించి యెంతదీర్ఘకాలము భోగము లనుభవించినను, అవి అక్షయ్యములు కావు. కొంతకాలమును తరువాత పుణ్యము క్షీణించుచునే యున్నది. అపుడు తప్పక ఆ మానవుడు మరల మర్త్యలోకమున బడి జనన మరణబాధ లనుభవింపవలసియే యున్నది. కాని పురుషార్థముల నెరిగినవారు జ్ఞానయోగముతో శివజ్ఞానమును సులభముగా జిక్క బట్ట గలరు. ఈ శివపరంజ్యోతి యద్వితీయమై; నిత్యమై, పరంధామమై, క్లేశ కర్మ ఊర్మి విపాకాదులు లేక నిర్వికారముగా నున్నది.

వి. స్వర్గమున కేగినవారు పుణ్యము తరుగగా మరల మర్త్యమున బడుదు రనుటకు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యను సూక్తి చాలును. అవిద్యా, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశము లని క్లేశములైదు. ధర్మ, అధర్మము లని కర్మ, ద్వివిధము. క్షుత్, పిపాసా, శోక, మోహ, జరా, మరణము లని ఊర్ములు ఆరు. జాతి, ఆయు ర్భోగములని విపాకములు మూడు. ఇవి యోగ వేదాంత శాస్త్రవిషయములు. ॥౫౫॥

శక్రాదీనాం క్రతుఫలజుషాం యత్సుఖం నాకలోకే
తత్కీటాదే ర్నరకనిలయస్యాపి తుల్యం విభాతి।
యేనైకాంతం న భవతి సుఖం కస్యచి న్నాపి దుఃఖం
ద్వంద్వగ్రస్తం త్రిభువనమిదం త్వంతు తస్మాద్విముక్తః॥౫౬॥

అర్థ:—క్రతుఫలజుషాం = యాగఫలము నొందునట్టి, శక్రాదీనాం = ఇంద్రాదులకు, నాకలోకే = స్వర్గమున, యత్ = ఏ, సుఖం = సౌఖ్యము, కలదో, తత్ = అది, నరకనిలయస్యాపి = నరకమున వసించు, కీటాదేరపి = పురువులు మున్నగువానికిని, తుల్యం = సమానముగా, విభాతి = అగుపడుచున్నది, యేన = దేనిచేత, కస్యచిత్ = ఎవనికైనను, సుఖం = సుఖముగాని, దుఃఖమపి = దుఃఖముగాని, ఏకాంతం = కేవలశాశ్వతమైనదిగా, న = లేదు, ఇదం = ఈ, త్రిభువనం = విశ్వము, ద్వంద్వగ్రస్తం = సుఖదుఃఖములలో జిక్కినదై యున్నది, త్వంతు = నీ వన్ననో, తస్మాత్ = ఆ ద్వంద్వమునుండి, విముక్తః = సంబంధరహితుడవుగా నున్నావు.

తా. మహాయాగఫలముల ననుభవించుచు స్వర్గమున నున్న ఇంద్రాది దేవతలయొక్క సుఖముగాని, నరకమున నుండు పురువు

యొక్క దుఃఖముగాని నాకు సమానము గానే తోచుచున్నది. ఏలయన ఎవ్వరికిని సుఖదుఃఖములు శాశ్వతములుగా లభించుటయే లేదు. కావున నీ ప్రపంచమెల్లను నీ సుఖదుఃఖము లనెడు ద్వంద్వముతో గూడి యున్నది. పరమేశ్వరా! నీ వొక్కడవు మాత్రమే ద్వంద్వాతీతుడవై శాశ్వతమైన చిదానందము ననుభవించుచున్నాడవు. ॥౨౬॥

బంధచ్ఛేదా దిహ తనుభృతాం యత్త్వయా సాక మైక్యం
సా చే న్ముక్తిశ్శివ కిమనయా యాతు యద్వాంధకూపం।
త్వమ్మే స్వామీ భవదనుచర శ్శర్వ య త్సర్వదాఽహం
తద్ధి శ్లాఘ్యం స్వపతిపదవీం కామయంతే న భృత్యాః. ॥౨౭॥

అర్థ:—ఇహ = ఇచ్చోటి, తనుభృతాం = జీవులకు, బంధచ్ఛేదాత్ = మాయాపాశ నాశము వలన, త్వయాసాకం = నీతోనగు, యత్ = ఏ, ఐక్యం = ఏకత్వము కలుగునో, సా = అది, ముక్తిశ్చేద్ = ముక్తియగుచో, అనయా = దీనిచేత, కిం = ఏమి?, యద్వా = లేదా, అంధకూపం = చీకటి బావిని, యాతు = వెళ్ళుగాక! శర్వ = సుఖనిలయా! శివ = కల్యాణస్వరూపా! త్వం = నీవు, మే = నాకు, స్వామీ = ప్రభుడవు, అహం = నేను, సర్వదా = ఎల్లపుడు, భవదనుచరః=నీ కింకరుడను, (ఇతి) యత్ = ఇట్లేదికలదో, తద్ధి = అదియే, శ్లాఘ్యం = ప్రశస్తమైనది, భృత్యాః = సేవకులు, స్వపతిపదవీం = తమ ప్రభువుయొక్క స్థానమును, న కామయంతే = అపేక్షింపరు.

తా. మహాప్రభో! నీ సేవవలన ఈ లోకసంబంధమగు మాయాపాశమును ఛేదించుకొనిన జీవునకు ముక్తిగలుగునని పెద్దలు వచించుచున్నారు. ఈ ముక్తికి "నీలో సర్వాత్మనా కలిసిపోవుట" అను నర్థమే యుండుచో ఇట్టి ముక్తితో ప్రయోజనమేమి? పాతాళకూపమున బడినవానికిని ఈ సాయుజ్యముక్తి నొందినవానికిని భేదమేమి? "నీవు నా ప్రభుడవు. నేను నీకు ఎల్లప్పుడు బంటును" అనునది మాత్రమే ప్రశస్తమైనదగుచున్నది. ఇట్టి నీ యనుపమానమైన సాన్నిధ్య

మునే యపేక్షించుచున్నాను. భక్తుడెన్నటికిని తన ప్రభువుయొక్క అధికారము నపేక్షింపజాలడు.

వి. సాయుజ్యముక్తి కలదనియు, సామీప్యముక్తి కావలెననియును ఈ మహా కవీశ్వరుడు కోరినందున నితడు ద్వైతవాది యని యెవ్వరును తలంపరాదు. శైవుడు కావుననే; తనకు సహజముగ సాయుజ్యము లభించునని నిశ్చయించుకొనియే, మహా రమ్యమైన శివసాన్నిధ్యమును ప్రత్యేకముగ గోరుకొనినాడు. ఈ శ్లోకమందలి భావము మిక్కిలి యున్నతమైనది. ॥౨౭॥

వాతోద్ధూతస్ఫుటకమలినీపత్రితోయోపమానే
కో విశ్వాసం వ్రజతి చపలే జన్మినో జీవితేఽస్మిన్।
కాంతస్త్రీణాం ప్రియసహచరై ర్నిర్భరాలింగితం మే
చేతశ్శంభో స్వపితి న యథా తత్ప్రసాదం కురుష్వ ॥౨౮॥

అర్థః—శంభో = శంకరా, వాతో... మానే, వాతోద్ధూత= గాలిచే గదలింపబడిన, స్ఫుట = స్పష్టమైన, కమలినీపత్రి = తామ రాకుపైనున్న, తోయోపమానే= నీటికి సాటియైన, చపలే = చంచల మైన, జన్మినః = ప్రాణియొక్క, అస్మిన్ = ఈ, జీవితే = బ్రదుకు నందు, కః = ఎవడు, విశ్వాసం = నమ్మకమును, వ్రజతి = పొందు చున్నాడు? కాంతస్త్రీణాం = సుందరస్త్రీలయొక్క, ప్రియసహచరైః= ప్రియమిత్రులచేత, నిర్భరాలింగితం = గట్టిగా సంబద్ధమైనట్టి, మే = నాయొక్క, చేతః = మనస్సు, యథా = ఎట్లు, న స్వపితి = నిద్రింపదో, తత్ప్రసాదం = ఆ యనుగ్రహమును, కురుష్వ = చేయుము.

తా. శంకరా! గాలిచే మిక్కిలి కదలుచున్న తామరాకు లోని నీటివలె చంచలమైనట్టి ఈ ప్రాణిజీవితములపై బుద్ధిగలవాని కెవనికిని నమ్మకములేదు. ఐతే సుందరీమణులవెంటనంటి తిరుగువారి సహవాసమువలన నా మనము గట్టిగా పరాధీనమై నిద్రింపనట్లుగా స్వామీ! యనుగ్రహింపుము. ॥౨౮॥

త్వన్నేత్రాగ్నివ్యతికరమివ ప్రాక్తనం పుష్పచాపః
స్మృత్వా నూనం వ్యవసితమతి ర్వైరనిర్యాతనాయ।
యత్సంసక్తం తవ చరణయో ర్దేవ సేవానురాగా-
న్మన్మేతః ప్రసభమతిశ రైర్భృశ మత్యుద్యమత్వాత్ ॥౨౯॥

అర్థ:— త్ర్యక్ష = త్ర్యంబకా, పుష్పచాపః = మన్మథుడు, ప్రాక్తనం = ప్రాతదైన, త్వన్నేత్రాగ్నివ్యతికరం = నీ కంటిచే గలిగిన వ్యసనమును, స్మృత్వైవ = తలంచియో యేమో, వైరనిర్యాతనాయ = పగదీర్చుకొనుటకు, వ్యవసితమతిః = ఉద్యుక్తమైన బుద్ధిగలవాడై, తవ = నీ యొక్క, చరణయోః = పాదములలో, సేవానురాగాత్ = కొలుచుటలోని ప్రేమవలన, సంసక్తం = ఆసక్తమైనట్టి, మే = నాయొక్క, చేతః = చిత్తమును, శరైః = బాణములచే, యత్ = ఎందువలన, నూనం = నిశ్చయముగా, ప్రహరతి = కొట్టుచున్నాడో, దేవ = ప్రభూ, తత్ = దానినుండి, యత్నాత్ = ప్రయత్నముతో, రక్ష = కాపాడుము.

తా. ప్రభూ! త్రినేత్రా! నీ కంటిమంటచే పూర్వజన్మమున బొందిన పీడను దలచి కాబోలు కాముడు పగదీర్చుకొననెంచి సరిగా నుద్యుక్తుడనై నిను గొలువవలె నను ప్రేమతో నీ పాదములందే లయమందియున్న నా మనమును బాణములతో వేధించుచున్నాడు. ఈ కామబాధనుండి నను ప్రయత్నముతో రక్షింపుము స్వామీ! ॥౪౯॥

భిక్షాపాత్రం మృగజమజినం జీర్ణకౌపీన మేకం
కంథా రథ్యానిపతితజరచ్చీరలేశైశ్చ లక్ష్మ్వీ।
ఏతావాన్మే హర పరికర స్త్వత్ప్రసాదేన నిత్యం
భూయాద్భూయ స్తవ చరణయో ర్భూయసీ భక్తిరేకా॥౫౦॥

అర్థ:—హర = రుద్రా, భిక్షాపాత్రం = బిచ్చపుగిన్నె, మృగజం = లేడిదియైన, అజినం = చర్మమును, ఏకం = ఒక, జీర్ణకౌపీనం = చింపులబుడ్డగోచియు, రథ్యానిపతితజరచ్చీరలేశైః = త్రోవను బడిన ప్రాతబట్టపేలికలచే జేయబడిన, లక్ష్మ్వీ = చిన్నదైన, కంథాచ = బొంతయు, ఏతావాన్ = ఇంతటిదైన, పరికరః = సామగ్రి, త్వత్ప్రసాదేన = నీకృపవలన, మే = నాకు, నిత్యం = సదా, భూయాత్ = అగుగాక! భూయః = మరల, తవ = నీయొక్క, చరణయోః = పాదములయందు, ఏకా = ఒకటియైన, భూయసీ = గొప్పదైనట్టి, భక్తిః = భక్తియు (ఉండుగాక!)

తా. మహేశా! నాకెల్లప్పటికి ఒక బిచ్చపు చిప్పయు, జింక త్రోలును, చింపిరిబుడ్డగోచియు, త్రోవను దొరికిన పేలికల చిన్నబొంతయు, అను సామగ్రిమాత్రము దొరకునట్లు కరుణింపవలెను. మరి నీపాదములయందు కేవలము గొప్ప భక్తి గూడ సదా యుండునట్లు అనుగ్రహింపవలెను. ఈ రెండే నాకోర్కెలు.

వి. విశ్వారాధ్యుని సంస్కృత టీకలో నిది ౬౧ వదిగాను. "దేవస్తావత్" అను శ్లోకము ౬౦ వదిగాను ఉన్నది ॥౬౦॥

దేవస్తావద్భవతి భగవన్ భర్గ సర్గస్య సార
స్తస్మాత్పూర్వం మహదితిపదం ప్రోక్తముత్కర్షమాహ।
మాహాత్మ్యం తే స్మరహర మహాదేవ నామ్నైవ లోకే
దూరారూఢం వరద కిమహం స్తోత్రమన్యత్కరోమి ॥౬౧॥

అర్థ:—భగవన్ = శంభో, భర్గ = ఈశానా!, సర్గస్య = సృష్టిమధ్యమున, సారః = శ్రేష్ఠమైనది, దేవః = దేవతయే, భవతి తావత్ = అగుచున్నది కదా!, తస్మాత్ = ఆదేవశబ్దము కంటె, పూర్వం = మొదట, ప్రోక్తం = చెప్పబడిన, మహదితి = మహత్ అను, పదం = శబ్దము, ఉత్కర్షం = గొప్పదనమును, ఆహ = చెప్పుచున్నది; స్మరహర = కామారీ, తే=నీ యొక్క, మాహాత్మ్యం= గొప్పదనము, మహాదేవనామ్నైవ = మహాదేవు డను పేరుచేతనే, లోకే = ప్రపంచమున, దూరారూఢం = దూరముగా ప్రాకినదై యున్నది, వరద = కరుణాళో, అహం = నేను, అన్యత్ = వేరైన, స్తోత్రం = స్తవమును, కిం = ఏమి, కరోమి = చేయుదును.

తా. మహేశా! ఈ ప్రపంచమున దేవసృష్టియే శ్రేష్ఠమైనదనుట ప్రసిద్ధము. ఆ దేవశబ్దమునకు మొదటనే మహత్ అను శబ్దము మరియును దాని యౌన్నత్యము నినుమడింప జేయుచున్నది. ఇట్లు నీ మహాదేవ శబ్దమే నీ సర్వదేవాధిపత్యమును లోకమున ప్రసరింపజేసి యుండగా మరియొక క్రొత్త స్తవమును నే నల్లి తెలుపు క్రొత్త సంగతు లేమియు లేవు శంభో. ॥౬౧॥

కాలేన నీతస్సర్వోఽపి, పునరావర్తతే జనః।
మహాకాలేన నీతస్య, నావృత్తి ర్విద్యతే పునః ॥౬౨॥

అర్థ:—కాలేన = యమునిచేత, నీతః = కొంపోబడిన, సర్వః= సమస్తమైన, జనోపి = జనమును, పునః = మరల, ఆవర్తతే = జన్మ ములు దిరుగుచున్నది, మహాకాలేన = మహారుద్రునిచేత, నీతస్య = కొంపోబడిన మనుష్యునకు, పునః = మరల, ఆవృత్తిః = రాకపోక, న విద్యతే = లేదు.

తా. కాలవశమున గాని, యముని అపహారము వలనగాని చనిపోయినవాడు, మఱల పుట్టుచు చచ్చుచునే యున్నాడు. కాని మహాకాలుడైన హరుని దయకు పాత్రుడై దేహమును వీడిన వానికి మరల నీలోకమునకు రాకపోకలు కలుగజాలవు. సర్వథా ముక్తుడగును. ॥౬౨॥

అవ్యక్తాక్షరజల్పితైరపి శిశోః ప్రీతి ర్గురూణాం భవే
త్తే నాస్మద్వచనం మలీమసమపి స్యాత్తుష్టిహేతుస్తవ।
శ్రాంతస్త్వద్గుణకీర్తనాత్కిమపి యత్పుణ్యం మయోపార్జితం
తేన స్యాజ్జననాంతరేఽపి మహతీ త్వయ్యేవ భక్తిర్మమ ॥౬౩॥

అర్థ:—శిశోః = బాలునియొక్క, అవ్యక్తాక్షరజల్పితైరపి = వచ్చిరాని యక్షరములు గల మాటలచేతనైనను, గురూణాం = తలి తండ్రులకు, ప్రీతిః = ప్రేమ, భవేత్ = అగును, తేన = అందుచేత, అస్మద్వచనం=మావాక్కు, మలీమసమపి = నిర్మలము కాకపోయినను, తవ=నీయొక్క., తుష్టిహేతుః = సంతోషమునకు కారణము, స్యాత్ = అగును. శ్రాంతః = అలసినవాడనైనాను, (?) త్వద్గుణకీర్తనాత్= నీగుణముల బొగడుటవలన, కిమపి = ఎద్దియోయైన, పుణ్యం = సుకృతము, మయా = నాచేత, ఉపార్జితం=సంపాదింపబడినది (అగుచో) తేన = ఆపుణ్యముచేత, జననాంతరేఽపి = జన్మాంతరమునందును, మమ = నాకు, త్వయ్యేవ = నీయందే, మహతీ=గొప్పదైన, భక్తిః = భక్తి, స్యాత్ = అగు (కలుగు) గాక!

తా. శిశువులు వచ్చిరానిమాటలఁ బల్కినను వాని దోసముల నెంచక తలిదండ్రులు విని సంతసింతురు. అట్లే నా వాక్కులలోను స్ఖలనము లుండినను చాల భక్తుడను గాన పరమేశా! నీసంతోషమున కిది కారణమగుగాత! ఇంతకంటె నెక్కువగా నే జెప్పదగినదియు లేదు. ఈ స్తోత్రి మొనర్చుటచేత నా కొకింతయైనను సుకృతము లభించుచో దానివలన భవిష్యజ్జన్మమునందును నీ పాదభక్తి దృఢముగ నుండునట్లు వర మిమ్ము స్వామీ! ॥౬౩॥

ద్విజో దక్షిణరాఢీయో, నవగ్రామవినిర్గతః।
హలాయుధబుధః శంభో- రిమాం స్తుతి మరీరచత్ ॥౬౪॥

అర్థ:—ద్విజః = విప్రుడును, దక్షిణరాఢీయః=దక్షిణరాఢమను ప్రాంతీయుండును, నవగ్రామవినిర్గతః = నవగ్రామమునుండి ప్రయాణించినవాడును, అగు, హలాయుధబుధః=హలాయుధ పండితుడు, ఇమాం= ఈ, స్తుతిం = స్తవమును, అరీరచత్ = విరచించెను.

తా. బ్రాహ్మణుడును, వంగదేశమందలి దక్షిణరాఢ్ మండల ప్రాంతీయుడును నవగ్రామము నుండి ప్రయాణించిన వాడును, అగు హలాయుధ పండితు డీ స్తుతిని రచించెను.

వి. కొన్ని ప్రతులలో 'దక్షిణరాష్ట్రీయః' అను పాఠ మున్నది. కాని అది సరియైనది కాదనితోచుచున్నది. రాఢ్ మండలము వంగ దేశమున నుండుటచే 'రాఢీయః' అనుటయే సమంజసము. నవగ్రామమునుండి వెడలివచ్చిన రాష్ట్రకూటుల శివ కృష్ణ దేవునియొద్ద ఈ కవి నెలకొన్నాడు కావున ఆ మాటయు సరిగా నున్నది. ఇట్లుగాక 'స్వగ్రామమును వీడి కైలాసమునకు వెళ్లినవాడు' అనియును, నవగ్రామ మనగా తొమ్మిది యూళ్ళనియును కొందరు జెప్పుచున్నారు. కాని ఇది సయుక్తికముగా లేదు. 'నవగాం' అనగా క్రొత్తపల్లి. ఆది నేటికిని వంగభూమిలో గలదు. ॥౬౪॥

[అమరేశ్వర మందిరపు శిలాశాసన ప్రతిలోని స్తుతి ఇంతతో సమాప్తి యైనది. ఈ క్రిందివి గూడ కొన్నిప్రతులలో కలవు.]

యత్ర క్వచిద్భవతి దేవమనుష్యతిర్య-
గ్యోనౌ స్వకర్మపరిపాకవశా త్ప్రసూతిః।
తత్ర స్థితస్య మమ బాలమృగాంకమౌళే
త్వత్పాదభక్తి రచలాస్తు భవత్ప్రసాదాత్ ॥౬౫॥

అర్థ:—బాలమృగాంక మౌళే = బాలచంద్రశేఖరా!, స్వకర్మ పరిపాకవశాత్ = తన కర్మయొక్క ఫలము వలన, యత్రక్వచిత్ = ఎచ్చోటనైనను, దేవమనుష్యతిర్యగ్యోనౌ = సుర, మనుష్య జంతువుల యొక్క జాతిలో, ప్రసూతిః = జన్మము, భవతి = కలుగుచున్నది, తత్ర = అట, స్థితస్య = ఉన్నట్టి, మమ = నాకు, భవత్ప్రసాదాత్ = నీ యనుగ్రహము వలన, త్వత్పాదభక్తిః = నీచరణభక్తి, అచలా = నిశ్చలమైనదిగా, అస్తు = అగుగాక!

తా. చంద్రమౌళీ! నర సుర పశు జాతులలో నెక్కడ నైనను వారి వారి పూర్వకర్మానుసారము పుట్టుచుందురు. నేను, ఎక్కడ బుట్టి నను సరియే కాని ప్రతిజన్మలో నీ చరణములమీది భక్తి మాత్రము నిశ్చయముగా నుండునట్లు నన్నాశీర్వదింప వలెను. ॥౬౫॥

మహాకాలవనం సేవే, కయాచి త్ఫలలిప్సయా।
సంసారభ్రమణోద్భూత - శ్రమాపహరణక్షమం ॥౬౬॥

అర్థ:—కయాచిత్ = ఏదియో యొక, ఫలలిప్సయా=పండును బడయు దలంపుతో, సంసార = ప్రపంచముయొక్క, భ్రమణ = తిరు గుటవలన, ఉద్భూత = కలిగినట్టి, శ్రమ=ఆయాసమును, అపహరణ= హరించుటలో, క్షమం = సమర్థమైనట్టి, మహాకాలవనం = మహాకాల (మహారుద్ర) మను వనమును, సేవే = భజించుచున్నాను.

తా. ఏదియో యొక పండును దొరకించుకొనుటకై, సంసార ములో దిరుగుటవలన గల్గిన ఆయాసమును శమింపజేయునట్టి ఆ జగత్ప్రసిద్ధమైన మహాకాలుఁడను పేరుగల వనమున సంచరించుచున్నాను.॥౬౬॥

తవ చరణసరోజే దత్త మేకం ప్రసూనం
ఫలతి జలధివేలావేష్టితాం భూతధాత్రీం।
ప్రతిదివసపర్యాభక్తికౌతూహలానాం
ఫలమిద మితి శంభో శక్యతే కేన వక్తుం ॥౬౭॥

అర్థ:—శంభో = శంకరా, తవ = నీయొక్క, చరణసరోజే = పాదకమలమున, దత్తం = ఇయ్యబడిన, ఏకం = ఒక, ప్రసూనం = పుష్పము, జలధివేలావేష్టితాం = సముద్రపుమేరలచే చుట్టబడినట్టి,

భూతధాత్రీం = ప్రాణిపోషక మగు పృథ్విని, ఫలతి = కనుచున్నది, ప్రతిదివసనపర్యాభక్తికౌతూహలానాం = నిత్యసేవల నొనర్చు భక్తి యందు అపేక్షగలవారికి, ఇదం = ఈ, ఫలం = ఫలము, ఇతి=ఇట్లు, వక్తుం = చెప్పుటకు, కేన = ఎవనిచేత, శక్యతే = సాధ్యమగును।

తా. భక్తవత్సలా! నీ చరణముల సన్నిధిని భక్తితో నొక పుష్ప ముంచినంతనే సమస్త పృథ్వీచక్రమునకు ప్రభువగుచున్నాడని నిగమాగమములు చెప్పుచున్నను, ఇక ప్రత్యహమును నిను సేవించి మ్రొక్కు మహానుభావుల సౌభాగ్య మిట్టిదని నిరూపింప నెవరికి తరము మహాదేవా! ॥౯౭॥

---

చ. పరశివపాదపంకరుహభక్తిదివాకరుఁ బొంది; జన్మబం
ధురచిరతామసోత్కరముఁ దుంపఁ దలంచియు, శాలివాహ భూ
వరు శరవైరిహస్తిశశివత్సర శుక్లతృతీయమందు శం
కరనుతిపంచక మ్మనెడు గ్రంథము తెల్గునుడిన్ యథామతిన్
విరచన సేసె చిదరమఠవీరుఁడు; దీన శివుండు మెచ్చుతన్.

క. మానవమాత్రుఁడు దీనిన్
బూని పఠించినను మరలఁ బుట్టఁడు ధాత్రిన్,
జ్ఞానియయి ప్రమథగణ సం
మానముఁగని శంభులోకమాణిక్య మగున్.

(శా. శ. ౧౮౭౯ స్వభాను జ్యేష్ఠ శుద్ధ 3 మందవాసరమున)

ఇది శ్రీ మద్వేదాగమోపనిషత్సిద్ధవిమలవీరశైవమహామతస్థాపనాచార్యశ్రీజగద్గురు రేణుకాచార్యవర్యశిష్యప్రశిష్యపారంపర్యధర్మ, వీరగోత్రచిదిరేమఠవంశ్య నాగభూషణార్యశ్యామలాంబాదంపతీగర్భావిర్భూతికర్మ, కాశీపండిత గురుకులసమాసాదితవేదకావ్యస్మృతితీర్థసాహిత్యవిశారదధర్మా చార్యవిద్యానిధివిద్యారత్నాదిపదవీవర్మ, పండిత చిదిరేమఠీయవీరభద్రశర్మవిరచితంబగు శివపంచస్తవీభక్తరంజనీ వ్యాఖ్యానమున హాలాయుధస్తవము సమాప్తము.

---

సర్వము సంపూర్ణము.

# ఆంధ్రహాలాయుధస్తవము

## శ్రీ శృంగారకవి వేంకటరామయ్యగారు

---

క. శ్రీ పార్వతీ తపఃఫల, రూపా! గిరిచాప శార్ఙ్గిరోపా! త్రిజగ
ద్దీపా! హృతభక్తమన, స్తాపా! వందనము తరుణచంద్రకలాపా!

సీ. మహిత పన్నాల రామబ్రహ్మశాస్త్రి సమంజసంబగు మహిమ్న స్తవంబు
భవ్యుఁడౌ దేవులపల్లి సుబ్బారాయ మాన్యయశుం డల మల్హణంబు
బుధనుతుం డగు వింజమూరి లచ్చారాయ విద్వద్వరేణ్యుండు బిల్హణంబు
* కవిరాజ శృంగారకవి సర్వరాయ సమాహ్వయామాత్యుం డనామయంబు

గీ. నాంధ్రభాషను రచియించి యశముగనిరి, సంస్తుతంబైన శైవపంచ స్తవముల
మిగిలిన హాలాయుధస్తుతి మిగుల భక్తిఁ, దెనుఁగు చేయఁగఁ బూనితి దేవదేవ!

---

చ. అరయఁగ ధర్మపత్ని దన యర్ధశరీరమునందుఁ దాల్చు నా
హరు గురుఁ జూచి తానును దదాకృతిఁ జెందఁగ, నేకదంతుఁడై
కరికరిణీస్వరూపము మొగంబునఁ బూని చెలంగినట్టి యా
కరిముఖుఁ డంతరాయములఁ గ్రిన్ననఁ ద్రోలి ముదంబొసంగుతః. ౧

చ. తన గుణగౌరవంబునను దండ్రిని మించిన పుత్త్రుఁ డిమ్మహిః
జనకుని కంటె మిక్కిలి ప్రశస్తి వహించిన యాతఁడౌఁ గదా!
యని మదిఁగోరి పంచముఖుఁడౌ తన తండ్రికి నెక్కుడౌ షడా
ననములఁ బూను చంద్రధరనందనుఁ డోముత విశ్వమంతయుః. ౨

గీ. చంద్రజూటుండు కేవల జ్ఞానమూర్తి
సర్వలోకస్వరూపిణి శక్తి లోక
బీజములుగా నెపుడుగూడి వెలసిరట్టి
యాదిదంపతులకు నతి యాచరింతు.

3

---

* "ధన్యుఁడౌ బండారు తమ్మయధీరుఁడు, సన్నుతమలయరాజ స్తవంబు
చిదిరెమఠాధిప శ్రీ వీరభద్రార్యుఁ డర్హణరానామయ స్తవంబు."
అను నీ శ్లోకాంతరమును ప్రస్తుతము.
—సంపాదకుఁడు.

గీ. సకలజగములఁ బుట్టింపఁజాలు విధిని
వానిఁ బోషించు శౌరి తద్వ్యయము లయముఁ
జేసి ఘనమహిమంబునఁ జెలఁగునట్టి
కాళమూర్తి! నీ కన్యుఁడు గలఁడె సాటి? ౪

మ. పలుకం గోరిక నీమహత్త్వమునకుం బారంబు లేదెంచ నా
పలుకు ల్సారములేని వల్పములుగా భావించి నీ సద్గుణా
వళి భక్తి న్నుతియింప నేర నని నా స్వాంతంబునన్ ధృష్టతా
విలసత్పట్టము గట్టినాఁడను సుమీ విశ్వాధిపా! శంకరా! ౫

మ. సకలజ్ఞానధనాభియుక్తుఁడగు భాషానేత నీమాట మా
మక కించిజ్జ్ఞకృతస్తుతు ల్కడు రుచింపంజాలవం చేనెఱిం
గి కరంబీశ్వర నీనుతు ల్విడిచినన్ గీర్దేవి నామోము బా
యక వేవెల్వడు నేమి సేయుదు మదీయంబైన సద్భక్తిచేన్. ౬

గీ. వాఙ్మనోతీతమును నిరవధిపదంబు
నైన యే తత్త్వ మజువాక్కులైనఁ దెలియ
వట్టి యాద్యంబు నపరంబునైన నీస్వ
రూప మర్చింతు మద్వచోయాఢి నీశ! ౭

చ. అమృతమయోక్తుల న్సుకవు లాదరమొప్ప రచించునట్టి స్తో
త్రములవలె మద్వచోరచన రమ్యముగాదని మాననేర్తునే?
ప్రమథపతీ! సువర్ణశతపత్రసమర్చన గాంచు పాద ప
ద్మములను భక్తి నర్కకుసుమంబులఁ గొందఱు పూజ సేయరే! ౮

గీ. కమలశత్రుమిత్రంబులు గంధజనక
వాహములు హవిర్గ్రాహకగాత్రకంబు
లంబుదాహారమార్గంబు లయిన యుష్మ
దష్టమూర్తుల భజియింతు నభ్రకేశ! ౯

మ. ఘనసంసారమునందు దుర్లభమనంగా నొప్పు మర్త్యత్వముం
గని ధన్యుండు భజించుచుండు నిను నొక్కం డన్యదైవంబు సే
వన జేయుంగద! రోహణాద్రిని మహాభాగ్యంబుచే నెక్కినన్
ఘనరత్నంబు [illegible] శివా!

గీ. భక్తిసులభుండ వని నిన్ను భజనసేయు
వారి కభిమత మొసఁగుట భర్గ! నిజము
పాంథునకు శీతజలముల పగిది నీదు
నామ మెవ్వని దృప్తి నొసర్ప లేదు? ౧౧

గీ. రేయి పగలు పక్షము నెల ఋతువులు మొద
లైన కాలము చంద్రసూర్యగ్రహంబు
లెల్ల నీ ప్రేరణములేక యెట్లు తిరుగు?
నిట్టి సామర్థ్య మితరుల కెందుఁ గలదు? ౧౨

ఉ. ఇంచుక నీదు సత్కృపకు నెవ్వఁడు పాత్రుఁడొ వాని యింటిలోఁ
బెంచిన యావనన్ సురభి పేర్మిఁ జరించును; దోటలోనఁ బా
తించిన వృక్షమట్లలరు దేవమహీజము; హస్తరక్షకై
యుంచిన మానికంబనఁగ నొప్పును వేల్పులరత్న మీశ్వరా! ౧౩

గీ. జాహ్నవిని దాల్చు శిరమున శశిని విసము
దినుటచే నల్లనౌ గళమునను ఫణిని
వెన్నెలంబోలు మేనిపై వేల్మిడి నిడు
వెల్ల హర! యోగిభూషగా నెఱుకపడియె. ౧౪

గీ. జాజిపూదండవలె మాళి జహ్నుకన్య
గళమునఁ మృగమదరేఖకరణి విసము
నుదుటఁ గుంకుమబొట్టునాఁ బొదలు కన్ను
శర్వ! నీ కివి సహజభూషణము లహహ! ౧౫

ఉ. మారుఁడు ముజ్జగంబు కుసుమప్రచురాగ్నిని గాల్ప, వాని నీ
చారులలాటనేత్రశిఖఁ జయ్యన భస్మ మొనర్చినా, విదే
యారయ నీకు యుక్తము మహాశివ!లోకము లాకులంపఁగా
గారియవెట్టువాని జననాథుఁడు దండన మాచరింపడే! ౧౬

గీ. కీడుఁగలిగించు బలవంతుతోడి పోరు
మరుఁడు నీకంటిమంటచే మడిసెఁ గాదె!
యధరచుంబన మొనరించినట్టి కాము
సుదతి బొమముడి చూడ్కులఁ జూడఁబడడె? ౧౭

క. అతితర్షితులకు నుదకము
గతి; దుఃఖార్తులకు, శోకకలితుల కరి పీ
డితులకు, నిర్ధనులకు, మూ
ర్ఖతతికి, దౌర్భాగ్యులకు, శరణ మీవ, శివా! ౧౮

గీ. శాస్త్రపాండితి, ఘనలక్ష్మి, సత్క్రియాచ
రణము, వేదాధ్యయనము, గాత్రదర్శిమయు,
శ్లాఘ్యజన్మంబు, సంస్కృతసరసవాణి
యీశ! నీ సేవలేని వివెల్ల వృథలు. ౧౯

క. లలి నీపూజకుఁ గుసుమం
బులు దేఁజన నశ్మకషణమును గను జనుసం
ఘమ్ములు నీపురిఁ జొర హర! విబు
ధుల మౌళిమణిప్రభాతతుల కెంపౌలయుః. ౨౦

గీ. గిరిశ! నీ మందిరంబు నొకింత గోమ
యంబుచేతను నలికినయట్టి జనుఁడు
సురపతిత్వంబుఁ బడసి ఖేచరసతీకు
చద్వయంబునఁ గస్తూరి చర్చ సేయు. ౨౧

గీ. నెమ్మిఁ బంచామృతాభిషేక మ్మొనర్చి
పూలమాలలు నీ శిరంబున నమర్చి
నతఁడు రాజ్యాభిషేచన మంది, భువన
పట్టబంధంబుఁ బడయును బార్వతీశ. ౨౨

గీ. భూతపతి తావకాంఘ్రులఁ బుష్ప మొకటి
భక్తినర్పింప నది పెక్కుఫలము లపుడె
యిచ్చు నీ వింత కని విని యెఱుఁగ మున్ను
కౌతుకంబయ్యె నాకుఁ జక్కంగ జెపుమ. ౨౩

క. హర! నీ యంఘ్రుల నిండీ
వర మొక టిడినతఁడు నీదు పరమకరుణ ని
ర్జరనారీదృక్కువలయ
వరమాలాలంకృతుఁ డగుఁ బరలోకమునన్. ౨౪

క. హర! వరసురభికుసుమమా
ల రమణ నీ కంధరమున లగ్నముచేయన్
సురరమణీకృతభుజని
ర్భరకంఠాలింగనంబుఁ బడయును సుమ్మీ! ౨౫

గీ. శంకరా! భవదంఘ్రిపూజల నొనర్చి
యష్టమూర్తికి నీకు సాష్టాంగ మెఱఁగు
నతఁడు భూపతియై;నుర్వి యతనియంక
పాళిఁ జెరలాడుచుండుఁ బెన్నిధాళిమిషను. ౨౬

గీ. తిమిరహరణ శిఖావళిఁ దేజరిల్లు
దీపమును శర్వ! నీ సన్నిధి నిడునట్టి
వాని కాత్మ ప్రకాశ విజ్ఞాన మిసుదు
మోహజనితాంధకారంబుఁ బోవఁద్రోచి. ౨౭

చ. మనుజుఁడెవండు చిత్రసుమమాలిక లర్పణఁ జేసి భక్తితో
నిను జయ చంద్రమౌళి! హర! నీలగళా! భవ యంచు! సంస్తవం
బొనరుచు వాఁడు నీ పదమునొంది ముకుందపురందరాంబుజా
సనముఖదేవతానికరసన్నుతిఁ గాంచుఁజుమీ భవద్దయన్. ౨౮

గీ. చేతవిలు, గంగ తలను, విభూతి మేనఁ
గంటి మూర్తి నిశ్శాంతి, యుక్తంబు శర్వ
కతిపయపురాధిపతులకే గల్గు చిత్ర
చేష్టలు త్రిలోకపతి నీకుఁ జెప్పనేల? ౨౯

మ. అమరుల్ శర్వ! నినుంభజించి ఘనరాజ్యశ్రీలఁ జెందంగ నీ
వమరన్ భిక్షముఁ గొంటివైనఁ దగె నీకాహా! మహాదేవ నా
మము సర్వాధిక సంపదావళులనే మన్నింపబోవన్న! తు
చ్ఛములౌ సంపదలందు నించుకయు వాంఛ ల్పుట్టునే నీకిఁకన్. 30

చ. పునుకలె భూషణంబులు, విభూతియె నెమ్మెయిపూఁత, ప్రేత పా
ళి నెనయుచున్న జంబుకములే సహచారులు నీకు, నో త్రిలో
చన! యదియేమితప్పు ఘనసంపద లంది విరక్తిఁ బొందినన్
గనకము లోష్టము న్సమముగాఁ దలంచును గాదె యున్మహిన్.

గీ. బిచ్చపుంగోర పుర్ర యప్పితృవనంబె
యిరవు నీకెద్దు యాన, మిం దేమిదోష
మల్పధనినైన నారాధ్యుఁ డభవ! యున్నె?
విధినిషేధము ల్నిర్గుణపథికునకును ౩౨

గీ. భైక్షమశనంబు దిక్తతి వస్త్ర, మస్థి
భూషణంబు, ఖట్వాంగమె పో! ధ్వజంబు
శయనము శ్మశాన మయ్యు, నీశ్వరపదమున
కీవగాక సమర్థుఁ డింకెవ్వఁ డభవ! ౩౩

గీ. దారుకావని మునివనితాసమాగ
మమును, సంధ్యానటనము దోషములు కావు
శంకరా! నీకుఁ బూర్ణవిజ్ఞానమార్గ
వర్తి కంటునె లోకాపవాద మెందు? ౩౪

గీ. శర్వ! మణిహేమభూషితుల్ సకలసురలు
చెవినో చేతనో బంగారు చిన్నమెత్తు
లేదు సహజవిలాస! నీ కాదరంబు
గుణములనెకాని లేదు భూషణములందు. ౩౫

చ. జలజభవాదినిర్జరులు స్వార్థపరుల్ నిను గోరి నిచ్చలున్
గొలిచెద రన్యు నొక్కరుని గోరవు నీవని పల్కు వేదముల్
తలఁచిన యంతసర్వమును దద్దయు నీయెదుట న్వసింప నీ
కిల నితరేచ్ఛ లెట్లు జనియించునో చెప్పఁగదే జగత్పతీ! ౩౬

గీ. ఖండపరశువు వా, ల్శశిఖండము పువ్వు,
విధిశిరఃఖండమే పాత్రి వినుము, ఖండ
పరికరుఁడవయ్యు నీ పాదభక్తులకు న
ఖండఫలదాయకుండవు గావె? దేవ! ౩౭

గీ. శిరము తారాపథంబుగాఁ జేసి ధరణి
పాదపీఠికగాఁ జేసి పరఁగు విశ్వ
రూపు నినుఁగొల్చు జనములు రూఢిమీఱఁ
గడలి నదులట్ల నీయందె కలియుచుంద్రు. ౩౮

చ. పురహర! వారణాసి సవిముక్తము సర్వజగద్విలోకనా
కరముకురంబు నీశుని ప్రకాశము భాసిలునట్టి క్షేత్రిమం
దు రహిని సన్న్యసించిన జనుండు తుది న్నినుఁబొందు దీపమా
సురుచిర తేజమం దెనయు చొప్పున హైమవతీసతీపతీ! ౩౯

మ. హర! శ్రీశైలమునందు దివ్యమును బ్రత్యక్షంబు లోకాళికిం
బరమాశ్చర్యము హేమపింగళమునై భాసిల్లు నీరూపముం
జిరభక్తిం గనువారు నీ దయను సంఛిన్నాత్మసంసారులై
నిరతంబుగ బ్రమథాదినాథపదముల్ సేవింతురి నిక్కంబుగాన్. ౪౦

గీ. శర్వ! శుచికాయు వాగీశు శక్తిహస్తు
నిస్తమస్కుని సతతంబు నిన్నుఁ దలఁచు
వానివదనంబు వెలువడు వాణి జాహ్న
వీప్రవాహంబువలె నిది వింత కాదు. ౪౧

గీ. త్రినయనా! నీదుకుడికన్ను దినకరుఁ డయి
వెలయు తేజోమయాత్ముల స్వేక్షఁ జేయు
మనుజు లఱచేతిలో బంతిమాడ్కి స్వేచ్ఛ
సూర్యపర్యంతలోకంబుఁ జూచుచుందురి. ౪౨

గీ. విమలమును జిత్స్వరూపంబు విశ్వముకుర
మఖిలలోకాత్మకం బయినట్టి నిన్ను
హృదయకమలముల న్భజియించు వారు
గిరిశ! సర్వజ్ఞతాసిద్ధిఁ బొరయుచుందురి. ౪౩

ఉ. శీతమయూఖమాళి నిజచిత్తసరోరుహమధ్యసంస్థిత
జ్యోతికి నగ్రిభాగమున సూక్ష్మముగా వెలుఁగొందు నిన్నొగిన్
జూతురొ వారు నిన్గలియుచుందు రుపాధిని వీడి వేగఁ బ్రి
ఖ్యాతి ఘటావకాశము వియత్తలసంగతమైన పోలికన్. ౪౪

గీ. విద్యుదర్చిరాదు లవేల విశ్రిమమున
కనుచుఁ గొందఱు సురయానముననె యేగి
బ్రిహ్మలోకభోగంబులఁ బడసి పిదపఁ
దన్మయత్వంబు ... ౪౫

గీ. ఎచ్చటను జ్యోతిరానంద మెనయుచుండు
నెచ్చటను దివ్యభోగంబు లెసఁగుచుండు
నెచ్చటను బునర్జన్మము లెడయుచుండు
నట్టి వైరాజ్యపద మిచ్చె దభవ దయను ౪౬

గీ. అద్దమందు ముఖంబట్టు లఖిలసద్గు
ణావళులు గల యాత్మ నీయందుఁ జాన
చంచలమనంబుచేఁ జూచు జనుఁడు వడయుఁ
గామితము ధర్మము సమాధిఁ గాలకంఠ! ౪౭

గీ. నిర్గుణుని జ్ఞానదీపుని నిర్మలాత్ము
నిన్ను యోగంబుచేతను నిఖిలమాను
లమలబుద్ధిని వీక్షింతు రభవ విశ్వ
మద్దమునఁ గానుపించిన యట్లు శర్వ! ౪౮

ఉ. *ధీరుఁడుగాక మత్తుఁడయి తెల్వియొకించుక లేక నిచ్చలుఁ
సారములేని సంసరణసాగరమందుఁ జరించి యంతమం
దారయఁ గాలుచే వ్యథలనంది తలంచును బూర్వవృత్తముఁ
నేరఁడు ముక్తి నీఁదగిన నీ పదభక్తి నొసర్ప శంకరా! ౪౯

ఉ. ఒప్పగు జ్ఞేయము న్విడిచి యుండదు జ్ఞానము, జ్ఞానశూన్యమై
యెప్పుడు జ్ఞేయమొప్ప, దటు లీ యుభయంబును గూడియుండు నా
చొప్పున నె మాయయంచుఁ బురుషుండనుచు న్వచియింత్రు శర్వ యె
ల్లప్పుడు నర్ధదేహమున హైమవతిం ధరియించి యుంటచేఁ. ౫౦

గీ. అభవ శబ్దాదులకు నింద్రియముల కెఱుక
పడక యూహించుట కొకింత వలనుగాక
గ్రిహణసంబంధములులేక కరము వెలయు
పరమవిజ్ఞానదీపతత్త్వంబ వీవ. ౫౧

*పైది మూలమునకు సరిగా లేదేమో యని ఈపాఠాంతరము వ్రాయబడెను. —చి.మ వీ.
చ. గతసుఖ మెప్పుడో చనెను, గల్గునె యిష్ట భవిష్యసౌఖ్యముల్?
అతిలవ వర్తమానసుఖ మందున కోర్కెలు దీర వైన, దు
ర్మతులు మదించి యంతటికె మానుచునుండిరి నీదు సేవ నా
తతభవభీతి [...] ఘోరకృపాణము నక్కటా! శివా! ౪౯

ఉ. ఇందుకళావతంస! భువి నెవ్వఁడు రాగము వీడి శాంతినిం
జెందిన మానసంబున విశీర్ణతమోగుణు నిన్ను నవ్యయా
నందుని బోధరూపుఁ గనినం దొలఁగుర్ ఘనమోహబంధముల్,
జెందును ముక్తిమార్గమును జీవముతోడనె యాతఁ డెంతయున్. ౫౨

చ. సకలజగత్పతిత్వమును సన్నుతిసేయును లోభి; చంచలా
త్మకుఁ డొగి సిద్ధుల న్వెదకు; ధాత్రి నిరోధకము ల్గదా స్మరాం
తక! భవదీయసత్పదమున న్వసియించి నిరంతరంబు నీ
ప్రకటితతత్త్వబోధసుధఁ బానముఁ జేసిన మౌని కిన్నియున్. ౫౩

చ. ఘనమగు బ్రహ్మచర్యమును, క్ష్మాతలశయ్యయు, దండధారణం
బును, హరిదంబరంబును, విభూతియు, మౌనము, భైక్షభోజనం
బును, శుచితావిరాగములఁ బూనుట వ్యర్థము, నీదు తత్త్వముం
*గనుఁగొనకున్న జాతిని విఖండన చేయుట దూదిచే శివా! ౫౪

ఉ కర్మఫలంబుచేతఁ జిరకాలము స్వర్గమున న్వసించి యా
కర్మఫలంబు నాశమును గాంచిన భూమి జనింత్రు మానవుల్
నిర్మలమైన యోగమున నిత్యసుఖం బగు నీపదంబునం
దర్మిలిఁ జేరి రారు జననాదులఁ జెందఁగ జంద్రశేఖరా. ౫౫

చ. సమము సుఖంబు జిష్ణునకు స్వర్గమునందు లభించు యజ్ఞసౌ
ఖ్యము నరకస్థితక్రిమికిఁ గన్గొన; నేరికి దుఃఖము న్సుఖం
బమరఁగ నున్నవే? త్రిభువనావళి ద్వంద్వముతోడ సంప్రయు
క్తము గద! యట్టిదాని నొగి దాటితి వీవె భుజంగభూషణా. ౫౬

చ. ఘనతరకర్మబంధములు గ్రిన్నన నాశముఁ జెంద దేహి నీ
తనువున నైక్యముం బడసి తాను విముక్తుఁడె యైనఁ, జీఁకటుల్
దనరెడు నూతిలోఁ బడినఁ దాఁ బడుఁగాక మహేశ! నీవు నా
కును బతి వేను నీభటుఁడ గోరరు రాజపదంబు సేవకుల్. ౫౭

---

* ఇది సరిగనే యున్నది. మా శ్లోకచరణమున కీ పాఠము తగును. సం॥—
చ. కనుఁగొనకున్న నుప్పిడని కమ్మదనమ్ము వలెన్ మహేశ్వరా. ౫౪

చ. కరువలిచేఁ జలించు సితకంజదళాంతరవాఃకణంబుతో
సరియగు జీవితం బెవఁడు సత్యమటంచును నమ్మియుండు, ని
బ్బరముగ సుందరీమణులపైఁ బ్రసరించు మదీయచిత్త మే
కరణినిగాని నిద్దురను గాంచని యట్లొనరింపు శంకరా. ౫౮

చ. శివ! భవదీయనేత్రశిఖిచేత నడంగె సుమాస్త్రుఁ డంచు నే
వ్యవసితబుద్ధితోఁ దలఁచి వైరము వీడె నటంచు నిచ్చలున్
భవదమలాంఘ్రిపద్మముల భక్తి భజింపఁగ నామనంబు బా
ణవితతిచేతఁ గొట్టెడు ననంగుడు; కావుము దీని యత్నతః. ౫౯

గీ. ప్రేత గోచియుఁ, బులితోలు, పచ్చడంబు,
భైక్ష మెత్తెడు పాత్రి, నీ పరికరంబు
చాలు నా కివి; శివ ప్రతిజన్మమందు
పాదభక్తి నొసంగుమీ పరమకృపను. ౬౦

గీ. సర్గసారమె సుమి దేవశబ్ద మయ్యె
దానికి మహాపదముఁ జేర్పఁ గానె తెల్పు
తాపకోత్కర్ష మమ్మహాదేవపదము
త్వన్మహత్త్వము నుతియింపఁ దరమె భర్గ. ౬౧

క. కాలుఁడు గొంపోయిన జను
లీ లోకంబునకు మఱల నేతెంతురె, మహా
కాలుఁడు గొనిపోయిన వా
రీ లోకంబునకు మఱల నేతేర రహా. ౬౨

ఉ. వచ్చియురాని మాటలను బాలుని మెచ్చరె తల్లిదండ్రు లా
మచ్చున నా మలీమసపు మాటలు నీ కొగిఁ దృప్తి సేయవే
మచ్చిరపుణ్యసంగతి నుమాపతి నిన్ను నుతింపఁ గంటి నే
నచ్చపుభక్తి రాఁగల భవాంతర మందును గల్గుఁ గావుతన్. ౬౩

* గీ. ద్విజుడు, దక్షిణరాఢీయ దేశభవుఁడు,
నల నవగ్రామనిర్గతుఁడగు హలాయు

* ఈ [illegible] రెండు పద్యముల నే ననువదించితిని. చి. మ. వీ.

ధ బుధుఁ డీ శంభుసంస్తుతిఁ దగ రచించె
(శాంభవుల పారాయణ శర్మదముగ.) ౬౪

చ. పరిచితపూర్వకర్మ పరిపాకవశంబున నాకు ముందటన్
నరసురతిర్యగాది జననంబులు గల్గినఁ గల్గుఁగాక భా
స్వరశశిఖండమౌళి! నిజబంధురసత్కృపచేతఁ దద్భవాం
తరములఁ గల్గుఁగా కెపుడు తావకభక్తి యచంచలంబుగన్. ౬౫

* గీ. ఘోరసంసారకాననఘూర్ణనమునఁ
గల్గినట్టి మహాయాసఖండనార్హ
ఫలము నెద్దియొ యిచ్ఛించి భవ్యమైన
శ్రీమహాకాళవనమును జేరుకొంటి. ౬౬

గీ. పుష్ప మొక్కటి నీ పదంబుల నిడంగఁ
బుడమి కంతకు నాతఁడే యొడయఁడగుచు
నిచ్చలును భక్తి నీ పూజ నెఱపువారి
ఫలము నుడువంగ నెవ్వని వశము శర్వ! ౬౭

---

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుండు శృంగార,కవికులజలధిరాకావిధుండు
పళ్ళెమూమాత్యుండు పత్ని రామాంబ నాఁ,దనరాఱుచుండిన దంపతులకు
సర్వరాయ సుకవీశ్వరుఁడు వెంకటరామ,యాఖ్యులఁ జనియించి రందులోన
రెండవవాఁడ, గిరీశ హాలాయుధ, కృతసంస్తవము నీదు కృప జనింప
గీ. నాంధ్రభాష రచించితి సరసి దీనఁ, దప్పులున్నను సైరించి దయదలంచి
భుక్తిముక్తుల నిడ నీకు మ్రొక్కుచుందు, బాలశశిమౌళి నిజభక్తపద్మహేళి!

ఆంధ్రహాలాయుధస్తవము సమాప్తము.

---

శివపంచస్తవి సమాప్తము.

---

# బిల్హాణ స్తవము

సంతు సహస్రం దేవా, స్తద్గుణదోషోక్తిభిః కి మస్మాకం
శివమేవ వర్ణయామః, పునరపి శివమేవ శివమేవ॥ ౧॥

తా. వేలకొలది దేవత లుందురుగాక! వారి గుణదోషములతో మాకేమి పని? మేము శివునే వర్ణింతుము. మరల మరల శివునే స్మరించెదము.

[శ్రీ బిల్హాణకవి దీనిని రచించుటవలన బిల్హాణ స్తవ మని పేరుగాంచెను. మహిమ్నము, మల్హాణము, మలయరాజము, అనామయము అను ఐదు స్తవములే శివపంచ స్తవములుగా ప్రాచీన కాలమున రూఢములై యుండెను. తరువాత క్రీ॥శ॥ ౧౨-వ శతాబ్దమున బిల్హాణ కవీశ్వరుడు రచించినట్టి ఈ స్తవముకూడ మనోహరముగను చమత్కారముగను ఉండుటవలన పంచ స్తవములలో జేర్చి పారాయణము గావింప దొడగిరి. ముఖ్యముగ నాంధ్రదేశమున నీ స్తవము బాగుగా ప్రచారమయ్యెను. ఇట్టి పరిస్థితిలో మలయరాజ స్తవమును కొందరు విస్మరించిరి. అందుకని ప్రాచీనమైన మలయరాజ స్తవమునకు మొదట తావు నొసంగి; తర్వాత ప్రచారము గన్న ఈ బిల్హాణ స్తవము గూడ అనుబంధముగా ప్రకటింపనైనది. గ్రంథవిస్తర భీతివలనను; కొంత సులభముగాఁ దెలియుటకు ఆంధ్రపద్యానువాదముకూడ నున్నందునను పదపదార్థవిశేషములు వ్రాయబడ లేదు.]

ధత్సే మూర్ధ్ని సుధామయూఖశకలశ్లాఘ్యే కపాలస్రజం
వక్షస్యద్రిసుతాకుచాగురురజస్సాంద్రే చితాభస్మ చ
తద్బాణాదికవిప్రణీతలలితస్తోత్రప్రబంధప్రియే
త్వత్కర్ణే లభతామయం మమ గిరాం గుంభోఽపి సంభావనాం ॥ ౨॥

తా. అమృతకిరణములుగల చంద్రరేఖను ధరించిన తలలోనే పుర్రెలదండను దాల్చినాడవు. పార్వతీదేవి స్తనములలోని అగురు (జవ్వాజి) పూతలు దట్టముగా నంటియున్న వక్షఃస్థలమునందు కాటి బూడిద నలదినావు. అటులే బాణాది కవీశ్వరులచే రచింపబడిన సుందరమైన కావ్యముల విని యానందించిన నీ కర్ణమున నాయీ మాటల వరుసయు మన్ననను పొందుగాక.

పంచబ్రహ్మషడంగబీజ ముఖరప్రసాదపంచాక్షర-
ధ్యేయవ్యాపిపురస్సరేషు మనుషు ప్రౌఢిః కుతో మాదృశాం

ఓంకారాదిననమోంతముద్రితభవన్నామావలీకల్పితం
సర్వం మంత్రితయా ప్రభో! పరిణమత్యంతర్బహిర్వ్యోగతః॥ 3॥

తా. ప్రభో! సద్యోజాతాది పంచబ్రహ్మములయొక్క వశ్యాకర్షణాది షడంగబీజాక్షరములచేత మిక్కిలి గొప్పదగు ప్రసాదపంచాక్షరియొక్క యక్షరములతో భూనభోంతరాళములు నిండుకొను మహామంత్రములలో మాబోంట్లకు పాండిత్యమెక్కడిది? ఓంకారము నాదియందును, నమః అనుశబ్దము నంత్యమునందును నీ నామధేయములకు ఇట్లు అంతర్బాహ్యముగ జేర్చినచో సమస్తముకూడ మంత్రస్వరూపమై పోవుచున్నది. [పంచాక్షరీ మంత్రముకూడ శాఖాభేదములనుబట్టి వేలువేలు బీజాక్షరములను పొంది; ప్రసాదపంచాక్షరి మున్నగు విధమున వ్యవహరింపబడును. ఇది మంత్రశాస్త్రనిపుణులకు మాత్రమే తెలియును. హర శివ శంభు అను శివుని యొక్క నామములకు ఆద్యంతములలో "ఓం-నమః"ను చేర్చినచో సర్వజనసులభమగు మంత్రమేర్పడునని భావము.]

సర్వేషాం హృది విద్యసే శివ తతస్త్వద్ధ్యానయోగేన కిం
విశ్వస్యోపరి వర్తసే యది తదా త్వత్పాదమూలే నతిః
త్రైలోక్యం త్వయి లీయతే యది తదా త్వత్ప్రాప్త్యుపాయైరలం
సత్యప్యాయతనే తనౌ కిమపరం దైవం న రోచిష్యతే॥ ౪॥

తా. ఓ శివా! నీవు ఎల్లర చిత్తములో నుండుచో నిక ధ్యానయోగముచే నక్కరలేదు. విశ్వముమీద నున్నావనుట నిజమగుచో నీ పాదతలమగు భూతలమున నొక నమస్కారమిడుచున్నాను. లేదా ఈ ముల్లోకములు, నీయందు అడగుచో ఇక నిన్ను పొందుటకై పెద్ద ప్రయత్నమొనర్ప నవసరములేదు. నా దేహమే నీకు ఇల్లుగా నుండ మనస్సు ఇతరదైవమును గూర్చి రోయకుండునా!

భణంతి చేతశ్చపలస్వభావం, జల్పంతి దోషం కవయో గుణాయ
తద్యత్ర కుత్రాపి విలీయమానం, కదాచన త్వయ్యపి ధావతీతి॥౫॥

తా. ఓ శంభో! ఈ మనస్సు చంచలమైనదని సాధారణముగాఁ జెప్పుదురు. కాని కవీశ్వరులు మాత్రము ఈ దోషమునుగూడ మంచిదనియే పల్కుచున్నారు. ఎందువలన ననగా ఎక్కడ గావలసిన నక్కడనే మఱుగెడి ఈ మనస్సు ఒకప్పుడు నీయందును భ్రమసి చేరవచ్చునుగదా!

ఏనాంసి మానసికవాచికకాయికాని
కుర్మ స్తథాపి చరణం శరణం దదీథాః
యో దోషవంతమపి రక్షతి రక్షితాసౌ
కో వా న రక్షతి నిరాగసమిందుమౌళే॥ ౬॥

తా. ఓ చంద్రశేఖరా! కాయిక వాచిక మానసికములైన పాపములను నే నొనరించినమాట నిజమే. ఐనను నీపాదమును శరణముగా ననుగ్రహింప గోరుచున్నాను. తప్పుగలవానిని కాపాడినవాడే నిజమైన రక్షకుడు. దోషములేని వాని నెవరు బ్రోవరు?

పాద్యైస్తవ కిం శ్మశానవసతేః స్నానైః కి మస్థిస్పృశః
కిం వస్త్రైశ్చ దిగంబరస్య భసితాలేపస్య గంధైశ్చ కిం
కిం ధూపైః శవధూమధూమ్రవపుషః కిం కాలకూటాశినో
నైవేద్యైరితి భక్తిమాత్రసులభం త్వాం దేవ! సేవామహే॥ ౭॥

తా. ఈశ్వరా! కాట నుండువానికి ఆలయముతో నేమి? ఎముకలు దాల్చువానికి అభిషేకము లేల? దిగంబరునకు పట్టుపుట్టములతో పనియేమి? బూదిదాల్పునకు గంధముపూత లేల? శవములపొగచే నల్లనైనవానికి ధూపము లెందుకు? విసము మెక్కెడు వానికి భక్ష్యభోజ్యాది నైవేద్యములతో నేమిపని? ఇట్లుగా భావించి, పరమేశా! నిను భక్తిమాత్రముతో సులభునిగాఁ దలంచి సేవించుచున్నాము.

ఆయుషి మహతి విలంబో, భవతి భవత్పాదపంకజప్రాప్త్యై
హీనే భవదారాధన- విఘాత ఇత్యుభయథాపి కిం కుర్మః॥ ౮॥

తా. దేవా! ఆయుష్యము దీర్ఘమయ్యెనా, నీ చరణారవిందమును గనుటకును ఆలస్యమగుచున్నది. లేక అల్పమయ్యెనా నీ సేవ బొత్తుగను లభించుటలేదు. ఇట్లు రెండు విధములుగను నష్టము గల్గుచున్నది. ఏమి చేయుదుము?

పుంసా మాయుర్నిటలఫలకే వ్యక్షరైర్లిఖ్యమానం
నిశ్చిన్వానో విధిరవధినా పూర్వమాసం స లుంపేత్
నైతత్కర్తుం ప్రభవతి మమ త్వత్పదాంభోజపీఠ-
ప్రత్యాసన్నక్షితినతికిణామృష్టభాలాక్షరస్య॥ ౯॥

తా. ఓ దేవా! బ్రహ్మదేవుడు మానవుల లలాటఫలకములలో వ్రాయునపుడు ఆయుస్సును నిశ్చయింపఁదలచి తబ్బిబ్బుగాఁ దోచినచో మొదటి వ్రాతను తుడిచివేయవచ్చును. కాని నీ పాదములనెడు పీఠము సన్నిధిని నిరంతర నమస్కారముచే కాయ గాచుటవలన తుడుచుకపోయిన ఫాలభాగాక్షరములు గల నన్ను మాత్రము ఏమియు చేయజాలడు.

శ్మశానే భూతానాం పతిరితి విజానన్నపి మనో
నృణాం భస్మన్యస్థీన్యపి కిమపి తీర్థం గమయతి

భవద్దేహాశ్లేషం భవదహిఘనారోహణమపి
స్వయం లబ్ధ్వాప్యేషాం సుకృత పరిపాకో న భవతి॥ ౧౦॥

తా. హరా! శ్మశానమునందున్న నీవు సర్వభూతపతివని యందరు తెలిసియు మృతులయొక్క అస్థులను ఏదియో యొక నదిని జేర్చుచున్నారు. నీ యొక్క దేహ లింగనమును, నీవలె గొప్ప సర్పములధారణమును సొంతముగ పొందియును వీరి పుణ్యము పరిపక్వమగుటలేదు. (శ్మశానముననే గల శివునకు భక్తితో దేహము సర్పించుచో అమానవునకును శివుడు సాయుజ్యము నొసంగునని భావము కావచ్చును.) (ఈ శ్లోకము మూడవచరణమున 'భవదహి' యనుటకు మారుగా "భవదప" "భవదపి" యనియు పాఠములు గావచ్చునేమో సందేహాస్పదముగా నున్నది.)

ప్రేతతామమరతాం చ బిభ్రతీం
త్వద్భుజిష్యపదవీం లభామహే
దుష్కృతస్య సుకృతస్య చోభయో-
ర్నాంతరం తదవధారయామహే॥ ౧౧॥

తా. ప్రేతత్వమును, మహాదేవత్వమును ధరించునట్టి నీవు ఏ పదవిని అనుభవించుచున్నావో దానిని మేమును (భక్తివలన) పొందుచున్నాము. కావున పాపమునకును, పుణ్యమునకునుగల తారతమ్యమును జెప్పలేకున్నాము.

బ్రహ్మోత్తమాంగలవితు ర్నృకపాలవోఢుః
శ్రీకంఠ! పాదకమలం వరివస్యతాం తే
హింసాప్యశౌచమపి నాగసి కారణం నః
స్వామీవ సేవక ఇతి ప్రవదంతి లోకే॥ ౧౨॥

తా. ఓ నీలకంఠా! బ్రహ్మదేవునియొక్క శిరమును గోసినవాడవును, నరకపాలముల దాల్చువాడవును అగు నీయొక్క పాదకమలమును సేవించునట్టి మాకును హింసలవలనగాని, అనాచారమువలనగాని దోషము కలుగజాలదు. దొరవలె బంటని కదా లోకప్రసిద్ధి?

జటాజూటే గంగా, నిటలనికటే శీతకిరణం
పునర్దేహే దేవీం తుహినగిరిపుత్రీం ఘటయతే
అతశ్శంకే లోకత్రితయపరితాపాపహరణం
విధాతుం సన్నాహో వరద! భవతా భావిత ఇవ॥ ౧౩॥

తా. ఇష్టదాతా! జడలో గంగను, నొసట చందమామను, మరియు దేహము

నందు హిమపుత్రికరైన సతీదేవిని ధరించుచున్నావు. దీనివలననే నీవు ఈ ముల్లోకములయొక్క తాపత్రయమును హరింప సంకించుచున్నావని భావించుచున్నాను.

విత్తేశస్య కుబేరతా న విరతా నీహారభానుః క్షయీ
హేరంబస్య మహోదరం న గళితం దైత్యారి రుచ్చైర్గదః
అంగం భృంగిరిటేశ్చ పాండుభృశ మిత్యాస్తా మమీషాం కథా
త్వం శూలీతి విగీయసే కథమహో భక్తస్త వానామయః॥ ౧౪॥

తా. విత్తేశునికి బేరత్వము (గూని,మరుగుజ్జుతనము) రహితము కాలేదు. చంద్రుడు క్షీణించుచునేయున్నాడు. వినాయకుని పెద్దపొట్టయు కరగలేదు. విష్ణువు మహాగదుడైయున్నాడు.(గదయన రోగమనియు, చేతియాయుధమనియు నిట రెండర్థములు) భృంగియొక్క అంగమెల్లయు పాండుదవిలి యున్నది నిక్కమేకదా! వీరి కథ లిట్లుండుగాక! నీవు సాంతముగ శూలివికదా! (శూలము = నొప్పి; త్రిశూలము) ఇక నీ భక్తుడనామయు (నీరోగు) డెట్లగునో స్వామీ! (ఇది వ్యాజస్తుతి. శూలము కలవాడు కావున దానితో పొడిచి రోగముల నశింపజేయకలడని భావము.)

గృహ్ణ్యాంతాం వసనేషు చర్మ భుజగో హారేషు యానేషు గో -
గుత్తూరం కుసుమేషు నాత్ర రుదిమః కిం త్వాత్ర కంపామహే
అబ్ధౌ కౌస్తుభకాలకూటకమలాకల్పద్రుమోచ్చైశ్శ్రవః -
పీయూషాదిషు సత్సు తాత భవతా యః కాలకూటగ్రహః॥ ౧౫॥

తా. అయ్యా! వస్త్రములలో చర్మమును, భూషణములలో సర్పమును, వాహనములలో ఎద్దును, పుష్పములలో నుమ్మెత్తను తీసుకొనినవాడ వగుదువుగాక! దీనను ఈ విషయమున మేము దుఃఖము నొందము. కాని నాయనా! భోజనార్థమై అమృతాదు లుండగా హాలాహలమును స్వీకరించినాడవను సంగతి మాత్రము మమ్ము కంపించి వైచుచున్నది.

ఉత్తరంగ మధిమస్తకగంగా-వారి ధారయసి వారిజగంధి
కిం పరైః శ్చులుకబిల్వదలైస్తే, భిక్షురుజ్ఝతి కదాచన లాభం॥౧౬॥

తా. ఉన్నతమైన తరంగములు గలిగినట్టియు, కమలముల సుగంధము గలిగినట్టియు గంగాజలమును తలలో దాల్చియున్నావుగదా! కొంచెపు అభిషేకముల తోడను గుప్పెడు మారేడు పత్రితోడను ప్రయోజనమేమి? అవును, భిక్షువు లాభము నెన్నటికిని వీడునా!

సన్న్యారోపణరక్షణాక్షమతయా భిక్షాటనం నిర్మితం
కచ్ఛగ్రంథనమోచనాలసతయా వాసో దిశః కల్పితాః
శాణాన్వేషణఘర్షణాసహతయా భస్మాంగరాగః కృతః
విశ్వోత్పాదనరక్షణాదిపవరతాపస్త్వయా నేక్షితః ॥౧౭॥

తా. శంభో! కొంలకలను నాటు వేసికొనలేక బిచ్చము నెత్తబూనితివి. తీక్ష్ణమైన చుంగులుబోసి కట్టుకొనుటను విడుచుటను జేయజాలక దిగంబరుడవైతివి. సానదెచ్చు కొని గంధము తీసికొనలేక బూది బూసి కొంటివి. కాని ఈ విశ్వమును పుట్టించి పోషించి గిట్టించుట యనెడి ఆయాసమును ఏలనో గణింపవైతివి.

ధుత్తూరాణి శిరస్స్రజం పితృవనం వాసం విషం భోజనం
సర్పాం శ్చాభరణాని భస్మ తిలకం వృద్ధోక్ష మారోహణం
ప్రేతాన్ పారిషదాన్ విధాయ మమృజే దుర్మేధసో వేధస-
స్త్రైలోక్యానుపయోగవస్తురచనావైపుల్యదోష స్త్వయా ॥౧౮॥

తా. ఉమ్మెత్తలను సిగపూలుగాను, శ్మశానమును నివాసమునుగాను, విస మును భోజనముగాను, పాముల సొమ్ముగాను, బూదిని బొట్టుగాను, ముదుసలి బక్కను వాహనముగాను, దయ్యముల బంట్లగాను నీవు ఏర్పరచుకొని; ఆ పిచ్చివాడైన బ్రహ్మదేవు డీ ముల్లోకములలో వ్యర్థముగా బుట్టించిన వస్తువులయొక్క దోషమును దొలగించినాడవని దలంచుచున్నాను స్వామీ!

వాణీ పంకరుహాసనస్య గృహిణీత్యాస్థాయి మౌనవ్రతం
లక్ష్మీః సాగరశాయినః ప్రియతమే త్యగ్రాహి భిక్షాటనం
ఇత్థం స్వామినిషిద్ధసేవకవధూసంభోగబీభత్సయా
పంచానేషణ త్వయా ధృతిదయాదాంతిక్షమాముక్తయః ॥౧౯॥

తా. జగదీశ్వరా! వాణి (మాట) బ్రహ్మను భార్య కావున దాని వంటక మౌనము దాల్చినాడవు. లక్ష్మి (సంపత్తు) విష్ణుపత్ని కావున అద్దాని ముట్టక భిక్షా టనవలన మాత్రమే యాహారము సంపాదించుకొనుచున్నావు. ప్రభువులైనవారు సేవ కుల స్త్రీల ముట్టరాదు. కావున ఈ లక్ష్మి సరస్వతుల ఉపయోగమునందు హేయత గలవాడవై; ధైర్య, దయా, దాంతి, క్షమా; ముక్తు లనెడు ఐదింటిని మాత్రమే స్వీకరించితివి. (శివుని సహజమైన మౌనిత్వ భిక్షుకత్వములను చమత్కారముగా కవి సమర్థించినాడు. బ్రహ్మ విష్ణ్వాదులకు శివుడే ప్రభువనియు తెల్పినాడు.)

భిక్షాం దేహి గృహాణ కీదృశమభిప్రేతం ప్రతిజ్ఞా దృఢా
బాఢం పృచ్ఛ హిమాచలం న గృహిణీ భిక్షాం ప్రతీపృచ్ఛతి
తద్భిక్షే తనయామియం త్రిసయనాయత్తా ప్రతిజ్ఞా మృషే-
త్యంతశ్ఛద్మపరీక్షితాచలవధూభావాయ తుభ్యం నమః ॥ ౨౦॥

తా. "అమ్మా! భిక్షము" "ఇదిగో వడ్డించుచున్నాను?" "ఆం మా ప్రతిన నిక్కమా? హిమవంతు నడుగుడు" "భిక్షనుగూర్చి భార్య భర్త నడుగ నక్కర లేదు" "అట్లగుచో మా పుత్రికను యాచించుచున్నాను" "ఈమె ముక్కంటి స్వాధీనరాలై యున్నది" "మరి మీ రన్న మాట దబ్బరయయ్యెకదా!" ఇట్లు మారు

వేసముతో బోయి హిమవంతుని భార్యయొక్క చిత్తమును పరీక్షించినట్టి ఓ కామారీ! నీకు నమోనమః.

సః స్వామీ జగతాం సఖా ధనపతేః సేవ్య స్సురాణామితి
శ్రుత్వా తుభ్య ముమాం ప్రతిశ్రుతవతీ మేనా మునీనాం పురః
త్వా మాశావసనం పిశాచసుహృదం ప్రేతావృతం ప్రాంగణే
దృష్ట్వా చిత్రశిఖండిభిః ప్రహసితం మేనే నమైర్నాటకం॥ ౨౧॥

తా. "మా ప్రభువు జగదీశ్వరుడు, కుబేరునకు ప్రియమిత్రుడు. దేవతలకును పూజ్యుడు" ఇట్లు మునులు పల్కుటవలన పాఱియేనుట పార్వతి నిచ్చెదనని మేనక యొప్పుకొనెను. కాని వరపూజకై నీవు ముంగిట నిలువగా నీ దిగంబరత్వమును, నీ మిత్రులగు పిశాచములను, ప్రేతములను, నవ్వుచున్న సప్తర్షులను చూడగా ఇదియొక పాత్రధారుల నాటకమని యామె యూహించియుండునని తలంచుచున్నాను మహేశా!

శూలాని క్షురహి లోహకార డమరూన్మాతంగ సంహృత్య చ
వ్యాలాన్ జాంగలిక ప్రయచ్ఛ శబర వ్యాఘ్రాజినాన్యానయ
ఖట్వాంగాన్యపి సూత్రధార ఘటయేత్యుద్వాహకోలాహలే
దండ్యంతే హిమవత్పురే భవదనుజ్ఞాతై ర్గణైః కావసః ॥ ౨౨॥

తా. స్వామీ! నీ వివాహమునకై హిమవంతునింటికి విచ్చేసిన నీ సహచరులగు ప్రమథగణములు "ఓ కమ్మరీ! శూలము చఱచుము, మాతంగా! డమరును ముడువుము, గారడీ! పాములనిమ్ము, నిషాదా! మృగచర్మముల దెమ్ము, శార్యదక్ష! మంచపుకోళ్ళను సమకూర్చుము" అని యచ్చోటి శిల్పులను, వ్యవస్థాపకులను బాధించుచున్నారు. (శివునికిని వానిగణములకును గావలసిన యలంకారము లివి యని భావము.)

శ్వశ్రూ స్సవ్రీడమేషా మిమతి న విహితః కంకణస్యాపి మోక్షః
కోఽసా వుద్ధూలకస్యావసర ఇతి భవాన్ మాతృభి ర్వారితోఽపి
నిర్వృత్తో మాధుపర్కో విధిరితి గిరిజాసిద్ధిసిద్ధాంతవాదీ
నిర్వాణస్య స్వపాణిగ్రహణజహుతభుగ్భస్మలిప్తో ననర్త ॥ ౨౩॥

తా. "ఇదుగో అత్తగారు సిగ్గుపడుచు తొలగుచున్నది. ఇంకను కంకణమైనను విప్పలేదుకదా! అప్పుడే భస్మమేల బూసికొనెదవు" అని బ్రాహ్మీముఖ్యగు సప్తమాతృకలు వలదనుచున్నను "మధుపర్క విధి ముగిసినది. పార్వతి పట్టుపడినదికదా!" యని భావించుచు తనపెండ్లి హోమగుండమునందలి భస్మమునే పూసికొనుచు రుద్రుడు నర్తన మొనర్చెను.

హారం త్యక్త్వాత్తసూత్రే శ్రివసి మణిసరం ఛిన్నమౌంజీగుణాయాం
కట్యాం శ్రీఖండపంకం విగలితభసితే కక్షతుంబీకరండే
మాలా వృత్తారితాస్థిస్రజమపి మకుటం ముక్తభిక్షాకపాలే
పాణౌ శైలేంద్రదత్తం శివ తవ దధతో ముగ్ధతా ధూర్తతా వా॥

తా. హిమవంతుడు పెండిలి వేళలో రత్నహారము నీయగా వదలివేసి, చెవికి రుద్రాక్షల జుట్టికొంటివి. మణిదండనీయగా మొలత్రాడు చెరించుకొని నడుమున గట్టితివి. శ్రీగంధలేపము నొసంగ బూదె బారబోసి, బుర్రకాయలో నింపికొంటివి. కిరీట మర్పింపగా బిచ్చపు పుర్రెను, ఎముకల దండను, క్రిందబడవైచి చేతబట్టి కొంటివి. ఇట్టి వైపరీత్యముల నొనర్చెదు నీవు పిచ్చివాడవో, కొంటెవాడవో శివా!

కిం స్థానం త్రిజగత్సు సత్తను వరం హే పద్మవాసే కుతో
హే పద్మాసన పద్మ విశ్వగశిరోలంకార మారోహణే
ఇత్థం తన్నియమార్చన ప్రణయిభిర్మాహేశ్వరై ర్భర్త్సితౌ
మన్యే వారిశయస్య తావభనతాం వ్రాప్నాభిపద్మాసనా ॥౨౫॥

తా. "ఓలక్ష్మీ! ఓబ్రహ్మా! ఈ ముల్లోకములలో అన్నిటికంటె నుత్తమస్థాన మెద్ది"యని యడుగగా వారు "శివుని శిరస్సే" యని యటనుండదిచ్చించిరట. అంత నిత్య శివపూజాధురంధరులగు మాహేశ్వరులు చీవాట్లువైచిరి కాబోలు. ఆ లక్ష్మీ బ్రహ్మలు విష్ణువుయొక్క వక్షస్థ్సలమును; నాభికమలమును ఆశ్రయించినారు.

త్వత్పాదయో రబ్జసహస్రపూజాం
నేత్రాబ్జపూర్ణాం కృతవ త్యుపేంద్రే
త్రినేత్ర నేత్రాబ్జసహస్రపూజాం
కుర్వన్నిపేంద్రః ప్రణతో విభాతి. ॥౨౬॥

తా. త్ర్యంబకా! నీపాదములకు సహస్రకమలపూజ జేయనెంచిన విష్ణువు తన నేత్రకమలముతో బూర్ణముగావించినపుడు; తన వేయి కనులనెడు కమలములతో ఇంద్రుడు పూజించి నమస్కరించుచున్నాడా యన్నట్లుండెను.

నేత్రానలే కామకరీషదీప్తే
కృతాంతకాష్ఠజ్వలితే పినాకిన్
మూలాహుతీః త్రీణి పురాణి హుత్వా
పూర్ణాహుతిం విశ్వమిదం జుహోషి. ॥౨౭॥

తా. మహారుద్రా! మన్మథుడను పిడక(కచ్చిక)చే రగులుచున్నట్టియు, యముడను కట్టెచే మండుచున్నట్టియు నీ నేత్రమనెడు నగ్నిలో మొదలు ముప్పు

రము లనెడు మూడాహుతుల నిచ్చి పూర్ణాహుతికై చివర ఈ విశ్వమునే హవన మొనర్చుచున్నావు. (శివుడు మన్మథుని, యముని, త్రిపురములను దగ్ధమొనర్చుటయే కాదు, కాలస్వరూపుడై విశ్వమునే కబళించునని భావము.)

ఆరోప్య వాయుమపి ఖేచరతాం లభంతే
హుత్వా హుతాశమపి వానవతాం భజంతే
శంభో భవచ్చరణపద్మ మనర్చయంతో
మర్త్యాః కథంచిదపి నాశ్నువతే భవంతం. ॥౨౮॥

తా. ప్రాణాయామాది సాధనములతో మింట దిరుగగలరు. యజ్ఞయాగాదుల నొనర్చి ఇంద్రపదవినిగూడ కొందరు సంపాదింపగలరు. కాని మహేశా! నీ పాదపద్మపూజ నొనర్పనివారు ఎట్టి ప్రయత్నము లొనర్చినను నిను బొందజాలరు కదా!

ఛిత్త్వా బ్రహ్మశిరో యది ప్రథయతి ప్రేతేషు సఖ్యం యది
క్షీబః క్రీడతి మాతృభిర్యది రతిం ధత్తే శ్మశానే యది
సృష్ట్వా సంహరతి ప్రజా యది తదాస్వాదాయ భక్త్యా మన-
స్తం సేవే కరవాణి కిం త్రిజగతీ శూన్యా న ఏవేశ్వరః॥ ౨౯॥

తా. బ్రహ్మశిరము బెరికినను, ప్రేతములతో నేస్తము బెంచినను, పురుషత్వము లేక సప్తమాతృకలతో నాడుకొనుచున్నను, కాటిలో ప్రేమ ముంచికొన్నను ఓ చిత్తమా! వానినే కొలుచుచున్నాను. ఏమి సేయుదము? ఈ ముల్లోకములు శూన్యమే! వాడొక్కడే ప్రభువు.

వ్యాలేభ్యోఽస్తు నమః పిశాచసదసే న్యస్తః ప్రణామాంజలి-
ర్నమ్రాః స్మో నృకపాలదామని చితాభస్మాభివందామహే
జానుభ్యాం ప్రణిపత్య చాటువచనై స్సంతోషయామో వృషం
కిం కుర్మః పరమేశ్వరస్య చరితం విజ్ఞాయ వర్తామహే॥ ౩౦॥

తా. పాముల కొక ప్రణామము, పిశాచసభకంజలి యిదుగో ఘటించుచున్నాను. దయ్యపు పుర్రెలయెదుట ఇదే దండమిడుదుము. కాటి బూది కనేక వందనములు. ఆ వృషభేశ్వరు సన్నిధిని మోకాళ్లూని యిదే ప్రీతి మాటలతో నుతించుచున్నాము. ఏమి చేయగలము? మహేశ్వరుని చర్యల దెలిసి నడచుకొనుచున్నాము.

ధత్తాం భాస్మన మంగరాగమజినం వస్త్రం చ తారక్షవం
కాపాలీం స్రజ మాబిభర్తు కటకం చాహేయ మాముంచతు
భూయశ్చాపి శివేతరాణి భజతాం దైవస్తథాపి స్వయం
సత్స్వన్యేష్వపి దైవతేషు శివ ఇత్యేక స్సమామ్నాయతే ॥౩౧॥

తా. బూది బూసుకొనుగాక! గజచర్మమును, పులితోలును ధరించుగాక! కపాలమాల వేసికొనుగాక! సర్పకంకణములు దాల్చుగాక! ఇంకను ఎన్నియో యమంగళముల నొనర్చుగాక! ఐనను తానే ప్రభువుకదా! ఇందరుదేవతలుండగా ఈయనకే శివుడని (పవిత్రుడని, కల్యాణకరుడని) ప్రఖ్యాతి కలిగియున్నది.

అపి కుశలినః ప్రేతావాసస్థలీసహవాసినః
ప్రమథపతయః కచ్చిజ్జీర్ణస్సుఖీ తవ శాకటః
అపిచ సులభా భిక్షావృత్తిర్జగత్త్రియనాథ తే
నఖలు శిథిలప్రాంతః కంఠే గజాజినకంబలః ॥౩౨॥

తా. అయ్యా! త్రిలోకేశ్వరా! ప్రేతములును, మీ శ్మశాన సహవాసులైన ప్రమథపతులును కుశలముగా నున్నారా? మీ ముదుసలి బండెద్దు సుఖముగా నున్నదా? మరి భిక్షము సులభముగా దొరకుచున్నదా? మీ గజచర్మము సెడు గొంగడియొక్క మూంగొంగు చినిగిపోలేదు కదా?

భో భో కైతకపుష్ప! సౌరభనిధే ఖేదం వృథా మాకృథాః
దృష్ట్వా మూర్ధ్ని మహేశ్వరస్య రచితా మర్కపసూనావలీం
అస్థిష్వాభరణస్పృహాం విదధతః క్షారానులిప్తాకృతే-
ర్నగ్నీభూయ చ నృత్యతోఽస్య చరితం సర్వం సఖే తాదృశం ॥౩౩॥

తా. ఓ సువాసనానిధియైన మొగిలి చెట్టయా! మహేశ్వరుని తలమీద ధరింపబడిన జిల్లేడుపూల జూచి వ్యర్థముగా ఖేద మొందకుము. ఎముకలతో సింగారించుకొని, బూది బులుముకొని, బరిబత్తల (దిస్సమొలతో) నెగురులాడు నట్టి యీయనసంగతి యంతయు నిట్టిదే మిత్రమా!

భజేమ భవదంతికం ప్రకృతిమేత్య పైశాచికం
కిమిత్యమరసంపదః ప్రమథనాథ నాథామహే
భవద్భవనదేహళీనికటతండు దండాహతి -
త్రుటన్మకుటకోటిభిర్మఘవదాదిభిర్భూయసే ॥౩౪॥

తా. శంభో! పిశాచత్వము నొంది నీ సన్నిధికి జేరదలచినారము. దేవభోగముల నేమని యాచింతుము? ఇంద్రోపేంద్రాది దేవతలెల్లరును నీ కడప కడనున్న నందీశ్వరుని చేకర్రకు తమ కిరీటములు విరుగునట్లు గొట్టి మొత్తుకుచున్నారు గదా!

అర్థానర్థనిరూపణవ్యసనితా మాధ్యస్థ్యవ్యగ్రితా-
మేణాక్షీకుచలాలనప్రణయితా మద్యాపి వర్తామహే
త్వద్ధ్యానవ్యవధానహేతుషు మనస్త్వచ్చాటుకావ్యేషు వాక్
త్వత్పూజావిధురేషు కర్మసు కరః శ్రీకంఠ నోత్కంఠతే ॥౩౫॥

తా. పరమేశ్వరా! ఇంకను నా మనసు అనర్థమును శేషు. అర్థమునందును, శ్రీమంతుల స్తుతించుటయందును, రమణీకుచలాలసలోను వర్తించుచున్నదే! నిను దలంచి ధన్యమగుటకు మనసుగాని, నీ స్తోత్రముల రచనకు శాత మగుటకు వాక్కుగాని, నినుబూజించి పుణ్యమార్జించుటకు కరముగాని ఇంకను సహాయపడకున్నయది స్వామీ!

యే బిల్హాణాహ్వాయుకవీశ్వరసంప్రణీతా-
మేతాం స్తుతిం శివముదేఽన్వహ మాపఠంతి
తే ప్రాప్నువంతి పురుషాయుషమాత్మ విద్యా-
మారోగ్య మష్టతనయా నఖిలేష్టసిద్ధిం ॥౩౬॥

తా. బిల్హాణకవీశ్వరునిచే విరచితమగు నీ స్తవము నెవ్వారు శివుని ప్రీతికొరకు ప్రతిదినము పారాయణ మొనర్తురో వారు దీర్ఘాయువును, విద్యను, ఆరోగ్యమును, అష్టపుత్రులను, సర్వకామసఫలతను పొందగలరు.

---

ఇది చిదిరెమఠము వీరభద్రశర్మచే వ్రాయబడిన
మల్హాణస్తవాంధ్రతాత్పర్యము.

---

# ఆంధ్రబిల్హణస్తవము

## శ్రీ వింజమూరి లచ్చారాయ కవిగారు

క. శ్రీమన్మహీ సుతాకా, మా మిహిరకులాభిరామ మహీపలలామా
సీమాతిలంఘి నిఖిల, క్షేమంకరభవ్యనామ శ్రీరఘురామా.

సీ. అవధరింపుము గౌతమాఖ్యగోత్రజుఁడ శ్రీ, వింజమూర్యన్వయుఁ విశ్రుతుండ
శ్రీసతీమణికి లక్ష్మీదేవి కాతిథే,యునకుఁ ద్వత్పాదభక్తునకుఁ బుణ్య
మతికి వేంకటరామకృతిమాలికి సుతుండ, లత్సరాయాఖ్యుఁ జెలంగువాఁడ
ధరణిజాపరిణయ ద్వాదశవివ్వచ్చ, రితత్రిముల్ మును నీకుఁ గృతియొసఁగితి,
గీ. సరవి నిప్పుడు బిల్హణస్తవముఁ జెన్గు, చేసి నీకంకితమొనర్తు శివుఁడు నీవు
నొక్క తేజంబ యని వినుచుంటిఁ గాన, హరిహరాద్వైతభక్తి నాకమరుటకును.

---

గీ. దైవతంబులు వేనవేల్ ధరణిలోన, గలరు వారల గుణదోష గణనచేయ
మాకు నేటికి; నింక ముమ్మాటికిని భ,జించెదము భూధరేట్సుతాధీశు శివుని. ౧

చ. సితకరఖండపూజ్య మగు శీర్షమునందునఁ బుక్కపేర్లు ప
ర్వతతనయాకుచాగురుపరాగరతం బగు రొమ్మువక్ష శ్మశా
నతల విభూతిఁ దాల్చుకతనం గను బాణముఖప్రబాధ్రువ
ర్ణితనుతి కావ్యవ్యాప్తమగు నీచెవి గౌరవ మస్మదుక్తులన్. ౨

శా. పంచబ్రహ్మషడంగబీజముఖర ప్రాసాద పంచాక్షర
ప్రాంచద్వ్యోమ విసర్గముఖ్యమసుదార్ధ్యం బెట్లు మాబోంట్లకా
నం చోంకార నమో ముఖాంతభవదాఖ్యాక్లృప్తి నెంతున్ మహో
దంచత్సర్వ జగంబు మంత్రముగ నంతర్బాహ్య యోగంబులన్. ౩

ఉ. ఉల్లమునందు నందఱకు నుండెద వేని తలంచ నేల? ని
న్నెల్ల జగత్తుపై నెసఁగదేని త్వదంఘ్రికి మ్రొక్క నా, జగం
బుల్లయ మొంద నీ యొడలఁ బొంద నుపాయము లేల? నిన్ను మే
నిల్లుగ నుల్లసిల్ల నిఁక నేటికి రోయఁగ నన్యదైవముల్?. ౪

గీ. మనస దెందేనియు నిలీయమానమగుచు, నెప్పుడేనియు నీయందు నెనయు ననుచు
బలుకుదురు దాని చంచలప్రకృతిగాఁగఁ, దప్పు లెంతురు విద్వాంసులొప్పుకొలుక.

గీ. త్రికరణంబుల నఘము నిర్మింతు మైనఁ, జరణమును జేయుమీ నీవు శరణముగను
రక్షకుఁడు వాఁడె యెవఁ డపరాధిఁ బ్రోచు, నెవఁ డనపరాధి రక్షింపఁ డింపుమాలి.

శా. ఏలా! మేడలు ప్రేతభూవసతికిన్ స్పృష్టాస్థికిన్ మజ్జనం
బేలా! వస్త్రము లేల! దిక్పటునకున్ ఘృష్టోల్లసద్గంధ మే
లా! లిప్తోరువిభూతి కేల! శవధూపామ్రాతకున్ ధూపకం
బేలా! నీకు గౌరీశ కన్నమని భక్త్యాప్తునిన్ గొల్చెదన్. ౫

గీ. ఆయు వధికమైన నాలస్యమగు మీదు, పాదపంకజముల ప్రాపుఁగనుట
కల్పమైన సేవ కవరోధమగు నింక, నిరుడెఱుంగులందు నేమి సేతు? ౮

చ. చెలుపఁగ నోపు వర్ణములచే లిఖియించిన యట్టి యాయువుల్
బురుషుల ఫాలసీమ తుదిముట్టఁగ నెంచి; విరించి నాకటుల్
నెలుపఁగ లేఁడు, త్వచ్చరణనీరజ పీఠసమీపభూ ముహు
ర్వ్యిరచితవందనోత్థకిణ మృష్టలలాటతటాక్షరాళికిన్. ౯

చ. జనముల మానసంబులు; శ్మశాననివాసివి భూతభర్త వీ
వనుచు నెఱింగియున్, భసిత మస్థులు తీర్థముఁ జేరఁగోరు; త్వ
త్తనుపరిరంభణస్థితియుఁ, దావక దేహవిభూషణత్వమున్,
బనుపడ గాంచియున్ సుకృతపాకము గల్గదు వారి కేలకో. ౧౦

గీ. భూతభావంబు నమరత్వమును వహించు, నీదు కింకరమార్గంబు నాదుకొనెద;
మటులగావున పాపపుణ్యద్వయంబు, తారతమ్యంబు రూపింప నేర మేము. ౧౧

చ. గురిగొని తమ్మిపట్టి తల గొట్టి కపాలముఁబట్టినట్టి యో
గరళశిరోధి! నీదుపదకంజము గొల్చెదు నట్టివారి కే
సరణిని మాకు హింసయు,నశౌచము నయ్యెడు గర్హణీయముల్
దొరవలె సేవకుండు నని లోకమునందుఁ బ్రసిద్ధమే కదా! ౧౨

చ. వరద! జటాకటాహమున స్వర్ధుని, ఫాలముచెంగటన్ సుధా
కరుని, శరీరమందు మిహికాగిరినందనిఁ దాల్తు గాన; నా
దర మెసఁగన్ ద్రిలోకపరితాపము వాపఁగ నోపు పూన్కిచే
నిరవుగ యత్న మీవు వహియించితి వంచును నేఁ దలంచెదన్. ౧౩

చ. విరతము గాదు యక్షపుకుబేరత, సక్షయు డిందుఁ, డగ్గణే
శ్వరుని మహోదరంబు పెడఁ బాయదు, శౌరి మహాగదుండు, భృం
గిరిటికిఁ బాండు వంగకము కేవల మక్కథ లుంచు, శూలి వీ
వరయఁగ; నీదు సేవకుఁ డనామయుఁడో యెటులయ్య యీశ్వరా! ౧౪

చ. కొనఁబడుఁ గాక చర్మమును గోకల, హారములందుఁ బాము, వా
హనముల నెద్దు, పుష్పములయందును ధూర్తము నందు కేము రో
దన మొనరింప; మిందులకె తండ్రి! తలంకెద మబ్ధి శ్రీసురా
వనిజ గవీ మణీ హయ సుధాదు లెసంగ, విసంబు గొంటకున్ ౧౫

గీ. మాళి నుల్లోలకల్లోలజాలగాంగ, వారి వారిజపరిమళోద్గారిఁ దాల్తు
వేల పుడిసెడు బిల్వాంబు లీశ! నీకు భిక్షు వింతైన లాభంబు విడువఁగలఁడె? ౧౬

మ. తిరిపెం బెత్తితి వీవు సస్య మిడి బోదిం జేయలే; కాళ లం
బరముం జేసితి కచ్చ దోపుకొని పాపన్ లేక; మైపూఁత భూ
తి రహిం దాల్చితి సానదెచ్చికొని మర్దింపంగలే; కీ జగ
త్కారణస్థాపనసంహృతిశ్రమము మాత్రిం బెంచ వైతేలకో! ౧౭

మ. తల నుమ్మెత్తలమాలికల్, వసతి రుద్రక్షోణి, కూడా హాలా
హాలమున్, భూష ... ... ... ... భృ

త్యులఁ జేరికంబులఁ జేసి తోఁచితివి నూ! దుర్బుద్ధియా బ్రహ్మ యం
దలి లోకానుపయోగవస్తురచనాదారిఘిష్ఠహా దోషముల్. ౧౮

చ. వనజజురాణి వాణి యని పల్కక హానముఁ బూని, శౌరి యం
గన సిరియంచు బిచ్చమును గైకొని, కేనికిఁ గాని భృత్యు మా
నిని గొనఁగా దలంకుటను నీవు గ్రహించితో కైవసంబుగా
మునుకొని క్షాంతి దాంతి ధృతి ముక్తిదయల్ జగదేకనాయకా! ౧౯

చ. హిమగిరిపత్ని! భిక్ష యిడు మెట్టి దభీప్సిత మిచ్చుదాన, ని
క్కమె నిజమే హిమాద్రి సదుగం దగు, భిక్షువు నాతిచేతి భై
క్షము గొనఁడో! యబైన సుత, యామె త్రిదృక్వర! బొంకితంచు గృ
త్రిమమున మేనకాళయపరీక్ష యొనర్చిన నీకు మ్రొక్కెదన్. ౨౦

శా. మానాథుండు జగత్ప్రభుండు ధనదామాత్యుండు దేవార్చితుం
డౌనంచున్ మునులాడ వారికడ నీకై గౌరి నీఁ బూనినన్
మేనాదేవి వివస్త్రి భూతసఖునిన్ జేరితావృతున్ జత్వరా
స్థానిన్ గాంచి తలంచె మానికృతహాస్యశ్రీప్రయోగంబుగన్, ౨౧

మ. భవదాజ్ఞన్ బ్రమథుల్ హిమాద్రిపురి నుద్వాహోత్సవం బందుఁ గా
రువులన్ మంచపుగోళ్ళు ఢక్కలును శార్దూలాజినంబుల్ ద్రిశూ
లవితానంబులుఁ బాము లిండనుచు హేలంబట్టి భర్జింతురి మా
ర్దవమున్ బాసి నిజోద్ధతిన్ దెలుపుచున్ దత్తత్క్రియాదక్షులన్. ౨౨

ఉ. అత్త యదే సలజ్జముగ నారసెఁ గంకణమైన విప్పలే
దిత్తటి బూదెఁ బూసికొనె దేలని మాతృక లెల్ల మాన్ప భూ
భృత్తనయాప్తి నిక్కమను నిమ్మథుపర్కము దరె నంచు భ
ద్రోత్తము వహ్నిభస్మ మెయి నొప్పుగఁ బూసుక యాడి త్రీవాగ్నిన్. ౨౩

సీ. హారంబొసంగిన నక్షసూత్రము వాపి, కర్ణశష్కులిక లగ్నముగఁ జేసి
మణిసరం బొసఁగిన మౌంజీగుణము దెంచి, కటితటంబునయందుఁ గట్టిపెట్టి
చందనం బిడిన భస్మము నెల్లదులిపి కక్షమునందుగల తుంబకాయ నునిచి
మౌళికై యొసఁగిన మకుటంబు భిక్షా కపాలంబుఁ బడవైచి పాణిదాల్చి

గీ. యల్లుఁడవటంచు హిమవంతుఁ డాదరముగ, నిడినబహుమానముల నెల్ల నిటులనటుల,
వ్యత్యయంబుగ ధరియించు నట్టిసీకు, గుసుమశరవైరి! చెబ్రియో కొంచెతనమొ?

మ. కమలా! యో కమలాసనా! భువనసంఘుంబందు మీకెందు స
ద్మము యుక్తంబు వసింపుఁ డందనినఁ బద్మంబో య దీశాన మ
స్తమహాలంకృతి తొక్కఁగూడ దనుచున్ శైవాళి భర్జింప వా
రు ముకుందాశయనాభికంజముల నారోహించి రంచెంచెదన్. ౨౫

గీ. హార! భవత్పాదములకు సహస్రకమల; పూజఁజేయుచు నయనాబ్జ పూర్ణముగ ను
పేంద్రుడొనరింప నతుఁడగు నింద్రుఁడక్షి, కమలములు వేయుపూజించుగతి, నెసంగు.

గీ. పంచబాణ కరీషదీప్తంబునంత, కేంధన ప్రజ్వలితము నా వీక్షణాగ్నిఁ
ద్రిపురమును దెచ్చి త్రైణ్ణపాతగ నశిష, లోకముల వెల్చెదివు పినాకపాణి! ౨౭

గీ. వాయుధారణ మెఱింగి నభశ్చరత్వ, మనలమును వేల్చి యింద్రత్వమును భజింతు
రభవ! భవదీయపాదపద్మార్చనంబు, సేయకుండిన జనులు నిన్ జేరలేరు. ౨౮

చ. తొలుతను బ్రహ్మమస్తకము ద్రుంచి పిశాచసఖత్వ మొందనీ
కులుకుచు మాతృకావితతిఁగూడి శ్మశానరతిన్ వహించనీ
యెలమిఁ బ్రజన్ సృజించి హరియించఁగనీ నిఖిలేశుఁడాటఁ గే
వలముగ నాతలం పతనిఁ బట్టి భజించెడి నేమి సేయుదున్. ౨౯

చ. వినతి సరీసృపంబులకుఁ, బ్రేతసదస్సుకుఁ గేలుమోడ్పు వం
దనము కపాలమాలకు, బ్రణామము కాటివిభూతికిన్ వృషేం
ద్రుని మృదులోక్తి జానువుల మ్రొగ్గి నుతించెద మేమి సేతు మీ
శుని చరితంబుకున్ దగిన చొప్పు నెఱింగి చరింతు మెంతయున్. ౩౦

చ. నెఱి భసితాంగరాగ మిడనీ, యహికంకణముల్ ధరింపనీ
యెఱిఁగి కపాలమాలలు వహింపఁగ నిమ్ము; మృగాదనాజినాం
బరము ధరింపనీ, మఱి యమంగళవస్తువు లెల్లఁబూననీ,
పరవిబుధాళి యుండగ శివప్రథ యాతఁ డొకండ తాల్పఁడే. ౩౧

చ. ప్రమథపతుల్ శ్మశానతలవాససఖుల్ సుఖులే గదయ్య, భ
ద్రము గలదయ్య, నీదగు పురాణమహోత్సము; నీవు భైక్ష కృ
త్యము సులభంబుగా నొదవునయ్య. జగత్త్రయ పాలనోచితో
ద్యమ! కరిచర్మకంబళము ప్రాంతదృఢంబయి యున్నదే గదా! ౩౨

చ. హరుని శిరంబునం దిడిన యర్కసుమావళిఁ జూచి సౌరభా
కరమగు నో దివాసుమ! యకారణ మిట్లు వృథావిచారముం
బొరయకు మస్థిభూష లిడి భూతి శరీరమునం దగం దగం
బరుఁడయి యాడు నాతని సమస్తచరిత్రము నట్టిదే సఖా! ౩౩

చ. శివ భవదంతికంబును భజింతుము ప్రేతతనొంది దివ్యవై
భవము లవేలటంచుఁ దలఁపంబడునో ప్రమథేశ్వరా! భవ
ద్భవన సుగేహళీనికటతండుకరోద్ధృతదండతాడన
చ్యవదురుమౌళికోటిమణులై సురనాథముఖుల్ వసింపఁగన్. ౩౪

చ. మనసు ధనాగమవ్యపగమవ్యసనంబులయందు; వాక్యముల్
ధనికజనస్తవక్రమములన్; గరముల్ దరుణీకుచాగ్ర్యమ
ర్దనవిధులందు; నేఁటికిని దార్కొనుచుండు, నినున్ దలంప, ని
న్వినుతి యొనర్ప, నిన్ గొలువ, వేడ్క యొనర్ప వవేమొ యీశ్వరా. ౩౫

క. ఎవ రెల్లప్పుడు బిల్హణ, కవిరచితస్తుతి శివాప్తికై నుడువుదురో
భువి వారికిఁ జేకుఱు నా,యువు నీరోగతయుఁ జెలిమియును సంతతియున్. ౩౬

క. కరసరసిజ భవనిధి సా,గర సంఖ్యాకలిత కలియుగ వికృతి సంవ
త్సర విజయదశమి గురువా,సరమున నాకల్పముగ నెసఁగ నొనరించితిన్.

ఆంధ్రబిల్హణస్తవము సమాప్తము.

అనామయ స్తవానుబంధము :

# ఆంధ్రానామయస్తవము

## శ్రీ శృంగారకవి సర్వారాయడుగారు

ఉ. మానసమందుఁ దృష్ణ యలమం బరమార్థ మెఱుంగనీని య
జ్ఞానము గ్రమ్ము మాదృశులు జంతువు లీశ్వర తేజమే గతి
న్గానఁగ నేర్త రట్టులయినం బరమేశ్వరు స్తోత్రరూపముం
బూని కడున్నడు ల్వెడలు మోమునసుండి యిఁకేమి సేయుదున్. ౧

గీ. బ్రహ్మవిష్ణువరుణ వాసవ యమసూర్య, చంద్రవసువులాది సకల సురలు
నీ స్వరూప మెఱుఁగ నేరరటన్నచో, నీశ మమ్ము బోటు లెఱుగ గలరె? ౨

చ. భరమగునయ్య నీదు స్తుతి భక్తి బలంబగు నేని; యాత్మ నా
పురుషుఁడు వన్యుఁ డేని మఱి పొల్పగు గ్రమ్యుఁడె యైనగాని యీ
శ్వరుపయి భక్తిలేనినికి బ్రహ్మవిదుం డయినంత నేని నీ
స్మరణకు రాఁడుగా! పశుసమానుఁ డతండు తలంప శంకరా! ౩

ఉ. శ్రీ మహిమావలంబనము చేకొనియే జగము ల్జనించు, ని
ట్లా మహనీయచేతనసమంచిత కర్త లభింపకున్న వి
శ్వామితసృష్టి లేదు, వసుధాదులు నీకళ లేక నిల్వ లే
వో మృడ! సర్వలోకవిభుతోన్నతిఁ జెందుదు వీవ దేవరా! ౪

ఉ. చేతనశక్తి శూన్యమగు చిత్ప్రకృతిం గడు భోగ్యమందురు, సం
భూతము దానిఁ ద్రిప్పగల బుద్ధిపదాఖ్యుఁడు భోక్తయందురు సం
ప్రీతిని రెంటిమేళనము చేకొనఁ గల్గును భోగ, మింతకున్
హేతువు నీవ కాదగుదు వీశ జగత్స్థితి సూత్రధారివై. ౫

చ. వరద రజఃప్రవృత్తియగు పట్టున సృష్టి యొనర్తు, సత్త్వవి
స్తరమగు వేళఁ బాలనము సల్పుచునుందు, తమోగుణంబెడన్
బొరసిన యప్డు సంహరణముం బొనరించెద, వా విరించి మా
శరణినె పొల్పడుం బ్రకృతికై యిది నీదు మనోవినోదమా. ౬

క. పులితోలు బట్ట పితృవన, మిలు; వాహమెద్దు నంచు నెంతురు నీ కో
యలికాక్ష! యీశబ్దమె, తెలుపుం గేవలముగం ద్వదీయ మహిమమున్. ౭

క. అశుభాస్థిమాల శేల ప, రశుఖండం బేల కేల రమణీయుత మ
ర్ధశరీరమేల యని నిన్నుఁ, బశుపతి! యజ్ఞులు హసింప బాటించితివో. ౮

గీ. ఘోరకాపాలికవ్రతమే రచించె, ముక్తిమార్గపవిత్రత పారయలేదొ
యుమ ప్రియస్థితి వర్తించు యోగమాయ, సృష్టికగు దాని మిథునచరిత్ర శర్వ. ౯

గీ. గరళగళ నిన్నుఁగూర్చినక్రతుకృశుండు, శక్రవిశ్రుతసంస్థాన మాక్రమించు
సురవధూవరణాంగసుందరుఁ డతండు, నీవు కోపింప నరకమందే వసించు. ౧౦

చ. వర భవదీయతేజమది ద్వాదశనేత్రము షణ్ముఖంబును
స్మరవణజంబు భర్మనలినవ్యవదాతము బాల్యమయ్యె ని
ర్జరతరుణీమణు ల్వరమశాత్రవమందిన దైత్యబంధ మం
దిరచిరవాసమున్మఱచు తీరు నొనర్చుచునుండె నద్దిరా! ౧౧

చ. త్వరితగతి న్నవగ్రహము లాత్తనిపాతము నొందుచుండ ని
ర్భర విలయాబ్ధి వీచికల శైఖరి దిక్కుల నాక్రమించి వి
స్ఫురణ దలిర్చు ముత్తెముల పోల్పునఁ బెంపెసలారుచున్న ని
ర్జరనది నీ శిరంబున హరా! సుమమంజరినా తనర్చెడున్. ౧౨

చ. మరకత కాంతికాంతము సమగ్రము నీ గళకల్మషం బదే
కరము జగత్త్రయాపవనవికస్వరమైన భవత్ప్రసాద మా
గరళము మందరోత్థ ముదగర్భము దుర్విషమాపలేని స్థా
వరమును జంగమంబు నిలువంగలవే నిముసంబు శంకరా! ౧౩

ఉ. పంచశరుండు కొంచకెదఁ బచ్చని వింట విమోహనాస్త్ర మ
త్తించి హూంకరించి వెనుదీయక యేయఁగఁ బంచవక్త్ర! రో
షించి కనన్ భవన్నయన చిహ్నితవహ్ని నిఁ జెంది రక్తిమా
భ్యంచదశోకమంజరి మహత్తమధూమమిళిందమై చనెన్. ౧౪

శా. ఆ లంకాపతి రావణాసురుఁడు క్షారాంభోధి వీచీ సమా
లోల స్వీయభుజాయుగ ప్రథిమపాల్పుం జెల్ప నీ స్థానమా
కైలాసంబుఁ గదల్ప లోఁ దెలిసి తొట్రిక్కం దావకాంగుష్ఠరే
ఖాలీలంబడి మోముల స్రుధిర ముల్కన్ మొఱ్ఱలం బెట్టఁడే. ౧౫

శా. దేవా! తావకపాదపద్మముల నెంతే కొల్వఁగా నెంచి భ
క్త్యావేశంబున శీర్షపద్మనవకం బర్పించి యర్చించి త
ద్భావైశ్వర్యము రావణుం డొడిసి కాదా లోకపాలావళే
పావిర్భావనిరాసము న్నెరపువాఁడయ్యెన్ జయశ్రీలతోన్. ౧౬

క. బాణుఁడు త్వత్పదభక్తిం, బూని మహాదేవ! లోకములలో నుచ్చ
స్థానముఁగనెఁ దద్దృష్టిప,థాన నిలువఁజాలినారె దైత్యాదిత్యుల్ ౧౭

ఉ. పన్నగమస్తలగ్నధర పాదవతిన్ నతమయ్యె నీశ యు
త్సన్నములయ్యె నద్దిశలు తత్క్షణమాత్రన హుంకృతిక్రియ
న్నన్నము లయ్యె బాహుచలనంబున మేఘములున్ గ్రహంబులు
న్భిన్నగతిం గనెం జగము నీ వదె నృత్తముపక్రమింపఁగన్. ౧౮

చ. నిలువున స్తంభమూర్తివయి నిల్చిన నీమహారూపముం గనన్
నలినభవుండు మీఁదు నలనాభుడు క్రిందును బోయి సుంతయుం
దెలియక రేయి తుదన్మొదలు నిన్ను నుతింపఁగఁ గంతకాళిమం
గల కపిలాక్షరూపమును గన్పడ జేయవె దేవ! వింతగన్. ౧౯

చ. త్రిపురజయంబుఁ గాంచి యరుదెంచి యుమాసతి మోమువీఁద దృ
ష్టి పరపి చాపకోటిపయిఁ జేయిడి నిల్చిన నీపయిం గణా
ధిప సురకామినీకర వితీర్ణ మరంద మనోజ్ఞ వాసనా
నిపుణ ప్రసూనవృష్టి కడునిండుగ నించుట గాంచఁ జోద్యమా. ౨౦

మ. కమలాక్షుండు సహస్రపద్మములు గల్గన్మాని తారాపరా
గము నేత్రారుణపద్మమొక్కటను జక్కంగా సమర్పించి యు
గ్రము బాలారుణమండలోపమము జ్వాలాజాలదీప్తంబు చ
క్రము నీచే గ్రహియించి చేయఁగద రక్షశ్శిక్ష మృత్యుంజయా! ౨౧

క. నలినాక్షుఁడు చక్రముఁ గొని, త్రిలోకముల నేలు దునిమి దితిజుల మఱియున్
బలియిడిన కన్నుఁ గనెనే, ఫలమీయదు నీదుపాదభక్తి గిరీశా! ౨౨

మ. అమరన్ ముమ్మొనవాలు సవ్యకరమం దంకించి భిక్షాకపా
లమొగిన్ వామకరంబునందు నిడి లీలన్బాలచంద్రున్ స్వశీ
ర్షమునందున్ ధరియించి మేనఁబూదివెన్ సర్పోత్తరీయంబు వే
షమిదేమంచు హసించి గౌరి పెరిమెచ్చం బాత్రమై ఈశ్వరా! ౨౩

చ. భుజమున హస్తిచర్మమును బూని నిరంతరధారమైన యా
సజలపయోదనీలమయి సంభ్రమకారణమైన వేషముం
గజిబిజిఁ జూపఁజూచి యెద గౌరి భయంపడి కౌఁగిలింప నో
యజ! నిజవజ్రదేహమిడి హర్షముఁ జెందితివంచు నెంచెదన్. ౨౪

ఉ. కానల బీజవృత్తియును గ్రామములందున భిక్షకేఁగుటల్
పూనికఁ దీర్ఘయాత్రలకుఁ బోవుట మంత్రము లభ్యసించుటల్
శ్రీ నియమంబులున్ శ్రమము సేయు, నవేమి ఫలంబులిచ్చు నిన్
ధ్యానమొనర్చి తత్ఫలము లంది మనఃప్రమదంబు నొందెదన్. ౨౫

గీ. గంధధూపార్పణము గృహాకరణ ముపరి, క్షీరధారాభిషేకంబు సేయనేల
పూల నీపాదపద్మము ల్పూజసల్పి, మాతృగర్భనిబంధముం బడడు జనుడు. ౨౬

చ. మునులు మనంబునందుఁ దలపోయఁగఁ జాలినవాని ముక్తరూ
పుని నృకపాలమాలికలఁ బూనినవాని సతీమణీసమే
తుని శిరమందు దేవనది తోఁగెడు వానిని శుక్తిహాక్తి కా
భుని విధుమాళినిన్ భుజగభూషణు నిన్నుద సన్నుతించెదన్. ౨౭

క. నరయక్షదివిజ విద్యా, ధరరాక్షస నాగలోకతతులం దిర్య
గ్వరయోనుల నెటఁబుట్టిన, హర! తావకభక్తి మిగుల నగుగాక మదిన్. ౨౮

మ. వరదున్ రుద్రుని శంకరున్ విమలు దివ్యజ్ఞాను దండిం జగ
ద్గురునిన్ ముండధరుం బురారిని త్రినేత్రున్ శూలపాణిన్ శుభం
కరుఁ దేజోమయునిం గుబేరసఖునిం గైలాసవాసున్ హరున్
గిరిజానాథుని దీర్ఘమాళిని మదిం గీర్తింతు నిన్నో యజా! ౨౯

సీ. యోగివయ్యును బహుభోగివైతివి శస్త్ర, పాణివయ్యును బల్తపస్వివైతి
వమృతుండవయ్యు విషముడ వీవైతి వు, గ్రుండవీవయ్యు శాంతుండవైతి
వింద్రియమ్ముల జయించినవాడవ, య్యును గిరికన్యాప్రియుండవైతి
వతులితాష్టైశ్వర్యపతివయ్యు భిక్షావి,హారవృత్తుండ వీవైతి వెపుడు

గీ. పరమపావనమూర్తివై పరగుచు నశు,భాస్థిమాలలు దాల్చి యలరుచుంటి
కడు విరుద్ధస్వభావంబు గలుగునిన్ను, నెట్లు తెలియంగ నేర్తుమో యీశ చెపుమి. ౩౦

గీ. ఆదిమధ్యాంతశూన్యము నపరము పర, మమితదూర మదూరమునై వెలింగి
యోగమజ్ఞాన మొదవించునట్టి జ్యోతి, యందు నాభక్తి యెల్లపు డొందుఁగాక. ౩౧

గీ. దండియనుపండితుఁడు చంద్రఖండమౌళి, స్తవమనామయాఖ్యమున్ మృదుతరపదములు
బొదల విరచించె దీనిని జదివినట్టి, నరు లనామయ లవుదురు హరునికరుణ. ౩౨

చ. జగతి నవస్థ భిన్నమయి సాగుచునుండును దేశకాలభే
దగతిని తత్క్రమంబుఁగని తత్స్థితి యే యనవద్యుఁ డాత్మశ
క్తిఁగొని హరించు దన్నియతి దెల్పి విరించి రచించుగాని స
ర్వగత నిజస్వతంత్రత చిరంతన యాతని కేది చెప్పుమా! ౩౩

ఉ. బాలశశాంకమౌళులు ప్రవాళలతాజటిలల్ సతీయుతుల్
వ్యాళవిభూషితాంగు లలికాక్షులు కల్మషకంఠు లాత్మమో
దాలలితుల్ సదాపరశుహస్తులు రుద్రులు భద్రమూర్తులై
శ్రీలఁ జెలంగుచుం గడు జరింతురు తావకభక్తు లీశ్వరా! ౩౪

---

గీ. నాకభాషను దండి యొనర్చినట్టి యయ్యనామయసంస్తవ మంధ్రభాష
వ్రాసె శృంగారకవి సర్వరాయసుకవి, కరశిఖినవైకహాయనవత్సరము మొదట.

---

ఆంధ్ర అనామయస్తవము సమాప్తము.

# సాధు పత్త్రము

| పుట | బంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| ౪౦ | ౨౦ | రాధాత్ | రాధాద్ |
| ,, | ౨౧ | ౭౨ | ౩౨ |
| ౬౨ | ౯ | ఆంధ్రమహిమ | ఆంధ్ర మహిమ్నము |
| ౬౭ | ౨౯ | త్వా | త్వాం |
| ౬౮ | ౭ | పూజితంత్వా | పూజితంత్వాం |
| ౭౦ | ౨ | సవిశతి | సవిశంతి |
| ౭౯ | ౧౯ | భరించుట | ధరించుట |
| ౮౭ | ౨౮ | ఛింది | ఛింధి |
| ౮౮ | ౪ | ,, | ,, |
| ౧౦౦ | ౧౩ | కుజ | కుచ |
| ౧౧౫ | ౨౫ | సిభో | విభో |
| ౧౧౭ | ౧౪ | ప్రశసంతి | ప్రశంసంతి |
| ౧౩౧ | ౨ | మాదృశా | మాదృశా |
| ౧౩౩ | ౧౫ | సహీ | సహి |
| ,, | ,, | జగత్ | జగతీ |
| ౧౩౬ | ౧౬ | యుత్తు | యత్తు |
| ౧౬౬ | ౯ | స్వ - ౩౪ | సృ - ౩౪ |
| ౧౭౦ | ౧౩ | (భా. | (బా. |
| ౧౭౭ | ౧౪ | ప్రత్యాసన్నం | ప్రత్యాసన్నం |
| ౧౮౭ | ౧౪ | పౌఢము | ప్రౌఢము |
| ౧౮౮ | ౧౮ | పాదేన | పాఠేన |
| ౧౯౧ | ౭ | స్తంభాది | స్తంబాది |
| ,, | ౨౨ | సురవనితా | సురవనితా |
| ,, | ౨౮ | సురవనతా | సురవనితా |
| ౧౯౩ | ౧౪ | శీర్షముల | శీర్షమ్ముల |
| ౧౯౪ | ౧౯ | రాట్పతియాచకు | రాట్పతి యాచకు |
| ౨౫౮ | ౧౫ | తాపకో | తావకో |
| ౨౬౪ | ౨౨ | [illegible] | [illegible] |
| ౨౬౭ | ౨౪ | పుద్ధూలకస్యా | పుద్ధూలనస్యా |

# మా గ్రంథములు

| | | |
|---|---|---|
| గోత్రసూత్రపటము | ప్రమాణములతో | ౦- ౨-౦ |
| వీరశైవవివాహవిధిః | ఆంధ్ర తాత్పర్యముతో | ౧- ౦-౦ |
| లింగధారణవిధిః | ఆంధ్ర తాత్పర్యముతో | ౦- ౬-౦ |
| లింగధారణసిద్ధాంతము | వచనము | ౦- ౨-౦ |
| సిద్ధాంతశిఖామణిః | మూలం | ౦- ౪-౦ |
| శ్రీకరభాష్యం (చతుస్సూత్రీ) | మూలం | ౦-౧౨-౦ |
| మఠములు, మందిరములు | వచనము | ౦- ౨-౦ |
| శ్రీ రేణుకాచార్య చరిత్ర | వచనము | ౦- ౧-౦ |
| సంక్షిప్త శివపూజావిధిః | ఆంధ్ర వివరణముతో | ౧- ౨-౦ |
| काशीपीठाचें प्राचीनत्व | మరాఠి | ౦- ౨-౦ |
| వీరశైవరత్నము | వచనము | ౦- ౭-౦ |
| ఉమామహేశ్వరవ్రతకల్పం | తాత్పర్యముతో | ౦- ౮-౦ |
| పుష్పసేన విజయము | నవల | ౦- ౪-౦ |
| వీరశైవమహాత్ములు | వచనము | ౦- ౪-౦ |
| రేణుకవిజయము | పద్యపురాణము | ౧- ౦-౦ |
| శివపంచస్తవి | పద్యతాత్పర్య విశేషములతో | ౧- ౪-౦ |
| Mutts & Mandirs | ఇంగ్లీషు | ౦- ౨-౦ |
| 'Lingayat' for Veerashaiva | ,, | ౦- ౧-౦ |
| 'విభూతి' పత్రిక సంచికలు (ఇందు చక్కని వ్యాసములు కలవు) | ౧వ సం ౬-౧౨ | ౧-౧౨-౦ |
| ,, ౨వ సంపుటము ౧ నుండి ౧౨ సంచికలు | | ౨-౧౨-౦ |
| ,, 3వ ,, ౪ నుండి ౧౨ సంచికలు | | ౧- ౭-౦ |
| ,, ౪వ ,, ౧ నుండి ౯ సంచికలు | | ౨- ౭-౦ |

ధరలన్నియు కల్దారు. కొనువారే ప్రత్యేకము పోస్టు ఖర్చుల భరించుకొనవలెను, ఒకరూపాయికి తక్కువ వెలగల పుస్తకములు వి. పి. గా పంపబడవు. పది రూపాయిల కంటె యెక్కువ వెలగల పుస్తకముల గొనువారు వెలను ముందరే మనియార్డరు చేయుచో ఒకరూపాయ పుస్తకము ఉచితముగా నియ్యబడును. ప్రస్తుతము పోస్టు కర్చులు పెరిగియున్నవి.

మేనేజరు :—శివధర్మగ్రంథమాల.

౪౨౬౭ సుబాన్‌లాల్ వీథి, సికిందరాబాద్ (దక్కన్).

పాల్కురికి సోమనాథచరిత్ర, వైదికశివపూజావిధి, శివదీక్షావిధి, శ్రీకరభాష్యం - (నాగరిలిపి,) ద్విపదసిద్ధాంతశిఖామణి, శివరహస్యం (నాగరిలిపి,) ఆంధ్ర శ్రీకరభాష్యము, సిద్ధాంతశిఖామణి (తెలుగుటీక,) అను గ్రంథములు అచ్చులోనున్నవి. త్వరగా వెలువడగలవు.

# సాధు పత్రము

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| ౪౦ | ౨౦ | రాధాత్ | రాఘాద్ |
| ,, | ౨౧ | ౭౨ | ౩౨ |
| ౬౨ | ౯ | ఆంధ్రమహిమ | ఆంధ్ర మహిమ్నము |
| ౬౭ | ౨౯ | త్వా | త్వాం |
| ౬౮ | ౭ | పూజితంత్వా | పూజితంత్వాం |
| ౭౦ | ౨ | నవిశతి | నవిశంతి |
| ౭౯ | ౧౯ | భరించుట | ధరించుట |
| ౮౭ | ౨౮ | ఛింది | ఛింధి |
| ౮౮ | ౪ | ,, | ,, |
| ౧౦౦ | ౧౩ | కుజ | కుచ |
| ౧౧౫ | ౨౫ | సిభో | విభో |
| ౧౧౭ | ౧౪ | ప్రశసంతి | ప్రశంసంతి |
| ౧౩౧ | ౨ | మాదృశా | మాదృశా |
| ౧౩౩ | ౧౫ | సహీ | సహి |
| ,, | ,, | జగత్ | జగతీ |
| ౧౩౬ | ౧౬ | యుత్తు | యత్తు |
| ౧౬౬ | ౯ | స్వ - ౩౪ | సృ - ౩౪ |
| ౧౭౦ | ౧౩ | (భా. | (బా. |
| ౧౭౭ | ౧౪ | ప్రత్యాసన్నం | ప్రత్యాసన్నం |
| ౧౮౪ | ౧౪ | ప్రౌథము | ప్రౌఢము |
| ౧౮౮ | ౧౮ | పాదేన | పాఠేన |
| ౧౯౧ | ౭ | స్తంభాది | స్తంబాది |
| ,, | ౨౨ | నురవనితా | సురవనితా |
| ,, | ౨౮ | సురవనతా | సురవనితా |
| ౧౯౩ | ౧౪ | శీర్షముల | శీర్షమ్ముల |
| ౧౯౪ | ౧౯ | రాట్పతియాచకు | రాట్పతి యాచకు |
| ౨౫౮ | ౧౫ | తాపణో | తావణో |
| ౨౬౪ | ౨౨ | గంగా, | గంగాం, |
| ౨౬౭ | ౨౪ | వుద్ధాలకస్యా | వుద్ధాలనస్యా |

# మా గ్రంథములు

| | | |
|---|---|---|
| గోత్రసూత్రపటము | ప్రమాణములతో | ౦- ౨-౦ |
| వీరశైవవివాహవిధిః | ఆంధ్ర తాత్పర్యముతో | ౧- ౦-౦ |
| లింగధారణవిధిః | ఆంధ్ర తాత్పర్యముతో | ౦- ౬-౦ |
| లింగధారణసిద్ధాంతము | వచనము | ౦- ౩-౦ |
| సిద్ధాంతశిఖామణిః | మూలం | ౦- ౪-౦ |
| శ్రీకరభాష్యం (చతుస్సూత్రీ) | మూలం | ౦-౧౨-౦ |
| మఠములు, మందిరములు | వచనము | ౦- ౩-౦ |
| శ్రీ రేణుకాచార్య చరిత్ర | వచనము | ౦- ౧-౦ |
| సంక్షిప్త శివపూజావిధిః | ఆంధ్ర వివరణముతో | ౧- ౩-౦ |
| काशीपीठाचें प्राचीनत्व | మరాఠి | ౦- ౨-౦ |
| వీరశైవరత్నము | వచనము | ౦- ౮-౦ |
| ఉమామహేశ్వరవ్రతకల్పం | తాత్పర్యముతో | ౦- ౪-౦ |
| పుష్పసేన విజయము | నవల | ౦- ౪-౦ |
| వీరశైవమహాత్ములు | వచనము | ౦- ౪-౦ |
| రేణుకవిజయము | పద్యపురాణము | ౧- ౦-౦ |
| శివపంచస్తవి | పద్యతాత్పర్య విశేషములతో | ౧- ౪-౦ |
| Mutts & Mandirs | ఇంగ్లీషు | ౦- ౩-౦ |
| 'Lingayat' for Veerashaiva | ,, | ౦- ౧-౦ |

'విభూతి' పత్రిక సంచికలు (ఇందు చక్కని వ్యాసములు కలవు) ౧వ సం ౬-౧౨ — ౧-౧౨-౦

,, ౨వ సంపుటము ౧ నుండి ౧౨ సంచికలు — ౨-౧౨-౦

,, ౩వ ,, ౭ నుండి ౧౨ సంచికలు — ౧- ౮-౦

,, ౪వ ,, ౧ నుండి ౯ సంచికలు — ౨- ౮-౦

ధరలన్నియు కల్గారు. కొనువారే ప్రత్యేకము పోస్టు ఖర్చుల భరించుకొనవలెను, ఒకరూపాయికి తక్కువ వెలగల పుస్తకములు వి. పి. గా పంపబడవు. పదిరూపాయిల కంటె యెక్కువ వెలగల పుస్తకముల గొనువారు తెలసు పొందరే మనియార్డరు చేయుచో ఒకరూపాయ పుస్తకము ఉచితముగా నియ్యబడును. ప్రస్తుతము పోస్టు కర్చులు పెరిగియున్నవి.

మేనేజరు :—శివధర్మగ్రంథమాల.

౪-౨-౬౫ సజన్‌లాల్ వీథి, సికింద్రాబాద్ (దక్కన్).

పాల్కురికి సోమనాథచరిత్ర, వైదికశివపూజావిధి, శివదీక్షావిధి, శ్రీకరభాష్యం - (నాగరిలిపి,) ద్విపదసిద్ధాంతశిఖామణి, శివరహస్యం (నాగరిలిపి,) ఆంధ్ర శ్రీకరభాష్యము, సిద్ధాంతశిఖామణి (తెలుగుటీక,) అను గ్రంథములు అచ్చులోనున్నవి. త్వరగా వెలువడగలవు.

# శివాద్వైతమంజరి

ఇది ప్రాచీనాచార్యునిచే రచింపబడి శైవప్రపంచమున విఖ్యాతి మైన గ్రంథము. దీనికి పండ్రెండు నూర్ల (౧౨౦౦) పుటల యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి యున్నది. ఇందు శివాద్వైత సిద్ధాంతము కరతలామలకముగను, పరవాదిభయంకరముగను, సవిస్తరముగను వ్రాయబడినది. ఇది యొక్క గ్రంథమే నూరు గ్రంథముల పెట్టు. శతాధికశాస్త్రగ్రంథముల పఠించి మిక్కిలి పరిశ్రమతో నిది సిద్ధము చేయబడినది. ఇది యొక మహాదివ్యజ్యోతి. దీనితో శివ ధర్మము మరల నుద్ధరింపబడినట్లు కాగలదు. ఇట్టి సర్వసమర్థమైన గ్రంథమును తప్పక ప్రకటింపవలసి యున్నదని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఈ హెచ్చుధరలలో దీని నచ్చువేయుటకు ఆరువేల రూప్యములు వ్యయమగుచో నాశ్చర్యము లేదు. ఇమ్మహాగ్రంథమునకు సంపూర్ణముగ సాహాయ్యమొనర్చి జగత్ప్రసిద్ధమైన కీర్తిధనమును, శివ పరబ్రహ్మ కృపను సంపాదించు మహాదశ యేమహనీయునకు పట్ట నున్నదో కాని వారి ధన్యతయు మాన్యతయు లోకోత్తరములగు ననుటకు సందేహము లేదు.

ఇంకను భోజునితత్త్వప్రకాశము, సిద్ధాంతసారావలి, శివపంచ శ్లోకి, శివరహస్యము, క్రియాసారము, ధర్మశిరోమణి, పారమేశ్వరా గమము, సదాచారసంగ్రహము, అనుభవసారము, శివతత్త్వసారము, చతుర్వేదసారము మున్నగు గ్రంథములు ముద్రణ నభిలషించు చున్నవి. ఒక్కొక్క గ్రంథము నొక్కొక్కరు సులభముగా నచ్చు వేయింపవచ్చును. ఇట్టి మహనీయుల కీర్తి శతాధికవత్సరముల వరకు జగద్వ్యాప్తమగుటయే కాక పరస్పరముగ నుత్సాహముతో నింకను గ్రంథరత్నములు బయలువెడలి యపారముగ ధార్మికజనోపకారము సంభవింపగలదు. మిక్కిలి వ్యయమగునని వెనుదీయరాదు. శ్రీమంతులకు ధనము వచ్చుచు పోవుచుండును. అదృష్టహీనుడు గట్టిగ ముడివేసు కొన్నను రొక్కము నిలువజాలదు. అదృష్టవంతులు నిత్యమును మహా దానముల గావించుచున్నను వారి లక్ష్మి దినదినప్రవర్ధమాన మగు చుండునే కాని యేమాత్రము తరుగదు. కావున ధర్మాభిమానులు, ఉదారులు తమతమ యభిప్రాయములను తెలియపరతురు గాక!



చి. మ. పి.

